# తిరుపతి కవుల సాహిత్య సమీక్ష

(ఆంధ్రా ఎకాడమి బహుమతి పొందినది)

గ్రంథకర్త

శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి

అష్టావధాని

పబ్లిషర్స్

శ్రీ అరుణా బుక్ హౌస్

103, నారాయణ మొదలి వీధి

మద్రాస్-600001

శ్రీ

# ఉపోద్ఘాతము

కళాప్రపూర్ణ

డా॥ దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్.డి

పూర్వాంధ్రశాఖాధ్యక్షుఁడు ఉస్మానియా విశ్వవిద్యాలయము

వంశకర్తలైన రాజులవలెనే యుగకర్తలైన మహాకవులు కూడ కొందఱుందురు. ఆ రాజుల ప్రభావ మా వంశమున ప్రభవించినట్టియు, వారి తరువాత ధరణీపాలన మొనరించినట్టియు రాజులపై నట్లే ఆ కవుల ప్రభావము సమకాలిక కవులపై నెన్నో విధముల గోచరించును. కవితా దృష్టితోఁ జూచినచో నాధునికాంధ్రసారస్వత యుగకర్తలని చెప్పఁదగిన కవిపుంగవులు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు. వారద్యతనాంధ్ర కవిప్రపంచ నిర్మాతలని చెప్పుటలో నతిశయోక్తి యిసుమంతయు లేదు. కడచిన తరమున వారికి శిష్యులో ప్రశిష్యులో కాని కవులు లేరు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్లు "చెళ్ళపిళ్ళ వెంకన గురువంచు చెప్పుకొనఁగా నొక గొప్ప తెలుంగు నాఁడునన్" ఇందు వెంకన యని యొక పేరే పేర్కొనఁబడినను అది యిరువురు కవులకును అన్వయించును. వారి పేరులు భిన్నములు, వారు వ్యక్తులు భిన్నులు. అయినను రచనల విషయమున నొక్కరివలెనే కనిపింతురు. "కవలవలెం జరించుచుఁ బ్రకాస్తి వహించు శతావధానులే కవులిఁక వారి పేరులు జగద్విదితంబులు చెప్పనేటికిన్" అని వారే చెప్పుకొని యుండిరి. తిరుపతివేంకటేశ్వరు లనునది యొక్కని పేరేయని భ్రమించు వారు కూడ కొందఱు లేకపోలేదు. వివిధ కావ్య రచనలచేతను, నానారాజ సందర్శనములచేతను, ఆశుధారా ప్రదర్శనములచేతను, అష్ట శతావధానాచరణముల చేతను సుమారొక అర్ధశతాబ్దికాలము

తెలుఁగు ప్రజలను నిర్మల ప్రసన్న కవితా కల్లోలినిలో నోలలాడించిన కవి భగీరథులు వారు.

పూర్వాంధ్ర మహాకవులందఱును సంస్కృతాంధ్రములు రెండింట మహా పండితులై యుండిరి. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములను మూఁడు కవితాహేతువులును వారియందు పుష్కలముగా నుండెను. వారు విద్వత్కవులు. ''విద్వత్కవయః కవయః కేవల కవయ స్తు కేవలం కపయః'' అనునభియుక్తోక్తి కలదు. ఆధునిక యుగమున విద్వత్తా కవిత్వములు రెండింట పారంగతులైన వా రెందఱో యుండరు. ఉన్న వారిలో శ్రీ తిరుపతి వేంకటేశ్వరు లగ్రగణ్యులు. వారు గురుముఖమున భాష్యపర్యంతము సంస్కృత వ్యాకరణము నభ్యసించిన పండితాగ్రగణ్యులు. ఇతర శాస్త్రములతోఁ గూడ వారి కంతో యింతో పరిచయము లేకపోలేదు. ఇంక నాంధ్రమున వారికున్న ప్రయోగ విజ్ఞాన మద్వితీయము, అనన్యాదృశము. ఇట్టి పాండిత్యముతోపాటు అసాధారణ కవితాధార కూడ నలవడుట వారి పూర్వపుణ్యా విశేషము - వారిది కాదు, ఆంధ్రుల పూర్వపుణ్యా విశేషము.

తిరుపతి శాస్త్రిగారు వెలనాటివారు, వేంకటశాస్త్రిగారు ఆరామ ద్రావిడులు. 'వెలనాటివాఁడఁ గవితకు వెల నాటినవాఁడ'నని తిరుపతిశాస్త్రిగా రొకచో చెప్పుకొని యుండిరి. బాంధవ్య మేదియు లేకున్నను వారొక్క గురువుగారికడ విద్యాభ్యాసము కావించిరి. పాండిత్యసామ్య మేర్పడినది, ప్రతిభాసాదృశ్యము కలిగినది, పేరులు చక్కగా కలిసినవి. వారి నోట కవిత్వము మున్నేరై ప్రవహించి సారస్వతతైర్థికులను పునీతులఁ గావించినది. లోకమున జంట కవులు కొందఱున్నారు. ఆంధ్రమున నంది మల్లన, ఘంట సింగన మొదటి జంటకవులు. వారు కవిత్వమెట్లు చెప్పియుండిరో మనకు తెలియదు. కాని వారి కవితాధారమాత్ర మేకముగానే యుండును. ఆధునిక కాలమున నెందఱో జంట కవులు వెలసిరి. వారిలో కొందఱు మధ్యలో విడిపోయిరి. కొందఱి కవితాస్వరూపమున పార్థక్యము గోచరించును. అట్లుకాక మనస్సులవలెనే కలసి

పోయి అభిన్నమై తుదిదాఁక తిరుపతి వేంకటీయమై పరగిన కవిత్వ మొక్క- తిరుపతి వేంకటకవుల దే. తిరుపతిశాస్త్రిగారు దివంగతులైన పిమ్మట వేంకటశాస్త్రిగా రొక్క-రును రచించిన రచనలు కూడ తిరుపతి వేంకటీయములుగానే ప్రసిద్ధినందినవి. మరణించిన పిమ్మట కూడ తిరుపతి వేంకటేశ్వరునియందు జీవించియే యుండెను.

తిరుపతి వేంకటేశ్వరులు రచించిన గ్రంథములు శతాధికములు. అందు పురాణములున్నవి, ప్రబంధములున్నవి, అన్యాపదేశములైన లఘుకృతులున్నవి, నాటకములున్నవి, ప్రహసనములున్నవి, వచన రచన లున్నవి, అనువాదము లున్నవి, స్వతంత్రములున్నవి, స్తుతు లున్నవి, నిందలున్నవి. ఇవి యావి నేల? తెలుఁగు భాషా సారస్వత ముల నుద్ధరించుటకై సరస్వతి వారి రచనలలో నెన్ని యవతారము లెత్తవలెనో అన్ని అవతారములు నెత్తినది. వారు తెలుఁగునవలెనే సంస్కృతమున కూడ నద్భుతమైన కవిత్వము వెలయించిరి. వా రుభయభాషా కవిత్వమున సవ్యసాచులు. కొందఱు కవిత్వము చెప్ప దురుకాని పద్యము సరిగా పఠింపలేరు. తిరుపతి వేంకట కవుల పద్య పఠన పద్ధతి అపూర్వము, అందును వేంకటశాస్త్రిగారిది సమ్మోహ నాస్త్రమే. వారు పద్యము చదువుచుండగా విని పరవశులయ్యు తల లూపని వారుండెడివారు కారు. ఆ పద్ధతి యించించుక భేదముతో వారి శిష్య పరంపరలో ముగ్గురి కబ్బినది. వారు వేలూరి శివరామ శాస్త్రిగారు, పింగళి లక్ష్మీకాంతముగారు, విశ్వనాథ సత్యనారాయణ గారు. ఆ పద్ధతిలో సంగీతముకాని పరమ సంగీతమున్నది. అది శిశు పశు ఫణులనే కాదు జడములైన మణులను కూడ కరగించును.

తిరుపతి వేంకటకవుల ఉపన్యాస వైఖరియు నపూర్వమైనదే. వా రుపన్యాస మారంభించిన భారతములు గీరతములు మాత్రమే కాదు ఆంధ్ర సంస్కృత వాఙ్మయ రత్నాకరములందలి రత్నము లన్నియు దొరలిపోవును. వారి యుపన్యాసము వినుట ఒక ప్రత్యే కానుభూతి, వారి ఆశుకవిత్వము నాలించుట వీనుల విందు, వారి అష్ట శతావధానముల సభలలో కూర్చుండుట షడ్రసోపేత భోజన మారగించుట. భాషా పరిజ్ఞానమువలెనే వారి లౌకిక జ్ఞానమును

అపారమైనది. అది వారి విజయములకెన్నో విధముల తోడ్పడినది. కవి సరసుఁడు, పండితుఁడు, లోకజ్ఞుఁడు, వావదూకుఁడు, భక్తుఁడు, రక్తుఁడు మాత్రమే కాక 'కొంటెలలోన కొంటెయుం గావలె'నని వేంకటశాస్త్రిగారి సిద్ధాంతము. ఈ లక్షణము లన్నియు నా జంట కవులందు కలవు. అందుచేతనే వారొోటమి నెఱుఁగక కవితా ప్రపంచమున నసహాయశూరులై వర్తించిరి.

అట్టి మహాకవుల సాహిత్యమును సమీక్షించు నుత్తమ రచన యీ గ్రంథము. దీనిని రచించినవారు శ్రీ శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి గారు. వీరి పితృపాదులను, సోదరులను నే నెఱుఁగుదును. బందరులో విద్యాభ్యాసము కావించునప్పుడు ఆజానుబాహువులైన శ్రీ నరసింహశాస్త్రిగారిని పెక్కుసార్లు చూచు భాగ్యము నాకు కలిగినది. వారు మహాపండితులని అందఱును చెప్పెడివారు. నేనును వారు మహా పండితులని అనుకొనెడివాఁడను. కాని ఆ మహా పాండిత్య మెట్టిదో నాకప్పుడు తెలియదు. తరువాత తెలిసినది. వారి కుమారరత్నములు కూడ నంతటి పండితులగుట ముదావహము. వారి ప్రసక్తికూడ నీ గ్రంథమున నొకటి రెండు చోట్ల వచ్చినది. వారికి తిరుపతి వేంకటకవులపై నభిమానము. అభిమానము మాత్రమే కాదు. వేంకటశాస్త్రిగారు కొన్ని సంవత్సరములు బందరులో పని చేసి యుండుటచే వారిరువురికిని మైత్రికూడ నుండి యుండును. తండ్రిగారి కా మహాకవుల యెడఁగల స్నేహాభిమానములు కుమారుని యందు కూడ ప్రసరించి వారిచే నీ గ్రంథమును వ్రాయించినది. ఈ గ్రంథమున కాంధ్రప్రదేశ సాహిత్య అకాడమివారి పారితోషికము కూడ లభించినది. అప్పుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు దీనిని గూర్చి చాల ప్రశంసించియుండిరి. ఆ ప్రశంస నేను స్వయముగా వినియుంటిని. ఆ కవిసమ్రాట్టుల ప్రశంసలను పొందుటయే యీ గ్రంథము వైశిష్ట్యమునకు చెప్పనక్కఱలేని అఖండ నిదర్శనము.

శ్రీ శాస్త్రిగారీ గ్రంథమును 17 అధ్యాయములుగ విభజించిరి. మొదటి అధ్యాయమున వారు తిరుపతి వేంకటకవుల జీవిత

మును, విద్యాభ్యాసమును, కలయికను వర్ణించిరి. విద్యాభ్యాసము ముగిసిన పిమ్మట వారు దేశ సంచార మారంభించిరి. విద్యాభ్యాస కాలముననే గణపతి నవరాత్రోత్సవముల సందర్భమున ధన ధాన్యములు వసూలు చేయుటకై ఆ యా గ్రామముల కరుగుచుండిరి, వారికి గోచి పెట్టక మున్నే కోమల కవిత్వమలవడెను, గురు కటాక్షమున పాండితీ ప్రాగల్భ్యము చేకూరెను, కాళీదేవ్యుపాసనా బలమున నఖండ ప్రతిభా ధారణా శక్తి లబ్బినవి. వారు జగజ్జేగీయమానులై అలరారుటలో నబ్బుర మే మున్నది? ఏ సందర్భముననైనను ఎవ్వరి ముందైనను జంకుట కాని, అధైర్యపడుట కాని వారెఱుఁగని గుణములు. రాజులతో ప్రసంగించునపుడు వారు కవిరాజులవలెనే ప్రసంగించెడివారు. "రాజమిత్రుల మదికాక రాజబంధువులము కవిరాజులము.. మాకెందు కొదువ లేదు. కీర్తికై రాకసుమి వనపర్తి భూప!" అని వారు నిశ్శంకముగా వనపర్తి రాజుగారితో చెప్పియుండిరి. తమ్ము నిరాదరించిన రాజులను వారు లెక్క చేయలేదు. "మమ్ము నిరసించుటంత క్షేమమ్ముకా"దని హెచ్చరించి వారి వినతులతోపాటు బహూకృతులు కూడ నందుకొనిరి. వారా యా రాజుల మీఁద చెప్పిన పద్యము లాశూక్తములైనను రసవంతములును భావగంభీరములునై యుండును. శ్రీ శాస్త్రిగారందలి ముఖ్య సన్నివేశముల నన్నిటిని చక్కగా వివరించి యుండిరి.

మూఁడు నాలుగధ్యాయములందు శ్రీ శాస్త్రిగారు తిరుపతి వేంకటకవుల కల్పిత కావ్యములను గూర్చియు, అయిదవ అధ్యాయమున నాంధ్రీకృత కావ్యములను గూర్చియు సమీక్షించిరి. కల్పిత కావ్యములలో శ్రవణానంద పాణిగృహీతలు ముఖ్యములైనవి. అవి సాంఘిక ప్రబంధములు, అందచ్చటచ్చట నాత్మాశ్రయ చ్ఛాయలు కూడ కలవు. శ్రవణానందము సార్థక నామధేయము. అప్పుడు దానిని చదువని అక్షరాస్యు లెవ్వరును లేరనిన నతిశయోక్తి యుండదు. "ధనమా పోవును మానమా చెడును.. మనమా వద్దిక నాదు మాట వినుమా మర్యాద గాపాడుమా" అను పద్య మాంధ్రు

లందఱికిని సుపరిచితము. పౌరాణిక కావ్యములలో లక్షణా పరిణ యము, ఏలా మాహాత్మ్యము గణనీయములైనవి. మొదటిదానిలో శబ్దాలంకార ప్రీతి హెచ్చు. రెండవదానియందలి కవిత్వమతి ప్రౌఢమై పాండురంగ మాహాత్మ్యాదులందలి కవిత్వముతో పోటీ చేయు చుండును. ఆంధ్రీకృతములలో దేవీ భాగవతము పురాణము. ఇం దితరుల కవిత్వముకూడ కొంత కలదు. అందలి కథలు ప్రసాదగుణ భూయిష్ఠములై హృద్యములుగా నుండును. బుద్ధచరిత్రము తిరుపతి కవుల కావ్యములలోనికెల్ల తలమానికమని చెప్పఁదగినది. ఎడ్విన్ ఆర్నాల్డు ఆంగ్లమున రచించిన Light of Asia అను కావ్యము ననువ దించుచు మధ్య మధ్య అశ్వఘోషుని బుద్ధచరిత్రమందలి వర్ణనలు చొప్పించుచు వారీ కావ్యమును రచించిరి. శ్రీనివాస విలాసము శ్లేష యమకానుప్రాసాది శబ్దార్థాలంకారములతోఁ గూడినట్టిది. కవుల పాండిత్యమును పరీక్షించుటకై దాని నాత్మకూరు నృపాలుడు రచింపుమని అడుగగా వారు రచించిరి. లేనిచో వారు దాని జోలికి పోయి యుండెడివారు కారు. అనువాదములలో కూడ వారి కవిత్వ మెచ్చటను కుంటువడక ప్రసన్నానవద్యమై హృద్యముగా సాగి పోవును.

వివాద గ్రంథములు వ్యక్తిగతములైనను ఆ రోజులలో అపారమైన కవితా సంచలనము కలిగించినవి. అప్పు డందఱును వాని నాసక్తితో చదివెడివారు. వానివలన నుద్రిక్తులై కవిత్వము చెప్పిన వారు కూడ చాలమంది కలరు. తిరుపతి వేంకటకవులు రచించిన వివాదకావ్యములలో గీరతము, గుంటూరు సీమ, జయంతి ముఖ్యము లైనవి. గీరతము శిష్యులతోడను, జయంతి వేంకటశాస్త్రిగారికి గురువులైన శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారితోడను జరిగిన వాగ్యుద్ధ ములను వర్ణించు కావ్యములు. గుంటూరుసీమ కొప్పరపు కవులతో జరిగిన వివాదమునకు సంబంధించినది. ఉభయపక్షములవారును గొప్ప కవులే. ఆశుకవిత్వమునం దందె వేసిన చేతులు వారి వివా దము పద్యములలో జరుగుటచే నత్యంత హృద్యముగా నుండును.

ఆ కావ్యములను తెలిచినతరువాత ముగియు వఱకు నాగువా రుండరు. వివాదములందు కూడ వేడుక పుట్టించిన గ్రంథములవి. కామేశ్వరీశతకము, మృత్యుంజయ శతకము, శుక రంభా సంవాదము లఘుకావ్యములు. వేంకటశాస్త్రిగారు తమ యొక్కయు సంతానము యొక్కయు నారోగ్యమునకై యిలవేల్పయిన కామేశ్వరీదేవిని స్తుతించిరి. ఆ దేవి కరుణించెను. శుక రంభా సంవాదము సంస్కృత శ్లోకములకు తిరుపతి వేంకటకవులే చేసిన ఆంధ్రానువాదముతోఁ గూడినది. వారి ఉభయభాషా కవితాధారాశుద్ధి కది మచ్చు ముక్క.

శనిగ్రహము, బిడాలోపాఖ్యానము అనునవి అన్యాపదేశ కావ్యములు. దూషణముకూడ సరసమై యుండుననుట కీ కావ్యములు దృష్టాంతములు. శనిగ్రహము తమపై రాజుతో కొండెములు చెప్పిన వైష్ణవ పండితుని గూర్చి చెప్పినది. ఆ పండితుని రహస్యము లన్నియు నిందు బట్ట బయలు చేయఁబడినవి. కవుల జ్యోతిశ్శాస్త్ర పాండిత్య మందు సర్వతో ముఖముగా గోచరించును. బిడాలోపాఖ్యానము కూడ రామ కృష్ణకవుల నెగతాళిచేయు కావ్యమే. దీనిని శిష్యులైన వేలూరి శివరామశాస్త్రిగారిపేర తిరుపతిశాస్త్రిగారు రచించిరి. గ్రామసింహమను కావ్యముకూడ నీ జాతికి చెందినదే. కాని యిందలి కథ భారతమున నున్నది. బిడాలోపాఖ్యానమందలి పులుల ప్రవృత్తియు గ్రామసింహమునందలి ముని ప్రవృత్తియు తిరుపతి వేంకటకవుల మనః ప్రవృత్తిని తేటతెల్ల మొనరించును.

తిరుపతి కవులకు దేశమున నపార ప్రఖ్యాతి కల్గించినవి వారి పాండవోద్యోగ విజయములు. అందలి పద్యములు భారత పద్యములతో పోటీ పడుచుండును. ఆంధ్ర దేశమున నవి ప్రదర్శింపఁబడని నగరములుండవు, ప్రదర్శింపని ప్రసిద్ధ నాటక సంఘములుండవు. అందలి పద్యము లాంధ్ర దేశమున నాబాల గోపాల విదితములు. ఈ నాటకముల రచనా సందర్భమును, అందలి రామణీయకమును శ్రీ శాస్త్రిగారు సమగ్రముగా వివరించియున్నారు. ఇతర పాండవ

నాటకములును, స్వతంత్రనాటకములును ఎక్కువ ప్రచారము పొంది యుండలేదు. వ్యసన విజయము గొప్ప నాటకమై యుండెడిది. కాని అది అసంపూర్ణముగా నుండిపోయినది. ఆంధ్రీకృత నాటకములు మూఁడును తిరుపతి శాస్త్రిగారి రచనలే. అందు ముద్రారాక్షస మృచ్ఛకటికములు ప్రదర్శితములైనవి. బాలరామాయణమునకు ప్రదర్శనయోగ్యత లేకపోయినది. ఇందలి ఆంధ్రీకరణ పద్ధతి శ్రీనాథుని దానివలె భావానువాద పద్ధతి. అచ్చటచ్చట కవులు స్వతంత్రముగా చేర్చిన పద్యభాగములు కూడ నున్నవి. ఈ నాటకములందలి పద్యము లనూదితములవలె నుండవు. కవులు మూల భావములు స్వాయత్తములు కావించుకొని వానిని తమ పద్ధతితో రచించిరి. నాటకములను గూర్చి శ్రీ శాస్త్రిగారు కావించిన సమీక్ష వారి పాండిత్యమును, పరిశోధనపాటవమును, విమర్శన వైశారద్యమును చాటుచున్నది.

పండ్రెండవ అధ్యాయము భాషాసౌందర్యమునకు సంబంధించినది. తిరుపతి వేంకటకవుల భాషాలాలిత్యమును గూర్చి యెఱుఁగనివా రుండరు. వారు మహాపండితులయ్యు ప్రసాదగుణ భూయిష్ఠముగా పద్యములు రచించి ఆంధ్ర కవిత్వకన్య నంతఃపురములనుండి అందఱి గృహాంగణములకును నడిపించి ఆ హాయిలు సామాన్యులు కూడ ననుభవించునట్లొనరించిరి. గ్రంథములందలి పద్యములందైనను ఆశువుగా చెప్పిన పద్యము లందైనను వారి కవితాముద్ర స్పష్టముగా గోచరించుచునేయుండును. వారి ధారాశుద్ధి అనన్యసాధ్యమైనది. "ముద్దు ముద్దుగఁ జెప్పఁ బూనితిమా వన్నెలాడి తీయని మోవి లంచమిచ్చు, కరినమ్ముగాఁ జెప్పఁగడఁగితిమా ప్రౌఢకాంత వక్షోజముల్ కానుకవెట్టు" మొదలగు పద్యములందలి భావములు సహజోక్తులే. వారి భాషాదృష్టి విశాలమైనది. తెనుఁగునకున్న వ్యాకరణ దీపము చిన్నదని వారు గుర్తించిరి. భారత మాంధ్ర సత్కవులపాలిటి వేదమనియు నందలి వాగ్ధోరణు లెట్టివైనను త్రోయఁగరానివనియు వారి విశ్వాసము. వారి ప్రయోగ విజ్ఞానము నాన్యతో దృశ్యము.

ఏ కవి యెచ్చట నే ప్రయోగము వాడెనో వారికి తెలియును. వారికి పెక్కుచోట్ల విజయము సాధించిపెట్టిన దీ ప్రయోగ విజ్ఞానమే.

దివాకరాస్తమయము. తిరుపతిశాస్త్రిగారి మరణానంతరము రాజమండ్రిలో జరిగిన సభలో వేంకటశాస్త్రిగారు చేసిన ఉపన్యాసమునకు గ్రంథరూపము. ఇందు వా రిరువురికిఁ గల అనుబంధమేకాక, వారి రచనల విషయమును, వారి కవిత్వమును గూర్చి కొందఱు పొందు భ్రాంతి విషయములును వివరింపఁబడినవి. ఇందు సహాధ్యాయుఁడు, తోడు నీడ, అయిన తిరుపతి మరణమునకు వేంకటశాస్త్రిగారు పొందిన విషాదము నైశిత్యము వ్యక్తము చేయఁబడిది.

తిరుపతి శాస్త్రిగారు మరణించిన పిమ్మట వేంకటశాస్త్రిగారు సుమారు ముప్పది సంవత్సరములు జీవించిరి. మంచము మీఁద నున్నను ఏదో వ్రాయుచునే యుండిరి. ''కవనార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి ఈ భవమద్దానఁ దరింతుఁ దద్భవమె మద్భాగ్యం''బని వేంకట శాస్త్రిగారు చెప్పినదంతయు సత్యము. వారొక్కరును రచించిన గ్రంథములుకూడ పెక్కున్నవి. శివభక్తి, గోదేవి మున్నగునవి వానిలో ముఖ్యములు. ప్రాయమునై వ్రాలు కొలందిని వేంకటశాస్త్రిగారు ప్రవృత్తినుండి నివృత్తికి మరలినట్లు కనిపించును. వా రాంధ్రరాష్ట్రమునకు ప్రథమాస్థానకవులైరి. అప్పుడు బెజవాడలో జరిగిన అభినందన సభ వైభవము వర్ణనాతీతము. ఆంధ్రదేశమంతయు నం దానందమున పాల్గొనియుండెను.

తిరుపతి వేంకటకవుల అవధాన విధాన మత్యంతహృద్యమైనది. శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారి అవధానములు చూచి వారును అవధానాచరణమున కారంభించిరి. వారు చేసినన్ని అష్టశతావధానములు మ టెవ్వరును చేసియుండరు, అంత నిర్దుష్టముగను సమగ్రముగను కూడ నెవ్వరును చేసియుండరు. అవధాన విద్యకాంధ్ర దేశమున వారు కలిగించిన ప్రచార మింతింతన రాదు. ఆ విషయమున వారి దాచార్య పీఠము. ఆశుకవిత్వ కౌశలము, ధారణాశక్తి, సద్యఃస్ఫూర్తి, హాస్యచమత్కారములు, శత్రువుల

కును ఈర్ష్యాళువులకును ముఖపిధానము చేయఁగల పాండిత్యము వారి సొమ్ములు. వారు జీవించినకాల మాంధ్ర సరస్వతికి మఱొక స్వర్ణ యుగము.

తిరుపతి వేంకటకవులు వచన రచనలు కూడ కావించిరి, కొన్ని ప్రహసనములు రచించిరి, విమర్శలు వెలయించిరి. విక్రమాంక దేవచరిత్రము, హర్ష చరిత్రము, చంద్రప్రభ చరిత్రము ఆంధ్రీకరణ ములు. ఈ మూఁడును తిరుపతి శాస్త్రిగారు రచించినవే. వేంకట శాస్త్రిగారు ఆ యా పత్రికలలో ప్రచురించిన వ్యాసము లన్నియు తరువాత కథలు, గాథలు అనుపేర సంపుటములుగా ముద్రింపఁ బడినవి. ఇవి వ్యావహారిక భాషలో రచింపఁబడినవి. ఐననేమి? ఆంధ్ర వాణి కలంకారములని చెప్పఁదగినవి. ఆ వ్యాసములలో స్వీయ విష యములు, సాహిత్య విషయములు, తత్కాలమందుండిన పండితుల విషయములు, సాంఘిక విషయములు—ఇవి యవి యననేల? ఎన్నో అమూల్య విషయములున్నవి. అవి వేంకటశాస్త్రిగారి విజ్ఞానమున కక్షర రూపములు. సమకాలిక విషయ విజ్ఞానకోశములు.

శ్రీ లక్ష్మీకాంతశాస్త్రిగారు తిరుపతి వేంకటకవుల గ్రంథము లన్నియు చదివి మౌలికమైన విమర్శ వెలయించియున్నారు. ముఖ్య విషయముల నన్నిటిని వారు స్పృశించియున్నారు. వారి విమర్శ సునిశితమైన పాండిత్యమును పరిశీలనమును ప్రకటించుచున్నది. శని గ్రహమునందలి పద్యములకు వారు కావించిన వ్యాఖ్య మిక్కిలి హృద్యముగా నున్నది. తిరుపతి వేంకటకవుల కవితా కౌశలమును, పాండిత్యమును, మనః ప్రవృత్తిని వారు చక్కగా వెల్లడించి యున్నారు. వారిశైలి చిన్న చిన్న వాక్యములతోడను, జాతీయ ములతోడను గూడి చదివినకొలఁది చదువవలెనను నుత్కంఠను రేకెత్తించుచున్నది. వా రన్ని కావ్యముల నుండియు నవరసములైన పద్యములను, వచన భాగములను సందర్భానుగుణముగా నుద్ధరించి యున్నారు. శ్రీ తిరుపతి వేంకటకవుల సాహిత్య సర్వస్వము నెఱుఁగఁ దలఁచువారి కీ గ్రంథము కొంగు బంగారమై ఆంధ్ర విమర్శవాఙ్మ

యమునం దొక ఉత్తమ గ్రంథమై యలరారఁగలదని యాశించు చున్నాను. ఈ గ్రంథమును ముద్రణ మతి వ్యయ ప్రయాసముతోఁ గూడిన యీ కాలమున రమణీయముగ ముద్రించిన శ్రీ అరుణా బుక్ హౌస్ వారి నభినందించుచు వారు సంకల్పించినట్లింకను ఉత్తమ గ్రంథములను పెక్కింటిని ప్రచురించి ఆంధ్రసరస్వతి కనవరతసేవ కావించు శక్తి భగవంతుఁడు వారికి సమకూర్పవలెనని ప్రార్థించు చున్నాను.

హైదరాబాదు
20-9-'80

దివాకర్ల వేంకటావధాని

శ్రీరస్తు

# ప్రకాశకుల విజ్ఞప్తి

'దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స' అని కవి సార్వభౌముల ప్రశస్తి గాంచినది మన భాష. భాషాభ్యుదయమునకు సాహిత్య సంపద జీవగఱ్ఱ. ఆదికవి నన్నయ భట్టారకుని నాటినుండి నేటివఱకు ఆంధ్రభాషా సాహిత్యము అవిచ్ఛిన్నముగ బహుముఖముగ రాణించి మించినది. ముద్రణాది సౌకర్యము లేర్పడిన తరువాత మన తెనుఁగు భాషలో ప్రాచీన కావ్య పురాణాది వివిధ గ్రంథములు సుప్రకాశితము లయ్యెను.

అట్టి ప్రాచీన సాహిత్యగ్రంథ ప్రచురణ సంస్థలు ఇటీవల చాలవఱకు అంతరించినవి. ఏ కొన్నియో మిగిలియున్నవిగాని, అయ్యవి వ్యాపార దృష్టితో చౌకబాఱు వాఙ్మయమును ప్రచురించుటయందు నిమగ్నములై యున్నవి. ప్రాచీన ప్రశస్త కావ్యాదులు ఈనాడు లభ్యములగుట లేదు. నేడు అతివేగముగా ప్రకటింపబడు నవలాది వాఙ్మయ పఠనానందము తాత్కాలికము మాత్రమే. శాశ్వతానంద సంధాయకము భాషావిజ్ఞాన ప్రదాయకమూ అగునది కావ్యపురాణాది సాహిత్య గ్రంథ సంపద.

ఆంధ్ర పాఠకులకు అట్టి సదవకాశమును గలిగింప సంకల్పించి మేము కావ్యపురాణాదులను సాహిత్య గ్రంథములను క్రమముగ ప్రచురింప ప్రారంభించితిమి. అట్టి మా ప్రయత్నమునకు నాంది యనదగినది యీ తిరుపతి కవుల సాహిత్య సమీక్షా ప్రచురణ.

జగ మెఱిఁగినవారు తిరుపతి కవులు. వారి సాహిత్య సమీక్ష యిది. ఇయ్యది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి బడసిన ప్రశస్త గ్రంథము. దీనిని రచించినవారు శ్రీ శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు. ఈ గ్రంథమునకు అమూల్యమగు ఉపోద్ఘాతమును

మేము కోరిన వెంటనే ఆదరముతో కళాప్రపూర్ణ, ఆచార్య, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు వ్రాసి యిచ్చిరి. అందులకు వారికి మా ధన్యవాదములు.

ఈ గ్రంథమును త్వరలో ముచ్చటగ ముద్రించి యిచ్చిన క్రాంతిప్రెస్ వారికి మా కృతజ్ఞతలు.

ఇక రెండవ ప్రచురణ ఆంధ్ర పంచకావ్యములలో ప్రశస్తముగ పరిగణింపబడు సాహిత్య రసపోషణ రామరాజ భూషణ ప్రణీతమగు 'వసు చరిత్ర'. ఇది సవ్యాఖ్యముగ ప్రకటితమగును. ముందు ముందు ఉత్తమ సాహిత్య గ్రంథములు పండిత పరిష్కృతములయి ప్రచురితములగును.

ఆంధ్ర పాఠకలోకము ఆంధ్రభాషాభిమానులు ఆంధ్ర భాషా పండితులు మా ప్రచురణల నాదరించి మా యుద్యమమునకు చేయూత నొసగ ప్రార్థించుచున్నారము.

ఇట్లు
**ప్రకాశకులు**

# విషయసూచిక

శ్రీ

బాలాత్రిపురసుందర్యైనమః

# తిరుపతి కవుల సాహిత్య సమీక్ష

## ౧

## జీవితము

### సుకవితా యద్యస్తి రాజ్యేన కిం

ఉత్తమమైన కవిత్వ మలవడినచో సామ్రాజ్యముల కాశింప వలసిన పనిలేదు. సాహిత్య మొక విశాల సామ్రాజ్యము. దాని కధినేత మహాకవి. వానికి శాస్త్ర పాండిత్యము, కళావైదగ్ధ్యము చతురంగ బలములు. కావ్యరచన యవధాన సామర్థ్యము ఆశుధారా ప్రదర్శనములు వాని తంత్రములు. సమయానుకూలముగా వాని నుపయోగించి మహాకవి సకల మానవ ప్రపంచమును తన యధీనము గావించుకొనును రాజాధిరాజులు వానికి పాదాక్రాంతులగుదురు. పండితులు వానికి దాసాను దాసులు. వాని మాట కవిలోకమునకు శిరోధార్యము ఆబాలవృద్ధము వాని యడుగులకు మడుగు లొత్తుచుందురు. అతడు లోకాతీతుడయి వాఙ్మయాకాశమున భాను బింబమువలె పరులకు తేరిచూడ రాక ప్రకాశించుచుండును. వాని యెదుట నితరుల ప్రజ్ఞాపాండిత్యములు దివిటీల వలె కళావిహీనము లగును. జనులు వానికి బ్రహ్మరథము పట్టుదురు. కనకాభిషేకము చేయుదురు. రాజాధిరాజు లంతటివారు 'పుర మేగ పల్లకి తమ కేలఁబట్టి' యెత్తుదురు. అత డనుభవించని భోగము లుండవు. వాని కోర్కెలు తీర్పని వారుండరు

మహాకవి జీవిత మానంద రసానుభూతము. కాళిదాసు మహాకవి. భోజ మహారాజుతోపాటు సరి సమానమగు గౌరవ ప్రతీతులు

సంపాదించెను. సుఖము లనుభవించెను. భోజరాజును స్మరించిన వారు కాళిదాసును దలంపక మానరు.

పండిత రాయలు సాహితీ సామ్రాజ్య చక్రవర్తి. వాని మృదు మధుర కవితా విలాసినీ విలాసమునకు విస్తుపోయి ఢిల్లీ పాదుషా యడిగినదే తడవుగా తన కూతురగు లవంగి నిల్లాలుగా సమర్పించెను. చుట్టరికము కలుపుకొనెను. తన యంతవానినిగా నాదరించెను. నన్నయ తెలుగు భారత కవితా ప్రపంచమున కాది సృష్టికర్త. రాజరాజ నరేంద్రు డాయనను తన కుల గురువుగా నారాధించెను. తిక్కయజ్వ కవిబ్రహ్మ. నిర్వచనోత్తర రామాయణ మును కృతి యిచ్చి మనుమసిద్ధి చేత "మామా" యనిపించుకొనెను.

శ్రీనాథుని సంగతి చెప్పనే యక్కర లేదు. మహారాజుల చేత కనకాభిషేకము చేయించుకొనెను. వీరారెడ్డి వానికి రత్నాంబరము లర్పించెను. మైలారు విభుడు దిన వెచ్చము చెల్లించెను. తెనుంగు రాయరాహుత్తుడు కస్తూరి సమర్పించెను. విస్సన మంత్రితో హేమ పాత్రాన్న భోజనము పంక్తి నారగించెను. మిగిలినరాజు లా మహా కవి అడుగులకు మడుగు లొత్తిరి.

అల్లసాని పెద్దన యందుమా ఆశుకవితా ప్రదర్శనము నందు సంస్కృతాంధ్ర భాషా పురంధ్రుల పాదములకు బంగారు గజ్జెల మంజీరములు తొడిగించి జిలిబిలి ముద్దు పలుకుల జిగిబిగి యల్లిక తీరు లొందవ సభాంగణమున నాట్యమాడించినాడు. మూరు రాయర గండ డగు శ్రీకృష్ణరాయలు అమితానందము నొందెను. ఆ మహారాజున కొడలు పులకరించినది. పరవశత్వమున మే నెరుంగక తటాలున సింహాసనము మీదనుండి లేచెను. వచ్చి యాంధ్ర కవితా పితామహుని యడుగుఁ దమ్మికి రతనాల గండపెండారము స్వాయ ముగా తన చేతులతో నలంకరించెను. ఏ రాజాధి రాజున కీ యదృ ష్టము పట్టగలదు? అట్టియెడ మహాకవులు సామ్రాజ్యములను గోర వలసిన పనేముండును? 'నిరంకుశాః కవయః' వారిని శాసింప గల వారు లేరు. వారి నారాధింపని మానవు లుండరు.

మహాకవుల హృదయములు 'నవ్య నవనీత సమానములు' వారి పలుకులలో నమృతము జాలువారుచుండును. అలుక పొడమిన చో 'పలుకు దారుణా ఖండల శస్త్రతుల్యము'. అది వైరి వీర ధరాధీశుల రెక్కలను చిదుక గొట్టి యధః పాతాళమునకు త్రొక్కివేయ గలదు. ఉరి కంబమున కెక్కింపబడిన బిల్హణకవి శాపమున కడలి మదనాభిరామ భూపతి తన కుమార్తెయగు యామినీ పూర్ణతిలకను కరముల కప్పగించి క్షమా భిక్షము వేడుకొనెను.

వేములవాడ భీమకవి 'సందడి తీరిన వెనుక రమ్మనె పో' మ్మనిన రాజ కళింగ గంగు నొక్క పద్యముతో రాజ్యభ్రష్టుని గావించెను. పశ్చాత్తాపము నొందిన వెంటనే మరల నొక పద్యముతో తిరిగి మహారాజును చేసెను. మహాకవులు దేవతా ప్రసాదసిద్ధి కలవారు. తపస్సంపన్నులు. శాపానుగ్రహ సమర్థులు.

శ్రీకృష్ణరాయలు మరణించెను. విజయ నగరము మీదికి కటకమునుండి దండెత్తి వచ్చినాడు గజపతిరాజు. అల్లసాని పెద్దన కలుక పొడమినది. ఒక్క సీసపద్యముతో వానికి తలవంపులు కూర్చి మరలించి పంపినాడు. కవులకు వృత్తములే మహాసేనలు. అవి మొక్కవోని శక్తి సామర్థ్యములు గలవి. కవిత సర్వ సమర్థమైనది. అది శాస్త్ర పాండిత్యమువలె వల్లన వేయుటవలన వచ్చునది కాదు.

'ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః' అన్నట్లు జన్మతః సిద్ధించునది. దానికి పూర్వజన్మయందు చేసిన తపస్సు కారణము, కావుననే 'నానృషిః కురుతే కావ్యం' అని పెద్దలు వచించిరి. ఋషి కానివాడు కావ్యకర్త కాజాలడు. 'కవి ఋషి యంశంబు కలిగి పుట్టు' వాని కవితా శక్తికి జన్మాంతర తపము మానదండము. తపస్సు యొక్క తర తమ తారతమ్యములను బట్టి శక్తి యలవడుచుండును. 'అభ్యాసము కూసువిద్య' అలవాటు పెంబడి కవిత్వమలవడ వచ్చును. కాని యది బలవంతము మీద వచ్చిన యువతివలె మనోరంజకముగా నుండనేరదు. కవిత్వము స్వయం సమాగతమయ్యును కవికి సంస్కార ముండవలయును. దానికి శాస్త్రాభ్యాసము, విద్యా వైదుష్యము

ముఖ్యావసరములు. వానికి తోడు మాట చతురత లోకజ్ఞానము నుండవలయును. పండితులతోడి సాంగత్యము, దేశాటనము కవికి విశేష జ్ఞానము సంపాదించి పెట్టును. 'ముఖే ముఖే సరస్వతి' ఎవరి యొద్ద నే విశేష ముండిన దానినెల్ల పరిగ్రహింపనలయును. అప్పుడు కవితా ప్రసూనము నిండార విచ్చి నలుదిశల సువాసనలను ప్రస రింపుచు మకరంద రస ధారలను కురియుచుండును. ఇవన్నియు రాచు కొనినను పూసుకొనినను లభించునవి కావు. 'పుణ్యై ర్యశో లభ్యతే'

చదువఁగా వలె శబ్ద శాస్త్రాదికమ్మును
వీక్షింపఁగా వలె విద్య లెల్లఁ
జూడఁగావలె రాజ చూడామణుల సభల్
పొందఁగా వలె మహా భోగములను
దిరుగఁగా వలెనవి దేశాల వెంబడిఁ
బడవలెఁ బడరాని పాటు లెల్ల
వినఁగా వలెను బూర్వ విద్వత్ చరిత్రముల్
దర్శింప వలెను ఛందః ప్రశంస
కవులు కవు లన్న మాత్రానఁ గవులు గారు
ఎంత భారము కలదో కవీశ్వరులకు (నా. నా)

ఒక విధముగా సంస్కృతమునందు కవిత్వము చెప్పుట తేలిక. తెలుగునందు కవిత్వము చెప్పుట కష్టము. తెలుగునకు కట్టుబాటులు మెండు. మీదు మిక్కిలి రెండు భాషల యందును పాండిత్యము సంపాదింపవలయును.

తెనుఁగు తెనుఁ గని యద్దాన దిగుటె గాని
సంస్కృతమ్మున కన్న కష్టమ్ము హెచ్చు
ఒక్క దానఁ బరిశ్రమ మున్నఁ జాలు
దాని, కిద్దానికో రెంటఁ దగల వలయు (పా. గృ)

ఇవి తిరుపతి కవులు స్వానుభవము మీద చెప్పిన పద్యములు. కవి కష్టించి తా నెన్ని సాధన సామగ్రులు సమకూర్చుకొనినను

దేవతా ప్రసాద సిద్ధికూడ నుండవలయును. అప్పుడు కవిత్వము మహోన్నత స్థాయి నందుకొనును. హరిహరనాథుని ప్రసాదముచే తిక్కనయు, పరమేశ్వర కరుణా కటాక్షముచేత పోతనయు, బ్రాహ్మీదత్త వర ప్రసాదముచేత శ్రీనాథుడును వాఙ్మయ ప్రపంచమునం దున్నత పదవి నలంకరించిరి.

'పంచ షా వా మహాకవయః గణ్యన్తే' ఇట్టి మహాకవులు తెనుగు భాషయందు నలుగు రైదుగురుకన్న నెక్కువమంది లేరు. పదునొకండవ శతాబ్దమునాటి కొక విధముగా నుండియు లేనిదయి వికృతాకారము నొందియున్న తెనుగు భాషా యోషను సకలాంగ సుందరిని గావించి మృదు మనోహర గంభీర రూపముతో భారత సాహితీ నాట్యరంగము మీది కెక్కించినవాడు నన్నయ. ఆత డాది మహాకవి. ఆ కాలమునందు పండితులకు పామరులకు సంస్కృతాభిమానము మెండు. రాజ సభలయందు, గ్రామ వేదికలయందు సంస్కృతవాణి తిష్ఠ వేసికొని కూర్చుండెను. పండితుల మెప్పుకొరకు తెనుగు కవితా సీమంతవతికి సంస్కృతంపుఁ బలుకు పోకడ లలవరచినాడు నన్నయ. రెండు వందల సంవత్సరములు గడచినవి. జాతీయాభిమానము జనులలో మొలకెత్తి చిగురు తొడిగి మొగ్గ తొల్చినది. తెనుగు సంస్కృతముతోపాటు తల యెత్తి గౌరవ మర్యాదలు సంపాదించుకొనినది. తిక్కన తెనుగు కవితకు చక్కని దేశీయంపుఁ దీరులు తీర్చిదిద్ది తెనుగు సంప్రదాయములను పోకడల నలవరచి వెన్నకన్న మెత్తందనము కూర్చియు బిగువు సడలనీయక భారతము విరాట పర్వ మాది చిట్టచివర వరకు గజ్జె కట్టించి నాట్య మాడించినాడు. తరువాత కవుల కందర కాత డాదర్శ ప్రాయుడైన మహాకవి యైనాడు. అతడు శిల్పకవి. చిత్రరూప రచన మాతని చేతి సొమ్ము. తరువాతి కవులలో తెనుగు కవితా స్రవంతిని కావ్యంపు దారులకు మళ్ళించినవాడు శ్రీనాథుడు. ఈ మహాకవి యాంధ్ర దేశము వాడ వాడలందు సంచారము గావించినాడు. తన్నెదిరించిన గీర్వాణ పండితుల కంచు ఢక్కలు పగుల గొట్టించినాడు. బిరుదు

లూడతీయించినాడు. 'ప్రధ్వంసా భావము ప్రాగభావ మనుచుం దర్కింతు రిచ్ఛా రతిః' అని వారిని పరిహాసము గావించినాడు. సంస్కృత పండితులను నోరు మెదలింపనీయ లేదు. రాజ సభాంత రాళములందు ప్రవేశించినాడు. విజయ శంఖము పూరించినాడు. తెనుగు వాణికి కనకాభిషేకము చేయించినాడు. అతడు తిరుగని చోటు లేదు. చూడని రాజులు లేరు. అతడు ప్రబంధ యుగకర్త. తరువాతవా రందరు వాని యనుయాయులు. అల్లసాని పెద్దన యంతటి మహాకవి శ్రీనాధు నడుగు జాడలలోనే తన కవితను నడిపించెను. తమ కృతులకు నెవ రెన్ని వన్నెలు చిన్నెలు కల్పించినను మిగిలినవా రందరు కవనంపుఁ బోకడలం దీ ముగ్గురిలో నిమిడినవారే.

పదునారవ శతాబ్ద మాంధ్ర వాఙ్మయ చరిత్రమునందు స్వర్ణ యుగము. దాని కధినేత అల్లసాని పెద్దన. పిమ్మట దాదాపు మూడు వందల సంవత్సరములు పైచిలుకు తెనుగు సాహిత్యము వికాసము కోల్పోయి చైతన్యము వీడి ప్రవాస దీక్ష యనుభవించినది. మూగ తనము దాల్చి మారుమూలల నక్కినది. పేరునకు పెద్దవార మని యున్న తెనుగు కవులలో ప్రతిభా సామర్థ్యము లడుగంటెనవి. సంస్కృత పండితులు వారిని తల యెత్తనీయలేదు. వారి నాశ్రయించి తెనుగు కవులు ప్రాతయమకాదులకు క్రొత్త తీర్పులు దిద్ది ప్రాత శ్లేషలకు క్రొత్త విరుపులు పెట్టి కృతులు రచించుచు రాజాస్థానము లందు కడుపు కక్కురితికి కాలక్షేపము చేయుచు వచ్చిరి. ఎప్పటి కప్పుడు నూతనత్వమున కెదురు చూచు మానవప్రకృతి వారియెడ పెడ మొగము పెట్టి మూతి బిగించుకొన్నది. పూర్వపు భారత భాగ వత మనుచరిత్రాదుల యెడ విసుగు చెందినది.

పందొమ్మిదవ శతాబ్దము నాటికి కాలపరిస్థితులు పూర్తిగా మారిపోయినవి. వానితోపాటు మానవ ప్రకృతులు మారిపోయినవి. పరిపాలకు లాంగ్లేయులు. వారి యధికారము దేశమునందు మూల మూలలకు ప్రాకిపోయినది. వేళ్ళు నాటుకొని మారు పిలకలు వేసినది.

జనులలో వ్యక్తిత్వము నశించినది. రాజభాష యింగ్లీషు. ఇంగ్లీషు చదువుకొనిన వారికే గౌరవ మర్యాదలు చెల్లుబడి యగుచుండెను. ఉద్యోగములు లభించుచుండెను. సభావేదికల మీద కొలువుకూటములందు నాంగ్ల భాష పూజ లందుకొనుచుండెను. కళాశాలలు విద్యాశాలలు నాంగ్ల భాషామయము లైనవి. క్రొత్త యొక వింత ప్రాతయొక రోత. జనులంద రాంగ్ల విద్యాభ్యాసమున కెగబడిరి. ఇంగ్లీషు రానివా డొక మూర్ఖుడనియు ననాగరికుడనియు ప్రజలలో దృఢ విశ్వాస మేర్పడినది. ఈ పాశ్చాత్యభాషా వ్యామోహము మిన్నంట పొంగి నురుగులు కట్టుకొని పరవళ్ళు త్రొక్కుకొనుచు పొరలి పల్లెల కెగబ్రాకి ముంచెత్తినది. అమాయకులగు కర్షక కుమారులు సైతము బస్తీలను చేరి యాంగ్ల విద్యాభ్యాసము నవలంబించిరి. దేశ మాంగ్లేయమయ మైనది. ఒక్క భాషయందే కాదు, వేషమునందు వునికియందు నిత్య జీవితమందు పాశ్చాత్యుల ననుకరించుట జనుల కలవా టయినది. 'యథా రాజా తథా ప్రజా' ఎవరి నోటనుండి వెలువడినను షేక్స్పియర్, షెల్లీ, మిల్టన్ల పేరులు తారక నామమువలె వినవచ్చుచుండెను. ఆంగ్లసాహితీ సమగ్ర వేత్తలు, భాషాపండితులు సర్. ఆర్. వేంకటరత్నము నాయుడుగారు సర్. వి. శ్రీనివాస శాస్త్రిగారు, డాక్టరు జిడ్డు కృష్ణమూర్తిగారు తెలుగు దేశీయ విద్యార్థుల కాదర్శప్రాయులై నిలిచిరి. వారు మహోపన్యాసకులు. విద్యార్థులు వారివలె ననర్గళముగా నాంగ్లేయ భాషయందు మాట్లాడవలయునని వేదికల నెక్కి యుపన్యసింపవలయునని విశ్వ ప్రయత్నములు గావించుచుండిరి. ఉబలాటపడు చుండిరి.

పాశ్చాత్య భాషా యోషామణి యెత్తుమడమల చెప్పుల జోడు పాదములకు తొడుగుకొని దేశమందెల్లెడలను వీధుల వెంట పచారులు చేసినది. ఇంటింట మసలినది. స్త్రీ పురుషులు దాని కర్ఘ్య పాద్యము లిచ్చిరి. పువ్వులతో పూజించిరి. తెనుగును గురించి తలంచినవారు లేరు. తెనుగన్నను తెనుగు పండితులన్నను తెనుగు

సాహిత్యమన్నను నిరాదర భావము పుట్టినది. ప్రజా సముదాయము నందు స్వదేశ వేష భాషాభిమానములు నశించినవి. పరదేశీయులకు దాసులయి యాత్మాభిమానమునకు నీరు వదలుకొన్న నగర వాసులచేత నిరాకరింపబడిన గీర్వాణవాణి యింకను విజయనగరము, పిఠాపురము, వనపర్తి, గద్వాల, ఆత్మకూరు మొదలగు సంస్థానములం దగ్రతాంబూలమును బొందుచునే యుండెను. తెనుగొక భాషయే కాదనియు, తెనుగు సాహిత్య మొక సాహిత్యము కాదనియు సంస్కృత విద్వాంసుల వాదన. ఈ వాదన నన్నయ కాలము నుండియు గలదు. వారి నడంపగల యాంధ్ర విద్వత్కవులు పందొమ్మిదవ శతాబ్దమునందు లేరు. ఉన్న వేదం వేంకటరాయశాస్త్రిగారు వడ్డాది సుబ్బారాయుడుగారు, కొక్కొండ వేంకటరత్నము పంతులు గారు మొదలగువారు శ్రీనాథు నంత ప్రతిభావంతులుగారు.

సంఘములోని దురాచారములను రూపుమాపుటకు కంకణము కట్టుకొని పండితులతో హోరాహోరీ పోరాడినవాడు కందుకూరి వీరేశలింగము పంతులుగారు. ఆయన కొంతవరకు స్వతంత్రజీవి. ఆయనయైనను తెనుగు సాహిత్యమునకు నూతన చైతన్యము కల్పించి ప్రజా హృదయము నాకర్షింపలేకపోయెను. ఆయనయు సంస్కృత పండితుల మొగము మెప్పులకొరకు నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర నైషధమును రచించెను. తరువాత రచనలయందు తెనుగు కవితా యువతిని సులుగుదారుల త్రొక్కించినను వినూత నత్వము లేకుండుటచేత మానవ హృదయమును జూరగొన లేక పోయెను. అసలే బక్కచిక్కిన తెనుగు సాహిత్యము సంస్కృతాంగ్లముల నడుమ నలిగి నల్లపూసయినది.

ఆ కాలమునందు కాకినాడ నగరములో తెలుగు సరస్వతిని ప్రభకట్టి రాజవీధుల వెంట నూరేగించినారు. ఆంధ్ర కవితా శంఖమును పూరించినారు. వారి విజయ కాహళకా నినాదములు తెలుగు దేశము నలుదిశల మారుమ్రోగినవి. సంస్కృత పండితుల హృదయ

ములు దద్దరిల్లినవి. ఆంగ్ల భాషాకోవిదుల యంతరంగములు విస్తు పోయినవి. తెనుగు ప్రజల ముఖములు విప్పారినవి.

మెడలో రుద్రాక్ష పేరులు నొసట కుంకుమ బొట్లు బిళ్ళ గోచీలు పెట్టుకొని పండితులు నుద్యోగులు ధనికులునున్న నిండు సభలో నిర్భయముగా నిలిచి సంస్కృతాంధ్ర భాషలయందు ధారా శముగా, కవిత్వము చెప్పునపుడు ప్రజలు విరుగబడి చూచిరి. ఇంకను పూర్తిగా నిరువది యేండ్లయినను నిండలేదు. ఎదిరించిన పండితులతో వాదోపవాదములు గావించుచు కోయిల కంఠస్వరము వంటి మనోహర కంఠారావముతో శ్రీరాగ మందుకొని పద్యము చదువుచున్నప్పుడు శారదాదేవి ముంజేత మొరయించు కచ్ఛపీ నినాద మేమోయని చెవులు విచ్చుకొని యందరు నాలకించిరి. వారు రూపొందిన సరస్వతీమూర్తులు. ఆకృతి తాల్చిన సాహిత్య దేవతలు, తిరుపతి వేంకటేశ్వరుల మూర్త్యంతరములు. వారే తిరుపతి వేంకట కవులు.

వేంకటశాస్త్రిగారు పేరు వరుసయందు రెండవవారయ్యును కార్యరంగమునందు మొదటివారు. వీరు ఆరామ ద్రావిడ కుటుంబము నకు చెందిన బ్రాహ్మణులు. ఇంటిపేరు చెళ్ళపిళ్ళవారు. వీరి నివాసము గోదావరి మండలములోని కడియ మను గ్రామము. వీరి తండ్రి పేరు కామయ్యగారు. తల్లి చంద్రమ్మ. ఈ పుణ్యదంపతుల పూర్వజన్మ తపః ఫలంబయి లేక లేక పుట్టిన కుమారుడు వేంకటశాస్త్రిగారు. వీరికి మొదట తల్లిదండ్రులు పెట్టిన పేరు వేంకటాచలము. వేంకటా చలమును యథావిధిగా నైదవయేట చదువవేసిరి. కాని బడికి పోయిన పాపమున నెన్నడు పోలేదు. తోడి బాలకులతోగూడి గోలీలు కోతికొమ్మచ్చులు నాడుకొనుచు విచ్చలవిడిగా తిరిగెను. తల్లిదండ్రుల కది విషాద కారణమైనది. తాతగారగు వేంకనగారు కొడుకు కోడండ్రతో 'వానిని బడికి పొమ్మని శాధించకండి. పోకుండినపోనిండు. నా మాటలు నేర్చుకొన్న చాలు. వాడు బ్రతుకలేకపోడు' అను చుండెడివాడట. తాత వేంకనగారు లౌక్యుడు, తెలివికలవాడు. విద్యా

ధికుడు కాకపోయినను మాట చతురత కలవాడు. తాతగారి యాశీః ప్రభావమో లేక జాతక చర్య యెట్టిదో కాని క్రమముగా బుద్ధి కుదిరి వేంకటాచలము ఏండ్లలో నేర్వతగిన విద్య నెలలలో నార్జించెను. కారణాంతరమువలన పరిస్థితులు తారుమారైనవి. కామయ్యగారు కడియమునుండి తన సంసారమును యానాము నకు మార్చవలసి వచ్చినది. అచట వేంకటాచలమునకు కొంచెము హూణ విద్యయలవడినది. అచట ఫ్రెంచి పాఠశాలయందు బోధించు తెలుగు వేంకటాచలమునకు నచ్చలేదు. కొలది కాలము వీధిబడియందు చేరి విద్య నభ్యసించెను.

'అప్పుడు వీధినాటకములాడుట వాగుక రామ నాటకం
బొప్పుగ నాడఁజూచి మరియుం బరియించియుఁ దెల్గు నేర్చితిన్
జెప్పినవారు లే రెవరు స్వీయమె సర్వము' (జా. చ.)

అని వేంకటశాస్త్రిగారు తన్ను గురించి చెప్పుకొనిరి. ఆ గోష్ఠుల లోనే గానము మృదంగము మొదలగు కొన్ని చిల్లర విద్యలు కూడ నభ్యసించిరి. వేంకటాచలమునకు సంస్కృతము మీదికి బుద్ధి మరలినది. 'బుద్ధిః కర్మానుసారిణి.' కానుకుర్తి భుజంగరావుగారి యొద్ద రఘువంశ కావ్యమును చదువుట కారంభించిరి. ఆ సమయమునందు నాటకములలో వేషములు వేయలేదు కాని సారంగధరుడు కణ్వుడు మొదలగు పాత్రలు ధరించుటకు ప్రయత్నములు జరిగినవి. ఇవి యన్నియు నప్పటి కప్పు డంతగా నుపకరించకపోయిన నుత్తరత్ర సర్వతోముఖ పాండిత్యమునకు, కీర్తిసముపార్జనకు నుపసాధనములుగా బనిచేసినవి. అప్పుడే కవిత్వసాధన కారంభించి కొన్ని పదాలు జావళీలు కీర్తనలు రచించెను. వేంకటాచలమునకు విద్యాపరిగ్రహణమునం దభిలాష యినుమడించినది. విద్యాలబ్ధికొరకు గ్రామముల వెంట తిరిగి తిరిగి చివరకు కాటవరము చేరిరి.

కాటవరములో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యొద్ద మూడు మాసములు కుమారసంభవమున రెండు సర్గలు మేఘసందేశమున

కొన్ని శ్లోకములు పఠించెను. అప్పుడే చదరంగపు టాటయందు ప్రజ్ఞ కూడ సంపాదించెను. తరువాత కాజులూరను గ్రామమునందు పండితుల యొద్ద మేఘసందేశమును చదివెను. కావ్యము పూర్తి కాలేదు. కాని కవిత్వమునందు పాటవ మేర్పడినది. తరువాత వేంకటాచలము యానామునకు తిరిగి వచ్చెను. ఇంటియొద్ద నూరక కూర్చుండలేక యానాములోని వేంకటేశ్వరుని మీద నొక శతకము రచించెను. దానిని పండిత సభయందు వినిపించెను. ఆ గ్రంథమునం దొక పద్యములోని సంస్కృత సమాసగత సంధికార్యమును గురించి పండితులు ప్రశ్నించిరి.

వేంకటాచలమున కప్పటికి తెలుగు వ్యాకరణము వచ్చును. సంస్కృత వ్యాకరణము రాదు. వేంకటాచలము పని యస్తావ్యస్త మయినది. తలవంపు కలిగినది. పాణినీయము చదువవలయుననియు కోరిక పుట్టినది. వ్యాకరణాధ్యయనము కొరకు చామర్లకోట కరిగెను. అచ్చట మాధుకర వృత్తిచేత భుక్తి గడుపుకొనుచు ప్రతివాది భయంకర రాఘవాచార్యుల వారి యొద్ద మూడు మాసములు భాగవిలో మూడు సర్గలు లఘు కౌముదియందు పంచ సంధులు నభ్యసించెను. 'శ్రేయాంసి బహు విఘ్నాని' అంతలో వేంకటాచలము కంటికి జబ్బు ఏర్పడినది. కావున తిరిగి యానామునకు రావలసి వచ్చెను. విద్యాపరిగ్రహణమునందు వేంకటాచలమున కున్న తృష్ణ మరే విద్యార్థికి నుండదు.

పగలు పగ లయ్యె నిశి తన బంధు వయ్యె

పగలంతయు కంటి బాధపడుచు నిల్లు కదలక రాత్రులందు పిల్లంకి యను గ్రామమున కరిగి యనంతాచార్యులవారి యొద్ద లఘు కౌముది చదువుచు వచ్చెను. అంతలో చర్ల బ్రహ్మయ్య శాస్త్రి గారు కాశినుండి స్వగ్రామమునకు తిరిగి వచ్చిరని వేంకటాచలము వినెను. ఆయన పండిత కుటుంబమునకు చెందినవాడు. తాత ముత్తాతలు మహాపండితులు. పూర్వార్జితమైన స్వాస్థ్యము కలవాడు. ఉదార

స్వభావుడు. కాశీయందు వ్యాకరణశాస్త్రము షడ్దర్శనములు నామూలాగ్రముగా గురువులయొద్ద నధ్యయనము చేసిన మహాను భావుడు. బ్రహ్మయ్య శాస్త్రిగారి స్వగ్రామము తాడేపల్లి గూడెము నకు సమీపమునందున్న కడియెద్ద యను పల్లెటూరు. అందు శాస్త్రి గారు విద్యార్థులకు సంస్కృత పాఠశాల నొకదానిని నెలకొల్పిరి. శిష్యుల కుచితముగా విద్య గరపుటయే కాక భోజన సౌకర్యములు గూడ వారికి తమ యింటనే సమకూర్చుచు వచ్చిరి. వారిని దర్శింప వలయునని వేంకటాచలము—

ఒక కంటఁ జూచుచును వే
రొక కంటికి గుడ్డకట్టి యూరు విడిచి మి
న్నక యేగఁ దొడఁగెఁ గను వా
రికిఁ దాఁ గవి యగుటఁ దెల్పు రీతి (జా. చ.)

ఆడబోయిన తీర్థ మెదురైనట్లు మార్గ మధ్యమునందు శిష్య సముదాయముతో బ్రహ్మయ్య శాస్త్రిగారు వేంకటాచలమున కెదురైరి. వేంకటాచలము

కని యమ్మహాత్ముఁ బెన్నిధిఁ
గను పేద విధమునఁ బొంగి కడు భక్తిని మ్రొ
క్కి నిలిచి
మీ యొద్ద చదివికొనుటకు
నై యేఁ జనుదెంచు చుంటి నస్మ దదృష్ట
శ్రీ యెట్టిదో త్రోవను భవ
దీయం బగు దర్శనంబు తీర్చె శకునమున్ (జా. చ)

అని మనవి చేసికొనెను. ఆ పండిత మాన్యుడు వేంకటా చలమును శిష్యునిగా గైకొనుట కంగీకరించెను. వేంకటాచలము బ్రహ్మయ్య శాస్త్రిగారియొద్ద సెలవు తీసుకొని చింతపఱ్ఱున కేగెను. అచట రెండు నెలలుండి నేత్రచికిత్స చేయించుకొనెను. అనంతరము

కడిమెద్ద యందు బ్రహ్మయ్యశాస్త్రిగారి దగ్గర విద్యాభ్యాసమునకు వచ్చి చేరెను.

తిరుపతిశాస్త్రిగారు అంతకు పూర్వము నాలుగైదు మాస ముల క్రిందట బ్రహ్మయ్యశాస్త్రిగారి యొద్ద శిష్యత్వమునకు కుదురు కొనిరి. కౌముది పాఠము చదువుచుండిరి. తిరుపతిశాస్త్రిగారి యింటి పేరు దివాకర్ల వారు. వారి స్వగ్రామము జల్లిసీమలోని యెండగండి యను గ్రామము. వెలనాటి శాఖకు చెందిన బ్రాహ్మణ కుటుంబము లోనివారు. వీరిది పండిత వంశము. హరితస గోత్రము. యాజుష శాఖకు చెందినవారు తిరుపతి శాస్త్రిగారు. వీరి ముత్తాత వేంకట జోగిగారు. ఈ రేడు విద్యలం బాటవమ్మున మించినవాడు. తాత సుందర రామశాస్త్రిగారు. ఆయన సాంగ వేదాధ్యేత. తండ్రి వేంక టావధాని. ఘనాంతము స్వాధ్యాయపరుడు. శాస్త్రవిదుడు. షోడశ కర్మాధికారి. సాహితీవేత్త. బుద్ధిసూక్ష్మతకలవాడు.

తిరుపతిశాస్త్రిగారి తల్లి పేరు శేషమాంబ. 'వండ నలయదు వేవురు వచ్చిరేని యన్నపూర్ణకు నుద్దియౌ' నన్నటుల నతిథి అభ్యా గతులకు నవ్వారిగాం బెట్టి తాను భుజించు నిల్లాలా పరమసాధ్వి. ఆ వధూవరులకు నాల్గవ పుత్రసంతానము తిరుపతిశాస్త్రిగారు. ప్రజో త్పత్తినామ సంవత్సరమున ఫాల్గుణ మాసమునందు జన్మించిరి. వేంకటశాస్త్రిగారు ప్రమోదూతనామ సంవత్సర శ్రావణ మాస ములో పుట్టిరి. కావున వేంకటశాస్త్రిగారికంటె తిరుపతిశాస్త్రిగారు రమారమి సంవత్సరము మీద నేడు మాసములు చిన్న.

తిరుపతిశాస్త్రిగారికి బూరుల సుబ్బారాయుడుగా రక్షరాభ్యా సము గావించిరి. అంతో యింతో వారియొద్దనే కావ్యపాఠముకూడా కావించినటుల తిరుపతిశాస్త్రిగారు చెప్పుకొనిరి. తరువాత పితృ పాదుల యొద్ద రఘువంశము, కుమారసంభవము చదివిరి. పదునాల్గవ యేట కోనసీమకు విద్యార్థియైచనిరి. గంగలకుర్తి యగ్రహారమునందు గరిమెళ్ళ లింగయ్యశాస్త్రిగారి యొద్ద భారవి లోనగు కావ్యములు, భారత చంపువు మొదలగు చంపువులు, మరికొన్ని భాణములు నభ్య

సించిరి. పిమ్మట శాస్త్ర పాఠముల మీఁదికి శాస్త్రిగారి మనస్సు మళ్ళినది. పిప్పరలో పమ్మి పేరిశాస్త్రులవారియొద్ద మురారి నాటకములో నాలుగంకములు మరొక శాస్త్రులవారియొద్ద తర్క సంగ్రహము న్యాయబోధిని వరకు చదివిరి. అప్పటికి చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు కాశినుండి స్వగ్రామమునకు వచ్చిరి. వారియొద్ద వ్యాకరణ శాస్త్రము చదువ వలయునని కడియెద్దకు ప్రయాణమైరి. మార్గమధ్యమున పెంటపాడు గ్రామమునందు తిరుపతిశాస్త్రిగారికి చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి దర్శనము లభించినది.

నాటినుండి తిరుపతిశాస్త్రిగారు బ్రహ్మయ్య శాస్త్రిగారి శిష్యులైరి. తిరుపతి శాస్త్రిగారి ప్రజ్ఞ వర్ణనాతీతమైనది. అప్పటికే యెంత కఠినమగు శ్లోకమైనను తేలికగా నన్వయింపగల సామర్థ్యమును సంపాదించిరి. సంస్కృతమునందు చక్కని సాహిత్య సరళి యలవడినది. వారి మేధా సంపత్తి ప్రశంసనీయమైనది. అదివరకు తిరుపతి శాస్త్రిగారు కౌముది యెరుగరు. కౌముది పూర్తిచేసికొని మనోరమాది వ్యాఖ్యానములు చదువుచున్న తోడి విద్యార్థులకు గురువులు చెప్పు పాఠము నాలకించి మరల వారికి సంతన చెప్పుచుండెడివారట. అది యాలకించి బ్రహ్మయ్య శాస్త్రిగారమితాశ్చర్యము నొందుచుండెడివారట. తిరుపతి శాస్త్రిగారి ప్రజ్ఞ అటువంటిది. అట్టివారెన్ని యవధానములైన పుక్కిలించగల రన్నచో నబ్బురమేమున్నది? ఆయన తెలివి తేటలకు సహపాఠు లసూయపడుచుండెడివారు. తిరుపతి శాస్త్రిగారు గురువులు చెప్పు పాఠములు వినుటయే కాని మరల పుస్తకమును విప్పిన పాపమున నెన్నడు పోయెడివారు కాదు. ఆ పాఠము శిలాక్షరములవలె హృదయమున హత్తుకొని పోవుచుండెడిది. ఐదు మాసములు గడిచినవి. తిరుపతి శాస్త్రిగారికి కౌముదియందు కారక పరిచ్ఛేదము పూర్తికావచ్చినది.

తరువాత వేంకటశాస్త్రిగారు బ్రహ్మయ్య శాస్త్రిగారి యొద్ద విద్యాభ్యాసమునకు చేరిరి. వేంకటాచలమునకు గురుపాదులు ప్రసాదించిన పేరు వేంకటశాస్త్రి. ఇచ్చటనే వేంకటశాస్త్రిగారికి తిరుపతి

శాస్త్రిగారితో పరిచయము సంభవించినది. అప్పటికే వేంకటశాస్త్రి గారికి రాగయుక్తముగా పద్యము చదివి సభారంజకముగా పురాణ ములు చెప్పగల శక్తి కలదు. తెనుగునందు కవిత్వము చెప్పగల సామర్థ్య మున్నది. శ్లోక రచన కంతగా నలవాటుపడలేదు.

తిరుపతి శాస్త్రిగా రంత సంగీత ధోరణిని పద్యము చదువలేక పోయినను పురాణము చెప్పుటకు చక్కగా నలవాటుపడిరి. కొంచెమో గొప్పయో సంస్కృతమునందు కవిత్వ మల్లగలరు. తెనుగు కావ్యముల పరిచయము తక్కువ. అసలు లేదనియే చెప్ప వచ్చును. ఇరువురు ప్రజ్ఞావంతులు. ఇరువురు మేధా సంపన్నులు. ఒకరిని మించిన వా రింకొకరు. సహపాఠులై యున్న కాలమునందు ప్రారంభదశలో నిరువురకు వాదోపవాదములు చెలరేగినవి. తోడి విద్యార్థులు చెరియొక పక్షము నవలంబించిరి. ఇరు కక్షులకు చెరి యొకరు నాయకు లయిరి.

ప్రతి సంవత్సరము గణపతి మహోత్సవములు చేయుట పాఠ శాల విద్యార్థుల కలవాటు. తిరుపతి శాస్త్రిగారు వేంకటశాస్త్రిగారు తమ మిత్రులతో చెరియొక వైపున కరిగి పురాణములు, కవిత్వ ములు చెప్పి ధనార్జన చేసికొని వచ్చుచుండెడివారు. అందు వేంకట శాస్త్రిగారిదే పై చేయి. ఆ డబ్బుతో మహావైభవముగా నుత్సవము జరుపుచువచ్చిరి.

ప్రతిదినమును తిరుపతిశాస్త్రి వేంకటశాస్త్రిగార్లకు వాద ములు చర్చలు జరుగుచుండుటయు గురుపాదులు సర్ది చెప్పుటయు సంభవించుచుండెడిది. ఆ వాదములలో నొకరి భావము లింకొకరు పరిస్ఫుటముగా నవగతము గావించుకొనగలిగిరి. భావి కాలమునం దొక మహా కార్యము నపేక్షించి పరమేశ్వరు డిట్టివారి నొకచోట చేర్చుచుండును. కాలక్రమమున ప్రత్యర్థులుగా నున్న యిరువురు ప్రాణమిత్రులయిరి. ప్రాణమిత్రు లగుటయే కాదు. తిరుపతి శాస్త్రి గారికి వేంకటశాస్త్రిగారి యందు గురుభావ మేర్పడినది. కుందనము

నందు వజ్రము పొదిగినట్లు ఇరువురి యంతరంగము లొకదానితో నొకటి హత్తుకొని పోయినవి.

ఎవఁడు నా కెక్కుడయ్యు నా మొదలఁ గార
ణాంతరమ్మున గురు భావ మంతరంగ
మునను గాక పయికిఁ గూడఁ గనఁగఁ జేసె

అని వేంకట శాస్త్రిగారు తిరుపతి శాస్త్రిగారిని గురించి కాకినాడ సభలో నుడివిరి. తిరుపతి శాస్త్రిగారే స్వయముగా 'వేంకటేశ కవిదేశికు సన్నుతి చేతు నిచ్చలున్' అనియు 'కవితా సద్గురు వేంకటాభిధుని వక్కాణింతు నెక్కాలమున్' అనియు పెక్కుచోట్లు లందు చెప్పుకొనిరి.

దీనినిబట్టి వేంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారికి తెనుగు కవితయందు దేశికులని యూహింపవలసి యున్నది. తిరుపతిశాస్త్రిగారు సంస్కృత భాషా కోవిదులు. అనర్గళముగా నా భాషయందు కవిత్వము చెప్ప నేర్చినవారు. తెనుగు గొడవయే వారికి తెలియదు. వేంకటశాస్త్రిగారి పిన ముత్తాత నరసన్నగారు గొప్పకవి. వేంకటేశ్వర విలాసము, యామినీ పూర్ణతిలకా విలాసము లను గ్రంథములు తెనుగునందు రచించిరి. ఆయన సంపాదించి పెట్టిన పెద్ద పుస్తక భాండాగార మింటియం దున్నది. వేంకటశాస్త్రిగా రా గ్రంథము లన్నియు చదివి గోచి పెట్టక మున్నె కోమల కవిత చెప్ప నారంభించినారు. తిరుపతి శాస్త్రిగారి కా వాసన లేదు.

కాకినాడలో శతావధానమునకు బయలుదేరి పోవుచు మార్గమధ్యమున తెనుగు ఛందస్సు, కవితా రహస్యములు, అవధాన ప్రక్రియ వేంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారికి బోధించిరి తిరుపతిశాస్త్రిగారు మహా మేధావి, గొప్ప గ్రహణశక్తి కలవారు. అన్నియు నవగతము గావించుకొని కాకినాడ సభలో తమ ప్రజ్ఞాపాండిత్యములు ప్రదర్శించిరి. అది కారణముగా నాటినుండి తిరుపతిశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారిని గురువుగా గౌరవించుచు వచ్చిరి. కాకినాడ

యవధానానంతరము తిరుపతి శాస్త్రిగారు కుమారసంభవము కొంత వరకు తెలిగించిరి. అది ముద్రింపఁబడ లేదు

సాహిత్యాం గురుపాణినీయ జనితా పౌరాణ సంవర్ధితా
దేశాలోకన పుష్పితాచ కవితాకన్యా మయిప్రత్యయాత్
వవ్రేం మాం స్వయ మేవ. (కా. స.)

అని కూడ తిరుపతి శాస్త్రిగారు చెప్పుకొనిరి ఇది సంస్కృత కవిత్వమును గురించి యై యుండ వచ్చును.

అడివి యుసిరికాయ యల సముద్రపు టుప్పు కలియు రీతి
(జా. చ.)

వారికి మైత్రి కలిసినది

తిరుపతి యితండు వేంకటేశ్వరుఁడ నేను
వెరసి తిరుపతి వేంకటేశ్వరుల మేము (నానా. సం)

అని యూరూర చాటుకొనిరి. ఆ పేరుల కలయికలోనే యొక మనోహరత యున్నది. మానవాతీత మగు నొక శక్తి ప్రతిభ యిమిడియున్నవి. తరువాత యెంతమంది జంటకవులు కలిసి పేర్లు పెట్టుకొనలేదు? వారిలో నీ పొందికయు నేకత్వము మచ్చుకైన కనిపించవు. పరమేశ్వరుడు కొందరు వ్యక్తులను కొన్ని కొన్ని కార్యములు నిర్వర్తించుటకు ప్రత్యేకముగా శక్తి సామర్థ్యములను ప్రసాదించి సృష్టించుచుండును. ఆ తెగకు చెందినవారు తిరుపతి వేంకటేశ్వర కవులు.

మూడు వందల సంవత్సరములనుండి పూజా పురస్కారములు లేక నానాటికి దీన స్థితిని పొందుచున్న తెనుగు సాహిత్యమునకు వినూత్న చైతన్యమును కలిగించి పునరుద్ధరించుటకు రూపద్వయముతో నవతరించిన సరస్వతీ మూర్తులు తిరుపతి వేంకటకవులు. తిరుపతి శాస్త్రిగారు కొంచెము స్థూలకాయులు. వేంకటశాస్త్రిగారు పలుచని శరీరముగలవారు. తిరుపతి శాస్త్రిగారు మితభాషి. వారికి

కంఠ సారస్యము తక్కువ. పద్యమంత రమ్యముగా చదువలేరు. సభా ముఖమునందా లోపము కప్పిపుచ్చగల శక్తి సామర్థ్యములు వేంకటశాస్త్రిగారికి గలవు. వేంకటశాస్త్రిగారి కంఠస్వర మతి మనోహరమైనది. పద్యము చదువుచున్నప్పుడు సంగీత స్రవంతి స్నిగ్ధ మోహన గంభీర స్వరముతో కంఠనాళమునుండి వెలువడి శ్రోతలను ముగ్ధులను గావించును. అంతటితో వేలకొలంది జనులు గూడియున్న మహాసభ నిస్తరంగ పయోరాశివలె మూటుమడిగి యుండును. ఇది వేంకటశాస్త్రిగారి యందున్న ప్రత్యేకత. అది దైవము జన్మతః ప్రసాదించిన గుణము.

వేంకటశాస్త్రిగారతి మాటకారి. పలుకు నేర్పరితన మెక్కువ. తాతగారి గుణము సంక్రమించినది. ఇంటియందేమి సభలయందేమి, యెప్పుడు నోరు మాట్లాడుచుండవలసినదే. క్షణమూరకుండునది కాదు. ఆ మాటలు వినుటకు విసుగు పుట్టదు. వానిలో చమత్కారములు, పరిహాసములు, వెక్కిరింతలు, వక్రోక్తులు, వ్యంగ్యములు నొకటేమిటి యేరుకొనెడివారుండవలయును గాని రత్నాలు రవ్వలు వర్షించును. ప్రతిపక్షి యెదుట కనిపించవలయునేగాని మరింత యీసామాషీలు పొడుపులు వడగండ్లవలె వర్షించును. వినువాడు తన్ను గురించియేనని యింటికి పోయి బాగా యాలోచించుకొనిన గాని తట్టదు. అంతవరకు నందరితోపాటు తానును కడుపుబ్బ నవ్వుచుండును.

సభలలో పొడుము పట్టుపట్టించి యుపన్యాసమున కారంభించినచో కథలమీద కథలు సంగతులమీద సంగతులు నల్లుకొని పోవుచు మధ్య మధ్య మోహన రాగముమీదనో శ్రీరాగము మీదనో పద్యములు విసురుచు నుండునపుడు కాలము తెలిసెడిది కాదు. గంటల వెంట గంటలు గడిచి పోయెడివి. సభికులలో నొక్కడైనను కదిలెడివాడు కాదు. ఎక్కడే సంగతి దాటిపోవునో యని చెవులు విచ్చుకొని వినుచుండెడివారు. సభలో నొక్కరు కిక్కురుమనెడివారు కారు. మొదటినుండి చివరి వరకు హాస్యములు కబుర్లు

శాస్త్ర వాదనలు ప్రయోగ విశేషాలు కవితా రీతులలోని యందములు పరవళ్ళు త్రొక్కుకొనుచు పొరలి వచ్చెడివి. ఆ మాటలలోని చమత్కారములు వినవలసినవేగాని చెప్పిన తీరునవి గావు.

కాశీ కృష్ణాచార్యులవారు పండితులు. శతావధానములు చేసినవారు. సంగీత విద్వాంసులు. వారొకసారి బందరులో వేణుగానపు కచేరి చేయుచుండిరి. పాట ముగిసినది. వేంకటశాస్త్రిగారు లేచి—

ఒక జానెడు బెత్తెడు లో
నికి తెచ్చెను గాననిరనిధి నీతఁడు

అనుచు నొక కందపద్యము నాశువుగా చెప్పిరి. దానిలో నెంత భావ మిమిడియున్నదో చదువరులు గ్రహించుకొనగలరు. ఆ రోజులలో వేంకటశాస్త్రిగారు లేని సభ బందరులో జరిగెడిది కాదు. ధనకోటి తెనుగు దేశమునందు దక్షిణాదిని పేరు మోసిన మహాగాయకురాలు. మహారాజులు జమీందారు లామెను మిగుల గౌరవించిరి. బందరులో ధనకోటి పాటకచేరి చేసినది. శాస్త్రిగారా సభయం దుండిరి. చివరకు శాస్త్రిగారు లేచి యుపన్యసించుచు 'ఈ ధనకోటికి మన మే మిచ్చి సంతోష పెట్టగలము? ఆమెనే త్రిప్పి యిచ్చినను ఋణము తీరదు' అంటూ—

'...ధనకోటి నీ పాట కోటి ధనము.'

అని యతి చమత్కారముగా నొక గీత పద్యము చెప్పిరి. ఇంతేకాదు. ఒకసారి బెంగుళూరు నాగరత్నము బెజవాడలో వేంకటరెడ్డిగారి యింటియందు సంగీత సభ చేసినది. నాగరత్నము సంగీత శాస్త్రమునందు నిధి. కవనము చెప్పగల సమర్థురాలు. దానికితోడు మంచి రసికురాలు కూడ. అప్పుడు వేంకటశాస్త్రిగారు బెజవాడ యందు నివసించుచుండిరి. ఆ సభకు వారుకూడ ఆహ్వానింపబడిరి.

గాయకురాలు 'నగుమోము గనలేని' యనుకృతి యత్యద్భుతముగా గానము చేసినది. స్వర కల్పన చేసినది. రాగ మాలపించినది. అది గంధర్వ గానము. సభకులందరు ముగ్ధులైనారు. వేంకట

శాస్త్రిగారు సభా మధ్యమునందుండి ముందు రెండు మూడు మాటలు చెప్పి 'నాకు నాగరత్నమునకు నవినాభావ సంబంధము. మే మిద్దరము కలవని చోటంటూ లేదు' అన్నారు. ఆ మాటలకు సభలోని వారందరు బిరగబడి గొల్లున నవ్విరి. తరువాత "గీత సాహిత్యములు వాణికి జనుదోయి" అంటూ సమర్థించి యొక గీత పద్యము చెప్పిరి.

వేంకటశాస్త్రిగారిలో నింకొక విచిత్రముకూడ నున్నది. ముందు సగము పద్యము చెప్పి శ్రోతలను తప్పు దూహాలోనికి దారి తీయుదురు. తరువాత సభికుల ముఖము వంక చూచి కొంచెము సేపాగి వారి మనోగత భావమునకంటె విభిన్నముగా మిగిలిన పద్యము పూర్తి చేసెడివారు. సభికులు నిర్ఘాంతపోయెడివారు. ముక్త్యాలలో హరి నాగభూషణముగారి గానసభ జరిగినది. ఆయన మీద వేంకటశాస్త్రిగారి శిష్యుడొక కవి యొక పద్య మాశువుగా చెప్పెను. ఆయన కొంచెము వృద్ధు. తలకూడ నరసినది. తరువాత శాస్త్రిగారు లేచి—

శిష్యులకు గూడ తల నరసినది కొంత
నాకుఁ దలయొక్కటియె కాదు

అనుచు చేతిలోని పొన్నుకఱ్ఱ చంక పెట్టుకొని సభికులవంక చూచుచు పొడుముకాయ తీసిరి. సభికు లొకరి ముఖ మొకరు చూచుకొనుచుండిరి. శాస్త్రిగారు మిగిలిన పద్య మసభ్యతగా పూరింతురని వారి యూహ. పొడు మొక పట్టు పట్టించి

నరసె మీస
లిట్టిచో నే కయిత చెప్ప నేల యైనఁ
జెప్ప కే తప్ప కొక్కింత చెప్పుచుంటి

అని శాస్త్రిగారు పద్యమును పూరించిరి. సభ్యు లనుకొనిన దొకటి పూర్తిచేసిన దొకటి. అందరు తలవంచుకొనిరి. ఇట్టి విచిత్ర సంఘటన లవధానములం దెక్కువగా జరుగుచుండెడివి.

అవధానములలో తిరుపతి కవులకు గల సమయస్ఫూర్తి చెప్పుకొన తగినది. బందరులో తిరుపతికవు లవధానము చేయు చుండిరి. ఆ సభకు పండితులు కవులు నుద్యోగస్థులు గాయకులు పెక్కుమంది వచ్చిరి. సభ కిట కిట లాడుచుండెను. నాదెళ్ళ పురుషోత్తముగా రానాటి పృచ్ఛకులలో నొకరు. ఆయన యొక కవి, పండితుడు. బంధ కవిత్వము గర్భ కవిత్వము చెప్పుటలో పేరు మోసినవాడు. సభ మహారంజకముగా నుండెను. తిరుపతి శాస్త్రి గారికి చేతిలో రుమాలుంచుకొనుట యొక యలవాటు. అవధానమునందు నేకాగ్రత వహించియున్న తిరుపతిశాస్త్రిగారి చేతిలోని రుమాలు క్రిందపడినది. శాస్త్రిగారది చూచుకొన లేదు. పురుషోత్తమ కవిగా రది పరిశీలించి 'అయ్యా! శాస్త్రిగారు! మీరు మాలండి' అన్నారు మహానేర్పుగా నాలోచించి. తిరుపతిశాస్త్రి గార నే ప్రతీతి. ఆ మాట విని వెంటనే 'ఆ మాదిగా!' అన్నారట. ఆ మాట విని సభికులు కరతాళ ధ్వనులు చేయుచు గొల్లున నవ్వినారట. కవిగారి ముఖము చిన్నపోయినది ఆయన పరిస్థితి తన్ను జోయి తలక్రిందుగా బడినట్లయినది. జమిందారులు కానిండు మహారాజులు కానిండు తిరుపతి కవులకు జంకు గొంకు లేదు. వారన దలంచుకొనినది మెత్తని మాటలతో మనస్సు నొవ్వనీయకుండ చురుకు తగులు నట్లనుట యలవాటు

కరినమ్ములగు రాళ్ళు కరపి కట్టిన రామ
భజ నాలయమ్మె పడక లాయెఁ
దాకిన మాత్రానఁ దనువు కట్టెగఁ జేయఁ
జాలిన చలినీట స్నాన మాయె
నుడికియు నుడుకని కడు వేడి మెదుకులే
యాకొన్న కడుపున కడ్డమాయె

అని మొదట పరదేశ వాసమువలని కష్టములను వేంకటగిరి మహారాజులంగారికి మనవి చేసుకొనిరి. ఆ మీద

ప్రభులిచ్చు వేసూట పదియారు లనియెడి
స్వప్నమ్ములే ధనార్జనము లాయె

అని యొక్క విసురు విసిరిరి. ఎంత భావగర్భితమైన చమత్కారము! నవ్వు పుట్టించును. మహారాజులు మాత్రమే మనగలరు? ఈ విధముగానే గద్వాల రాజుగారితో

చర్ల బ్రహ్మయశాస్త్రి శబ్ద శాస్త్రము చెప్పె
వంట నేర్పించె గద్వాల రాజు

అనిరి. ఎంత నర్మగర్భితమైన యుపాలంభము. గ్రహించుకొనవలయునుగాని యిట్టి చమత్కారములు వారి పద్యములలో పెక్కులు గలవు. గోడే గజపతిరావుగారికి—

సంగర శక్తిలేదు వ్యవసాయము సేయఁగలేము సంతలో
నంగడివేసి యమ్ముటది యంతకుము న్నె హుళక్కి కావునన్
బొంగు బుజానవైచుకొని పోయెద మెచ్చటికేని ముష్టి చెం
బుం గొనిపెట్టు మొక్కటి యమోఘుమ దేకద దంతిరాణ్ణృపా.

అని యర్జీ పంపుకొనినారు తిరుపతి కవులు. ఎదుటి వారిని నిందించినా నిందించి నట్లుండదు. కొంత యాలోచించినగాని యంతరార్థము బహిర్గతము గాదు.

తిరుపతి వేంకటకవులు, చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి యొద్ద భాష్యాంతము వ్యాకరణశాస్త్ర మధ్యయనము గావించిరి. ఆ కాలమునందే కవిత్వము నన్నివిధముల నభివృద్ధి గావించుకొనిరి. అష్టావధాన శతావధానములు ఆశుకవనము శతఘంట కవనము ప్రబంధరచనము మొదలగు వానియందసమాన ప్రతిభా విశేషములు సంపాదించిరి. కాళీసహస్రము, ధాతురత్నాకరము, శృంగార శృంగాట మను సంస్కృత గ్రంథములు వ్రాసిరి. వేంకటశాస్త్రిగారు కాశియందు అంతో యింతో వ్యాకరణము నోరి సుబ్రహ్మణ్యశాస్త్రుల వారియొద్ద చదవడమే కాకుండ తర్కం చేమర్తి శోభనాద్రి శాస్త్రుల వారియొద్ద

పఠించాను. అని మా గురుపరంపర యను వ్యాసమునందు చెప్పు కొనిరి.

వీరు బందరులో నుద్యోగము చేయుచు జంధ్యాల గౌరీనాధ శాస్త్రిగారియొద్ద కొంత సూత్రభాష్యముకూడా పఠించిరి. మిగిలిన పాండిత్య మంతయు తిరుపతి కవులు స్వయంకృషిచేత సంపాదించు కొనిరి. వారికి పరిచయములేని శాస్త్రములేదు. ఎవరే శాస్త్రమునం దే విషయము నెత్తుకొనినను దాని నందు కొనెడివారు. అందు వేంకటశాస్త్రిగారు విద్యాపిపాసి. సంగీతము, జ్యోతిషము నందు కూడ చాలవరకు పరిశ్రమ చేసిరి.

తిరుపతి కవులకు బూర్వజన్మ తపఃకలనచేత గోచిపెట్టకమున్నె కవితాసిద్ధి చేకూరినది. గురు కటాక్షమువలన శాస్త్రపాండిత్యము సమకూడినది. వీనికి తోడు కాళికాదేవి నుపాసించి యామె ప్రసాదము కూడసంపాదించుకొనిరి. ''తగు నుపాస్యమ్ము కాళీపదమ్ము మాకు'' అని చెప్పుకొనిరి. మహాకవులకు కావలసిన సాధన సామగ్రు లన్నియు సమకూడినవి. ఇక టెంగురంగా యని విదేశ సంచారములకు బయలుదేరినారు.

---

## ౨

# దేశ సంచారము

పురాణ యుగము నందున్న కవులందరు మహాపండితులు. పురాణవేత్తలు. భారత రామాయణాది కృతులను తెనుగునందు రచించిరి. వారు దేశ సంచారము చేసినట్లుగాని యాశు కవితా కల్పనలు కావించినట్లుగాని యెచ్చట నంతగా కనిపించదు. వారికంత పనిపట్టినట్లు కూడ లేదు. ఏదో యొకరాజు నాశ్రయించి కాలమును గడిపిరి. పదునాల్గవ శతాబ్దము నందున్న వేములవాడ భీమకవితో నాశు కవిత రంగస్థలమున కెక్కినదని చెప్పవచ్చును. భీమకవి రాజులను దర్శించి యాశువుగా పద్యములను చెప్పి పొగడుటయో తెగడుటయో కావించెను. పదునైదవ శతాబ్దమునందు శ్రీనాథుడు శాస్త్ర పాండిత్యము ఆశు ప్రబంధ కవితా కల్పనము సహాయముగా వహించి యాంధ్ర దేశమునందున్న సమస్తరాజ లోకమును చుట్టపెట్టెను. గ్రామములు, నగరములు సంచారము చేసి యాంధ్రవాణికి స్వర్ణాభిషేకములు చేయించెను. ఇంటింట పూజా పురస్కారము లొందవించెను.

శ్రీనాథునంత దేశసంచారము చేసినవాడుకాని తెనుగుకవితకంత పూజ్యత సంపాదించినవాడుగాని తెనుగు వాఙ్మయచరిత్రయందింకొకడు లేడు. కాని వాని కవధాన ప్రక్రియలు తెలియవు.

పదారవ శతాబ్దమునందు రామరాజ భూషణుడు తన్ను గురించి—

శతలేఖనీ పద్య సంధాన ధౌరేయు
　　ఘుటికా శత గ్రంథ కరణ ధుర్యు
నాశు ప్రబంధ బంధాభిజ్ఞు నోష్ఠ్య ని
　　రోష్ఠ్యజ్ఞు నచల జహాల్యుక్తి నిపుణుఁ
దత్సమ భాషా వితానజ్ఞు బహు పద్య
　　సాధిత వ్యస్తాక్షరీ ధురీణు

నని చెప్పుకొనెను. రామరాజ భూషణుడు శ్రీనాథాదులను మించి పోయెను. శతలేఖ న్యవధానము, ఆశు ప్రబంధ రచన, శతఘంట కవనము, బహు పద్య సాధిత వ్యస్తాక్షరీ ధురీణత్వము సాధించెను. వ్యస్తాక్షరి యష్టావధానములో నొక యంగము మాత్రమే. అందు మూలమున రామరాజ భూషణుడు సంపూర్ణముగా నష్టావధానము చేసి యుండడని తలంపవలసియున్నది. తరువాతి కవులలో చరికొండ ధర్మన, నెల్లూరు వీరరాఘవ కవి, మరింగంటి సింగరాచార్యులు, తంజావూరు రఘునాథరాయల యాస్థాన కవయిత్రి మధురవాణి శతావధానము లొనరించిరి.

ఇటీవల వారిలో మాడభూషి వేంకటాచార్యుల వారొకరు. వేంకటాచార్యులవారు లోకోత్తరులగు మహాపండితులు. షడ్దర్శనములం దఖండపండితులు. తాను విశిష్టాద్వైతియయ్యు ద్వైతాద్వైత విశిష్టాద్వైత భాష్యములం దపార పాండిత్యము కలవాడు. శత దూషిణిమీద ఖండన చెప్పిన మహామేధావి. ఏక సంథాగ్రాహి. ఉభయ భాషలయందు రసవంతమగు కవిత్వము చెప్పినవాడు. తెనుగునందు భరతాభ్యుదయ గ్రంథకర్త. ఆయనంతవాడాయన. నూజవీడు మొదలగు ప్రదేశములందు శతావధానము లొనరించెను.

మాడభూషికి నిది తోడి వేదం బయ్యెఁ
దిరుపతి వేంకటేశ్వరులఁ జేరె

నని తిరుపతి కవులు చెప్పినమాట. తిరుపతికవులు మాడభూషి వేంకటాచార్యుల వారంత పండితులు కారు. కాని శతావధానములో నంత ప్రతిభ కలవారని చెప్పవచ్చును. తిరుపతికవులు

శతఘంట కవనమ్ము సలుపు సంగతియన్న
కరతలామలకమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టావలంబన మన్న
నంబి కొండయ దండనంబు మాకు

ఆశుధారా కవిత్వాడంబరం బన్న
నల్లేరుపై బండి నడక మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
షడ్రసోపేత భోజనము మాకు
వ్యర్థ మగు వాదము లొనర్చు నట్టివారి
డంబ మడగించు టాపోశనంబు మాకు (నా. నా.)

అని చెప్పుకొనిరి. పూర్వ కవులలో నొక్కొక్కనియందొక్కొక్క విశేషమున్నది. అవి యన్నియు రాశీభూతములై రామరాజ భూషణుని యందు నెలకొని యున్నవి. వానియందు కంటె అష్టావధాన మొకటి తిరుపతి కవులయం దెక్కువ కలదు. తిరుపతి కవుల కవిత్వములోని ప్రసాదగుణము రామరాజభూషణుని కవితయందు లేదు. అతడు పాండిత్య ప్రియుడు. తిరుపతికవులు రసప్రియులు.

తిరుపతికవుల సమకాలికులలో శతావధాన అష్టావధానములు ఆశుధారా కవనములల్లి నట్టివారు లేకపోలేదు. కాశీ కృష్ణాచార్యుల వారు విద్వత్కవులు. శతావధానులు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు, దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రిగారు, తమ్మన్న శాస్త్రిగారు, కొప్పరపు కవులు, రామకృష్ణ కవులు ఇంక ననేకమంది యష్టావధానులు శతావధానులు నాశుకవులుగలరు. వీరందరియందు కవిత్వపు సాములలో నొక్కొకరి కొకొక్క విశిష్టతయే కలదు. తిరుపతి కవులు సకల ప్రజ్ఞాధురంధరులు. వీరియందున్న నవీనములగు కవనంపుఁ బోకడలు వారియందు లేవు. ఎప్పటికప్పుడు క్రొత్తగా కనిపించునదే కవిత్వము. తరచినకొలంది రసవంతములగు భావములు ఊడము నదియే సాహిత్యము.

ముద్దు ముద్దుగఁ జెప్పఁ బూనితిమా వన్నె
లాడి తీయని మోవి లంచ మిచ్చుఁ
గరినమ్ముగా జెప్పఁ గడఁగితిమా ప్రౌఢ
కాంత వక్షోజముల్ కాన్క లొసఁగుఁ

దీక్ష్ణరీతినిఁ జెప్పఁ దొరకొంటిమా వాలుఁ
గంటి లేఁజూపు సుంక మ్మొసంగు
మిశ్ర రీతినిఁ జెప్ప మేకొంటిమా బోఁటి
బిగువుఁ గౌఁగిలి పన్ను పెట్టి పోవు
నాశుధారా కవిత్వమ్ము నందుకొంటి
మేని యభిసారికయు దండ మిచ్చి తీఱు
నాంధ్ర గీర్వాణ భాషలయందు మాకు.

అని చెప్పుకొనిన తిరుపతి కవుల పలుకులం దతిశయోక్తి యే మాత్రము లేదు. వారి కవితా రీతులందున్న యా యా గుణ విశేషములకీ పద్యమే యొక నిదర్శనముగా గ్రహింపవచ్చును. ఈ పద్యములోని ప్రసాదగుణ మట్లుండగా నొక్కొక పాదమునం దొక్కొక వింత భావ మిమిడియున్నది. 'వన్నెలాడి తీయని మోవి లంచ మిచ్చు' నిత్యాదులు యథాలాపములుగా వాడినవి కావు. వీరి పద్యములన్నియు సర్వజనసామాన్య మూహల కందుబాటులో నుండును. ఉపమానములన్నియు నిత్య పరిచయములగు వస్తుజాలములందుండును. నల్లేరుపై బండినడక, షడ్రసోపేత భోజనము ఇత్యాదుల నెఱుంగని వారుండరు. అందుమూలమున వారి కవిత్వ మందరికి విన సొంపుగా నుండును. ఈ పోకడలు పూర్వ కవులలో లేవు. ముందు కవులలో నుండవు. సమకాలికులలో కనిపెంచవు. కావుననే తిరుపతి కవులు నవీనసాహితీ యుగమున కాది పురుషులు. ఈ ధీమా పండితరాయల యందు కలదు. ఆ మహానుభావుడు సర్వ స్వతంత్రుడు. 'సంఘమును లెక్కచేయలేదు' కవితను లంచమిచ్చి యవన కన్యకయగు లవంగిని లోగొనిన కవి లోకమాన్యుడు.

కస్తూరికా జనన శక్తిభృతా మృగేణ
కిం సేవ్యతే సుమనసాం మనసాపి గన్ధః

అని చెప్పుకొనిన ధీరుడు. తిరుపతికవుల కా సాహిత్యచక్రవర్తి మార్గదర్శకుడు. తిరుపతికవు లాయన యడుగు జాడలలో ప్రవర్తించిరి.

కవుల మిప్పటి రూల్సుకు కట్టుబడము
ఘనులు పండితరా యాది కవులు చూపు
త్రోవలం బట్టి పోదుము దేవుఁడైన
లక్ష్య పెట్టము మాకు వల్లభులు లేరు

అని పండితరాయలయందు తమకు గల యభిమానమును వెల్లడించిరి. అట్టి సంపూర్ణమగు నాత్మవిశ్వాసముతో నవధానములు చేయుటకు బయలుదేరిరి. మొట్టమొదటి శతావధానము కాకినాడ యందు జరిగినది. ఇద్దరు కలిసి యవధానముచేయుట యదివరకెన్నఁడు నెరిగినది కాదు. తిరుపతికవుల యవధాన ప్రక్రియ వింతమైనది.

ఒకచరణం బతండు మఱి యొక్కటినేను మఱొక్కటాతఁడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచేఁ దలలూఁచి మెచ్చఁగాఁ
బ్రకటతరాశుధార దనరన్ రచియింపఁగ నేర్తుమయ్య! (నా నా)

అని చెప్పుకొనినట్లే ఈ జంటకవులు మొదట నొక రొక పాదము నూరుమందికి చెప్పుదురు. తరువాత రెండవవారు రెండవ పాదము, మూడవపాదము తిరిగి మొదటివారును నాల్గవపాదము రెండవవారును నూర్గురికి చెప్పుదురు. చివరి కిద్దరు కలిసి నూరు పద్యములు నప్పగింతురు. ఈ విధముగా నవధానము చేయుటలో చాల కష్టమున్నది. ఎవరు చెప్పిన పాదమును వారు ధారణచేయు టంత కష్టముకాదు. రెండవవారు చెప్పిన పద్యపాదము జ్ఞాపక ముంచుకొనుట చాల కష్టము. దానికి లోకాతీతమగు మేధాశక్తి యుండవలయును.

అట్టి శక్తి తిరుపతి కవులయందున్నది. సర్వసామాన్యముగా మొదటిపాదము వేంకటశాస్త్రిగారు చెప్పుట యలవాటు. నూరుపాదములు వారు చెప్పునంతవరకు తిరుపతిశాస్త్రిగారు మనస్సు చెదర

నీయకుండ నేకాగ్రతతో దీక్షపట్టి ధారణచేసెడివారు. అంతసేపు సభికులలో విసుగు విరామ ముండెడిదికాదు. సభ మహారంజకముగా నుండెడిది. తరువాత తిరుపతి శాస్త్రిగారు లేచి రెండవపాద మందు కొనెడివారు. అప్పటికి కాలాతీత మగుచుండెడిది. సభికులలో నసహనము నలజడి యారంభమయ్యెడిది.

శతావధాన మనిన దాదాపు ఇరువది గంటలపని. ఎవ రెంత కాల మూరక కూర్చుండగలరు? దానిలో తిరుపతిశాస్త్రిగారికి కంఠ సారస్యము తక్కువ. మాట చతురతకూడ అంతగా నుండెడిదికాదు. ఆయన పని ఆయన చేసుకొని పోవుచుండెడివారు. సభారంజకత్వము వేంకటశాస్త్రిగారిమీద నుండెడిది. మధ్యమధ్య సభికులకు సమాధానములు చెప్పుట ప్రస్తానిక శ్లోకములు చాటువులు పూర్వరచిత స్వకీయకావ్యములలోని పద్యములు రమ్యముగా చదివి సభ పూర్తి యగు నంతవరకు నొక్కనినైన లేవనీయకుండ విసుగుచొరనీయకుండ సభికుల మనస్సును రంజింపచేయుచుండెడివారు. పద్యముల నెప్పుడు ధారణపట్టెడివారో యెట్లు ధారణపట్టెడి వారో వారి యుపాస్య దేవతకే తెలివయులయును.

అవధాన మనిన వేంకటశాస్త్రిగారి కొక యాటగానుండెడిది. ముఖ్యముగా అష్టావధానము చేయునపుడు వారిప్రతిభ చూచితీరవలయును, వ్యస్తాక్షరి పుష్పగణనము నిషేధాక్షరి మొదలగు వివిధ విషయములు నిర్వర్తించునప్పుడు వారి ప్రజ్ఞ యతి విచిత్రముగాను అమానుషముగాను గోచరించెడిది. ఏ విషయమునందును శాస్త్రిగా రంతగా పట్టించుకొను చున్నటుల తోచెడిదికాదు. చివరకన్నియు బీరుపోకుండ తప్పను మాట లేకుండ చెప్పెడివారు.

తిరుపతికవుల యీ యసాధారణ ప్రజ్ఞ తిలకించి చెన్నపట్టణము నందు ఆనిబిసెంటువంటి పాశ్చాత్యదేశీయ విదుషీమణి యాశ్చర్యపోయి వేయి ముఖముల వినుతించినది. తమయంతటి విజ్ఞానవేత్తలు లేరని యదరిపడిన గీర్వాణాంగ్లభాషా పండితులు తల వంచుకొనిరి. చెన్నపట్టణమునందు సైతము తెనుగు సాహిత్యసరస్వతికొక పీఠము

స్థాపించినారు తిరుపతికవులు. ఆనాటి చిహ్నమే యీనాటికి చిర స్థాయిగా నిలిచినది.

తిరుపతికవులు కాకినాడ విజయవాడ బందరు మొదలగు ప్రదేశములందు చేసిన సంపూర్ణ శతావధానములుగాక దాదాపు శతావధానాష్టావధానములు వివిధ ప్రదేశములందు గావించినవి రెండు వందలకు మించికలవు. వాని నన్నిటిని 'శతావధాన సారము' అను పేరట ముద్రించిరి.

అలవాటుండవలయును గాని యాశువుగా కవిత్వము చెప్పుట చాల సుకరము. అందు నిబంధనలు కట్టుబాటులు నుండవు. అవధానములందు వివిధ నియమములతో పృచ్ఛకులు ప్రశ్నలడుగుదురు. వానిని పాటించి పద్యములు చెప్పుట చాల కష్టము. అవధానములందు పద్యరచనకు సమయస్ఫూర్తి, పాండిత్యము, లోకజ్ఞానము, అనుభవము, రచనాపాటవము, చాకచక్యము నుండవలయును. తిరుపతికవులందీ గుణవిశేషము లవధానములందు సర్వత్రా గోచరించును. వారి యవధాన పద్యములందుకూడ ఒక విధమగు వినూతనత్వము, చమత్కృతి, రసవత్తత, మార్దవము, బిగువు గోచరించును.

పిఠాపురములో వాడ్రేవువారి యింటియందు జరిగిన యవధానములో సందర్భవశమున

ఇతర కవుల్ప్రియాసపడి యెంచి రచించిన నూటికెన్ని పె
ద్ద తనముగాంచి చిత్తమును దన్పునొ మే మవధాన సంగత
స్థితి గని యాశుగా రచనచేసిన పద్యములందు చూచినన్
శతమున కన్ని పద్యములు చక్కఁగనుండు నసంశయమ్ముగన్

అని తిరుపతి కవులు సగర్వముగా చెప్పుకొనిరి. ఇది తమ సమకాలికులను సూచించుచు ననిన మాట. అది చాలవరకు సత్యమనియే చెప్పవచ్చును. నరసరావుపేట యవధానములో కొండవీటిని గురించి చెప్పిన పద్యమిది

నదిలోన స్నాన మేనాడెఱుంగవు గదా
పాతాళ గంగా జపమ్మెగాని
శాల్యన్నమున కున్న చౌలెఱుంగవు గదా
గోగాకులును జొన్నకూడె కాని
శాక పాకాదుల చవి యెఱుంగవుకదా
దోసకాయల యడి యాసెకాని
సౌధమ్ముల వసించు జాడెఱుంగవు కదా
మట్టిమిద్దెల యునికి పట్టెకాని
ఒక్క కోటీశ్వరుండు నాయొద్ద నుండె
ననుచుఁ గడు విఱ్ఱవీగెద వతఁడుఁ గూడ
నాదిభిక్షు కుం డంచు నీ వరయ వొక్కొ
విగత సుఖభూమ! యో కొండవీటి సీమ!

శ్రీనాథుడు పలనాటిని గురించి

"చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్ళు, నాగులేటి నీళ్ళు నాప రాళ్ళు"

'దోసెడు కొంపలో పసుల త్రొక్కిడి' యిత్యాది పద్యములు రచించెను. వానియందుకంటె నీ సీస పద్యమునందు హాస్య మిను మిక్కిలిగా నున్నది. అంతేకాదు, చమత్కారముకూడ నిమిడి యున్నది. గీతమునందు శ్లేష.

గంగాధరుఁడు నీ మగండని నవ్వంగ
వేషధరుండు నీ పెన్మిటనియె
నెద్దు నెక్కును నీదు నెమ్మికాడని నవ్వ
గ్రద్దనెక్కును నీ మగండ టనియె
వల్లకాడిల్లు నీవల్లభున కనంగ
నడిసంద్ర మిల్లు నీ నాథున కనె
నాట్యంబుసేయు నీ నాయకుం డన నంగు
కావించు వెన్క నీ కాంతు డనియె

ముష్టికెక్కడ కేగె నీ యిష్టుఁ డనిన
బలి ముఖంబున కేగునో లలన! యనియె
నిట్టు లన్యోన్య మర్మంబు లెంచుకొనెడు
పర్వతాంభోధి కన్యలఁ బ్రస్తుతింతు. (బందరు అవ)

ఈ పద్యము చదువుచున్నప్పుడు నిజముగా పార్వతీ లక్ష్ములు పోట్లాడుకొనుచున్నటులనే తోఁచును. ఆ పోట్లాటలో ఒక పాదమునందుకంటె నింకొక పాదమెుకొక్క మెట్టు గయ్యాళితనము హెచ్చిపోయినది. ఈ వైఖరి తోడికోడండ్ర పోట్లాటలలోను చుట్టపక్కముల తగవులాటలయందు విశేషముగా నగుపించును. అట్టివానిని విని తమ యనుభవముల నీ పద్యములోని కెక్కించి యుందురు. భావముల మాటటుంచుడు. నాల్గు పాదములు రచనమునందొక్కొక్కరమైన నించుమించులు రాకుండ తూచినటులు నడిపించిరి.

తిరుపతి కవులలో సీసపద్య రచనమునం దిదొక విశేషము. మొదటి పాద మెట్లుండునో నాల్గు పాదము లావిధముగానే యుండును. తిక్కన శ్రీనాధులలో నిట్టి రచన యగుపించును. గీత పద్యములోని మొదటి రెండు పాదములు గూడ సీసము ననుసరించి యుండుట వీరిలో నొక విశేషము. ఇట్టి రసవత్తరమైన కవిత్వ మవధానములందు చెప్పగలుగుట యందరికలవడునది కాదు. పూర్వజన్మ తపః సంపద దేవతా ప్రసాదసిద్ధియు నుండవలయును. ఎంతమంది తరువాత యవధానములు చేయలేదు? వారియందు మచ్చునకైన నిట్టి పద్యములు గానరావు. ఇట్టి చణుకులు

అద్వైత మత్తేభ మడగు పెట్టగరాని
పల్లేరుకంప వ్యాపారి కొంప

అని యొక గుంటూరవధానమునందు చెప్పిన తిరుపతికవుల సమకాలికులు, విద్వత్కవులు శాస్త్రపండితులు నగు కాశీ కృష్ణాచార్యులవారి కవితయందు కనిపించును. ఇంక తిరుపతికవుల సమస్యాపూరమందు మా పృచ్ఛకులే కాదు పరులెవరే సమస్య నిచ్చిన

నవధాన కాలమందు నిరాఘాటముగా పూరించుచు వచ్చిరి. వారు పూరించిన సమస్యలుగల పద్యములు వల్లన వేసినవా రిప్పటికి పెక్కు-మంది కలరు.

అతి కుతుకం బలరారఁగఁ
జతురత మెఱయంగ మదనశాస్త్ర విధమునన్
వితతం బగు తన సౌధ వ
(సతి సతిఁ గదియంగఁ బుత్ర సంతతి గలిగెన్).

'ఎన్ని దినము లాయె నిట నన్ను డించి నీ
వరిగి' యనినఁ బత్ని కనియె భర్త
నేటి కెన్నఁగఁ బది నెల లాయెఁగా? నేడు
(గణచతుర్థి, నాఁడు ఫణి చతుర్థి)

ఈదృశములగు సరస మనోహరములగు పద్య రచనలచే తిరుపతి కవులు సామాన్య మానవుల మనస్సును రంజించిరి. సంస్కృత పండితు లుద్దండులు. వారు పద పదమున కడ్డు పడెడివారు. తిరుపతి కవులకు వ్యాకరణ శాస్త్రము వజ్రాయుధము. దానితో వారికి శృంగ భంగము కావించి నోటికి తాళము వేసెడివారు. తిరుపతి కవుల గీర్వాణవాణి కాళిదాసు కవిత కందుబాటులో నుండును. హంస పరమ హంస శ్లేష-మాక్తికమాలా వృత్తము.

శుద్ధతయా మానస పరిరోధా
ద్ధంస సమానో భవతి హి హంసః
యద్వచనాని శ్రవసి నిధాయ
ప్రీతి మనంతాం సుదృగపి ధత్తే

సంస్కృత పండితులు మొదట నెంత మొరకు పట్టు పట్టినను తిరుపతి కవుల యుభయభాషా పాండిత్యము శాస్త్ర జ్ఞానము కవిత్వ మాధుర్యము ప్రతిభ కన్నార వీక్షించి వంచలేక వంగిపోవుచు వచ్చిరి. విజయనగరమునందే యట్లు జరిగినది. ఇంక నితర

ప్రదేశముల మాట చెప్పవలసిన పని లేదు. అవధానములు తిరుపతి కవులకు స్వార్జిత విత్తములు. వారికి హక్కుభుక్తము లయి పోయినవి. వానివలన వా రఖండ కీర్తి సంపాదించిరి. అందు శతావధాన మనిన వారి కమిత ప్రాణము. అనేకమంది పెక్కు బిరుదుల నిచ్చిరి. అవి యేవియు వారి కంతగా నచ్చలేదు. తిరుపతి వేంకటేశ్వర కవులు శతావధాను లనియే వారు ప్రతిచోట వాడిరి. శతావధాన మనిన వారికి క్రీడావినోదము వంటిది. విజయనగరము నందు జరిగిన యొక యవధానానంతరము తిరుపతి కవులు ప్రసంగ వశమున

ఒక నూటేయన నేమి లెక్క విను డో హో పండితశ్రేష్ఠులా
ర! కడున్ వేగమె వేయిమంది కయినన్ రమ్యస్థితుల్ మీఱ నా
శు కవిత్వం బొనరింప నేరుతుము శ్రీశూలి ప్రియామానసీ
య కటాక్షమ్మున దగ్గకాలమును మాకర్పించి కూర్చున్న చోన్

అని బొమ్మ విరుచుకొని వచించిరి. వారి యాత్మవిశ్వాస మటు వంటిది. తెనుగు సాహిత్య సరస్వతికి నఖండ ధూప దీపారాధనలు చేయించుచు విజయశంఖములను బూరించుచు

దోసమటం చెఱంగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండు భాషలకు మేమె మగండ్ర మటంచు దెల్పఁగా
రోసము గల్గినం గవివరుల్ మము గెల్వుఁడు గెల్తు రేని యీ
మీసము దీసి మీ పద సమీపములం దల లుంచి మ్రొక్కమే.

యని సవాలు చేయుచు రాజ సభలందు కవితావేశముతో ప్రవేశించిరి. ఈ విధముగా రాజాస్థానములందు ప్రతిజ్ఞ చేసినవారు, ప్రతిజ్ఞ చేసి నెగ్గించుకొనిన వా రాంధ్రవాఙ్మయ చరిత్రయం దగుపించరు. రామరాజభూషణుడు ప్రతిజ్ఞ కావించి శిరోవేష్టనమును గోల్పోయెను.

తిరుపతి కవుల కాలమునాటికి రాజులందరు సంస్కృత ప్రియులు. సంస్థానములందు గీర్వాణభాషా పండితులు గురుపీఠము లాక్రమించిరి. ఉన్న తెనుగు కవులు వారికి దాసాను దాసులు. వారికి శాస్త్ర

పాండిత్యము తక్కువ. సంస్కృత పండితుల నెదిరించి వాదోప వాదములు గావించి స్వాతంత్ర్యము సంపాదించుకొనగల శక్తి వారికి లేదు. తిరుపతి కవులు గురు ప్రసాద లబ్ధమైన శాస్త్రపాండిత్య మొక వంక స్వయం సిద్ధమైన సాహిత్య మొక వంకను కొలిచి యేతేర రాజాస్థానము లందు దిట్టలై నిలిచి

దర్శనీయంబు గోదావరీ తీరంబు
వాసంబు సద్గుణావాస మాకు
షడ్దర్శనీవేది చర్ల బ్రహ్మయశాస్త్రి
గురువరేణ్యుఁడు ధరాభరణ మాకు
అష్ట శతావధానాది సత్క్రియ మంచి
నీళ్ళ ప్రాయము కలా నిపుణ మాకు
శబ్ద శాస్త్ర ప్రశస్త ప్రభావం బాత
పత్రమ్ము దివ్య చారిత్ర మాకు

పండిత ప్రీతి నొప్పు మీ వంటి నృపతు
లధిక దివ్యప్రతాప మాన్యమ్ము మాకు
విమల మధురాశుధారా కవిత్వ సరణి
కేళికాభూమి మాకు గోపాలరాయ!

రాజానో విరళా స్తతోఽపి గుణిన స్తత్రాఽపి విద్వత్ప్రియా
స్తత్రాఽప్యుత్తమ పాండితీ పరిచితా గోపాల భూమీపతే!
విద్వాంసో విరళా స్తతోఽపి కవయ స్తత్రాఽశుధారాచణా
స్తత్రాఽపి హ్యవధానిన స్తదుభయం దైవేన రాశీకృతం

అనుచు రెండు మీసములు మెలిపెట్టికొని చెప్పిరి. ఎంత ధీరత్వము. శ్రీనాథుడంతవాడు కూడ ముందు తన ఘనతను ప్రకటించుకొని

ఎటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావు సింగ మహీపాలు ధీ విశాలు
నిండు కొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురంబ శారదాంబ!

అని కొంచెము వినయ విధేయతలు వెల్లడించినాడు. తిరుపతి కవులకు వినయ విధేయతలు జంకు గొంకులు నే కోశమునందు నున్నటుల 'నానారాజ సందర్శనము' నంతయు నీ మూలనుండి యా మూలవరకు ప్రత్యక్షరము పరిశీలించి చూచినను కనుపించవు. తమ్ము నగౌరవ పరచిన రాజులను వారు లక్ష్యము చేయలేదు.

మదనాభిరామ రాణ్మణి బిల్హణ కవీంద్రు
    తో విరోధించి తాఁ జేవ చెడఁడె
రాజ కళింగ గంగ్రాజు భీమ కవీంద్రు
    తో విరోధించి తాఁ జేవ చెడఁడె
అల్ల నీలాద్రి రా జల జగ్గ సుకవీంద్రు
    తో విరోధించి తాఁ జేవ చెడఁడె
మున్ను దమ్మన పిండిప్రోలు లక్ష్మణకవి
    తో విరోధించి తాఁ జేవ చెడఁడె

ఏము గెల్చితి మను మాట కీవె సాక్షి
తగ వెఱింగియు పక్షపాతమ్ము పూని
మమ్ము నిరసించు టంత క్షేమమ్ము కాదు

అని నిర్భయముగా బలికిరి. వారి శక్తికి గడగడ లాడినారు రాజులు. తలలొగ్గి కానుకలర్పించినారు. ఏనుగులపై నెక్కించి యూరేగించినారు. రాజులనే కాదు తమ యుపాస్య దేవత కాళికాదేవి. ఆమెనే లక్ష్యము చేయలేదు.

.. . .... . చిన్నావనీ
వరునిం బ్రోవక యుంటివేని నిను రవ్వం జేతుమో శాంకరీ
గురుఁడున్ దైవము లేఁడు సత్కవులకుం గోపంబు రానీకుమా

అని యింత ఘాటుగా పలికినవారు సంస్కృత కవులలో కాళిదాసు, తెనుగుకవులలో శ్రీనాథుడు మాత్రమే కనిపించుచున్నారు.

తదీయ శష్పముల్
మెరుకఁగ లేవు నీవు నొక భీకరమూర్తివె కాళికేశ్వరీ.

అన్నాడు శ్రీనాధుడు. తిరుపతి కవులకంటె నీ విషయమున రెండాకు లెక్కువ చదివినా డా మహాకవి మహాకవుల లక్షణమే యది. వారు మానవ మాత్రులను లక్ష్యపెట్టరు. దైవతములకు భయపడరు. తిరుపతికవులా తెగకు చెందినవారు. వీరు సంస్థానాధిపతులను దర్శించి యాచకులవలె నెవరిని ధనముకొరకర్థింపలేదు. వేంకటగిరి ప్రభువులతో—

పరదేశ సంపాదన రతి మీకు నరేంద్ర
పరదేశ సంపాదన రతి మాకు
లసదుత్తమ పదాభిలాష మీకు నరేంద్ర
లసదుత్తమ పదాభిలాష మాకు
సకల నుత్య శ్లోక సక్తి మీకు నరేంద్ర
సకల నుత్య శ్లోక సక్తి మాకు
మనుమార్గ వర్తనం బనువు మీకు నరేంద్ర
మనుమార్గ వర్తనం బనువు మాకు

మీకు రాజపదము మాకును గవిరాజ
పదము కలదికెందుఁ గొదువ లేదు
కాన సామ్యమిచ్చి మానించు టొప్పదే
ముద్దు కృష్ణయాచ భూవరేణ్య.

అని సమానపాయలో మాట్లాడిరి. తిరుపతికవు లేయెండ కా గొడుగు పట్టగల సమర్థులు. శ్రోతల మనోవృత్తులను బట్టి వారి కవిత మారు చుండును. చాలవరకు వారి కవిత నవీన మార్గములను త్రొక్కినను ఒకొక్కప్పుడు పూర్వపు ప్రబంధ కవుల పోకడను పూర్తిగా పరిత్యజింపలేదు.

రాజులు సంస్కృతభాషా ప్రియులని యిదివరకే చెప్పియుంటిని. వారి యాస్థానములందుండువారు శాస్త్రపండితులు. వారికి ప్రాత కాలంపు యమకములు శ్లేషలు నలంకారములు ననిన విందు భోజన ములు. వారి మెప్పుకొరకు వెనుకటి దారులు పట్టక తప్పినది కాదు.

క్రొత్తపోకడలు వారికి నచ్చవు. పోకడలేకాదు పదములైనను నచ్చవు. వారు ప్రాచీన సాంప్రదాయములకు దాసులు. కావున నిట్టి పద్యములు నానారాజ సందర్శనమునం దచ్చటచ్చట కనిపించు చుండును. తిరుపతి కవులకు స్వయముగా నిట్టి శబ్దాలంకారములనిన నిష్టము లేదు. జన సామాన్యమున కర్థమగునట్లు రసవంతములగు పద్యములను రచించుటయే వారి కభిమతము. మారుమూల పదములు వాడుటకుకూడ వారి కిష్టముండదు. అందుకనే వారు కవితయందు చదువురానివారికైనను చదివి వినిపించినచో నర్థము చేసికొని యానందింప గలిగినట్టి లోకమునందు వాడుకలో నున్న పదములనే వాడుచు వచ్చిరి. ఆ కారణముచేత వారి కవిత్వము అందరిచేత వినుతింపబడుచున్నది.

తిక్కన కవితాపద్ధతియు నిట్టిదే. తిరుపతికవులు తిక్కన నాదర్శముగా కైకొని కవితారచనకు పూనుకొనిరి. తిక్కనయం దచ్చటచ్చట క్లిష్టాన్వయములు గలవు. తిరుపతికవుల పద్యములన్నీ పరిశీలించి చూచిన నెచ్చటను క్లిష్టాన్వయము లుండవు. వారి పద్యము లందు ప్రసాదగుణము హెచ్చుగానుండును. అద్దమునందు ప్రతి బింబించు ముఖమువలె భావములు పరిస్ఫుటముగా గోచరించును. ఈ పద్ధతి తెనుగునందేకాదు, సంస్కృత శ్లోకములందును గననగును. వీణావాదనము చెవుల కింపుగా వినిపించును. విన్నవెంటనే కృతియు స్ఫురణకు వచ్చును. దానిని తరిచి పరిశీలించినగాని యంతర్యాతమగు స్వరసంపుటి గానవిదునకు గోచరించదు. అటులనే తిరుపతికవుల పద్యములందలి భావములు తేలికగా గ్రహింప తగినవైనను ముసుగులోనున్న ముద్దియ ముఖసౌందర్యమువలె నం దిమిడియున్న వక్రోక్తులు వ్యంగ్యములు బాగుగా పరిశీలించినగాని యవగతములు గావు.

గద్వాల సంస్థానాధిపతులు ప్రతి సంవత్సరము పండితులకు కవులకు గాయకులకు సన్మానము చేయుదురు. వచ్చినవారికెల్ల మొదటి సంవత్సరము పదిరెండు రూపాయిలు ఇచ్చుట వారి యల

పాటు. వచ్చిన వారిలో కొందరు పరులచేత పద్యములు వ్రాయించు కొని వచ్చి సభలో చదువుచుందురు. వారికి నదే సంభావన. మహా పండితులకు నదే సన్మానము. తిరుపతికవులను మొదటి సంవత్సర మాంరీతిగానే గౌరవించిరి. అప్పుడు తిరుపతికవులు చెప్పిన పద్యమిది

పండితులైనవారు ప్రతిభాగతి భాసితులౌట సర్వ భూ
మండలి నుండు రాజులును మన్ననసేతురు వారి బండితా
పండితులైనవారల సభాస్థలి నీవలెఁ బూజ సేయు రా
జుండునె రామ భూవర! సమున్నత దాన విధాన ధీవరా!

'పండితా పండితులైనవారల సభాస్థలి నీవలెఁ బూజసేయు రాజుండునె' యనుటలో సంస్థానాధిపతుల యవివక్షదానము స్ఫురించును. అందు మూలమున రాజు నవివేకము ద్యోతక మగుచున్నది. 'సభాస్థలిన్' అనుటవలన సభ పండిత ప్రకాండుల కొరకు నియమితమగుట చేత నపండితుల కిందు సన్మానార్హత లేదు. వారిని వీరి నేకము చేయు చుంటివి. ఇట్టి దాన మవివేకము అని యర్థ శక్తిచేత వ్యంజిత మగు చున్నది. 'దాన విధాన ధీవరా' యను సంబోధన వ్యతిరేక లక్షణా వృత్తిచేత దాన విధానము తెలియని యజ్ఞానివని యర్థము స్ఫురిం చును. మొదటి పాదములందు రాజులు పండితులయెడ వర్తింపవలసిన విధానము సూచింపబడెను. రామ భూప! అను సంబోధనచే నీవు రాజువయ్యును రాజుల కనుచితముగా మెలంగుచుంటివని ధైర్యముగా నిలిచి నీతి సారమును బోధించినారు తిరుపతికవులు. ఇంత గుండె నిబ్బరముగా రాజులను గద్దించినవాడు తెనుగు కవులందు శ్రీనాథు డొక్కడు తప్ప యింకొకడు కనిపించడు.

వేంకటగిరి ప్రభువు సింగమనాయుడు. ఆయన మహాపండితుడు. సాహితీవేత్త. కళావిదుడు. సర్వజ్ఞు డను బిరుదము కలదు. శ్రీనాథుడు

సర్వజ్ఞ నామధేయము
శర్వునికే రావు సింగ జనపాలునకే

యుర్వీం జెల్లును నన్యుల
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే

అని శ్లేషాలంకారము నుపయోగించి సింగమనాయని నిందాగర్భిత ముగ వినుతించెను. దానికి మహారా జుబ్బిపోయి శ్రీనాధుని సన్మా నించెను. సింగభూపతి యంతటివాడు కవి యుపాలంభము తెలిసికొన లేకపోయెను. విద్యాగంధ విహీనులగు తిరుపతికవులనాటి సంస్థానాధి పతుల మాట చెప్పవలసిన దేమున్నది. వారిని నిందించినను వందించి నను నంధున కద్దము చూసినట్లులే యగును. కవితా మాధురిఁ దా గ్రహించి వహ్వారే

'కవిరాజాయని మెచ్చియిచ్చునృపుఁ డొక్కఁడైనఁ గర్వైనచోఁ కవినై పుట్టుటకన్న పాపపరిపాకంబుండునే'

'ఏ భూమీంద్రునిఁ జూడఁ బోయినను నీవే పద్యముంజెప్పి నీవే భావ మ్మును జెప్పికోవలయు'

అనియెడువారే! అట్టి రాజులను తిరుపతికవు లాత్మ గౌరవమును విడ నాడి, నీవు ఇంద్రుడవు చంద్రుండవని నుతింప లేదు.

అక్షయ్యంబుగ సాంపరాయని తెనుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవిరాట్ బృందారక శ్రేణికిన్

అని శ్రీనాధుడు శాసించి నటులనే

అమ్మవంకను జుట్టమా యేమి భోజ భూ
పాలవర్యున కల్ల కాళిదాసు
అబ్బవంకను జుట్టమా యేమి విక్రమ
ప్రభువరేణ్యున కల్ల భట్టిసుకవి
అత్తవంకను జుట్టమా యేమి రాజధ
రాధీశ్వరునకు నన్నయ్యభట్టు
మామవంకను జుట్టమా యేమి కృష్ణరా
డ్ధరణీశ్వరునకు పెద్దన్నగారు

కవియయిన వాని నెల్లను గారవింప
రాజయిన వానికెల్ల ధర్మమ్ముగాక

కవులను సన్మానించుట రాజుల విధియని నిష్కర్షగా ప్రబోధించిరి సన్మానములను బొందిరి. కవికులమున కంతకు సన్మానము సంపాదించి పెట్టిరి. తమ్ము నిరాదర మొనరించిన రాజులను వారు లక్ష్యము చేయలేక పూర్వ చరిత్రల నెత్తిచూపి 'మమ్ము నిరసించుటంత క్షేమమ్ము కాదు' కవులు శాప ప్రసాదములకు సమర్థులు అని హెచ్చరించిరి. వారు చేసిన తప్పు దిద్దుకొని సత్కారములు తలంచిన దానికి ముమ్మడుగులు చేసి తిరుపతి వేంకటకవులను పంపించినారు.

రాజ మిత్రుల మదికాక రాజ బంధు
వులము కవిరాజులము పదుగురు గలట్టి
కులము వారము మాకెందు కొదవ లేదు
కీర్తికై రాకసుమి వనపర్తిభూప!

ధనార్థులమై రాలేదు. కీర్తిసంపదకొరకు వచ్చితిమి. మాయందు యాచ్ఞావృత్తిలేదు. అని తెలిపిరి. దీనియం దెంత సత్యమున్నదను పరిశీలన మన పనికాదు. వారి స్వేచ్ఛాప్రవృత్తి ధీరత్వము నిందు గోచరించును.

తిరుపతికవుల వాణి విద్వాంసులగు రాజుల విషయమునందు పాండిత్యప్రకర్ష కనిపించుచునే వచ్చినది. విజయనగరము ప్రభువు ఆనందగజపతి మహారాజు. ఆయన శాస్త్ర పండితుడు. సాహితి, గాన విద్యాపారంగతుడు, కళావేత్త, వైణికుడు. బహుభాషా పండితుడు. ఒక మాత్రపు పండితులను, కవులను, గాయకుల నాయన లక్ష్య పెట్టడు. దర్శనమీయడు. తిరుపతి కవుల వాణి యీ మహారాజును స్వయముగావరించినది. పాండిత్యప్రకర్షతో శాస్త్రరీతులతో నాట్య మాడినది. వారి రసనాంచలములందు

ఎందఱిఁ జూపెనేని వరియింపదు మా కవితా కుమారి క
న్నందుకు దేశముల్ దిరుగుటబ్బెను సౌఖ్యము లేకపోయె నా

నంద నృపాల నీదు సుగుణమ్ములు చెప్పిన నాలకించి వెం
టం దలయూచెఁ గావునఁ దటాలున దీనిఁ బరిగ్రహింపుమా

అని యుపోద్ఘాతముగా నుడివినారు. ఆయన కీర్తిని వర్ణించుచు

అర్థవత్తని యనధీన మని సమస్త
దేవ సంగత మనియు నదేహ మనియు
నర్థవత్సూత్రమందు నీ యశము కొంత
గూఢముగఁ జెప్పెఁ బాణిని కువలయేశ!

"అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికః" అని పాణిని అర్థము కలదియు ధాతువు ప్రత్యయము కానిదియు ప్రాతిపదిక అని యర్థము. ఆనంద గజపతి మహారాజుల కీర్తిని గురించి అర్థవత్ = ప్రయోజనము కలదనియు అధాతుః = ధాతు విరహితమైన దనియు 'రసాసృఙ్మాంస మేధోఽస్థి మజ్జా శుక్రాణి ధాతవః' అని. అవిలేనిది కావున అదేహము సమస్త దేవ సంగత మనియు, అప్రత్యయః 'ప్రత్యయోఽధీన శపథజ్ఞాన విజ్ఞాన హేతుషు' అనుటచే అధీనము కానిది కావున అనధీనమనియు, అనగా నితరులకు లోబడని దనియు అర్థవత్సూత్రమునందు నిగూఢముగా పాణిని చెప్పెనని చమత్కరింప బడినది.

ఎంత మనోహరమగు పద్యము! ఎంత శాస్త్రకట్టు. నామమును గురించి—

కొందరు పచాద్యజంతం
బందురు మఱికొంద అర్ను ఆద్యంతంబే
యందురు మేముభయం బని
యందుము నీ నామధేయ మా నంద నృపా.

(పచాద్యజంతంబు—నందిగ్రహి పచాదిభ్యో ల్యుణిన్యచః' అని పాణిని నంద్యాదిభ్యో ల్యుః, గ్రహ్యాదిభ్యోణినిః, పచాదిభ్యోఽచ్, ఆనంద్ + అ = ఆనందః. ఆనందయతీతి ఆనందః. ఆనఁదింప జేయువాడు.

తన్ను దర్శించిన వారిని ఉచిత సత్కారాదులచేత ఆనందింపచేయు వాడని భావము. ప్రస్తుతము దర్శించినవారు తిరుపతి కవులు. వారిని సన్మానాదులచేత సంతోషింప చేయగలవాడ వని అంతరార్థము. అర్శ ఆద్యంతంబు — "అర్శ ఆదిభ్యోఽచ్" అని పాణిని ఆనంద్ + అ=ఆనందః. ఆనందః అస్య అస్తీతి. ఇతరులు దర్శించుటచేత ఆనందము కలవాడు. మత్వర్థము. జాతఆనందః ప్రకృతమునందు అస్మద్దర్శనేనజాతానందః ఇతి. మా దర్శనముచేత ఆనందము కలవాడవని భావము. ఇతరుల నానందింపచేయు వాడవును ఇతరులచేత నానందించు వాడవునని "ఆనంద" నామక శబ్దముచేత విశదమగుచున్నదని ఫలితార్థము. మేము నిన్ను దర్శించితిమి. మా కవితా శక్తిని ప్రదర్శించుటచేత ఆనందము కలవాడవయి మమ్ము బహూకరించుటచే మమ్ము నానందింప చేయుదువని అంతరార్థము.) అని వినుతించిరి. నిజముగా నంత పొగడ్తకు తగినవాడు ఆనంద గజపతి మహారాజులుంగారు. ముఖము కొలది తిలక మనినారు పెద్దలు. గ్రహించుకొనగల రాజు లుండవలయును గాని తిరుపతి కవుల సాహితీ సరస్వతి పరవశమునొంది మిన్ను ముట్టకపోదు. ఆనంద గజపతి మహారాజులుంగారతి గంభీరులు, రాజసముగల ప్రభువులు. కాబట్టి సింహాసనముమీద నుండి లేచి వచ్చి తిరుపతికవులను గౌగలించుకొన లేదేమోగాని మఱే వ్యాకరణాది శాస్త్ర పండితుడైన నొడలు పరవశము నొంది యీ మహాకవులను గౌగలించుకొనక పోడు. ఇట్టి కల్పన లదివరకు లేవని నే ననను. వానిలో నిదియొక క్రొత్త కల్పన. ఆంధ్రవాణి యీ రీతి నధిక ప్రౌఢయై నటించినది. ఇంక గీర్వాణ వాణి

అస్వాప్త మానవహయో నగజాఽధినేతాఽ
వ్యత్యాగమోదిత యశా అపదాతి భూపః
శంభు ర్భవే దపి తథా కిము రాజమౌళి
రానంద భూమి పతి రేవ హి రాజమౌళిః

అని యమృత మయములగు మృదు మనోహర పదజాలముతో

సంకీర్తనము చేసినది ఆ రాజమౌళి నాలంకారికముగా. ఒకరిని మించిన వా రొకరు. ఇట్టి ఉభయవాణీ పతులగు తిరుపతి కవులు ఒకొక్కప్పుడు శ్రీనాథునికంటె మిన్న లేమో యనిపింతురు. భవతు, నభవతు, వీరి కవితా ప్రాగల్భ్యము సమకాలికులను మించి పోయిన దనక తప్పదు.

కిర్లంపూడి సంస్థాన ప్రభువులు తిరుపతి కవులకు కవితా సంబంధముచేత నాత్మీయులైనారు. బావమరదుల వరుసలోని వారని శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారొక ఆంధ్రపత్రిక ఉగాది సంచిక యందు సూచించిరి. రాజు రాజగోపాల వెంకట చిన్నరాయ నృపతి అతి సౌందర్యవంతుడు. తిరుపతి కవులకు గుణవర్ణనమునందు కవిత యావేశ పూరితమయిన రచనా సౌలభ్యమునుగూడ తీసికొని మనోహర భావములలో వెలువడుచుండును. దాని కాత్మీయత తోడయి నప్పుడు చిలువలు పలువలల్లుకొని వన్నెలు చిన్నెలు దాల్చి మనోరంజకముగా నుండును. సహజమగు కవితాశక్తి ధారలు గట్టి రసవంతముగా వర్షించుచుండును. చిన్న రాయ నృపతి యందమును వర్ణించుచు

ఇనుఁగంటిఁ నినుఁగంటి భేద మొక యింతేనిం గనన్ రాదు సో
మునిఁ గంటి న్నినుగంటి భేదము లవమ్మింగానఁగారాదు మే
ఘునిఁగంటి న్నిను గంటి భేదమరయఁ గోరంతయుఁ లేదు మీ
యినుగంట్యన్వయు మెంత చేవగలదోయీ! చిన్న రాయాధిపా!

తేజము నందము దానశీలత ఉపమానములచేత ధ్వనితములు. కళాగోపనమునందే కళాధిక్యత కలదని పాశ్చాత్య పండితుల మతము. ఆ గోపనము పలువిధములుగా నుండును. భావ గోపనము, అలంకార గోపనము, వస్తుగోపనము అని. దీనినే ధ్వని యనియు వ్యంగ్యమనియు మనవారు చెప్పుచుందురు. కవి వర్ణించునప్పుడలంకారములలోని యన్ని యంగములు ప్రతిపాదింపక కొన్నిటిని చదువరుల యూహకు విడిచి పెట్టుదురు. అవి సందర్భమును బట్టి వాని యంతట నవి స్ఫురించును. ఈ పద్యమున చిన్న రాయని

సూర్య చంద్ర మేఘములతో బోల్చిరి. సమాసధర్మములు లోపింప చేయబడినవి. అవి పాఠకు లూహించుకొనవలసి యున్నవి. ఇందు పద్య రచనము నలంకార ప్రతిపాదనము నూతన మార్గమును ద్రొక్కినది. రచనములందేమి, యలంకారములందేమి, భావములందేమి తిరుపతి కవులు క్రొత్త దారులకు మళ్ళించిన పద్యములు నానా రాజసందర్శనమునందు పెక్కు కలవు.

దీనాననమ్ముతో దేవనాథుని వంక
లోఁతుగాఁ జూచెఁ బులోమ తనయ
అభినయించుచుఁ జేతు లాడక రంభయు
నిలువున నీరయి నిల్చిపోయె
భూలోకమున కేను బోయి వచ్చెదనంచు
సెలవు గోరెను లక్ష్మి జలజనయను
నశ్వినీ నక్షత్ర మతిభీతిచేతఁ గు
టుంబ వైరంబు చేటునకు జంకె

నల జయంతుని యక్షరా జాత్మజాతు
సాంగ మద నాశ్వినేయుల రంగు గాంచి
స్వారికై నీవు వేంచేయు సమయమందుఁ
జిన్నరాయన రేంద్ర సుశ్రీమహేంద్ర!

అల్లసాని పెద్దనగారి "యింతలు కన్నులుండ" అను పద్యము వలె తిరుపతి కవుల పద్యములు తేలికగా నున్నటుల గోచరించును. రసజ్ఞులగు విద్వత్కవులు భావమును తరచినకొలంది లోతునకు పోవును. ఇట్టి మహాకవుల పద్యములు పూత మెఱుంగులు పసరు పూప బెడంగులు కావు, ఇటువంటి కవిలోకభూషణులకు తమ కవిత్వమే మహారాజ్యము. వారు రాజుల దర్శింపనరుగుట రాజుల యదృష్టము. అందు శాస్త్రిగారిని బొబ్బిలి రాజులు పిలిపింపగా నరిగి

ఎలమిం దిర్పతి వేంకటేశ్వరులచే నెందుఁ దెలుంగుఁ ధరా
స్థలినేతల్ పలుమంది చూడఁబడుటన్ దత్తద్యశమ్ముల్ నభ

స్థలి రిక్కల్ బలె వెల్గు, బొబ్బిలికిఁ దద్భాగ్యమ్ము లేదన్న యన్నలుపు న్నీ పరిపాలనమ్ము దొలచెన్ నన్నిట్లు రప్పించుటన్

అని నుడివిరి. ఏ కవి యేకాలమునందిట్లు సగర్వముగా చెప్పుకొనగలిగెను. అది యా మహానుభావుల యదృష్టము. వారు స్వతంత్రులై పుట్టిరి. స్వతంత్రులై పెరిగిరి. స్వతంత్రులై మరణించిరి.

ఉభయ భాషలయందు విశాలసాహితీ సామ్రాజ్యమునకు మేము సార్వభౌములము. మమ్మెదిరించి నిల్వగలవారు లేరు. అని దృఢముగా నిరూపించుకొనినవారు తిరుపతి వేంకటకవులు. ఆంధ్ర దేశమునందు వారు దర్శింపని రాజులు లేరు. వారు కాలు మోపని నగరములు గ్రామములు లేవు.

మాడకు మాడయెత్తుగల మాటలు నేరిచి సత్కవిత్వ మే
మీడుగ జోడుగాఁ జెవుల కింపుగఁ జెప్పగ నేర్చినాము మా
చూడని వారు లేరు మముఁ జూడనివారును లేరు

అని ఘనముగా చెప్పుకొనిరి. విజయనగరమునుండి చెన్నపట్టణము వరకుఁ గల సంస్థానాధిపతు లందరు తిరుపతి కవుల కర్ఘ్యపాద్యము లిచ్చి సన్మానించిరి. కొంద రేన్గుల నెక్కించిరి. కొందరు బిరుదు లొసంగిరి. కొందరు హారముల నర్పించిరి. మాన్యము లిచ్చిరి. ఒక టేమిటి? యడుగకుండనే సకలము లభించినవి. ఏ కొదవయు వారికి కలుగ లేదు.

అనుభవించితిమి దివ్యభోగములను రా
జాధిరాజులకన్న నధికముగను
సంచరించితిమి రాజ్యస్థానములఁ బూర్వ
కవుల కన్నను నిరాఘాటముగను
ఆర్జించితిమి యింత యతిథుల కిడి మేము
ననుభవింపఁగఁ జాలునట్టి వృత్తి
రచియించితిమి వచోరమణి తోడుగ రస
వంతమ్ములైన ప్రబంధములను

అని ప్రకటించుకొనిరి. ఇందతిశయోక్తియే మాత్రము లేదు. వేంకటశాస్త్రిగారు వార్ధక్యముచేత లేవలేక మంచముపట్టి మూలపడి యున్నప్పుడు సంస్థానాధిపతులు కొందరు స్వయముగా వచ్చి కుశలము విచారించి ఖర్చులకుఁ గావలసిన ధన మొసగి పోవుచుండెడివారు. ఈ యదృష్ట మెవరి కబ్బినది? శ్రీనాథు డంతటివాడు చివరికి దరిద్రుడై మరణించెను.

కవనార్థం బుదయించితిః సుకవితా కార్యంబు నావృత్తి యీ భవమద్దానఁ దరింతు

అనిన వేంకటశాస్త్రిగారి జీవిత మట్లే గడచినది. ఇంక తిరుపతి శాస్త్రిగారు పోలవరము జమీందారువారి పోషణమున రాజభోగము లనుభవించిరి. తిరుపతి వేంకటకవులు నవీన కవితా రాజమార్గ నిర్మాతలు. తరువాతివారు వారి సమకాలికులలో కొందరు వారి శిష్యులా మార్గము ననుసరించుచుండిరి. వారు నవ్యసాహితీ యుగపురుషులు.

నానారాజ సందర్శనము మొదటినుండి చివరివరకు సాహిత్య దృష్టితో పరిశీలించినచో పూర్వభాగము నందున్న కవిత్వములోని బిగువు ఉత్తరార్ధమునందు కనిపించదు. అందును కిర్లంపూడియందు చెప్పిన పద్యముల తరువాత పోనుపోను కవిత బిగువు సడలినది. దానికి వయస్సు కారణమైనఁ గావచ్చును.

---

# 3

## కల్పిత కావ్యములు

కావ్య మొక దర్పణము. అందు కవి కాలమునాటి సాంఘిక మానసిక ప్రవృత్తులు ప్రతిబింబించుచుండునని యొక పాశ్చాత్య పండితుడు నుడివెను. ఇతివృత్త మేదైనను తన కాలపు సాంఘిక పరిస్థితుల కనుగుణముగా మార్చి యానాటి మానస ప్రవృత్తులను నైతిక ప్రవర్తనములను కవి తన కావ్యమునందు చిత్రించును. అవి యెంత నిశితముగా చిత్రింపగలిగిన కావ్యమంత మనోహరముగా నుండును. వానిని మనోనయనమునకు గోచర మగునటుల ప్రదర్శించుటలోనే కవితాశిల్ప మున్నది. పాఠకుని యూహా కెంత దరి దాపున కది తేగలిగిన కావ్యమంత యాకర్షణీయముగా నుండును.

షేక్స్పియరు మహాకవి. ఆయన కాలమునం దింగ్లాండులో మనదేశమునందువలెనే భూతములు గలవనియు, అవి మానవులతో మాట్లాడుననియు నొక విశ్వాసము కలదు. ఆ సంగతినే యా మహాకవి హామ్లెట్ నందు ప్రదర్శించెను. మంత్రకత్తెలను గురించియు వారికి మూఢనమ్మకము గలదు. వారు త్రికాలజ్ఞులనియు మంత్రశక్తిచే వా రెంత కార్యమైన సాధింపగలరని వారి యభిప్రాయము. అదే మేక్బత్ నాటకమునందు నిరూపించెను.

క్రైస్తవుల సత్య సంధత, ఔదార్యము యూదుల సంకుచితము క్రూరమునగు మానసిక ప్రవృత్తి మర్చన్ట్ ఆఫ్ వెన్నీసునందు చిత్రించెను. షేక్స్పియరు నాటకము లన్నిటను ఆ కాలమునందలి సాంఘిక నైతిక రాజకీయ మానస ప్రవృత్తులు ప్రతిబింబించి యుండును. అవి సామాన్య మానవ జీవితములకు నూహల కందుబాటులో నుండును. కావుననే యా మహాకవి నాటకములంత లోకవ్యాప్తి చెందినది. భాషయు నతి కఠినమైనది. వాని యలంకార

ములు కవితా శిల్పము నిత్యమానవ జీవితమునకు సంబంధించి పారకు నకు పరిచయము కలిగియుండును.

మిల్టను పాశ్చాత్య విద్వత్కవి. మహాపండితుడు. 'పేరడైజ్ లాస్టు, పేరడైజ్ రిగైన్' అను కృతులను రచించెను. అవి పౌరాణికములు. పదచ్యుతు డగు మానవుడు మరల పదవీ సంపాద నకు చేయు ప్రయత్నములు, లేవతీయు విప్లవములు, సేటను పాత్రలో చిత్రించెను. ఇందు కవి చిత్రించిన మానవ ప్రవృత్తివి భాష, ఆలంకారిక రీతులు, శయ్య మరుగు పరచినవి. అవి పండిత జనైక గమ్యములు. సామాన్య మానవుల కందుబాటు నందుండవు. అందలి కవితాశిల్పము ఊహాతీతము. ఆ కారణముచేత నీ రెండు పండిత లోకమునందును షేక్స్పియర్ నాటకములు పండిత పామర లోకమునందును ప్రచారము కలవయ్యెను.

భారత రామాయణములు వ్యాస వాల్మీకులచేత రచింప బడినవి. వా రా యా కథల కాలములందు నివసించియుండిరి. ఆ కవి పుంగవులు తమ గ్రంధములం దా యా కాలమున సాంఘిక రాజ కీయ నైతికవ్యాపారములను చక్కగా చిత్రింపగలిగిరి. కావున ఆ కావ్యము లీనాటికి సజీవములై నిలిచినవి.

కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమునందు శకుంతల న త్తవా రింటికి పంపునపుడు కణ్వుడు పడిన పరితాపము శకుంతలకు చేసిన బోధ సంఘమును, సంఘాచారమును మనోనయనమునకు గోచరింప చేసెను. 'తత్రశ్లోక చతుష్టయం' అను ప్రతీతి యందుకనే కలిగినది. ఆ నాలుగు శ్లోకములను చదువుచు గాథే యను జర్మను పండితుడు నాట్యముచేసెను. తరువాత మృచ్ఛకటికము సాంఘిక దురా చారములను ప్రతిబింబింపచేయబడిన నాటకము. ఈ రెండు జన సామాన్యములో నధిక ప్రచారము బొందినవి.

తెలుగునందు శ్రీనాధుని వరకుగల కృతులన్నియు నాంధ్రీ కరణములు. వానియందు కవి స్వతంత్రించుట కెట్టి సావకాశము

లేదు. కావున ఆ యా యాంధ్రీకృత కావ్యములందా కవుల కాలములందలి సాంఘిక పరిస్థితులు నాచారములు ప్రవృత్తులు చిత్రించుటకు వీలులేకపోయినది. కావున ఆ యా కవుల రచనా పద్ధతులను భాషలను చూచుకొని పాఠకు లానందింపవలసి వచ్చినది.

శ్రీనాథుడును, శ్రీనాథుని తరువాత కల కావ్యయుగమునందలి కవులును పురాణాంతర్గత కథా భాగములనే కొలది మార్పులతో కావ్యములుగా రచించిరి. కావున కథలలో భేదములు కలిగినవే కాని నూతనత్వము కావ్యములందు లేకపోయినది. దానికి తోడు కావ్యలక్షణములని యాలంకారికుల శాసనములు కూడ అడ్డమైనవి. కావ్యములన్నియు నొకేరకముగా తయారైనవి. యమకములు శ్లేషలు మొదలగు శబ్దార్థాలంకారములు పెచ్చుపెరిగి కావ్యకన్యకను మోటుపరచి పల్లెటూరి పడుచును గావించినవి. కావున తెనుగు కావ్యములందు వినూతనత్వము లేకపోవగా నిశ్చైతన్యములైనవి. వసుచరిత్ర యట్టివానిలో నొకటి.

అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు కొన్ని సాంఘికాచారములను ఆ కాలమునాటి బ్రాహ్మణ ప్రవృత్తులను ప్రవరునియందు చిత్రించెను. అందుమూలమున కావ్యరచనలో నవీనత కనిపించినది. రాయలవారు తన కాలమునందలి సంఘాచారములను శైవ వైష్ణవ మతవైషమ్యములను విష్ణుచిత్తీయమునందు ప్రదర్శించి యొకరకపు వినూతనత్వము ప్రతిపాదించెను. ఎవరే కావ్యము రచించినను సాంఘిక ప్రవృత్తి పరిపూర్ణముగా ప్రదర్శించినవారు లేరు. విప్రనారాయణ చరిత్రయందు కావ్యము నూతనమార్గమును పట్టినది. సాంఘిక పరిస్థితులు దురాచారములు ప్రదర్శితములైనవి. మానవ ప్రవృత్తియు చక్కగా చిత్రింపబడినది విప్రనారాయణునియందు. కాని రంగని భక్తరక్షణ మను నొక సంఘటనమును చొనిపించి కావ్యమునకు కృత్రిమత్వమును కల్పించినాడు కవి. ఇట్లు చాలవరకు తెలుగు కావ్యములు సామాన్య మానవ చిత్తాకర్షణీయములు కాలేకపోయినవి.

పదునారవ శతాబ్దము తరువాత కవులలో ప్రతిభ సన్నగిల్లినది. అందుమూలమున రచనా పద్ధతులందు ప్రాతదారులనే పట్టి కావ్యజీవితమునం దుత్తేజము కల్పింపలేనివారయిరి. ఆ కారణమున నొకవిధముగా తెనుగు కావ్యములు తిరస్కారమునుగూడ పొందినవి. ప్రాతదారులకు రోతపడిన విజ్ఞాన పిపాసువులగు నాగరిక మానవులు క్రొత్తదారుల కాశించిరి. అప్పటి కాంగ్లేయభాష వ్యాప్తిలోనికి వచ్చినది. ఇంగ్లీషు చదివిన వారార్థికముగా సుఖించుచుండిరి. జనసామాన్యము దృష్టి యటు మళ్ళినది. స్వదేశ భాషాభిమానము విడిచి యాంగ్లము పఠించిరి. అందలి నాటకములు కావ్యములు యువకుల చిత్తముల నాకర్షించినవి.

పందొమ్మిదవ శతాబ్దమునాటికి దేశమాంగ్లమయమైనది. షేక్స్పియరు, షెల్లీ, మిల్టనుల కావ్యములందలి ప్రతిబింబితములైన సాంఘిక ప్రవృత్తులు వారి మనస్సుల నాకర్షించినవి. తెనుగనినను సంస్కృతమనినను నిరసనము జనించినది. ఆంగ్లేయ కావ్యముల దృష్టితో తెనుగు కావ్యములను పరిశీలించి విమర్శింప మొదలు పెట్టిరి, సాంఘిక దృష్టితో రచింపని తెనుగు కావ్యముల నావలకు త్రోసిపుచ్చిరి. రాజును చూచిన కన్నులతో మగనిని చూచినట్లయినది. నిజమున కాంగ్లము రాజభాష కదా?

సంఘమును పరిబింబింపచేయు కావ్యము సాంఘిక కావ్యము, అది తెనుగునందు లేదు. ఆ లోపము గుర్తించిన వారొక్క తిరుపతి వేంకటకవులు మాత్రమే తిరుపతికవుల సమకాలికులలో నెవరది గ్రహించినవారు లేరు. కందుకూరి వీరేశలింగముగారు నవీనాభిప్రాయములుగల స్వతంత్రుడు. సాంఘిక పరిస్థితులను బాగుగా గుర్తించినవాడు. సంఘ దురాచారములను రూపుమాపుటకు పనిగొనినవాడు. మంచి సాహితి. అయిన నేమి, కావ్య రచనమునందాయన యూహ జనసామాన్యము యొక్క మానసికతత్త్వమును గ్రహించలేక పోయినది. ఆయన రచనలు సయితము సనాతన

మార్గమునే యనుసరించినవి. కావున సామాన్యజన మానస రంజకములు కాలేదు.

కవిః-కాలః-కాలపరిస్థితులను జనుల మనస్తత్వములను అభిరుచుల ననుసరించి కవి కావ్యరచన చేయును. తిరుపతి కవులనాటికి సంఘములో వేశ్యలను గురించి యలజడి మిక్కుటముగా నుండెను. జనుల మనోవృత్తులు వేశ్యలవైపు మరలినవి. అది యొక దురాచారము. దానిని తిరుపతి కవులు గుర్తించిరి. ఆ సంఘ దురాచారమును ప్రతిబింబింపచేయుచు శ్రవణానందము, పాణిగృహీతలను రచించిరి. వీనియందు వేశ్యల దురాగతములను, దుశ్చేష్టితములను చిత్రించి సంఘమునకు తిరుపతికవు లొక చక్కని నీతి పాఠమును నేర్పిరి. అందు 'శ్రవణానందము' మొదటిది. ఇది తిరుపతి కవులనాటి సంఘజీవితము ప్రతిబింబింపచేసిన శృంగార ప్రబంధము. ఇంతవరకు పౌరాణిక కావ్యములు చదివి విసుగు చెందిన మనస్సుల కీ సాంఘిక కావ్యము నూతనోత్తేజము కలిగించినది. ఇందు నాయకురాలు వేశ్య, బాలామణి. నాయకుడు మహాకవి, మధుసూదనుడు. అతడు వైష్ణవుడు. శ్రవణానంద మైదాశ్వాసముల గ్రంథము. మొత్తమైదువందల ముప్పదియేడు పద్యములు గలవు. ఈ కృతిని తిరుపతి కవులు వాడరేవు వేంకటరత్నము మంత్రి కంకితమిచ్చిరి. ఈ కావ్యము మనుచరిత్రాది కావ్యములవలె పురవర్ణనతో నారంభింపబడినది. కాని యీ పురవర్ణనమునకు నితర కావ్యములందలి పురవర్ణనములకు భేదమున్నది. ఇందు మేడలు ప్రాకారములు వర్ణింపక బ్రాహ్మణుల నెత్తికొని

కలదొక పట్టణంబు కలకాల మపార సుధాశనంబు చే
నరుల రసజ్ఞ యన్న మున కాసలుచేయ ధరాతలమ్ము లో
పల జనియించి పాఱుల నెపమ్మున నుండెడి దేవకోటి నాఁ
జెలఁగెడు శిష్టకోటికి బ్రసిద్ధ మనంత పురాభిధానమున్.

అని మన మెప్పుడు చూచుచుండు సామాన్య నగరమును నిసర్గ స్వరూపముతో వర్ణించిరి. ఈ పద్యమునందలి పాఱుల వర్ణన

చదువగానె పెద్దన్నగారి మనుచరిత్రలోని 'జిహ్వాగ్రతుప్పాడుల్ల నామెతలెటెంగె నీ తుషారాద్రి కతన' యనుపాదము జ్ఞప్తికి వచ్చును. ఆ నగరమునందు విశిష్టాద్వైత మతస్థుడు మధుసూదనుం డను నొక సుకవి గలడు. అత డుత్తమ విద్యలన్నియు నభ్యసించెను. తల్లిదండ్రుల కత డొక్కడే కుమారుడు. 'దేవియుం దేవరవోలె నుండి యిలు దీర్పఁగఁ గాపుర మొప్పు వానికిన్' అని మనుచరిత్రలో చెప్పినట్లు, 'తల్లిదండ్రు లిలుపెత్తన ముత్తమ రీతి చేయఁగన్' ఆ మధుసూదనుడు చెలువారును. మొదట మధుసూదనునకు ఓనమాలైనను రావు. ఆటకోటి తనముగా సంచరించినాడు. అదృష్టముచేత చిత్రముగా విద్యావంతుడైనాడు. మహాకవియై కీర్తి గడించెను.

కవిత చెప్పఁగ నేర్చుఁ గలవుదీరఁగ వేయి
గంటాలకైన నిష్కంటకముగఁ
జదువు చెప్పఁగ నేర్చు శబ్ద శాస్త్రాదికం
బది మేలనుచుఁ బండితాళి మెచ్చ
మద మడంపఁగ నేర్చుఁ బదిమంది కవులొక్క
టై దుష్టవాదంబు నందుకొనిన
మాటలాడఁగ నేర్చు మధురమ్ముగా విన్న
వారలెల్లరును వహ్వా యనంగ
బాగు బాగని యనఁ బాటఁ బాడ నేర్చు
నతులితంబుగఁ జదరంగ మాడ నేర్చు
వడివడిగ ముత్యములరీతి వ్రాయ నేర్చు
సుందర గుణాఢ్యుఁ డమ్మధుసూదనుండు.

నాయకుడు సర్వసామాన్య మానవలోక మధ్యమునందు సంచరించు నొక కవి. వసుచరిత్ర నైషధాదులయందు వలె నంబర చుంబిత సౌధాంతరాళములందు నగమ్యగోచరుండయి యుండు సంఘాతీతుడు కాడు. వేంకటశాస్త్రిగారి జాతకచర్య పరిశీలించి చూచినచో స్వీయగుణములే యీ మధుసూదనునియం దారోపించి

రని తోచును. అందుమూలమున శ్రవణానందము వారికి సంబంధించిన కథ యను భ్రమను కల్పించును. అట్టి తలంపునకు ప్రధానాధారములు వారి జాతకచర్య మొదలగు గావ్యములందు కలవు. సుదర్శనుడు వసించు వీధి నా నగరమునందు బాలామణి యను వేశ్య కలదు.

పాడెనా గంధర్వపాటలాధరల వీ
 ణా నినాదంబు చిన్న తన మూను
ఆడెనా రంభాముఖాప్సరో భామినీ
 వర్గ మెల్లను దలల్ వంచుకొనును
కూడెనా యక్షేశు కొడుకైన ఋణ విము
 క్తికిఁ దగ్గ ధనమిచ్చి తేలలేఁడు
వేడెనా వేదాంత విద్యా విశేషజ్ఞుఁ
 డైనను మారుమాటాడ లేఁడు

అనుచుఁ దనుఁజూచు జనులెల్ల నభినుతింప
సాటి బోటులలో నీటు గోటు గల్గి
వరలె నౌరౌర! భళిర! వహ్వా! వహావ్వ!
మేలు మేల్ రాజధాని యీ శాలసాని.

బాలామణికి విద్యావంతుడైన మధుసూదనునియందు' వలపు నిలిచినది. ఆమె తల్లితో 'శారదా కుచమ్ములు గలవాఁడు తక్కనితరుఁ డింతి కుచములు పట్టిన నేమి ముఖము' అని సిగ్గు విడిచి చెప్పుకొనినది. మధుసూదనుని తనకు సమకూర్పుమని వేడికొనినది. తల్లి,

సాహిణీ మారుండు చచ్చిపోవుట చూడఁ
 గవి వరేణ్యుల కోపకలనఁ గాదె
రాజ కళింగ గంగరాజు భిక్షుకుఁడౌట
 కవి వరేణ్యుల కోపకలనఁ గాదె

పోత నరేంద్రుండు పొలియు సంగతి చూడఁ
గవి వరేణ్యుల కోపకలనఁ గాదె
పెద్దాపురపు కోట పెద్దమ్మ కిల్లాట
కవి వరేణ్యుల కోపకలనఁ గాదె

కరుణ గల్గిన నిల్లు బంగార మౌను
కరుణ తప్పిన నడవియౌ గడియలోన
బ్రహ్మ కొడుకైన కవులకు భయముఁ జెందు
మన మనఁగ నెంత యమ్మక్క మదిని జూడ.

అని కూతునకు బోధించినది. ఈ పద్యమునందు కవుల ప్రభావము వర్ణించు మిషతో తిరుపతి కవులు తమ చారిత్రక విజ్ఞానమును వెలువరించిరి. నానారాజ సందర్శనమున 'మదనాభిరామ రాణ్మణి' యను పద్యము నిట్టిదే.

తిరుపతికవులు శాస్త్రపండితులు, కవులు మాత్రమే కారు. చరిత్ర పరిశోధకులు. ఇట్టి చరిత్రాంశములు వారి గ్రంథములందు పెక్కుగలవు. 'వినఁగావలెను పూర్వ విద్వచ్చరిత్రముల్' అని చెప్పుకొనినమాట కివి యన్నియు లక్ష్యములుగా కనిపించును.

ఒకనాడు మధుసూదనుడు ముస్తాబయి వేశ్య యింటిముందు నుండి పోవుచుండెను. వేశ్యమాత మధుసూదనునకు నమస్కరించినది. 'ఏడుమూఁడు పురుషాంతరముల నుండి మీ పూర్వుల మంగళాశాసన ప్రభావమ్మునను తిరుమంత్రోపదేశ ప్రభావమ్మునను నొక్కింత కొదువలేక నేఁటివరకు వర్ధిల్లుచుంటిమి. మా యర్థప్రాణమ్ములు భవ దధీనమ్ములు' అని చుట్టరికము కలుపుకొనినది. మధుసూదనుని తన యింటిలోనికి కొనిపోయినది. ఆ నాటి వేశ్యమాతల పని యిది. ఇక్కడ చక్కని యుపాలంభము అర్థాంతర న్యాసముతో లగించినారు తిరుపతి కవులు.

ఎన్ని చదువులు చదివిన నేమి నీచు
లకు గురుత్వంబు వైష్ణవులకు సతంబు

ఈ మాట లోకమునం దలవాటులోనున్న వైష్ణవుల గురు సంచారము ప్రవృత్తి జ్ఞప్తికి దెచ్చును. ఆ కాలమునందు వేశ్యాంగనలు వైష్ణవ పద దాసురాండ్రు.

రెండవ యాశ్వాసము మధుసూదన వేశ్యమాతల సంభాషణలతో నారంభమగును. వారి సంభాషణ చదరంగపు యెత్తులవలె సాగినది. అది యొక నాటక రంగమువలె నడచినది. తిరుపతికవులు సంభాషణ రూపమున కథను నడిపించుటలో నేర్పరులు. వారి కావ్యము లన్నియు నట్లే యుండును. ఆ పద్ధతి తిక్కనగారికి బాగా యలవడినది. అది వీరికి సంక్రమించినది. తిరుపతి కవుల కావ్యములు రసవంతములుగా నుండుట కిది యొక కారణము. మధుసూదనుడు వేశ్యమాత సంభాషించు చుండగా రంగస్థలము మీదికి పాత్రవలె

ముంగాల సింగార ముంగారు మేలు బం
గారు రంగారు లంగా ధరించి
దబ్బకాయలఁ జూచి యబ్బగారని పిల్చు
గబ్బి గుబ్బలఁ గంచుకమ్ము తొడిగి
చందమామ మిటార మొందు మోమున గంగ
సిందుర నామంబు పొందు పఱచి
కలువ రేకుల జాలు గెలువ జాలెడు సోగ
చెలువు కందోయి కజ్జలము దీర్చి
లీల కీల్జడఁ జుట్టి చొల్లెమ్ము వెట్టి
లలిత రుచి నొప్పుచున్న బులాకితోడ
మించి ముసిముసి నగవులు మేలమాడ
విప్రు దరిఁజేరె నప్పు డ వ్వేశ్య తనయ.

ఇది చక్కగా తీర్చి దిద్దిన సాలంకృతమగు చిత్ర శిల్పము. తిక్కనగారిట్టి శిల్ప రచనమునందు సిద్ధ హస్తులు. ఆ రచనా సౌందర్య మీ పద్యమునందు గోచరించును. ఈ పద్యము చదువు నప్పుడు మంచి బిగువైన యావనమందున్న పల్లెటూరి పురాతనపు

టాటవెలది కనుల యెదుట కనిపించును. ముంగాలి మీదికి వ్రేలాడు కుచ్చెళ్ళతోడి బంగారు రంగుగల లంగా, దబ్బకాయల కొంకింత చిన్నవగు బిగువు గుబ్బలమీద తొడిగిన రైక, చంద్రునివంటి గుండ్రని ముఖమున పెట్టిన గంగసిందురపు నామము, కాటుకతోడ వాలుకనులు, ముక్కున బులాకి, జడచుట్ట, ముసిముసి నగవులు సాక్షాత్తు విష్ణుమతస్థురాలగు వెలయాలి రూపము గోచరించును. ఆమె వచ్చి,

పైట తొలంగి పాదములపైఁ బడ గాజులు మ్రోయ సర్వదే
శాటన పావనంబగు ధరామరు పాద సరోజయుగ్మ మా
బోటి నమస్కరించె నల పుష్పశరాసుఁడు బాణపంక్తికిన్
వాటముగాక తా గిరటవైచిన చాప మనంగ నత్తరిన్.

ఆ నమస్కరించునపుడు పైట తొలంగి పాదములపై బడినది. గాజులు మ్రోగినవి ఈ రెండు సాభిప్రాయ వర్ణనలు. రసోద్దీపన కారణములు. వానికి నుత్ప్రేక్షాలంకారము మరింత రసపుష్టి కల్పించినది. నాయకురాలు తాంబూలము తెచ్చి

కరము కంపము నొంద సరులు తల్లడ మందఁ
జెమటచేతను చెక్కు చెమ్మగిల్లఁ
గనులు చాపల మూన మనము కోరిక లానఁ
దనువు పులకలచే దళముగాఁగ
నవ్వు అవ్వకుఁ దీయి అవ్వ చివ్వున డాయఁ
జనులు గందరగోళ మనుసరింప
సిగ్గు వెనుకడుగేయఁ చేటు ముందడు గేయ
మోహమ్ము తలకెక్కి మురువుఁ జూప

చేతి కందిచ్చినది. నాయిక సామాన్యయైనను పురుష సాంగత్య మెరుగనిది. నాయకునియం దనురాగము కలది. కావున యామె యందు పొడమిన యీ సాత్త్విక భావములు నిసర్గముగా వర్ణింపబడి నవి. ఇవి పూర్వకవుల కావ్యములందు సామాన్యముగా నగుపించు

చుండును. మధుసూదనుడు 'యోగ మున్నను దప్పింప నొకరివశమె' యని యానాటికి వెడలిపోయెను.

వసంతకాల మాసన్నమైనది. పూర్వకవుల కావ్యములందలి ఋతువర్ణనలకు శ్రవణానందములోని ఋతువర్ణనలకు చాల తారతమ్యమున్నది. పూర్వ కావ్యములందలి వసంత కేళీవనములు, చిగిరించిన రసాలములు, పుష్పించిన మల్లికాది వల్లికలు, కోయిలల కలగానములు, తుమ్మెదల ఝుంకారములు శ్రవణానందమునందు కనిపించవు. సంఘమునందు సకల మానవానుభవమునందున్న విషయములే యిందు వర్ణింపబడినవి. కావున నవి కృత్రిమములు సత్యదూరములుగాక చిత్తాకర్షణీయములుగా నుండును.

అత్తతోఁ బోరాట మందిపోయిన యట్టి
జామాత తను తాన సఖ్యపడియె
భార్యతోడ విరోధ పడిపోయిన మగండు
మగుడ భార్యను బ్రతిమాలు కొనియె
సన్యసించుటకు నిశ్చయ మందిన విరాగి
రాగాంధుండై తన రమణిఁ గవిసెఁ
గార్యార్థియై దూర గతుఁడైన సంసారి
దత్తరమ్మున నూరి దారి పట్టె

బ్రహ్మచారులు పెండ్లికై పాట్లు పడిరి
వేశ్య మాతల తోడను విగ్రహించి
నట్టి విటు లెల్ల నద్దాని ననుసరించి
రహహా! యేమన న వ్వసంతాగమమున

ఇది వసంత వర్ణనము. ఇంక నెండ కాలము.

ఇతరుల దాహాపుంగతుల నెన్నఁగ నేల దినేశుఁ డంతవాఁ
డతితర తృష్ణచేఁ దన సహస్ర కరమ్ములు సాచి నేమపుం
గతి విడనాడి గుంటలనెగాదు నదమ్ములఁగాదు కూప సం
తతులనెగాదు కంటికిఁ గనంబడినంతయుఁ ద్రావె నీరమున్

సూన బాణుని కేళిఁజొక్కి యక్కన ప్రాలు
ప్రియురాండ్రఁ బైటచే విసరువారు
విసరినందులకు నై కొసరి యింకొకసారి
వెడవెడ పనుల కొప్పించువారు
నొప్పించినను నొప్పకున్న క్రొన్ననబోణు
లను మా బదులు తీర్పు మనెడివారు
దీర్చికొమ్మన్న విదిర్చి శయ్యను డిగ్గి
చనువారిఁ గని ముద్దు గొనెడివారు

ముద్దుగొని సుద్దులను గొంత ప్రొద్దు జరిపి
మలయవావుయు లిరువురఁ గలక దేర్పఁ
గలయఁ దమకించి కోడి కూతలకుఁ దలఁకు
వార లైరట గ్రీష్మ విభావరులను.

ఈ పద్యములు చదువునపు డొక విధమగు నవ్వ ఆనందము కలుగును. వీనిలో హాస్యరసము సన్నని తెర మరుగున యౌవనవతి యగు తరుణీ ముఖ విలాసమువలె ప్రధాన రసమగు శృంగారము నందు నంతర్గతమయి వ్యక్తావ్యక్తముగా గోచరించి రసికుల హృదయము రంజింపచేయును. ప్రాచీన కావ్యములందు వర్ణనలవలె శ్లేషలు, ఉత్ప్రేక్షలు కలిగి రసమున కడ్డంకులయి చదువరులకు విసుగు పుట్టింపవు.

స్వభావ సిద్ధములయి తిరుపతికవుల వర్ణనలు నిత్యానుభవము లందుండినవయి మీదు మిక్కిలి రసస్రుతికి నుపస్కారకములై యుండును. ఇది వారి కావ్యములలోని పూతనత్వము. ఇట్టి విధము తరువాతకవులకు దారి చూపినది. పూర్వ కవులలోగాని సమకాలికు లగు కవులలోగాని యిట్లు వర్ణన చేసినవారు లేరు.

అట్టి వసంత సమయమున మధుసూదను డారామమునం దుండెను. బాల వానిని కదియ వచ్చినది. మధుసూదనుడు 'తోడింతయు లేక యుద్యానవనమునకు నేల వచ్చితివి' అని ప్రశ్నించెను. బాలసాని 'రేపె వత్తునని మీరు రాకుండుటఁజేసి మిమ్ముఁగన నేగు

దెంచితిని. పండితులైనవారి కబద్ధమాడుట భావ్యమే కదా' యని సూటి పోటిగా సమాధానము చెప్పినది.

పండిత పామ రాపార మోదమ్ముగా
నమ్ము మా పెట్టెలో సొమ్ము గాదె
శుభ కార్యములయందు సొంపు సంపాదించు
విధి మేము పెట్టిన బిక్ష కాదె
మన్మధ వేదాంత మార్గోపదేశంబు
లనఁగ మాతలనె పుట్టినవి కావె
ముని భీతితో మునిగినరాజు నుద్ధరిం
పఁగ మమ్ము చెప్పి చెప్పవలెఁగాదె
సురత నైపుణ్యముల మదిఁ జొన్ప రసిక
వరుల కందఱు మా తరువాత గాదె
ఎన్ని విధములఁ జూచిన మన్ననలకుఁ
దగుదుమే కాని నిందకుఁ దగము మేము.

అని వేశ్యల ఘనత చెప్పుకొనినది బాలామణి. ఈ పద్యము మను చరిత్రములోని 'చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధి పొడమిన చెలువ తోఁబుట్టు మాకు' అను పద్యమును జ్ఞాపకముకు తెచ్చును. అట్లని దాని కనుకరణ మనుటకు వీలులేదు. ఈ యాశ్వాస మొక నాటకరంగమువలె నడిచినది. 'ఎన్నిట జాణ వైతి విపు డెవ్వని నైనను బుట్ట పెట్టవే' యని మధుసూదనుడు వెడలిపోయెను. 'ఇంత మాత్రమున కట్టి ఘనబుద్ధులు పెడమార్గమునకుఁ జనునె' యన్నారు తిరుపతికవులు. 'కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్' అన్నాడు పెద్దన. ఈ రెండు ప్రబంధముల కర్తలు మహానుభావులు. పై రెండు కావ్యములందు నుత్తమ కథా సూచనములైన ఈ యర్థాంతరన్యాసములు నాటకములోని విష్కంభముల వంటివి. గట్టి ప్రయత్న మవసరమని మొదటిదాని సూచన. ప్రయత్నము నిష్ప్రయోజనము. ఇంతటితో నాట కట్టని పెద్దనగారి సూచన.

పెండ్లిండ్లయందు నితర శుభకార్యములందు వేశ్యల యాట పాటలు ప్రదర్శించుట తిరుపతి కవులనాటి సంఘములో నొక యల వాటు కలదు. అది ఘనముగా నాటిజనులు తలంచు చుండెడివారు. అవి యాధారముగా చేసుకొని వేశ్యలు ధనార్జనకు పూనుకొనెడి వారు. మధుసూదనుని దగ్గరచుట్టముల యింట వివాహమైనది. మధుసూదను డా పెండ్లికి వెళ్ళెను. బాలామణియు మేళముకొరకా పెండ్లికి వచ్చినది. వివాహము పూర్తియైనది. పెండ్లివా రందరు నదిని దాటి యరుగుచుండిరి. అప్పటికి చీకటి పడినది. ఒంటరిగా మధు సూదనుడు ముం దరుగుచుండెను.

తైక దాఁటియు బనారసు కండువా దాఁటి
గబ్బి గుబ్బల కాంతి గంతు లిడఁగ
గాగరా దాఁటి పై గట్టుపుట్టము దాఁటి
తొడల యందం బడావడి నొనర్ప
కర్ణమ్ములను దాఁటి గండస్థలము దాఁటి
కమ్మల కాంతి యాగడముఁ జూపఁ
దలదాఁటి మొలదాఁటి తళ్కు మీరెడు మేల్మి
బంగారు జడ బరాబరులు సేయ

పార్శ్వగత వృక్ష గళిత పుష్ప ప్రకీర్ణ
మై శుక పికాళి కలకూజి తాభిరామ
మై మలయమారుతోపేతమై తనర్చు
నట్టి యా యేటి యొడ్డున నరిగి యరిగి

బాలామణి మధుసూదనుని కలిసికొనినది.

చిన్ని వెన్నెల మోము చెల్వువడ్డి కొసంగు
చిన్నారి పొన్నారి చెమటదాని
నాయాసమున రెప్ప లల్లనల్లన నార్చు
శ్రీయుతం బగు కన్నుదోయిదాని

నొలయు నిట్టూర్పు వాయువులచేఁ దబ్బిబ్బు
లై యుబ్బు పెన్గుబ్బ లమరుదానిఁ
గరఁగి నీరై నాసికను జాలువాఱు సిం
దూరంపు తోరంపు సొరుదానిఁ
గలకల ధ్వను లొలయఁ బొంకమ్ము మీఱు
జారు మొలనూలు గల కటి స్థలము దానిఁ
గంది యున్నట్టి పాద యుగమ్ము దానిఁ
గనియె మధుసూదనుండు వెన్కకును దిరిగి.

తిరుపతికవులు సీస పద్యములు నడిపించుటలో తిక్కన శ్రీనాథుల తలకు మీరినవారు. పై పద్యములలోని గంతులిడగ, అడావడి నొనర్ప, ఆగడము చూప, బరాబరులుసేయ, వడ్డికొసంగు, నిత్యాది పదములలో సారస్యములు ప్రశంసింప దగినవి. ఈ రెండు పద్యములందు రెండు రకముల రూపములు చిత్రింపబడినవి.

మొదటిది నడుచుచున్న నాయకురాలి సౌందర్య చిత్రము. రెండవది యలసి సొలసి యున్న బాలామణి యాకారము. ఈ రెంటియందు రూప నిర్మాణమున తిరుపతికవుల లేఖని సున్నితమగు సన్నని మొన గల శాణమువలె పనిచేసినది. రెండవదానిలోని రెప్పలల్లార్పులు తబ్బిబ్బులై యుబ్బు పెన్గుబ్బలు కవితాశిల్పము లందలి కళా నైశిత్యమును వెల్లడించుచున్నవి. ఈ పద్యములను చదువగానే యా యా రూపము లా యా కదలికలతో సజీవము లుగా గన్నుల యెదుట నిలుచును. పద్య రచనమునందే కాదు, శిల్ప ప్రదర్శనము నందును తిరుపతికవులు తిక్కనతోడి సరితూగుదు రనుటలో సందేహము లేదు. తిక్కన నర్తనశాలలోని కరుగుచున్న యుత్తరను–

అడుగుల నును కాంతి నవ్యోడ పద్మరా
గంబుల నెలకట్టు కరణి నొప్పఁ
బాలిండ్లు తనువెడ ప్రాలింపఁ జెన్నొందు
నసదుఁ గౌఁదీఁగె యల్లాడుచుండఁ

దటివేచి వెనువెంటఁ దగులు కామాంధ కా
రము లీలఁ గ్రొవ్వెద గొమరు మిగులఁ
గర్ణభూషణ మౌక్తిక ప్రభా డోలన
మీక్షణ దీప్తుల నినుమడింప

నందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోది రాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందములఁ దోన
చనఁగ నుత్తర నర్తనశాల కరిగె

అని వర్ణించెను. ఈమె మహారాజపుత్రి. బాలామణి వేశ్యాంగన. ఆ తారతమ్యము వర్ణనలలో కనిపించును. తిక్కనలో కొంచెము నాజూకుతనమున్నది. తిరుపతికవుల వర్ణనలలో కొంచెము మోటుతన మున్నది. అది కాలము పాత్రలనుబట్టి కలిగిన భేదము. శిల్పమును తీర్చిదిద్దుటలో నిద్దరు సిద్ధహస్తులే. తిరుపతికవుల వర్ణనలన్నియు స్వభావ సిద్ధములై యిట్లే యుండును.

తిరుపతికవు లుద్దీపన విభావములగు పుష్పించిన వృక్షములు, కలకూజితము లొనరించుచున్న శుకపికాదులు, వీచుచున్న మలయ మారుతముల నడుమ నేటి యొడ్డున నాయికా నాయకులసమాగ మమునకు చక్కని సన్నివేశము కల్పించిరి. అది మనోహరమగు రంగస్థలము.

మా వారలు కడు దూరము
గా వచ్చుచు నున్నవారు కావున మిమ్మున్
నే వేడెద నిచ్చోటఁ
మా వారలు వచ్చుదనుక మసలుట కొఱకున్.

అనుచు బాలామణి మరల ప్రయత్నమునకు కొంత సావకాశము కలిగించుకొనినది. మరల వాదనకు దిగినది.

మన కిదివరకే కలదని
జను లెల్లరు చెప్పికొనఁగ సాగిరి కాదే

జనవాక్యం కర్తవ్యం
బను పెద్దల పల్కులకును నారడి కలదే.

వాదములేల వట్టి యపవాద వహింపఁగ రాదు గాన మీ
పాదములాన యింక వలవంతలఁ బెట్టుట కాదు చిత్త దా
యాదుఁడవైతి శంకవలదంచు కర గ్రహణం బొనర్చె నా
గాదిలి వన్నెలాడి

మధుసూదనుని గుట్టు చెడినది. గుండె జల్లుమన్నది. మేను చెమర్చినది. ఏమి చెప్పుట కోపలేదు. బాలామణి యాలింగన మొనర్ప నిచ్ఛ చేసినది. అంతలో నామె చెలులు వచ్చిరి. మధుసూదనుని పరిహసింప మొదలుపెట్టిరి. మధుసూదనుడు బయలు దేరెను. వాని మనస్సు మనస్సులో లేదు. 'నడచునేకాని యా నడచుచున్న మార్గం బెడకేగునో యాతని కెఱుక లేదు' మరుడు వాని మనస్సునందు ప్రవేశించెను. ఆ రేయి మధుసూదనుడు పరిపరి విధముల నాలోచించెను.

అప్రయత్న సిద్ధమ్ముగ నబ్బినట్టి
పొందులోడఁ గూర్చుఁగాదె పెంపొందు సుఖము

అను నిర్ణయమునకు వచ్చెను. బాలామణికి కొంత ధైర్యము చిక్కినది. 'నామాట యన్న నడుగుదాటునే యిఁకఁ గొంత గడచు మీద'నని యనుకొన్నది. ఇంక నాల్గవ యాశ్వాసము.

మరునాడు మధుసూదనుడు వేశ్యతనయ కొక లేఖ వ్రాసి పంపినాడు. ఆమె సమ్మతిని తెలుపుచు సమాధానము వ్రాసినది. రాత్రి సుదర్శనుడు బాలామణి యింటికి బయలుదేరినాడు

మధుసూదనుడు అతిభీరువు. అనుమానము లధికము. ఒక మిత్రునింటికి చేరినాడు మధుసూదనుడు. వాని నీతి బోధలకు తల యొగ్గి యచట నా రేయి నిద్రించెను. ఆ రే యంతయు కన్నులు దించికొని పోవునల్లెదురు చూచినది వేశ్య. మధుసూదనుడు రాలేదు. తెల్లవారినది. మరొక యుపాయము పన్నినది బాలామణి.

ప్రతిదినము పూట కొకసారి పనిని బూని
యతని సన్నిధి కేతెంచు నది మొదలుగఁ
బుస్తకము హస్తమునఁ బూని పొలతి యొకతె
తనకుఁ జేదోడు వాతోడుగను మెలంగ

చదువను పేరెగాని యామె చదువుకొఱకు వచ్చినదికాదు. ఆమె ప్రయత్నము వేరు. మధుసూదనునితో నెకసక్కెపు మాటలాడును. సందొదవినప్పుడెల్ల నేదియో యొక సంగతి తెచ్చి పండితులు మొదలే యబద్ధమాడెదరు. మోసము చేయుదురు. వారిని నమ్మరాదని చెప్పును.

ఒకమాఱు మనుచరిత్ర కథాంశమున వరూ
ధిని మరులు నెందు పట్టునను జదువు
నొకమాఱు నాయికాదిక చేష్టలెఱఁగించు
రసమంజరీ రస ప్రసృతిఁ జదువు
నొకమాఱు నభినయ ప్రకటీకరణ చణా
భినయ దర్పణ రసాభిరతి చదువు
నొకమాఱు గాన విద్యోప యుక్తార సం
గ్రహ ముఖ్య గ్రంథ సంగతులు చదువుఁ
గ్రొత్త క్రొత్తలు జావళీల్ క్రొత్త క్రొత్త
పదములును క్రొత్త క్రొత్తలౌ వర్ణములును
నింపు దళుకొత్తఁ గోరి రచింపఁ జేయు
నేమి చెప్పఁగ వచ్చు న య్యింతి చర్య.

ఆమె కాముకురాలు. మనస్సు నిలకడ లేనిది. ఏ వేళ కేది యనువుగా నున్న నవి యెల్ల నడుగును. ఎండకాలము వచ్చినది. పోయినది. వానకాలము ప్రవేశించినది. ఒక్కనాటి రేయి మధుసూదను డింటియం దొంటరిగా నుండెను. బాలామణి మధుసూదను నింటికి వచ్చెను. అతడామె కధీనుడై నాడు. వారిరువురకు సమయమిది

"నీ యెడం దప్పెపు డబ్బునో యపుడ తప్పాఁ జుమీ మన స్నేహ భావముల్" తెల్ల వారు జామయినది.

నలిగిపోయిన పుష్పములు కీలు జడనుండి
యడుగడ్డునకుఁ ద్రోవయందు రాల
మలయు ప్రాతఃకాల మలయ వాయువులచేఁ
జెమట బిందువుల మొత్తము లణంగ
కురియు నున్మంచు తుంపురులు కెమ్మోవి నొ
క్కల కించుక భరమ్ము కలుగఁ జేయ
నతి రతి పరవశ స్థితి వియ్యమందు ని
ద్దుర నెత్తికెక్క తత్తరము చూప

నెవరు చూచెదరో యంచు నించు కంత
భయము కల్గియు నాకేమి భయమటంచు
దిటము మదిలోననూని య చ్చటుల నేత్ర
టింగురంగా యటంచు నింటికిని జనియె.

పంచమాశ్వాసము నందు సుదర్శనుడు తా నొనరించిన యకార్యము నకు పశ్చాత్తాపము నొందును.

"మనమా వద్దిక నాదు మాట వినుమా మర్యాద కాపాడుమా" అను మకుటముతో పదునేడు పద్యములు రచింపబడినవి. శ్రవణానంద కావ్య మంతయు నొక యెత్తు, ఈ పద్యము లొక యెత్తు. ఇవి కావ్యసతికి మకుటాయమానములు. శ్రవణానందము చదివిన వారందరు నే పద్యములు కంఠస్థము చేసినను చేయకున్నను నీ పద్యములు వల్లన వేయుదురు. వానియం దట్టి మాధుర్యమున్నది. వీని రచనా విధానము వేరు. ఈ పంథా మరేకావ్యమునందు లేదు. శృంగార ప్రబంధము లిట్టివి పూర్వము పెక్కు గలవు. అందు నాయకుడు పశ్చాత్తాపము పొందిన ఘట్టములు గలవు. ఏ కవియు మనస్సును ప్రబోధించుచు నేక మకుటముతో రచించిన వరుస పద్యములు గానరావు. ఇది నూతన పద్ధతి—మచ్చునకు

ధనమా పోవును మానమా చెడును నిందా నెత్తిపైకెక్కు లో
ననుమానింతురు తల్లి దండ్రులు కులంబా వన్నెకుందగ్గు నూ
తన మాంద్యమ్ము ఘటిల్లు బందుగులు పంతంబొప్ప నిందింతురో
మనమా వద్దిక నాదు మాట వినుమా మర్యాద కాపాడుమా

ముసు లీలాశుక కాళిదాసకవిరాణ్ముఖ్యుల్ ధన స్త్రీలతో
డను గ్రీడింపరె దాన వారల ప్రతిష్ఠల్ వోయెనేయంచు నీ
వనఁ దప్పౌ జుమి నక్కయేడ దివిజాధ్యక్షాలయం బేడ నో
మనమా వద్దిక నాదుమాట వినుమా మర్యాద కాపాడుమా

ఇది మనస్సునకు మధుసూదనునకు జరిగిన సంఘర్షణము. వాగ్వాదము, వ్యక్తరూపమున ప్రదర్శింపబడినది. మనస్సు తుపానులు రేపినది. మధుసూదనుడు తట్టుకొనలేకపోయినాడు. "ఆతఁడయ్యదియై యా కంజాక్షి యాతఁడై" కొంతకాలము గడచినది. ఒక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యత చేసినది.

రాజరాజైన నెంతటి రసికుఁడైన
నెంత గారా మొసంగిన నెంత ధన మొ
సంగినను జాటున నొనర్చు దొంగ సంగ
తుల నొనర్పక మానదీ తులజాతి.

అని తలంచి మధుసూదనుడు విరక్తి నొందెను. ఈ విధముగా 'శ్రవణానందము' మొదటినుండి చివరివరకు వినూత్న మార్గమున నతి రమణీయముగా నడిపించినారు తిరుపతికవులు. వారి కావ్యములలో శ్రవణానందమునకున్న ప్రచారము మరే యితర కావ్యములకు లేదనియే చెప్పవలయును. ఇందలి భాషా సౌలభ్యము ఈ కావ్యమున కొక వన్నెయు మాయని మెరుగును తెచ్చిపెట్టినది.

బూతుల బుంగ, ముండల మురాకోరు, గాడిదపిల్ల కోమలము, జూటా మాటలు, శ్రీరంగ నీతులు, బెట్టుసరి, మాయలమారి ముండలు, బుట్టపెట్టు, చుక్కెదురు, కైసరు బొజ్జ, బూడిద బుస్స, చచ్చిన చావు, సోలెడు పద్యములు మొదలగు జనసామాన్యము

నందు వాడుకలోనున్న దేశీయములను సందర్భానుసారముగాను, రసానుగుణముగాను పొందుపరచి పద్యములను రచించిరి.

శ్రవణానందమునందు తిరుపతి కవులు వాడినన్ని సామెత లితర కావ్యములం దే కవియు నింతవరకు వాడలేదు. లోకమును మాయను మూకుడున్న దే, నిప్పున కంటునే చదలు, దాసరి తప్పు దండముతో సరి, అందని ద్రాక్షపండు, మాటకు మాట తెగులు నీటికి నాచు తెగులు, రంకొక్కటె నూరు నోములను మెక్కుంజాలు, తిన్నమ్మకు తిన్నంతయుఁ గన్నమ్మకుఁ గన్నయంత, రంకు సాగినఁ బెండిలి యింకేల' గత జలమ్మున కానకట్టలు, కంబళిన్ మెక్కుచు వెండ్రుకల్ వెదుక మేలొను, గతిలేనమ్మకు గంజియే పానకము, వలపుసానికిఁ బలుపు దెబ్బ, దంపినమ్మకు బొక్కినదే కూలి యిత్యాదులు చాల కలవు.

అగ్రహారము లిచ్చి కవులకు శాశ్వత వృత్తులు కల్పింపగల రాజులు తిరుపతి కవుల కాలమునందు లేరు. కవి జనసామాన్యము మీద నాధారపడవలసి వచ్చినది. సంఘములో సంస్కృతాంధ్రము లందలి పాండిత్యము సన్నగిల్లినది. దేశభాషమీద తిరస్కారము పుట్టినది. ఆంగ్లభాషయందు మితిలేని యభిమానము పెరిగినది. తెనుగు సాహిత్యము ప్రచారము చేయవలయుననిన భాష జనుల విజ్ఞానమున కందుబాటులో నుండవలయును. అది గుర్తించినవారు తిరుపతి కవులు. వారికి మారుమూల పదములు వాడి కావ్యమును జటిలముగా చేయుట యిష్టములేని పని. వారు రసప్రియులు. వారు రచించు కావ్యములు సకల మానవులు చదివి రసానుభవమును పొంది యానందింప వలయునని వారి తలంపు.

కావున నీ శ్రవణానందమును వసుచరిత్రాదులవలె శ్లేషాద్య లంకారములచేత మొరటుగా చేయక రసవంతముగ భాషా సౌలభ్య మును కలిగి పరిమితంబులగు నర్థాంతరన్యాస రూపకోప మాలం కారములతో నవనాగరి కాంగనవలె మృదుమనోహర సహజాకృతి కల్పించి, యీ సాంఘిక కావ్యమును సృష్టించిరి. శ్రవణానందము వలె ప్రచారమునకు వచ్చిన కావ్యము తిరుపతి కవుల కావ్యములం

దింకొకటి లేదు. పూర్వకవుల పోకడలను స్వకీయము లొనరించుకొన గల శక్తి తిరుపతి కవుల కున్నది. శ్రవణానందములోని యితివృత్తము నకు బీజము విప్రనారాయణ చరిత్రయం దున్నది.

కవిత్వమునకు శిల్పమునకు ప్రధానాధారము తిక్కనగారి భారతము. కొన్ని పోకడలు పెద్దనగారియం దగుపించును. వారివారి కవిత్వమునందలి యందచందములు జీర్ణించుకొని దేశకాల పాత్రానుగుణములగు సరస పద రచనలను జోడించి సాంఘిక ప్రతిబింబములుగా నుద్గతము గావించిన సృష్టి శ్రవణానందము. ఇటీవలి కాలమునందిట్టి రచన గావించివా రొక రిద్దరుతప్ప కనుపించరు. వారిలో పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావుగా రొకరు. వారి సౌందరనంద మీస్థాయి నందుకొనినది. ఒక్కొక్కప్పుడు మించిన దేమోయనికూడ తోచును.

తిరుపతి కవుల రెండవ సాంఘిక కావ్యము పాణిగృహీత. ఈ కావ్యము పుచ్చా శీతారామయ్యగారి కంకితముగా రచియింపఁ బడినది.

విటులకు బుద్ధివచ్చుగతి వేశ్యలకుం దలవంపుగా విశం
కట పదగుంభనమ్ములనుగాక కడున్ సులభంపు శైలి నొ
క్కటి రచియింపుఁడీ కృతిని

అని కృతిభర్త తిరుపతికవుల నర్థించెను. ఆయన కోరిక కనుగుణముగా నీ కృతిని రచించిరి. కృతిపతి విటలోకగ్రామణి. అంత విద్యావంతుడు కాడు. పాణిగృహీతయందలి యితి వృత్తముకృతిపతికథయే యని ప్రతీతి. కృతిపతి యతని మిత్రులు నితర విటలోకము నీ కృతిని పఠించి బుద్ధి నేర్చుకొనవలయునని య ట్లర్థించి యుండవచ్చును.

విటులగు వారికి విజ్ఞానము తక్కువగా నుండును. కావున భాష సులభముగా నుండవలయును. దానికితోడు కొంత హాస్యము, కొంత శృంగారము జతకూర్పవలయును. అట్లయినఁగాని వారి మనస్సునకు నచ్చదు. అది గుర్తించి తిరుపతికవులు పాణిగృహీత నొక ప్రహసనముగా తయారుచేసిరి. ఇందలి నాయకురాలు జారిణియగు

వేశ్య. శ్రవణానందములోని నాయిక వంటిదికాదు. పేరు జలజాక్షి. నాయకుడు విటుడు. ఉదారు డనువాడు. గానాభినయ ప్రియుడు. ఇందలి ప్రధాన రసము శృంగారాభాసము. హాస్య మంగము.

అగు కావ్యమ్మిది యైననున్ బ్రహసనప్రాయమ్ము ప్రారంభమా
దిగ దీనంబలుచోటులం బొసఁగు నెంతేనిన్ రసాభాస రో
మగువన్ నాయికచేఁత దుర్విటుల నిర్మర్యాద వాక్యమ్ములో
ప్పగ.

కాలముపట్టి దేశమునుగాంచి ప్రభుత్వమునెంచి దేశ భా
షా లలితాంగి మారుటయు సత్కవి సమ్మతమాట నన్యదే
శ్యాలును నాంధ్రభాషఁగల వాటను నొచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటిమి

అని తిరుపతికవులు కృత్యాదియందు పండితుల రాబోవు విమర్శనల నూహించి తాము వాడిన భాషను సమర్థించుకొనుచు సమాధాన ముగా నుడివిరి. నన్నయగారు సూత్రించిన 'ప్రవాహినీ దేశ్యా'యను దానియందు నీ యభిప్రాయ మిమిడి యున్నది. సజీవములైన భాషల కన్నిటికి నీ సాంకర్యము తప్పనిది. తెనుగు భాషయందు కన్నడము అరవము తురకపదము లదివరకే చేరియున్నవి. ఇప్పటి పరిస్థితులను బట్టి యాంగ్ల పదములు సమ్మిళితము లగుచున్నవి.

సనాతన భాషాపండితులు తామెంత మడికట్టుకొని దూర దూరములందు తొలిగిపోయినను వారికయి లోకవ్యావహారికము లాగవు. సంభాషణా సౌలభ్యము కొర కాంగ్లపదములు వాడక తప్పదు. సంఘమునందు వలెనే భాషయందు సంకుచిత భావములు మానవులకు తగవు. కాని యెంతవరకు తెనుగుభాష యాంగ్లభాషా పదముల నంతర్లీనము గావించుకొన గలదో రచయిత గ్రహించు కొనవలయును. పరిమితిని మించినచో భాషకు ద్రోహము చేసిన వాడగును. అంతేకాదు తాను పరిహాసముల పాలగును.

ఏ కలెక్టరుకు లేదింత వర్కును భంగి
నుత్తరమ్ములును బ్రత్యుత్తరములు
ఏ డాక్టరుకును లేదింత యల్లడి యన్న
చందాన నిలుగాచు సారటులును
ఏ జనానాకు లేదీ చందమను భంగి
నూడిగ మ్మొనరించు చేడియలును
ఏ దేవతలకు లే వికాన్కలను రేవ
ఫలపుష్ప ముఖవస్తు పటలములును
దన కోలమ్మునఁ గోడమిన మనుజు నొకనిఁ
గట్టుకొని కాఁపురముసేయు కలికి కెట్లు
గల్గనేర్చును సానియై వలచి వలపు
గలుగఁ జేసెడి కలికి మిన్నలకుఁ దక్క

అని వేశ్యమాత యన్న మాటలను విటుడొక డుదారునితో నుడివెను. ఇందలి కలెక్టరు, వర్కు, డాక్టరు, సారటు, జనానా యిత్యాది పదము లీపద్యమునకు హాస్యరస జీవము పోయుచున్నవి. ఈ పదములు వాడుటచేతనే యీ పద్యము చదువునపుడు నవ్వుపొడమును. ఆ పదముల కే మారు తెనుగు పదములు వాడినను పద్యమునందు చేతనత్వము నశించి రసవిహీనమగును.

ఒక్కొక్కప్పుడు రసపుష్టిని కల్పించి కవితకు వికాసము కూర్పగల శక్తి యాంగ్లాది యన్యదేశీయ పదములకు కలదు. స్థానాస్థానము లెఱిఁగి వాని నుపయోగించుటలో కవి తన తెలివితేట లుపయోగించవలయును. ఏ యాంగ్లపద మెచట నేరీతి వాడిన హాస్యరస మెట్లు లుప్పతిల్లునో తిరుపతి కవులకు తెలియును. ఇవి వాడుకలో నున్న పదములు కావున ప్రయుక్తములైనవి. ఇట్టి వాడుకలో నున్న పదములను నిషేధించుట పెరుగుచున్న తెనుగు భాషాసతి యంగములను ఖండించుట వంటిది.

అన్నా! వైనట బ్రాందియంట విస్కీయం టక్కటా నీకు నీ
విన్నాణం బెటులబ్బెరా ద్విజకులా విఖ్యాతియుం బానమున్

మున్నెచ్చో విన లేదు నీదు తలనే మున్నెన్ మహా పాపము
చ్ఛిన్నంబయ్యెఁ గులమ్ము నీకతన ఛీ! ఛీ! గోత్రవిధ్వంసకా!

అని తల్లి యుదారుని చీవాట్లు పెట్టినది. ఈ రెండు పద్యములు తిరుపతి కవుల నడిమి వయస్సునందలి యాంధ్ర దేశ స్థితిని ప్రతిబింబింప చేయు నిగ్గుటద్దములు. ధనికులు నున్నతోద్యోగులు సనాతన ధర్మము లకు స్వస్తిచెప్పి త్రాగుడుకు వేశ్యాలోలత్వమున కలవాటుపడిరి. అది యొక నవనాగరికతా ముద్రయను విశ్వాసము చెలరేగినది. ధనికులు తమ యర్థ ప్రాణములను పడుపుకత్తెల పరము చేయుచువచ్చిరి. కావుననే వేశ్యలు మహాభోగము లనుభవించుచు కలెక్టరులను డాక్టరులను జమీన్దారులనుగూడ మించియుండిరి.

ఏ సంసార స్త్రీ యా సుఖానుభవములను బొందగలదు? భర్తల దుశ్చేష్టితములకు భార్యలు కన్నీరు కార్చిరి. ఉత్తమోత్త మములైన యాహితాగ్ని కుటుంబములలోని వారు సహిత మీ దురభ్యాసములకు లోనయిరి. ఈ పరివర్తనము తిరుపతి కవులు

ముక్తికామినితోడ ముచ్చటించిరి గాని
వెల వెలందులఁ గాంచి పలుకరైరి
యుపనిషత్కాంతల నుంచుకొనిరి గాని
పడపుఁతొత్తుల యాసఁ బాఱరైరి
సాహితీ సతితోడ సరస మాడిరి గాని
కులహీనలను జేరఁ దలఁపరైరి
కీర్తి భామినులకు మూర్తి నిచ్చిరి గాని
గుత్తలంజల పొందు కోరరైరి

తరతరమ్ముల నుండి యిందనుక మీ కొ
లమ్మువారలు నేటికీ లలన కతనఁ
గొలమునకు నీకు నిహ పరమ్ములకు నొక్క
పెట్టఁ జెడఁ దగినంత యిక్కట్టు వచ్చె

అనుచు నీ పద్యమునందు సూచించిరి. ఈ మార్పు ఒక బ్రాహ్మణు

లందు కాదు దేశమునం దంతటను కలిగిన మార్పే. తిరుపతి కవులు పూర్వ దేశసదాచార సంపత్తి ఆధునికావినీతి ప్రవర్తనము సుందరముగా జోడించి చిత్రించిరి. ఇది యుదారున కాప్తవర్గములోనివాడు బోధించినది. పురుషులు వేశ్యాలోలులయి యుండ వారి భార్యలూరుకొందురా?

వంటబ్రాహ్మణులతోఁగాని బట్ట లుతుకు
వానితోఁగాని బంట్రోతు వానితోడ
గాని లోకమ్ముతోఁ బాటుగా నొకింత
కులికితినొ యెందు కింత మీ కులికి పాటు.

అన్నది జలజాక్షి యుదారునితో. ఇది గొప్ప యింటివారి వర్తన. ఆ సంగతి యట్లుండనిండు. విటు డను వాసన సోకినంతనె ఈగలవలె తార్పుడుగాండ్రు చుట్టు మూగుచుందురు. ఉదారుడు కార్యాంతరాసక్తుడయి చెన్న పట్టణమున కరిగెను. అచట నాటకత్తెలను నరయుచుండెను. జలజాక్షి యుదారుని చూచినది. తనకు చిరకాలమునుండి యంటుకాడైన యొక విటుని యుదారునకు దన్ను గూర్పపంపినది. అత డుదారుని గలిసికొనెను.

బిబ్బోకవతి గబ్బి గుబ్బదోయిని జూచి
మతిమాలి బతిమాలు యతియు రతికి
నుడు రాజముఖి కంటఁబడి దాని జడఁ జూడ
జడదారి పెడదారిఁ జనఁగఁ దివురుఁ
గన్నె మిన్న బెడంగుఁ గన్ను సన్నలు గన్నఁ
గన్నవాఁడును దాల్మి సున్నఁ జేయుఁ
గల్కి ముద్దులు గుల్కు చిల్కపల్కుల కుల్కి
పల్కరింపఁగఁ జూచుఁ గల్కియైన
నొంటి పాటునఁ జెలి కడ నుండె నేనిఁ
దత్తరంబున వేదాంతి మెత్తపడును
జెలి శరీరమ్ము నొకపరి చే స్పృశింపఁ
బుంస్త్వ మొదవింపఁజేయు నపుంసకునకు.

ఈ రకపు వర్ణన తిరుపతి కవులకు వెన్నతోఁ బెట్టిన విద్య.

బాల్యమును మొట్టి మెడఁ బట్టి బైటఁ గొట్టె
యౌవనము రా భయమ్మున ననఁగ జెలికిఁ
జనులు చంకలఁ దూరెను గనులు చెవుల
దూఱె నడు మెట కేగెనో తోఁచ దహహా!

ఎంత నవ్వు పుట్టించునట్టి సరసమైన కల్పన! ఆ భయమెందు లకో పాఠకు లూహించుకొనగలరు. ఇట్లు జలజాక్షి యందమును వర్ణించి తన నేర్పరితనముచేత నుదారున కామె యందు మోహాము పుట్టించినాడు విటుడు. ఉదారు డామెను దనకు గూర్చుమని యా విటుని వేడుకొనెను. అతడు సరేయని వెడలిపోయెను. ఇది యంతయు విన్న యింకొక విటుడు జలజాక్షిని విమర్శించుచు,

ఒరిగిన చనుఁగవ గలిగిన
తరుణిం గవకూడు కన్నఁ దఱచై కడుఁ గ్రి
క్కిరిసిన చనుఁగవఁ గలిగిన
తరుణుల పదతాడనము శత గుణము మెఱుఁగా.

మారు మనువు దానిఁ జేరఁగఁ దీసిన
మొదటి మగని సోదె మొదలు పెట్టు
నన్న రీతి నిది రసాభాస మందును
నెక్కు డనుచు మీర లెఱుఁగ వలయు

అని మనస్సు మరలింప చూచెను. ఏమయిన నేమి నాయికా నాయ కులకు సమాగమము కుదిరినది. తరువాత ఉదారుడు తన గ్రామమున కరిగెను. కొన్ని దినములు గడచినవి. జలజాక్షి యుదారుని గ్రామము నకు వచ్చి కబురంపినది. ఉదారు డామెతో కొంతకాలము రహస్యము గాను కొంతకాలము తెగించి బహిరంగముగాను గడిపినాడు. ఆమె కొరకు చాల ధనము వెచ్చించి యప్పులపా లయినాడు. ఎంత ప్రేమించి పెద్దగ చూచినను వేశ్య తన స్వభావము మానదు.

ఎంత ధనంబొసంగినను నెన్ని నగల్ మెయినిండ వైచినన్
గాంతుఁడొకండు వేఱొకఁడు గావలె నిష్టుఁడు రో వెలందికిన్

అభినయ మటంచునో గాన మనియొ వైద్య
మనియొ మఱి యెద్దియో మిష యనువు పఱచి
తనకుఁ బ్రియుఁడగు వాని నంతఃపురమున
కశ్రమంబున రప్పింతు రబ్జముఖులు.

కొందఱు వెట్టులయ్యెడలఁ గొండొకమానిసి ద్వారమందుఁ గా
పుం దగ జీతమిచ్చి యిడి పోదురు వాని కొకింత యిచ్చినన్
జందన గంధికిన్ విటునిఁ జయ్యన వాఁడొనఁ గూర్చు గొన్ని చో
ట్లం దగ వాఁడె యా విటుఁడు లంజల నైజము లెన్న నేటికిన్.

అంతే కాదు 'నాథుఁడు శయ్యనుండఁగా నింకొకని నచ్చుట నే రతి దేల్చె నిద్ర వో డమ్మహితుండు దీపమును నారదు' అని దృష్టాంతము చూపినది జలజాక్షి తన పూర్వ విటునకు. అదియే జరిగిన దీ కథయందు. తిరుపతి కవులు లోకజ్ఞులు. చక్కగా చిత్రించి నారు వేశ్యల స్వభావమును జలజాక్షి, యుదారున కాశ్రితుడైన యొక కవి మీద మోజుపడినది. ఆ సంగతి యుదారునకు తెలిసి జలజాక్షిని పరిత్యజించెను. జలజాక్షి యుదారుని పాదములపై బడి వేడినది. అతడు

రొక్కము లేక కాదు నిను రోసియుఁగాదు మరొక్క లేమకున్
దక్కియుఁగాదు చెప్పెద యథార్థపు సంగతి చిత్తశాంతిలోఁ
గుక్కలరీతి నొక్క వెల కోమలికై పలుమంది చేరినన్
జిక్కు లనేకముల్ గలుగు ఛీ యనిపించు విరక్తి చెందితిన్.

అని సమాధానము చెప్పెను. పాణిగృహీత పేరెత్తిన చాలు నా రోజులలో నీ పద్యము ప్రతివాని నోటినుండి వెలువడినది. 'లోకుల నాలుకలనే యాకులుగా చేసికొనిన తిరుపతి కవుల గ్రంథ ములలో పాణిగృహీత యొకటి. జలజాక్షి యుదారుని వియోగము

భరింపలేక విషము త్రాగి మరణించినది. 'మంగళాదీని మంగళ మధ్యాని మంగళాం తాని చ' అని లాక్షణికుల మతము. తెనుగునం దశుభాంతములైన కావ్యము లింతకు పూర్వము లేవు. పాణి గృహీతయే మొదటి కావ్యము. తరువాతవారికిది దారి చూపినది. తిరుపతి వేంకట కవులు ఈ విషయమున నాంగ్లేయ కావ్యముల సాంప్రదాయముల ననుకరించి తెనుగు వాఙ్మయ లోకమున కొక క్రొత్తతనము నాపాదించిరి. ఈ క్రొత్తతనము పాశ్చాత్య భాషా వేత్తల నాకర్షించి పాణిగృహీత జనసామాన్యమునం దధిక ప్రచార మునకు వచ్చినది. ఈ మహాకవులు లాక్షణికుల కట్టుబాట్లను సమ యము వచ్చినప్పుడు త్రెంచి స్వేచ్ఛగా గ్రంథములు రచించిరి.

పాణిగృహీత యొక విధముగా విమర్శన గ్రంథము అని చెప్ప వచ్చును. ఇం దనేక సాంఘిక వాఙ్మయ విషయములు చర్చించి విమర్శింప బడినవి. ఈ విమర్శలనన్నియు తిరుపతి కవులు నా యా పాత్రల ద్వారమున సమయోచితముగా ప్రదర్శించిరి. జలజాక్షి కైత నభ్యసింప నెంచినది. ఆ సంగతి నుదారునితో చెప్పినది. ఉదారుడు

ఇప్పటి కైత గాంగ్రహహా యింగిలిపీ సొక యింత నేర్చి పైఁ
జెప్పెద రాంధ్రపుం గయిత నీ! యవి పండితు లాదరింతురే
తప్పుల కుప్ప లక్కృతులు తంపట పెట్టుట కేని నెవ్వరే
నొప్పిరె

అని వచించెను. ఇది సత్యము. ఆనాటి కవులందు నీనాటి కవు లందు నిట్టివారు పెక్కుమంది కలరు. వారు వాఙ్మయ సృష్టికర్తలని ప్రశంసించుచు వ్యాసములు వ్రాయు భాషావేత్తల మనుకొను విమర్శ కులు కూడ పెక్కుమంది కలరు. వారి వ్యాసములు ప్రకటించు పత్రి కలు కలవు. అందువలన తెనుగు సాహిత్య మధోగతి పాలగుచున్నది. వచన కవులను సూచించుచు

కాల మహిమమ్ముగాని యే కాలమందు
వచనము రచించువారు కవనమునందుఁ

బేరు గాంచిరి యెంతటి పేదతనము
వచ్చెఁ గవితా లతాంగి కవ్వారి కతన

అని నవలా రచయితలను విమర్శించెను. ఇంక జలజాక్షి

'ముది విటుల విధవ లంజెలు
పదకవిత లటంచు'
'ద్విపద కావ్యంబు ముది లంజె దిడ్డిగంత'

అనియు పదకవితను ద్విపదకావ్యములను విమర్శించినది. ఇట్టి వాఙ్మయ విమర్శనలు వారి సంభాషణలందు చాల కలవు. తిరుపతి కవులు స్వయముగా కృత్యాదియందు పీఠికలో నప్పకవిని గురించి 23 మొదలు 31 పద్యముల వరకు విమర్శించిరి. ఇంక సంఘ దురాచారములను ప్రకటించుచు నుదారుడు

బ్రాహ్మణుఁడై పుట్టి పరమ చండాలితో
సంసారియైన విశ్వాసి యొకఁడు
ముగుర మున్ జంపిన ముండమోపిని గట్టు
కొని గృహస్థయిన సుగుణుఁ డొకండు
ఐకమత్యమున కియ్యవి ముప్పనుచుఁ గులా
చారముల్ వదలిన జాణ యొకఁడు
పింగాణి చిప్పకు వెండి గిన్నెకు భేద
మున్న దే యనియెడు యోగ్యుఁ డొకఁడు
వీర లేకద సభలలో పెద్ద లిపుడు

అని సంఘ పరిస్థితులను నెత్తి చూపెను. జలజాక్షి

పెద్ద వృద్ధు తా
నే పసిపాపనో ధనమునిచ్చికొనున్, గనునంత మృత్యువా
పాపిని మమ్ముబోటుల నపారముగాఁ గని యిట్లొనర్చెడిన్.

అని వృద్ధ వివాహములు వాని ఫలితములను గురించియు, అతి బాల్యవివాహములు విధవావివాహములను గురించియు విమర్శించినది. స్త్రీకి స్వాతంత్ర్యము పనికిరా దనుచు కవులు

స్త్రీకి స్వాతంత్ర్య ముండుట చెల్ల దనుచుఁ
జెప్పు మను వంత వెఱ్ఱియే? చెడి కొలమ్ము
నెల్ల గంగను గల్పదే? యెఱుఁగ నేర
కూరకయ శాస్త్రకర్తల' మీఁర నగునె.

అని దృష్టాంతములతో నిరూపించిరి. పాణిగృహీత నాలు గై దాశ్వా సములందు తిరుపతి కవు లిట్టి సాంఘిక విషయము లనేకములు చర్చించిరి.

కవి యొక ప్రవక్త. తాను సంఘమునం దొకడయి యుండి సంఘపరిస్థితులను నిశిత దృష్టితో పరిశీలించుచు నైతికముగా గాని రాజకీయముగా గాని సంఘము అధఃపతనము చెందుచున్నప్పుడు తన లేఖినికి పని కల్పించును. తన కవితా సామర్థ్యముచేత మానసిక పరివర్తనము కలిగించి సంఘమును తప్పుదారినుండి మరలించును. కవి లేఖిని రాజు కత్తికంటె నిశితమైనది. అది హృదయ సంచలనము కలిగించి మానవునందు సుస్థిరమగు మార్పును కలిగించును. తిరుపతి కవులనాటి సంఘ మిటువంటి కావ్యముల కొరకు కలలను గన్నది. తిరుపతి కవు లది తీర్ప గలిగిరి. ఆ కాలపు కవుల కీ యూహాశక్తి లేకపోయినది.

ఆంగ్లేయభాషా సాంప్రదాయములకు నుఱ్ఱూతలూగి గుటకలు మ్రింగుచున్న నవనాగరిక మానవ లోకమునకు శ్రవణానందము, పాణిగృహీత లమృత ధారలయి పిపాస తీర్చినవి. తెలుగు దేశమునం దీ రెండు కృతులు నింటింట వెలసి కృతికర్తలకు తరగని కీర్తి తెచ్చినవి. పాణిగృహీతయందలి పాత్రలన్నియు దాదాపు విటీ విటులు. సత్సంప్రదాయమునుబట్టి విటీ విటులు నీచపాత్రలు. తిరుపతి కవు లౌచితికి భంగము రాకుండ ఆ యా పాత్రల కుచితమగు భాషను వాడిరి, "కవిత యన్నపు డెవరి వాగ్రచన యెట్లో దాని కనుకృతి చేయుటే తగిన ఫణితి" అని కృతికర్తలు మొదటనే నుడివిరి. దీనికి శ్రీనాథుడు మాయా కిరాతుని నోట పలికించిన "రండాసుత" యే తార్కాణము.

౪

# పౌరాణిక కావ్యములు

తిరుపతి కవులు శ్రవణానందము పాణిగృహీతలవంటి కల్పిత కావ్యములను రచించి మానవ లోకమునకు నీతిని బోధించుటయె కాక పౌరాణిక ప్రబంధములనుగూడ వ్రాసిరి. వారన్నిట సమర్థులు. సాహితీ సరస్వతి వారి జిహ్వాగ్రమునం దుండి వివిధ రూపము లగు నాట్యభంగిమలు ప్రదర్శించినది. శతావధానాష్టావధానములం దప్రతిమాన మేధాసంపత్తి ప్రకటించిరి. దెనుగు వారల వినతులు, వినుతులు పడయ గలిగిరి. ఆశువుగా "ఒక్కొక్క రొక్కొక్క రోజున కొక్కొక్క ప్రబంధము సేయనేర్తురు".

తాటికొండ సంస్థానాధిపతులగు రామరెడ్డిగారు తిరుపతి వేంకట కవులకు చిరపరిచితులు. "ఆశుగ మాకు లక్షణాపరిణయమున్ రచింపవలెఁ బండిత మండలి కింపుగావలెన్" అని కోరిరి. శ్రీ వేంకట శాస్త్రిగారు వారి యభిమతమున కనుగుణముగా రామిరెడ్డిగారిని కృతిపతిగా చేసి 'లక్షణా పరిణయము' చెప్పిరి. ఇది మొత్తముమీద మూడువందల యరువది పద్యములు గల మూడాశ్వాసముల చిరుత కావ్యము. దీనికి మూలము భాగవతము లోని

అమరులఁ బారఁ దోలి భుజగాంతకుఁడైన ఖగేశ్వరుండు ము
న్నమృతము దెచ్చుకైవడి మదాంధుల రాజుల నుక్కడంచి యా
కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్
సమద మృగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్

అను పద్యము. దీనికి గొన్ని చిలవలు పలవలు కల్పించి యీ కావ్యమును సానపట్టిన జాతిరత్నమువలె తయారుచేసిరి. శ్రవణానందము పాణిగృహీతల కృతి భర్తలవలె కాక లక్షణా పరిణయ కృతిభర్త "పండిత మండలి కింపుగావలెన్" అని యర్థించెను. పండితులు శబ్దార్థా లంకార ప్రియులు. వారి యూహ లున్నతపథమున సంచారము

చేయుచుండును. వాని కనుగుణములగు పద్ధతులతో నీ కావ్యము నడిపింప బడినది.

ఇందు వెనుకటి రెండుకావ్యములందువలె కథ పురవర్ణనతో నారంభింపక ఆశీర్న మస్క్రియా వస్తునిర్దేశములందు వస్తునిర్దేశమైన మద్రదేశాధిపుడగు బృహత్సేనుని వర్ణనతో, తిరుపతికవులారంభించిరి. ఇట్టి యాచారము తెనుగు కావ్యములందు నూతనమైనను "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా" "నిపీయ యస్య క్షితిరక్షిణః కథాః" అనియు నారంభించిన కుమారసంభవ నైషధాది సంస్కృత కావ్యములందు అధికముగా కనిపించును. బృహత్సేనునకు లక్షణ యను కుమార్తె కలదు. ఆమె పెరిగి పెద్దదయినది. "కంతునకు కాపురం బయ్యె నింతి మేను" ఆమె యౌవన సౌభాగ్యమిట్లు వర్ణింపఁబడినది.

జాఱు ముడివైవఁ గటిపైఁ బచారుఁ సేయు
జడ ఘటించిన మడమలఁ దొడరి యాడుఁ
గొప్పు వెట్టినఁ దలకన్నఁ గొప్ప గాంచుఁ
జొల్లెమిడు టొప్పదే యట్టి సుదతి కురులు

లక్షణ శిరోజములు సుదీర్ఘములయి యొత్తు గలిగి యున్నవని యీ పద్యమునందు వర్ణితము లైనవి.

పరి వేషమ్ములుగట్టి పూగ శకలప్రాయంబులై యంత బం
గరు గోలీల నతిక్రమించి లికుచాకారమ్ములై పిమ్మటన్
సరసీజమ్ముల మీరి గట్టిపడి విన్నాణంపు బల్కుప్పలై
పరిమాణింప నశక్యమైయెసఁగె న ప్పద్మాక్షి వక్షోజముల్

ఇంత మనోహరముగా నొక్క వ్యర్థపదము రానీయకుండ స్వభావ సిద్ధముగా నే కవియు తన కావ్యమునందిట్లు వర్ణింపలేదు. ఆ చందోయి పెరిగి పెద్దదయి గట్టిపడిన క్రమము చూచినట్లే కవులు వర్ణించిరి. ఈ పద్యమొక్కటియే వారి యూహాశక్తి యనన్యకవి సాధారణ మని వేనోళ్ళ చాటుచున్నది. రవి కాననిచోనైనను కవి గాంచును. ఇట్టి వర్ణనలు చేయుటకు కవియందు లోకాతీతమగు

ప్రతిభ యుండవలయును. అది తిరుపతి కవులందు మిక్కుటముగా కనిపించును.

వసంతకాలము వచ్చినది. అట్టి సమయమున బృహత్సేనుండు పండిత మండలిని సత్కరించుచు పూఁదోటలోని యొక "వట్టివేళ్ళ రుచి నెసంగిన" చప్పరమున కూర్చుండెను. అట్టి సమయమున

కాషాయ వస్త్రమ్ము కటి తటమ్మునఁ గ్రాలఁ
గాయమంతయు భూతి కడలు కొనఁగఁ
త్రిదశాపగామృత్తు నుదుటిపైఁ జెలువార
మ స్తకమ్మున జటామకుట మొలయ
దండ కమండలు ద్వయము కేల నెసంగఁ
బాదమ్ములందుఁ బావాలు దనరఁ
జేరురమ్మునఁ బద్మబీజమాల యెలర్ప
వీణియ భుజముపై రాణ నింప

నంబరమునుండి కృష్ణ కృష్ణా యటంచు
సరస సంగీత భంగీత సంగతులను
బాడి యాడుచు నానంద భరితుఁ డగుచు
వచ్చె నారదుఁ డా నృపవరుని కడకు

విభూతి శివుని చిహ్నము. పద్మబీజమాల విష్ణుచిహ్నము. హరి హరుల యందలి నిరంతరభక్తి సమ్మేళనము నారదమూర్తిగా వర్ణింపఁబడినది. ఈ నారదు డద్వైత మతానుయాయి. కవు లద్వైతులు. కవుల సంప్రదాయముల కనుగుణముగా నారదుని రూపము మారుచుండుట కావ్యములందు కనిపించును. 'కృష్ణ కృష్ణాయటంచు సరస సంగీత భంగీత సంగతులను బాడి' యాడుట భావికథా సూచకము. ఇన్ని యభిప్రాయములతో నీ వర్ణన చేయఁబడినది. సీసమునందే యర్ధపాదమున కా యర్ధపాదము ఖండించుట శ్రీనాథుని సీస పద్య రచనలలో నొక తీరు. అది తిరుపతికవు లిం దనుకరించిరి. రాజు నెదుట నారదుడు 'రసముట్టిపడన్ జలజనయను'ని

అలినీలాలక భీష్మకన్య తొడపై నానందముం దెల్ప లీ
లలు చెన్నారఁగ సత్యభామ మధురాలాపంబులం దేల్ప ని
చ్చలు పైపెచ్చుగ నా సుదంతి విడెముం జానొప్పనందీయ మె
చ్చులకున్ మెచ్చులొసంగు నీవిహృతికి న్జోహారు జోడించెదన్

కోకల్ చంకనుబెట్టి గూఢగతిఁ దళ్కుంగొల్ల యిల్లాండ్ర బల్
వీఁకన్ వంచనచేసి పొన్నపయికిన్ వేంచేసి కూర్చుండి త
ద్రాకాపూర్ణ నిశాకరాననల మర్మంబుల్ విలోకించు 'నీ
జోకల్ లోకము మెచ్చుపోక' లనుచున్ జోడించి కేల్మోడ్చెదన్

అని నుతించెను. ఈ పద్యములందు రసముట్టిపడుచున్నది. నారదుడు నిజముగా నిట్లు నుతించెనో లేదోగాని తిరుపతికవులు నిమీలిత విలోచనులయి యా పరమాత్ముని భక్తి పరవశమున మనసునందు నిలుపుకొని వినుతించిరేమో యనిపించును. ఈ యనన్యసామాన్యమగు భక్తి తత్పరత పోతనగారియందు మాత్రమే కాన్పించును.

రెండు పద్యములందు రెండు చిత్రరూపములు ఈ పద్యములు చదువునప్పుడు కనిపించును. ఏ రసమునందు ప్రవేశించినను వారి వాణి హృదయంగమముగా నర్తించును, నారదుని యా స్తవములను విన్నది లక్షణ. ఆమెకు కృష్ణునియందు వలపు నిలిచినది. బృహత్సేనుడు త్రిలోక సంచారియు త్రికాలజ్ఞుడునగు నారదుని “మా పిల్లకు తగిన వరుని దెల్పు” డని యడిగెను. నారదుడు శ్రీకృష్ణుండు తగిన వరుండని తెల్పెను. “త్వత్కుమారికా రీతియుఁ జూడ నాతని వరింపఁగ నెంచెడి యట్లఁదోచు” నని వచించెను. “స్వయంవరము చాటింపుము. కన్యకా పరిగ్రహణమునకు మత్స్యయంత్ర విచ్ఛేదనము శుల్కముగా నొనరింపుము. అది శ్రీకృష్ణునకు తప్ప యితరులకు సాధ్యముకాదు” అని యుపాయముగూడ చెప్పెను. ఈ నారదాగమన వృత్తాంతము కాళిదాసు కుమారసంభవములోని సంగతిని జ్ఞాపకమునకు తెచ్చును. ఇది ప్రథమాశ్వాసము

ద్వితీయాశ్వాసము సాయంకాలపు వర్ణనతో నారంభమైనది.

పశ్చిమాచలమునఁ గాంతి పరిఘవిల్లెఁ
గాని తూరుపుఁ గొండ రిక్త దశ నందె
నొకఁడు చెడిపోవు పైఁగాని యొకఁడు బాగు
పడుట లేదని జనులాడు పలుకు నిజము

వెల వెలఁబొతెఁ దూర్పుదెస వేవిళు లొప్పినమీద గర్భిణీ
లలన మొగంబువోలె

ఎంత చక్కని భావము ఈ పద్యపాదమునందిమిడ్చిరో తిరుపతి కవులు పాఠకు లూహించుకొనగలరు. ఇందలి యుపమానముచేత కొలది సేపటిలో ప్రసవింపనున్న చంద్రుని తన గర్భమునందు తూర్పు దిశాంగన తాల్చియుండె నని వ్యంగ్యముగా చెప్పఁబడినది. అందుకనియే యీ వెలవెలపోవుట. ఇది యలంకారకృత వస్తుధ్వని. కాబోవు చంద్రోదయము సూచించబడినది. ఆశుకవితయం దిట్టి వ్యంగ్యసహితమైన కవిత చెప్పుట కెవరికి సాధ్యమగును? ఇట్టి వర్ణనలు పండితుల మెప్పు పొందకేమగును.

చంద్రుడుదయించి విజృంభించెను. లక్షణకు మన్మథ పరితాపము మితిమీరినది. పూర్వకవుల ప్రబంధములందు వలెనే మన్మథాది దూషణలు సాగినవి.

రాజీవంబ! యటంచు వైచెదవు తద్రాజీవమున్ జీవమా!
రా జాగేలయటంచు జీవమును గ్రూరంబై వెలింజేయు నో
రాజీవాస్త్ర! భవద్వినోదములు మార్గాలంపు సయ్యాటలై
రాజీవాక్షుల నేచుచున్న విది ధర్మం బౌనె నీ బోటికిన్

ఈ పద్యమునందు రాజీవ శబ్దమును రా జీవంబ, జీవమా రా, యనియు పదమును విరిచియు నక్షరమును మార్చియు రచనలో చమత్కారమును చూపిరి. మోహము తలమున్కలైనది. లక్షణ మూర్ఛిల్లినది. చెలులు శీతలోపచారములు గావించిరి. ఆమె తేరు కొనినది. పంజరములోని చిలుక యామె స్థితికి జాలికొనినది. శ్రీకృష్ణునితో లక్షణ వలపు సంగతి యెరింగించి వత్తునని బయలు దేరినది. లక్షణ

రమ్మనుమీ, సై పుట భా
రమ్మనుమీ, విరహా మతి భరమ్మనుమీ, వా
రమ్మనుమీ వ్యవధి, సుదూ
రమ్మనుమీ పురి స్వయంవరమ్మనుమి తగన్

అనుమాన మేల నిక్కము
నిను మాన నటంచుఁ బలికె నెలతుక పేర్మిం
జనుమాన మొసఁగు మనుమా
చనుమా, కనుమా, కృపాను సారిన్ శౌరీ

అని కబురంపినది. ఈ పద్యములందు తిరుపతికవు లీశబ్దాలంకారములను వాడుటచేత లక్షణ మనస్సులోని యావేగము భరింపరాని మోహావేశమువలని యనుభవించుచున్న పరితాపము చదువరులకు గోచరించుటయేకాక యామె దీనాననముతోడి రూపముకూడ కనుల కగుపించును. అది యా శబ్దముల పొందికలో నున్నది.

"కురువృద్ధుల్ గురు వృద్ధబాంధవు లనేకుల్" అను నన్నయగారి పద్యము చదువుచున్నప్పుడు కౌరవుల జూదపు గొల్వులోన విలయమూర్తియయి విజృంభించిన భీముని భయంకరాకారము కనులముందు తోచునటుల గావించెను. నన్నయ తిక్కన వలె రూపకల్పనము చేయడు. శబ్దములద్వారా యర్థమును స్ఫురింపచేసి తన్మూలమున రూపచిత్రమును మానస దర్పణమున ప్రతిబింబింప చేయును. అది యెవరియందు లేని యపూర్వశక్తి. అట్టి శక్తి నన్నయ కొక్కనికే కలదు.

ఆ ప్రతిభ తిరుపతికవులందీ పద్యములలో కనిపించుచున్నది. "అనుమా, చనుమా, కనుమా, కృపానుసారిన్" అనుచు కీరమును తొందరచేసి తరిమినదేమోకూడ. కవి భావానుగుణమగు వృత్తమును పదజాలము నెన్నుకొనుటలో నేర్పుకలదు. పైన, ఆ కంద పద్యములందా శబ్దాలంకార సహితములగు పదముల నా పొందికగా సమకూర్చుటచేత నా యందము రసస్ఫూర్తి కలిగినది. వృత్తముల

నెన్నుకొనుటలో తిరుపతి కవులు సిద్ధహస్తులు. ఇట్టి పోకడలు భాగవతమునందు పెక్కు గలవు.

కొమ్మా! దానవనాథుని
కొమ్మా హావమునకుఁ దొలఁగె గురు విజయము గై
కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ
గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్

కాని యొండొంటితో పొందిక కల్గు శబ్దార్థశక్తుల సమ్మేళనముచేత రూప చిత్రమును స్ఫురింపజేయగల సామర్థ్యము పోతన యందు లేదు. చిలుకలు రాయంచలు రాయబారములు నడుపుట ప్రాత పురాణములే.

నల దమయంతుల మధ్య మరాళము రాయబారము నడిపినది. రాధా మాధవ కావ్యమునందు చిలుక రాయబారము చేసినది. ఆ పద్ధతినే తిరుపతికవు లీకావ్యమునం దనుకరించిరి. "అల్లనాడు దమయంతికి న్నలుతోడ నేస్తముఁ గలపదె యొక యంచ, కనంగా నివి క్రొత్తలే" యన్నది చిలుక. ఈ విషయము నిజముగా క్రొత్తది కాదు. రాయబారము ఫలించినది. శ్రీకృష్ణుడు లక్షణను పరిణయమైనాడు. ఇంతటితో కథ ముగిసినది. అప్పటికి కావ్యము చిన్నదిగా నున్నదను కారణముననో యేమొ తిరుపతి కవులు కథనింక కొంత పెంచిరి.

ప్రౌఢయగు రాధతోడి సమాగమమున గడితేరిన కృష్ణునకు నవోఢయు ముగ్ధయు నగు లక్షణతోడి సాంగత్య మంత రంజింప చేయలేదో లేక రాధమీది యనురాగ మట్టిదో కాని రాధమీద మనస్సు పారినది. ఆమెతోడి ఏకాంత క్రీడలు తలంపునకు వచ్చినవి.

అర్ధక్షణం బేని యంతరాయము లేని
వింత వింతల కౌఁగిలింతలార
తమి యెఱుంగక పొంగు తమకమ్మున నెసంగు
హద్దు పద్దులు లేని ముద్దులార

తడబాటు తరి డాసి యొడలు సీరుగఁ జేసి
పొగరు చూపెడు గుబ్బ పోటులార
లేని తప్పులు చుట్టి పోని కూరిమి బట్టి
రవరవఁ దగు చపేటమ్ములార

తియ్య తియ్యని కెమ్మోవి తేనెలార
నిరుపమానంపు దొంతర నిద్రలార
తమి నెఱుంగని పురుషాయితమ్ములార
రాధికా కృష్ణులను విడరాదుసుండు

అని కలవరించినాడు కృష్ణుడు. తిరుపతి వేంకటకవు లమిత రసిక శేఖరులు. ఒకరిని మించినవా రింకొకరు. అందులో వేంకట శాస్త్రిగారి యనుభవము చెప్పవలసిన పని లేదు. శ్రవణానంద కావ్యములో కథానాయకు డని లోక ప్రతీతి. కావుననే ఇట్టి పద్యము వ్రాయగలిగిరి. ''పొందగావలె మహాభోగములను'' అన్నారు మహా కవులు. స్వానుభవమున్న గాని రసవంతమగు కవిత్వము రాజాలదు. అది తెలియనివారు కవులకు వ్యభిచార దోషము అంటకట్టి నిందింతురు. అది పొరపాటు.

శృంగారీ చేత్కవిః కావ్యం జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగ శ్చేన్నీరసం సర్వ మేవతత్

అని లాక్షణికులు. అక్కడ ద్వారకయందు రాధ ''దయా విహీను నెటుకూడితి నేనని మాటి మాటికిన్'' నింద యొనర్చినది కృష్ణుని.

రతియన నెట్టిదో యెఱుఁగరాని తనున్ మదనాగమాంత పం
డితునిగఁ జేయు టెల్లనొక నీరజనేత్రకు నొప్పఁజెప్ప నం
చితఁడు మతిందలంచెనొ? దయాళునిగా మదినమ్మితిం గృత
ఘ్నత లెఱుఁగంగవచ్చునె కనంబడునంతటిదాక నేరికిన్

'ప్పకొనంగ నా పయటగాని మఱొక్కటి నొల్లఁ డెవ్వ రేఁ
జెప్పినమాట నా కెఱుక చేయక నిద్దురవోఁ డొకప్పుడున్

గప్పురపీడె మొక్కఁడయి కైకొనఁడా మురిపెమ్ములన్నియుం
దప్పెనొ? యెల్ల కాలమొక త్రాటను బోదురె జారపూరుషుల్
వల్లభునొల్ల కన్యయము వానికి లోఁగక లోకులాడు నా
యల్లరిమాట లోర్చుకొని యన్నిటికిం దెగ తెంపుచేసి యీ
కల్లరి సౌఖ్యమే సతముగాఁ దలపోసి పరున్వరించు నా
హల్లకపాణికిం జెడుటయబ్రమె పుణ్యము పూరుషార్థమున్

అని లోలోన పరితపించినది. ఈ పద్యభావము లన్నియు పారిజాతాపహరణాది కావ్యము లందలివే శ్రీకృష్ణుఁ డింటికి వచ్చెను. రాధను చూడబోయెను. ఆమె యలుక తీర్చెను. ఇరువురకు సంధి కుదిరినది. వియోగానంతర సంయోగము. ఆ ముచ్చటలు చెప్పవలయునా?

లక్షణ నీరీతి లాలన చేయుదే
యన మంచిదానవే యనియె శౌరి
యీ బోటిపై మనం బతికెనే యీ రీతి
నన లేదు లేదు లేదనియె శౌరి
యీ యింతి కీ వింత లన్నియు నేర్పితే
యన వెఱ్ఱివాఁడనే యనియె శౌరి
యీనాంతి కీ ప్రీతి యమరెనే నీమీఁద
నన నించుమించుగా ననియె శౌరి

ఆ లలన యెన్న డేని నన్నడిగెనే య
టన్న నెఱుఁగునో యెఱుఁగదో యనియె శౌరి
చెప్పకుందువె నాతోడ చెప్ప వనిత
నబల! నీ కలయిక సాక్షి యనియె శౌరి.

రాధ యతిప్రౌఢ. ఆమెకు కృష్ణునియందనురాగము. అనుమానము మెండు. ఆమె ప్రశ్నలన్నియు భావగర్భితములు. శ్రీకృష్ణుడు ధూర్తుడు. బహుకాంతా లోలుడు. ఆమె ప్రశ్నలకు తగు

సమాధానములు చతురముగా చెప్పి తప్పించుకొనెను. ఈ ప్రశ్నలు నీ సమాధానము లెంతో శృంగార రసానుభవమున్న వారికి గాని స్ఫురింపవు.

రసానుభవమున్న గాని కవితలో రసస్రుతి కలుగదు. ముద్దు పళని రాధికా సాంత్వనము రచించెను. ఆమె వేశ్య. ఆమె బహిరంగముగా సంభోగ శృంగారము వర్ణించినది. తిరుపతికవు లీ పద్యమునందు సంభోగ శృంగారమును భావగర్భితము చేసిరి. ఈ పద్యము చదువునపుడు నాయికా నాయకల చాటుపనులు స్ఫురించును. ఈ కథాభాగము ఇళను మరిగిన శ్రీకృష్ణుడు తలంపునకు వచ్చిన రాధ కథను బోలియున్నది. అచ టచ్చటి భావము లిందు గలవు. గ్రంథవిస్తరణ భయమున వాని నిందు నుడువలేదు.

తిరుపతి కవులు ప్రధానకథ కీ కథాభాగము చక్కగానతుకు పెట్టిరి. శృంగార రసము ఈ కావ్యమునందు కోటికెక్కినది. ఈ ప్రబంధము పూర్వ ప్రబంధముల దారి నన్నివిధముల ననుసరించి క్రొత్త సీసాయం దెక్కించబడిన ప్రాత ద్రాక్షరసమువలె నున్నది. ఐనను ఇట్టి యాశు ప్రబంధమునం దిటువంటి రసవంతములగు పద్యములు, రచనా చమత్కారములు, నవీన భావములు పొందు పరచి రచించుట యన్యులెవరికి సాధ్యము కాదు.

వీరు రచించిన మఱొక పౌరాణిక కావ్యము ఏలా మాహాత్మ్యము. ఇది 358 పద్యముల చిన్న కావ్యము. దీనిని తిరుపతి శాస్త్రిగారు రచించిరి. పీఠవరము మురాధిపతియగు తోట సర్వారాయుని కిది యంకిత మీయబడినది. ఇందలి కథ సూతుడు శౌనకాది మహామునులకు చెప్పుచున్నటుల ప్రారంభింపబడెను.

కిమ్మీరుడను రాక్షసుడు వేగి దండకారణ్యమునం దొంటి కాలిమీద నిలువబడి శివుని గురించి తపము గావించెను. శివుడు కిమ్మీరునకు సాక్షాత్కరించెను. శివుని రూపము స్వభావసిద్ధముగాను మనోరంజకముగాను చిత్రింపబడినది.

తలమీఁది గంగ కడలి రాచ పసిబిడ్డ
యగు చందురుని ముద్దులాడుచుండఁ
జేతిలోఁ దనరారు జింక కొమ్ములు తూగి
జీరాడు జడలలోఁ జిక్కువడఁగ
బులితోలుపై వ్రేలు పుక్కుదండల చాలు
చిలువరా తలల మణులను నొరయఁ
గందోయిఁ దొరఁగెడు కరుణామృతపు వెల్లి
మిసిమినాఁ దెల్లని మేను మెరయఁ
గొండరాచూలి తనకొక దండకాఁగ
గిబ్బ తత్తడిపై నెక్కి కెలన నడచు
భృంగితోఁ గొన్ని ముచ్చట లెంచికొనుచు
నసుర వ్రేలకుఁ బ్రత్యక్షమయ్యె శివుఁడు.

తిరుపతి కవులు దేనిని సూటిగా గాని, యుపమానముల మూలమునగాని వర్ణించుట వారి స్వభావము కాదు. ఏదో యొక వింత కల్పన గావించి వర్ణిత వస్తు సౌందర్యము నూహించుకొనుటకు పాఠకులకు వదలివేయుదురు. అదే వారిలోనున్న విశేషము. ఇట్టి పద్ధతి పూర్వకవులందు చాల యరుదు. ''దబ్బకాయలఁ జూచి యబ్బగారనిపిల్చు గబ్బిగుబ్బల'' అని శ్రవణానందమునందు నాయికా స్తనయుగళమును వర్ణించిరి.

''స్తనములు నారింజకాయలంతలేసి'' అని వర్ణించుట పూర్వ కవుల యాచారము. తిరుపతికవు లట్లు వర్ణించలేదు. దబ్బకాయల నా స్తనముల పొంత నిలిపినచో నవి తండ్రి బిడ్డల పరిమాణములుగా నుండుననియు, తండ్రి కంటె బిడ్డ చిన్నదిగా నుండును. దానినిబట్టి దబ్బకాయలకంటె స్తనములు చిన్నవయి యే నారింజకాయలంతో యుండునని భావము. ఇదంతయు పాఠకు లూహించుకొనినగాని సారస్యము తెలదు. ఇది తిరుపతి కవుల పద్ధతి. వారి కావ్యములందు వర్ణన లన్నియు దాదాపిట్లే యుండును. ఈ పద్యమునందు గంగ దాపున చంద్రరేఖ కలదనుటకు గంగ చంద్రుని ముద్దులాడు

చుండెనని వర్ణింపబడినది. అది యెంతవరకు సమంజసమందురేని గంగ కడలి యిల్లాలు. చంద్రుడు కడలికి తనయుడు. కావున గంగకు కుమారుడగును. తల్లి కుమారుని ముద్దాడుట సమంజసము. పెద్ద వాడైనచో కుమారునైన తల్లి ముద్దుపెట్టుకొనదు. అందుమూలమున బాలచంద్రుడని వర్ణించినారు కవులు.

తిరుపతి కవుల పద్యములు తేలికగా నున్నటు లగుపించును. భావము చెప్పవలసినప్పు డాలోచింపవలసి యుండును. ఈ కావ్యము లోని రచనా ఫణితికి మిగిలిన కావ్యములలోని రచనా విధమునకు చాల తారతమ్యము గలదు. ఈ కావ్యమునందు అచ్చిక వైకృత తత్సమ శబ్దమును కలిపి గుచ్చెత్తి వాడుచు వచ్చిరి. సాక్షాత్కరించిన శివుని కిమ్మీరు డిట్లు నుతించెను.

పోతు తత్తడితోడఁ బోరాడి జడదారి
బుడత కాయు వోసంగి ప్రోచినావు
బాణాసురుని యింటఁబడి వాని మొగసాలఁ
గాల్బంటు రీతిగాఁ గాచినావు
పాల మున్నీటఁ బొల్పడిన విసము ద్రావి
సోకుమూఁకల దయఁ జూచినావు
నినుఁ గడుపులో నుండుమని వేఁడు దానవు
తనువున నెమ్మెను దాచినావు

నీకు భక్తుల యెడఁ గల్గు నిరుపమాన
కరుణ యే దేవతలకైనఁ గలదె శీత
గిరిసుతా! కలితాంగ! చందిరసితాంగ!
రాజకలితోత్తమాంగ! ధరా శతాంగ!

గౌతముని యాశ్రమము వర్ణించుచు

పులికి శేరుక మీఁద కలతీట నేచోటఁ
గొమ్ములతో జింక గోకుచుండు
అచిర ప్రసూతమ్ములైన లేళ్ళే చోటఁ
దపసుల పీపులు దడవుచుండు
మొదవు లేఁగలకైనఁ బులియాఁడు రేచోటఁ
జనవుగాఁ బాలిచ్చి సాఁకుచుండు.
నేవేళ నీవార తృణ రాసు లే చోటఁ
జిఱుత వేళులతోడఁ జివుకుచుండు

లతలు నగములతోడ షడృతువులందు
నేకరీతుల పుష్ప ఫలైకతాన
గతులఁ దనరారు నేచోట గౌతమ ముని
యాశ్రమం బది యొప్పారు నశ్రమంబు

తిరుపతికవు లొక్కొక్కప్పుడు వర్ణనలం దుపమానములను చొనిపించి రూపము మరింత కనులకు కట్టినటుల చేయుదురు. వారి యుపమానము లన్నియు మానవుల నిత్యజీవితమునం దనుభవములో నుండునవియు చూచుచుండునవియు నై యుండును. జయా విజయలు వృద్ధ గో రూపములను దాల్చి గౌతమముని యాశ్రమమున కరిగిరి. ఆ రూపము లిట్లు వర్ణింపబడినవి.

కప్పుపోయిన యింటఁగల వాసముల రేవ
బక్కప్రేవులతోడి ప్రక్క లమర
నీరెండిపోయి వన్నియ దక్క పెన్నాయి
పోలఁగాదగు వాలమూల మొలయఁ
జిరకాల భుక్తమై చివికిన పొలికట్ట
భాతిగా నీరోమవాల మొసఁగఁ
బ్రాగంద పట్టెలపై నయశ్శంకుల
బొగడలునా ఖురములు చెలంగ

గడియ కొక నూఱుసారులు కదలి జాఱు
గోమయస్రుతి యొడలిపై దోమ పిండు
ముసరఁ జేయఁగఁ బెంపేదు ముసలి యాల
యాకృతి వహించి రంత జయావిజయలు

ఒంటియూపిరితో రేపో మాపో ప్రాణముపోనుండి కసాయివాని దుకాణమునకు తేబడిన ముసలి గోరూపము లీ వర్ణనమునందు స్ఫురించును. ఇందు వాడిన యుపమానము లన్నియు నిత్యము మానవులు చూచునవి. అందుమూలమున ప్రక్క యెముకలు బయటపడిన డొక్కలతో బక్కచిక్కిన దేహము, లోతునకు గుంటపడియున్న వాలమూలము, వెంట్రుకలు రాలి యెండియున్న వాలము, తేజ ముడిగిన గిట్టలు, బలహీనతచేత క్షణ క్షణము బైటికి జారుచున్న పురీషముతోడ దోమలు మూగుచున్న శరీరము కనుల కగుపించును. ఇదేకాదు పురుహూతిక యను శక్తిని

కదళికా సుమదళీ కల్పమైన నయన
ద్వయము రక్తప్రభా పటలి నీనఁ
బైనుండి క్రిందికిఁబడు మఱ్ఱి యూడల
పోలిక నిరువది భుజము లొలయ
నానాభి వ్రేలుచున్నట్టి పుర్రెల దండ
రత్నహారముల నొరయుచు నుండఁ
దారకా పాళి యుతంబైన మిన్ను నాఁ
జెలువారు గుపకన్ను చీరె మెఱయ

శాకినులు డాకినులును బిశాచములును
దోడఁ జనుదెంచు చతుల నుతుల నొనర్ప
నుచ్ఛ్రయము మీఱ నూరేగుచున్న దానిఁ
గనిరి పురుహూతికా నామికయగు శక్తి

అని స్వభావసిద్ధముగా వర్ణించిరి. ఇందలి యుపమానములుగా వాడ బడిన యరటిపూల దళములు, మఱ్ఱియూడలు, నక్షత్రములతోడి

యాకసము మనము నిత్యము చూచుచుండునవే. ఇట్లు జనుల యూహల కందుబాటులో నుండు నుపమానములతోడ కూడి యుండుటచేత తిరుపతి కవుల కవిత యంత ప్రచారములోనికి వచ్చినది.

పూర్వకవుల కావ్యములందలి కవితకంటె భిన్నమయి వినూతనముగా నున్నటుల కనిపించును. దానికితోడు భాషకూడ సామాన్యజ్ఞానము కలవారి కందరికి నర్థమగుచుండును. ఇట్లు గౌతముని తపఃసిద్ధియు, నేలాముని తపోభంగమును, పీఠికాపురమున శివుడు కుక్కుటేశ్వరుండయి యుండుటయు ప్రథమాశ్వాసమున చెప్పబడినవి.

ద్వితీయాశ్వాసమునందు నేలా నదీ తీరమునందలి కోటిలింగములు, అమృతపుత్రము, ఉలిమేశ్వరము, తిరుపతి, పిఠాపురము మొదలగు క్షేత్రముల మహిమ వర్ణింపఁబడినది. అనపత్యూరాలగు నరసాంబ భర్తయగు గణపతి సోమయాజితో

సురభి తైలము తెచ్చి శిరసంటి యొడలెల్ల
రాసి సున్నియు హరిద్రయును జేర్చి
నట్టి మైపూతచే నలఁది నల్గిడి మంచి
నులివెచ్చ నీరోసి జలక మార్చి
తనరు పయ్యంటచేఁ దడియార్చి చెవిలోనఁ
దిరివెట్టి మేల్మి కస్తురి తిలకము
జారుగా నుదుట సింగారించి కన్నుల
నిండఁ గాటుక వెట్టి నెఱులు దువ్వి
సరిగఁ జేయుచుఁ గడుపార స్తన్య మిచ్చి
తూగు టుయ్యెల నుంచి సంతోష మెసఁగ
నిసువులను నల్ల నూచుచు నిద్రపుచ్చు
నువిద లే నోము మును నోచిరో మహాత్మ!

అట్టి నోము లేదని వాపోయినది. ఇట్టి విచారము సహజముగా బిడ్డలు లేని పడతులకు కలుగుచుండును. ఈ పద్యమునందు స్త్రీలు

తమ పసిబిడ్డల కనుదినము నలుగుపెట్టి నీరుపోయుట దగ్గరనుండి నిద్ర పుచ్చునంతవరకు చేయు నుపచారములు నిసర్గముగా చెప్పబడినవి. కవులు సంతానవంతులు వారి వారి ఇంటియందీక్రమమును నిత్యము చూచి యుందురు. ఆ యా కృత్యములు వర్ణించి యుందురు.

భార్య భర్తలను తమ పుత్రుల విషయమై యెట్టి విభిన్న మనోవృత్తులు కలిగియుందురో యీ క్రింది పద్యములందు సూచింపబడినవి. తల్లిప్రేమ ఫలాపేక్ష విరహితము. తన కుమారుల యభివృద్ధిని చూచి యానందించుట తల్లిస్వభావము. ఆమె సుఖమును కోరుకొనదు. సంతానముకొరకు తన సర్వస్వము త్యాగముచేయును. కావున కొడుకుల విషయమై యామె తలంపులు వేరు.

తొలి బాముసందు నోములు నోఁచని సతికిఁ
గలుగునే తనయు మొగమ్ము గనుట
ధూళిచేఁ బొరయు పుత్రుని మేను దుడుచుట
సుస్కృతంబు సేయని సుదతి కగునె
యుద్వాహ పీఠిపై నొలయు పుత్రునిఁ జూడ
వఱలునే దురదృష్టవతికి నెందుఁ
గోడంద్రతోఁగూడి కొడుకు సుఖించు సౌ
భాగ్యంబు గనునె నిర్భాగ్యురాలు

కొడుకులను గూతులను తన కొడుకు గనిన
వారిఁ దొడమీద నిడుకొని వార్ధకంబు
నడప నేర్చునె కోటి జన్మములనుండి
యైన బున్నె మార్జింపని యంబుజాక్షి

అని విషాదపడినది సోమిదేవి. ఇంక సోమయాజి.

ధనము లేకున్న విన్ననువుగా సంపాద
నముచేసి మిగుల నానంద మొసఁగు
వయ సంతకంత పోవఁగ మూఁడు కాళ్ళ ము
సలులైన తఱిఁ బరిచర్య చేయుఁ

గను మొఱంగినఁ బ్రేత కార్యము నెరవేర్చి
పలుగు పైశాచ రూపమ్ముఁ బాపు
గయకేగి పుణ్యలోకమ్ము రా విష్ణుపా
దమ్ముపైఁ బిండదానమ్ము సలుపు

సుతులు లేకున్నఁ బరలోక గతులు సున్న
యనుచు ఘోషించు ధర్మంబు లనుపదంబు
కొడుకులకుఁ గాని సెబసెంచడపుఁ జేత
సేసిన యధన్యులకుఁ బుత్రసిద్ధి కలదె

యని నుడివెను. ఇది స్వార్థము. ఈ తలంపు లన్నియు తన లాభమును ప్రకటించును. ఇదియే తమ పుత్రులయెడ తల్లిదండ్రుల కుండు మనోవృత్తి భేదము. ఈ రెండు పద్యములందు తల్లియమాయి కత్వపు నిస్స్వార్థము తండ్రి కుటిలంపు స్వార్థము వెల్లడింపబడినవి.

కవి సత్య ప్రదర్శకుడు. అతడు నిశితదృష్టితో ప్రపంచమును పరిశీలించును. వ్యక్తుల మనోవ్యాపారములను గ్రహించుకొనును. వానిని బాగుగా విమర్శించుకొనును. సత్యము నవగతము చేసుకొనును. స్వానుభవమునకు తెచ్చుకొనును. దానిని తన కవితా శక్తి మూలమున లోకమునకు వెల్లడించును. అది వేదవాక్కువలె గాని పండితుల ప్రవచనములవలెగాని సూటిగానుండదు. ఆలంకారికపు మెరుగులతో నాదర్శప్రాయముగా మనోరంజకముగా నుండును. కావున ప్రతివారు చదివి యానందింతురు. ఆనందించుటయే కాదు అనుసరింతురు.

తిరుపతికవులు తీవ్రమగు విమర్శనా దృష్టి కలవారు. దానిలో వేంకటశాస్త్రిగారు రగ్రగణ్యులు. తిరుపతి శాస్త్రిగారివలె నే విషయము నలంతిమాత్రముగా పోనిచ్చువారు కారు. ఆయన పరిచయము లోనికి వచ్చిన యే విషయమునుగాని యే వ్యక్తినిగాని స్తన శల్యపరీక్ష చేయుట వారి స్వభావము. వారి కథలు గాథలు విమర్శన దృష్టితో చదివినవారికి సత్య మవగతము కాకమానదు. వారి

జీవిత కాలమునందలి వ్యక్తులు, వంశములు, గ్రంధములు ఒకటేమిటి సర్వవిషయములు విమర్శించి సత్యమును చాటిచెప్పిరి.

తిరుపతికవు లాంధ్రదేశ మంతయు సంచరించి వారు స్త్రీ పురుషుల మనోవ్యాపారములను స్వానుభవము వలన గ్రహించిరి. సత్యస్వభావమును పై మూడు పద్యములందు వెల్లడించిరి. నాచన సోముడు ఉత్తర హరివంశమునందు "శ్రీకృష్ణుడు విప్రబాలకుని రక్షించుట" యను కధయందు బ్రాహ్మణుడు పుత్రసంతతిని గురించి శ్రీకృష్ణుని యెదుట వాపోయెను. ఆ విప్రుని నుడులకు నీ సోమయాజి యాలాపములకు చాల భేదమున్నది. పుత్రుల విషయమై తండ్రి యాశయము నిందు సత్యదూరము కాని విధమున రచించిరి.

తిరుపతికవులం దింకొక విశేషము కలదు. కావ్యమందలి యితివృత్తమును బట్టి కాలానుగతిగ వర్ణనలను మార్చుచుందురు. అందు మూలమున వారి వర్ణనలలో కాలపరిస్థితులు గోచరించును. ఏలా మాహాత్మ్యమునం దేలానదీతీర మిట్లు వర్ణింపబడినది.

మలయమారుత పోత చలిత శాఖా జాత
పతిత ప్రసవ జాల భాసురంబు
చిక్రోడ దంతప్రచిత నారికేళ క్ష
త క్షర దిక్షు రసోక్షితంబు
శుక ముఖ క్షత రసచ్యుత రసాలాలోల
వలయిత గోపాల కలకలంబు
ఫలిత పనస భూజ పాద జాత ఫల ప్ర
సార సౌరభ యుగ్దిశా తటంబు
హాల సమాకృష్టతర రసాతల నిపతిత
వికసిత ప్రసవ చ్ఛద ప్రకట పుట ని
పత దమిత హిమజల పృషద్వ్రాతత దళ స
మేత రంభానగ వన మేలాతటంబు

ఇది పురాణ కాలమందలి యేలా నదీతటము. తదను గుణముగా నా వర్ణనయు నున్నది. శ్రవణానందమునందు

ద్రాఙ్నదీ తరణ తంద్రాళు పాంథాహూత
నావికా ప్రతివచో రావకంబు
ఆనీయమాన మీనాకులీభవ దనే
కానాయకర ధీవరాకులంబు
అంతరీ పాగతానంత గో గోపాల
కాయ స్రవద్వారి కణ గణంబు
వికసత్కుసుమ పుంజ విహారమాణ నవీన
మలయమారుత పోత మానితంబు

అపరరోధో విహారాగతాసమాన
హయాణ మిథ నావలోక నాహూయమాన
హాలి కాన్యోన్య భాషణ వ్యాకులంబు
చేతము గరంచు నొక్క ధునీ తటంబు

అని వర్ణించిరి. ఇందలి కథ ఆంగ్లేయుల పరిపాలన కాలము నాటిది. ఆ కాల లక్షణము లందు ప్రతిబింబితము లగుచున్నవి. పూర్వకవుల కావ్యములందు నొకదానిలోని వర్ణన చదివినచో నదే మిగిలిన ప్రతిదానియందు కాపీ తీసినట్లు అగుపించుచుండును. తిరుపతి కవులు పెక్కుకావ్యములను రచించిరి. ఒక కావ్యములోని వర్ణన వలె నింకొక కావ్యమునందు కనిపించదు. కథలను బట్టియు సందర్భములను బట్టియు కాల పరిస్థితులనుబట్టియు మారుచుండును.

పై రెండు పద్యములు తిరుపతికవుల పాండిత్యప్రకర్ష వెల్లడించు మెరుగురాళ్ళు. వృత్త్యనుప్రాసాదులచే నందము నాపాదింప యత్నించిరి. ఆ పద్యములు దీర్ఘ సమాస సంఘటితములుగా చేయుట కంటే జాను తెనుగునందు రచించినచో నందముగాను రసవంతముగా నుండెడివి. ఈ విధముగా వర్ణనలతో సంభాషణపద్ధతి ననుకరించుచు నేలామాహాత్మ్యము రచించిరి.

---

౫

# ఆంధ్రీకృత కావ్యములు

ఆంధ్రీకరణములు ఛాయాచిత్రముల వంటివి. చిత్రగ్రాహిణి యెంత యుత్తమ తరగతికి చెందినదైనను చిత్రగ్రాహకు డెంత నేర్పరియైనను చిత్రమునకు జీవము పోయలేడు. తన తెలివి తేటలను వినియోగించి కళలను తీర్చిదిద్దును. రంగులువేసి వికాసము కల్పించును. మూలమునకు సన్నిహిత సాదృశ్యము తెచ్చును. ఎన్ని పాటులు పడినను మూలము మూలమే. ఛాయా చిత్రము ఛాయా చిత్రమే. రూప వికాసము కొరకు శిల్ప సౌందర్యముకొరకు చిత్రగ్రాహకుడు స్వతంత్రించి కళావైదుష్యము సంతరించినచో ఛాయా చిత్రము మూలముకంటె నందముగా కనిపించినను విభిన్నమయి ప్రత్యేక రూపముకలది యగును. అందందు పోలిక లుండినను సృష్టి కది ప్రతిసృష్టి యగును గాని మూలము కాజాలదు. మూలమనుట నామమాత్రము. మన తెలుగులోని భారత భాగవత రామాయణాది పురాణములు నైషధాది కావ్యములు పేరున కా యా నామములను దాల్చినను నయ్యవి ప్రతికృతులని సహృదయు లేకగ్రీవముగా నంగీకరించిన విషయమే.

శ్రీనివాస విలాసముకూడ చాలవర కట్టిదనియే చెప్పవలయును. తిరుపతి కవుల యాంధ్రీకరణముకూడ పూర్వకవుల యాంధ్రీకరణ పద్ధతియందే నడచినది. కావున దీనిని ప్రత్యేక కావ్యముగా సమీక్షచేయుట యుచితము. ఒక్క శ్రీనివాస విలాసమే కాదు వారి యాంధ్రీకరణము లన్నియు నీ దృష్టితోడనే పరిశీలించుట సమంజసము.

శ్రీనివాస విలాసము వర్ణనాత్మకమైన కావ్యము. దీనిని సంస్కృతమునందు "నవదుర్గ వంశాంబురాశి చంద్రుండు కృష్ణ కవిసార్వభౌము" డాశువుగా రచించెను. ఈ కవి మహా పండితుడు.

ఆత్మకూరు సంస్థాన విద్వాంసుడు. భూపతియగు పాకనాటి సీతారామ మహీపాలుని యానతియు కుర్మతి గిరీంద్రుండగు శ్రీనివాసుని యాజ్ఞప్తియు శిరమునందాల్చి యీ కవి శ్రీనివాస విలాస కావ్యమును చెప్పెను. సీతారామ భూపాలుని కులదైవంబగు కుర్మతి గిరి వల్లభుని యుత్సవ వర్ణన మిందలి యితివృత్తము. కృష్ణ కవిసార్వభౌముడు విద్వత్ప్రియుడు. ఆయన కావ్యమంతయు శబ్దాలంకారముల తోడను భావకల్పనలతోడను సుదీర్ఘములగు సమాసములతోడను నిండియున్నది.

కేవల శబ్దముల్ తగ లగించి బిగించినయట్టి సంస్కృతం
బే వగ విప్పి చెప్పనగు నే మన గుడ్డలు రైకలోపలన్
బ్రోవిడినట్టి శుష్క కుచపాంకము బైటకు పెట్టినన్ రసం
బావహిలంగ నేర్చునె? మహాకవులార! యను గ్రహింపుడీ.

జతుకాష్ఠక్రియ నొప్పు సంస్కృతపు శ్లేషల్ తెన్గుగాఁ జేయమా
మతికిన్ శక్యమటంచుఁ దోచ దిక మా మాటట్టు లుండంగ ను
న్నతులై పేరునుగొన్న యట్టి యల శ్రీనాథాదు లిప్పట్టునన్
నతు లర్పించిరి

ఈ మాట శృంగార నైషధమును మూలముతో సరిపోల్చి చదివిన వారికి విశదము నగును. తిరుపతికవులు సరసమతులు. వారి కవిత్వ మంతకంటె సరసమైనది. పదము లతి మృదులములు. భావములు నవ్య నవనీతములు. దానికి వారి పైపద్యములే సాక్ష్యములు.

ఎవ్వాని వాగ్ధాటి యెంత చూచిన మేటి
పాటవంబున రైలుబండి సాటి

ఇత్యాది పద్యములు పై యభిప్రాయమును బలపరచును. ప్రాచీనాధునిక భావ ప్రపంచ సమ్మేళనముచేత కైతలో నూతన వికాసమును సృష్టించినవారు తిరుపతికవులు. వారి లేఖిని యేదారికి మలిపిన నా దారియందు నిరాఘాటమగు ధాటితో పరుగెత్తగలదు.

అట్టివారి చేతియందు పడుటచేతనే శ్రీనివాస విలాసము కొంతవరకు రసవంతముగా తెలిగింపబడినది. వీరు ఆంధ్రీకరణము పద్ధతియందు

ఒక్కమెడన్ సమానముగ నొక్కొకచోట విశేషరీతిగా
నొక్కెడఁ దగ్గుగా మఱియు నొక్కెడ వేఱొక రీతి దోఁపఁగా
జక్కఁగఁజేసి రెల్ల కవిసత్తము లాంధ్రముఁజేయు నప్పుడా
ఫక్కియె మేము పట్టినది పండితులార పెనంగఁబోకుఁడీ

అని చెప్పుకొనిరి. కాశీఖండాది కావ్యములు శ్రీనాథు డిట్లే తెనిగించెను. ఆంధ్రీకరణమునందేకాక రచనా విధానమునందుకూడ తిరుపతికవులు శ్రీనాథు ననుకరించి రసవలయును. శ్రీనాథుడు కాశీఖండము పీఠికయందు

ధరియింప నేర్చిరి దర్భ వెట్టిన వ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగ మట్టియ మీద
కస్తూరికా పుండ్రకంబు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోలఁ
దార హారములు ముత్యాల సరులు
చేర్పంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ
గమ్మని క్రొత్త చెంగల్వ విరులు
దామముల వెండి పసిడియుం దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారమ్ములందు
వేమ భూపాలు ననుజన్మ వీరభద్రు
ధాత్రి పాలింప గౌతమీ తటములందు

అని వర్ణించెను. తిరుపతికవులు—

తాటి యాకుల యిండ్లఁ దవిలి యుండెడి కవి
ప్రతతి కెల్లను సౌధ వితతు లబ్బె
రాగి జారీలఁ గార్యము దీర్చు సోమయా
జుల కెల్ల బంగారు కలశ లబ్బెఁ

గాశ్మీర కంబళాల్ గప్పుకొనెడు బుధే
　　శుల కెల్ల వన్నె సేల్ జోడు లబ్బె
సీర్కావి ధోవతుల్ నియతిఁ గట్టెడి వైది
　　కుల కెల్ల మేల్ జరీ వలువ లబ్బె
మాన మర్యాదలకుఁ బడి గ్రమ్గు రాజ
బంధువుల కెల్ల నిరపాయ బహుళ సుఖద
సంపదల నీను మేల్ ముఖాసాలు గలిగె
నతఁడు సామాన్యుఁడే సోమనాద్రి విభుఁడు.

అనియు

ముదక చీరెలు గట్టు బుధుల భార్యల కెల్ల
　　నొడలెల్ల బంగారు తొడవులాయె

ఇత్యాది శ్రీనివాస విలాసము పీఠికయందు వర్ణించిరి. ఇవి శ్రీనాథుని పద్యములను బోలి యున్నవి. తిరుపతికవులకు శ్రీనాథుని యందు గల గౌరవము తెల్పుటకు నీ పోకడలు చూపితిని. శ్రీనివాస విలాసమునందు ప్రథమాశ్వాసములోని 40 వ పద్యము మొదలు 70 వ పద్యమువరకు గల 30 పద్యములలో కురుమతిగిరి వర్ణింప బడినది.

హరిహత ద్విరద కుంభాంత రాగళిత ము
　　క్తామణీ సాంద్ర కందర తలంబు
కందర ప్రాంత సంగత చమరీ వాల
　　చాలన వ్యాప్త నిర్ఝర కణంబు
నిర్ఝర కణ సంజనిత శీత వాత ని
　　ర్ధుత రతాయాసాప్సరో గణంబు
అప్సరో ముఖ చుంబ నాలింగనాది సం
　　భోగ సాదర దేవతా గణంబు

దేవతా కర సంగ్రహణావధూత
కబరికా స్రస్త నవ మల్లికా సుమంబు

మల్లికా సుమ గంధ సంభ్రమ విలోల
మత్త మధుపారవంబు కుర్మతి నగంబు

స్వతంత్ర కావ్య రచనకంటె నాంధ్రీకరణము చాల కష్టము. అందును రస ప్రధానమగు కావ్యమును తెనిగించి కొంతవరకు సరస మతుల మన్ననలను బొందవచ్చును. శబ్ద ప్రధానములగు ప్రబంధముల నాంధ్రీకరించి జనాదరణము సంపాదించుట యసాధ్య మగు విషయము. తిరుపతికవు లీ పద్యమునందు ముక్తపదగ్రస్తము నుపయోగించి మూలముకంటె ముద్దులొలుకు నటుల రచించిరి. ఇందొక్కొక్క పాద మొక దీర్ఘసమాసము. అయిననేమి? పదము లన్నియు సుబోధకములు, మృదులములు. సమాసము కూర్పునందు బిగువు కలిగి శ్రీనాథుని రచనతో సరిసమానముగా నున్నది.

సంతానక ద్రుమచ్ఛాయా సమాకీర్ణ
రాజవీధీ పరిభ్రాజితంబు
ధవళ చీనాంశుకోత్తమ సమాకల్పిత
మహనీయతర కేతు మండలంబు (హర. వి.)

ఇత్యాది పద్యములతో సరిపోల్చుకొనవచ్చును. తరువాతి పద్యముకూడ యిదే పద్ధతిని నడచినది.

మధుపా రవ విపంచి మధుర స్వరాకర్ణ
నాకులీ కృత హరిణీ కులంబు
హరిణీ రవి సుతా కణాయమాన నితంబ
వృక్షశాఖా వ్యాప్త వీక్షణంబు
వీక్షణాళీజంబు విభ్రాంత వితత హ
స్తతద లాభాయాసిత వటు గణము
వటు నిశామన భృశాపహాస ద్రమేశ సే
వాలోల నగరీ యువతి చయంబు

యువతి వశగత తరుణ సంస్తవ వివశిత
తచ్చతుర మధుర వచన తతి సముచిక

రణ చణ శుక ప్రకర తార రవ ముఖరిత
సకల దిక్కంబు కుర్మతి క్ష్మాధరంబు

ఏ పద్యము నే విధముగా రచించిన రచన యందముగా నుండి విన సొంపుగా నుండునో యది తిరుపతి కవులకు తెలియును. యతి ప్రాసల కొరకు తడుముకొనినట్లు వీరి పద్యము లందెక్కడ కనిపించదు. సర్వసాధారణముగా నన్ని పద్యములందు పదమధ్యగతమగు నక్షరమే యతిస్థానమునందు వచ్చుచుండును. ప్రాసస్థానమునందు శబ్దము తనంతట తాను వచ్చి వాలుచుండును. అందుమూలమున ధారా శుద్ధికి లోపము లేక పద్యము చదువునపుడు ధారాళముగా ముందు నకు సాగిపోవుచుండును. వీరి సీసపద్యములు ప్రబంధకవుల సీస పద్యములవలె యతిస్థానము దగ్గర ఖండింపబడక సర్వసాధారణముగా పదాంతర్గతాక్షరముతో యతి కలుపుకొని తిక్కన శ్రీనాథుల సీస పద్యములవలె పాదము చివరివరకు నడిచిపోవుచుండును.

తిరుపతికవులు మూలమునందు శబ్ద ప్రధానములైన శ్లోకము లను తెనిగించునపుడు గుడ్డలు రైకలోపలం బ్రోవిడినట్టి శుష్క కుచపాంకము బైట పడనీయక యనుగుణములగు శబ్దాలంకారము లతో మరింత బిగువు ఘటించి పై పద్యములవలె నందముగా నుండు నటుల రచించిరి. అర్థాలంకారములు గల తావులందు భావ మణు మాత్రమైన దుసిగిలి పోనీయక 'సమానముగా' నాంధ్రీకరించిరి. మచ్చునకు—

గుహలం జరియించు సింగముల్ బహుళ భయద
రావము లొనర్ప విని కాళ్లురాక డిల్ల
పడిన యేనుంగు గున్నల దడము లనంగ
గండశిల ల న్నగంబునం గ్రాలుచుండు

ఇట వసియించు సీతఁడని యిచ్చితి రత్నముతోడఁ బుత్రికం
గటకట! యేడ కేగెనొకొ కన్గొనుఁడీ యని యభ్రిపంప న

చ్ఛటి కరుదెంచినట్టి మణిసంఘము నాఁజెలువారు దీపపుం
బటలము లెన్న డేని దశమగ్రహముల్ కృతము ల్దలంతురే

ఈ పద్యములను చదువువారు స్వతంత్రములని తలంతురుగాని యాంధ్రీకరణములని యెవ్వరు తలంపరు. ఇట్లే శ్రీనివాస విలాస మంతయుఁ దెనిగించినదానివలె నగుపించక స్వతంత్ర కావ్యమువలె నుండును ఇందలి రెండు నాలుగాశ్వాసములు తిరుపతిశాస్త్రిగారును మిగిలినది వేంకట శాస్త్రిగారును తెనిగించిరి.

శ్రీనివాసవిలాసము మొదటి యాశ్వాసమునందు కుర్మతిగిరి వర్ణనము, విష్ణుమూర్తి వర్ణనము, వర్షఋతు వర్ణనము మొదలగునవి కలవు. శరదృతువర్ణనతో ద్వితీయాశ్వాసము ప్రారంభమగును. శ్రీహరి సర్వసేనానియగు విష్వక్సేనుడు భక్త జనులను హెచ్చరించుటయు కార్తిక శుద్ధపాడ్యమి మొదటి నాల్గుదినముల యుత్సవము నిందు వర్ణింపబడినది. గిరికందరమునందు నివసించియుండు శ్రీ మహా విష్ణువు ప్రొద్దున

ఉపనిషత్కాంత మౌళిపై నొప్పు నీల
మునుగొని యెవండొ హేమసంపుటమునందు
దాచెనన

బంగారు చవికెయందు నెక్కి గిరిశిఖరమున కరుగుటయు నచట భక్తజనుల సేవలనుగొని సాయంకాలమునకు మరల గుహ కరుదెంచుటయు నిత్యము జరుగు నుత్సవము. ఈ సందర్భమున చర్విత చర్వణముగ విభిన్న కల్పనలతో సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయములు చక్ర చ్ఛత్ర చామర దీపికలు బహురకములుగా వర్ణింపబడినవి. మచ్చునకు—

కురమతీశు చక్రోత్సవం బరసి వివశ
చిత్తమైయున్న దినలక్ష్మి చేతినుండి
జారిపోయిన మేల్మి బంగారు త్రాళ్ళ
బంతియోయన భాను బింబంబు మెఱసె

ఇట్లే వర్ణన లన్నియు నుత్ప్రేక్షాద్యలంకార సహితములగు కల్పనలతో విద్వద్వరుల మనోరంజకముగా నున్నవి. తరువాతి యాశ్వాసమునం దుత్సవము చూచుటకు వచ్చిన బ్రాహ్మణాదులకు సంబారములు పంచియిచ్చుట, మూగిన జనుల సమ్మర్దము వర్ణింప బడినది. ఇందు కొంత హాస్యరసము కలదు.

ఆ యా వస్తువులం గ్రహించుటకునై యందంద వారాంగనల్
డాయంబోవుడు కొందర గ్రజ విటుల్ దాదవ్వులన్నిల్వఁ డే
లా యీలాగున మీఁది కేగు టేది మేలా యంచు వారించు న
ట్లా యజ్ఞాత్ముల గుబ్బలం దడవి మోదాయత్తులై రెంతయున్.

మఱియు కొంద రిదేమి సమ్మర్ద మనుచు
మార్గమేర్పడఁ జేసెడి మాడ్కి వార
నళిన నేత్రాల నాలింగనం బొనర్చి
సంతసించిరి జన్మంబు సఫల మనుచు

సమ్మర్దముగల చోటులం దిట్టివి సంభవించుచుండుట చూచు చుందుము. కవి యా యా విషయములన్నియు చక్కగా వర్ణించి హాస్యరసమునకు కొంత తావు కలిగించెను. ఆత్మకూరు ధరావల్లభుడు తన సేనలతో కురుమతిగిరికి నుత్సవము దర్శింప బయలుదేరెను. ఆయన రాజమార్గము వెంట నరుగుచుండ స్త్రీ పురుషాదు లుత్సు కతతో పరిశీలించిరి. ఆ సమయమున స్త్రీల యలజడి వర్ణన సహజ ముగా నున్నది. భూపతి యంబాపురమున కరిగెను. అచట తల్లికి నమస్కరించి సీతారామ భూపతి కురమతిగిరి కరిగెను. చతుర్థాశ్వా సమునందు బ్రాహ్మణ సమారాధన, భోజనములు వర్ణింపబడినవి. చివరినాటి యుత్సవము పంచమాశ్వాసమున వర్ణింపబడినది.

నను వంచించి మహోత్సవంబు గనఁగా న్యాయంబె నీకంచు న
వ్వనజాతాలయ నన్నునే మనునొ కోపస్వాంతయై యంచు లో
ననుమానింపక కుర్మతీశ్వరుఁడు తా నద్రి స్థలం బెక్కి చ
క్కని రోయింతు లొనర్చు నృత్యమును వేడ్కంజూచుచున్నంతలోన్

లక్ష్మీదేవి ప్రేరేపింప కొందరు దొంగలువచ్చి హరి సర్వాలంకారములు హరించిరి. వానిని లక్ష్మి కప్పగించిరి. దీనముఖుండయి హరి, కుర్మతీశ్వరుడు తన యింటికి తిరిగివచ్చెను. ఆ సమయమున శ్రీసతియు భూసతియు నెదురువచ్చి కుర్మతీశ్వరుని గొనిపోయిరి. ఇచట లక్ష్మీ నారాయణుల సంభాషణ నాటకరంగమునందువలె రసవత్తరముగాను మనోహరముగాను హృదయాహ్లాదకరముగానున్నది. కావ్యమంతయు నొకయెత్తు సంభాషణారూపకమైన యీ పదునాల్గు పద్యము లొక యెత్తు.

విష్ణువు —

దాసుఁడనైన నా యెడలఁ దప్పులు గల్గిన సైఁపరాదె నేఁ
జేసిన నేరమేమి దయఁజిక్కెడు చూపుల నన్నొకింత గై
సేసిన దోసమా నె నను జిక్కులు పెట్టిరి దొంగ లింత వి
శ్వాసము దప్పియుంట తగవా మగువా! పగవాఁడనైతినే

లక్ష్మి —

నీ చాటూక్తుల కేమి నే నెఱుఁగనే నీ సంగతుల్ క్రొత్తలే
యీ చాతుర్యముచూచి సంతసిలు వా రెవ్వార లిచ్చోట ని
న్నే చోరుల్ గనికొట్టి వుచ్చికొనిరో ఎవ్వారి దండించెదో
కాచంబైనను నే నెఱుంగను జుమీ కాంతా! భుజంగాగ్రణీ!

ఇత్యాది సంభాషణ మృదులముగా నున్నది. నిందాలాపము గయ్యాళితనము లేని మధురవచన రచనలతో మహాపతివ్రతయగు లక్ష్మి మగని నేర్పుగా మందలించినది. తప్పుచేసిన విష్ణువు భార్యానుకూలుడు. వీరి సంభాషణ పాత్రల కనుగుణముగా రసవంతముగా నున్నది. మూల కావ్యకర్త ప్రజ్ఞాపాండిత్యములు కల్పనాచమత్కృతులు గలవాడు. ఆశువుగా నిన్ని వింతవింత కల్పనలను బొందుపరచి కథలేని కావ్య మైదాశ్వాసములు రచించెననిన దో మిగుల మెచ్చుకొనవలయును.

తిరుపతికవులు వారికంటె రెండాకు లెక్కువ నేర్చినవారు.

శ్రీనివాసవిలా సాంధ్రీకరణము వారి ప్రజ్ఞావైదుష్యములకు నొరిపిడి రాయియై వన్నె నొరసినది. చిరకీర్తి సంపాదించుటకు మైలురాయి వలె పాదుకొనినది. విద్వాంసులగు కవులు దానిని మన్నింతురు. తిరుపతికవుల పాండిత్యప్రకర్ష కీ కావ్యము వెలుగు మాయని దీప కళిక. శ్రీనివాసవిలాసమును ఆత్మకూరుప్రభువగు సీతారామభూపతి. కంకిత మీయబడిది.

కావ్యములందు శ్రవణానందము తరువాత తిరుపతికవులకు కీర్తి సంపాదించి పెట్టినది బుద్ధచరిత్ర. ఇది చారిత్రాత్మకమగు ప్రబంధము. సంస్కృతమునందు అశ్వఘోషుడను మహాకవి బుద్ధచరిత్ర రచించెను. అతడు ఒకటవ శతాబ్దములోనివాడు. కనిష్కుని యాస్థానకవి. అశ్వఘోషుని బుద్ధచరిత్ర నాధారముగా చేసికొని మాచ్యూఆర్నాల్డు అను నాంగ్ల విద్వత్కవి లైట్ ఆఫ్ ఏషియా యను పద్యకావ్యమును వ్రాసెను. ఈ రెంటిని క్షేమేంద్రుని బుద్ధజన్మ కావ్యమును ప్రధానాదర్శములుగా పెట్టుకొని తిరుపతికవులు బుద్ధ చరిత్ర వ్రాసిరి.

ఇద్ధతేజుఁడైన బుద్ధదేవు చరిత్ర
యశ్వఘోష ముఖుల ననుసరించి
యస్మ దంకితముగ నాంధ్రకావ్య మొనర్చు
డనుచు వీడ్యమిచ్చె నాదరమున.

అని తిరుపతికవులు కృత్యాదియందు వ్రాసికొనిరి. కావున బుద్ధచరిత్ర యొక విధముగా నాంధ్రీకరణ మని యంగీకరింప వల యును. కాని ఈ యాంధ్రీకరణము శ్రీనివాస విలాసాంధ్రీకరణము వంటిది కాదు. ఈ కావ్యమును పోలవరము జమీన్దారుగారగు కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావుగారి కంకిత మీయబడినది. వీ రార్వేల నియోగి బ్రాహ్మణులు. విద్వాంసులు. దివాకర్ల తిరుపతి శాస్త్రిగా రీ జమీన్దారుగారి యాస్థానమునందు చాలాకాలము కవిగా నుండిరి.

బుద్ధచరిత్రయందలి యితివృత్తము ప్రాచీనమైనది. తదనుగుణముగా తిరుపతికవులు ప్రాచీనకావ్యముల పద్ధతి ననుసరించి కపిలవస్తుపుర వర్ణనతో కథ ప్రారంభించిరి.

వీటఁ బొడవయి చదలంటు కోటగోడ
హరిపదము ముట్టె నన్నను నగునుగాని
కడలివలె లోతుగల్గు నగడ్తకూడ
హరిపదము ముట్టెననుట మహాద్భుతంబు

గజములో యని తలఁప నగజము లగుచు
నాగములె యని తలపోయ నగము లగుచుఁ
గొండ పొడుగుగఁ బురిచుట్టు నిండియుండుఁ
దొండములుగల్గు నట్టి జంతు వ్రజంబు

ఇందలి వర్ణన పూర్వకవుల దారినే పట్టినది. నన్నయ తీక్ష్ణకిరణుడనుటకు 'వాడి మయూఖముల్ గలుగువాఁడు' అని చక్కగా తెలిగించి భారతపద్యమునందు వాడినటులనే కరులనుటకు 'తొండములు గలుగునట్టి జంతువులు' అని వాడిన తిరుపతికవులు. భావికావ్యకర్తలకు సంస్కృత శబ్దములను తెనిగించు విధానమునకు దారిచూపి భాషను పెంపొందింప చేయుటకు మార్గదర్శకులైరి. వీరు నన్నయ వాడిన ప్రాణగొడ్డము జీవకఱ్ఱ మొదలగువాని నాధారముగా చేసుకొని 'కుచపొంకము' ఇత్యాది సమాసములను వాడిరి.

ఒక్కొక్కప్పుడు నిబంధనకర్తల కట్టుబాట్లను దెగతెంపులు గావించి తమ నిరంకుశత్వమును వెల్లడి గావించిరి. తిరుపతికవులు సమవృత్తములందుకంటె సీసపద్యములందును గీతపద్యములందును పదముల పొందిక మిక్కిలి మనోహరముగా నుండును. అందును విశేషమగుభావము నొక చిన్న గీతపద్యములో నలంకార సహితముగా నిమిడించగల శక్తి వీరి కెక్కువగా గలదు.

పంకజాత మగుటఁ దన్నుఁ బాసి యరిగె
రవిత్రయీమయుఁడని నళిని వగ నిగుడ

మగుడఁ దలయెత్త నేరని మాడ్కి యొప్పె
నకట! దాసఁ గేరికైన లజ్జావహంబు

ఈ పద్యమునందు పంకజ శబ్దమునకు పాపమని యర్థాంతరము చెప్పకొనవలయును. అప్పుడు పాపమునందు పుట్టిన బురదయందు పుట్టిన యని రెండర్థములు వచ్చును. ఇంత చక్కని భావమీ గీతపద్యమునందిముడ్చుటయేకాక చివర నర్థాంతర న్యాసాలంకారము కూడ పొదిగించిరి. ఇందు నళినీ రవులకు నాయికా నాయక భావము.

అంబరము తన మణి పోవ నార్తిఁగూరి
యెన్నియో దివ్వెలను బెట్టి యెందు వెదకి
విసివి పెద్ద దీపంబును బెట్టె ననఁగఁ
దారలును జంద్రుఁడును గ్రమదశ వెలింగె.

సూర్యునకు నభోమణి యనుపేరు లోకప్రసిద్ధము. ఈ పద్యములోని యుపమానము చాల సహజముగా నున్నది. ఇక్కడ యుత్ప్రేక్షాలంకాలమున కొక క్రమాలంకారము కూడ జత కూర్చపడినది. ఇట్టి శక్తి సంస్కృత కవులందు కాళిదాసున కొక్కనికి గలదు.

అనంత రత్న ప్రభవస్య యస్య
హిమం న సౌభాగ్య విలోపిజాతం
ఏకో హి దోషో గుణ సన్నిపాతే
నిమజ్జతీందోః కిరణేష్వివాంకః

అని కాళిదాసు ఒక చిన్న శ్లోకమునందు నుపమ అర్థాంతర న్యాసాలంకారములు జతకూర్చి రచించెను. దానికి తోడు రత్న ప్రభవస్య యనుచోట రత్నానాం ప్రభవస్య రత్నాని శ్రేషవస్తూని తేషాం ప్రభవస్య యనియు వజ్రాదీనాం ప్రభవస్యయనియు రెండర్థములంగీకరించినచో శ్లేషయు నుండును. ఇట్టి చతురత తెలుగుకవులందెవరికి నున్నటుల గోచరించదు. తిరుపతికవుల కీ యపూర్వరచనా

చాకచక్య మలవడినది. ఇట్టి రచనకు వెలుగుదీపమువలె ప్రసాద గుణము మెరుగు పెట్టుచుండును. ఇదియే వారియందలి విశిష్టత్వము. శ్రీనాథ శ్రీహర్షులు మలయమారుతమును

'కాలాంతః పురకామినీ కుచతటీ కస్తూరికా లుంటాకము' అని వర్ణించిరి. మలయమారుతము మలయపర్వతమునుండి వీచును. ఆ పర్వతము దక్షిణదిశయందున్నది. అచ్చట బయలుదేరిన చల్లగాలి యూర్ధ్వలోకములందున్న కాలాంతఃపుర కామినుల కుచతటము లందలి కస్తూరికాది సుగంధము నపహరించి తెచ్చుచున్నటుల శృంగార నైషధమునందు చెప్పబడినది. ఆ వర్ణనలోని స్వభావా స్వభావములను చదువరు లూహించుకొనగలరు. తిరుపతికవులు

తంజాపురీ నీల కంజాత నయనల
రెండు చెక్కులఁ బుల్కరింపఁ జేసి
కాంచీపురీ దేశ ఘనసార గంధుల
పొలయల్క పెక్కు సారులు వహించి
కర్ణాట కామినీ ఘన శిరోరుహముల
కసమాన నైగనిగ్యంబుఁ దెచ్చి
కుంతల ప్రాంత కర్ణాంతాయతాక్షుల
చెలువల కూర్మి హెచ్చింపఁ జేసి
యమిత తృష్ణార్జిత భుజంగ సముదయ ప్ర
మద విధానార్హ్వాకుశల సంపదలఁ బొదివి

మలయ నిలయ పటీరద్రుమవలయ నిలయ
మారుతంబులు చెలరేగె మాసరముగ

అని వర్ణించిరి. ఇందలి స్వభావసౌందర్యము పై వర్ణనయం దగు పించదు. కవికుల సార్వభౌముండగు కాళిదాసు మేఘసందేశము నందు వ్యంగ్య రూపమున బుతుపవనమార్గమును వర్ణించినటుల తిరుపతికవులిందు మలయమారుతము వీచు మార్గమును దక్షిణమున మలయపర్వతము మీదనుండి తంజావూరు, కంచి, కర్ణాటము,

కుంతలములను క్రమ క్రమముగా నుత్తరాభిముఖమయి తరించి కపిల వస్తుపురమునందు వీచినదని వర్ణించిరి. ఎంత చక్కని కల్పన! ఎంత మనోహరమగు భావము!

తెనుగు భాషయం దనేకమంది కవు లనేక కావ్యములను రచించిరి. వారందరు సందర్భానుసారముగా మలయమారుతమును తమ కావ్యములందు వర్ణించిరి. ఇంత స్వభావసిద్ధముగా భావపూరితముగా వర్ణించినవారు లేరు. తెనుగునం దేకాదు సంస్కృతమునందును వర్ణించినవారు కనిపించరనియే చెప్పవలయును. దీనిని వ్యాఖ్యానింపవలయుననిన పెక్కుపుటలు పట్టును. తంజాపురీ స్త్రీల చెక్కులందము కాంచీపురాంగనల ప్రణయకోప స్వభావము కర్ణాటాంగనల తల వెండ్రుకల నైగనిగ్యము, కుంతలప్రాంత యువతుల ప్రణయవర్తనము భంగ్యంతరమున వర్ణింపబడినవి. అంతేకాదు వారి వారి కుపయోగించిన విశేష కాములన్నియు సార్థకములు. ఆ యా ప్రాంత స్త్రీల సౌందర్య మెందు పరిణతి పొందినదో యీ పద్యమునందు సూచింపబడినవి. వేంకటశాస్త్రిగారు కాశిపర్యంతము దేశాటనము గావించినవారు. శ్రీనాధునివలె నా యా దేశస్త్రీల యందచందములు స్వభావములు నవగతము చేసికొని యుందురు.

వాని నిందు పొందు పరచిరి. ఇందలి భావసౌందర్యము మాటయుండనిండు. రచనాసౌందర్యము కూడ కొంత వివరింతును. సీసపాదములు నాల్గింటిలోను మొదటి యర్ధపాదములు సంస్కృతసమాసములతో కూర్చబడినవి. మిగిలిన యర్ధపాదములు తేట తెలుగు పదముల కూర్పుతో నమర్చఁబడినవి. ఇది యొక రచనా సౌందర్యము. అల్లసాని పెద్దనగారి సీసపద్యములలో నిట్టి యందమగుపించును.

కలశపాథోరాశి గర్భవీచిమతల్లి
కడుపార నెవ్వాని కన్నతల్లి (మను)

ఇత్యాదిక మరయునది.

సిద్ధార్థుడు పెండ్లి యీడునకు వచ్చెను. పండుగ మిషతో శుద్ధోదనుడు నానా దేశములనుండి రాజకుమార్తెలను బిలిపించెను. వారొక్కొక్కరు వచ్చి సిద్ధార్థునివలననుండి బహుమానములు తీసికొన వలయును. వారిలో తన మనస్సునకు నచ్చిన రాజకుమారిని సిద్ధార్థుడు పెండ్లియాడును. ఇది క్రొత్తరకపు కన్యావరణము. తిరుపతికవులా సందర్భమున నొక్కొక్క రాజకుమార్తెను వర్ణించిరి. ఆ వర్ణనలను బట్టి యామె యే దేశపు రాజకుమారియో మనము గ్రహించుకొనగలము. మచ్చునకు

కడియంబు లందెలు గజ్జెగొల్సులు గూడి
　　యడుగడ్గునకు గల్లురంచు మ్రోయ
జీరాడు మేల్జరీ చెఱఁగుఁ గుచ్చెళ్ళ చ
　　క్కదనంబు మీఁగాళ్ళకడల రాయ
మడఁచి యొడ్డాణంబు మధ్యఁజేర్చిన పైఁట
　　యంచు తెమ్మెరలు దూఁగాడఁ జేయఁ
గబరీభరంబుపైఁ గడలు కొల్పిన పూవు
　　లదరిఁ దావులకుఁ దుమ్మెదలు రోయ

విడెము తావియు రదనచ్ఛవియును గలసి
యోష్ఠకాంతికిఁ గొంత చేయూఁత యొసఁగఁ
జూప జెల్లరునుం దన సొగసె చూడఁ
గరిగమన యొర్తు వచ్చె నక్కజముతోడ

సిద్ధార్థుడు యశోధరను బరిణయమాడెను. ఆ దంపతుల కొక కుమారుడు జన్మించెను. దైవప్రేరితుండయి లోకహితార్థము భార్యాబిడ్డలను విడిచి సిద్ధార్థుడు సన్యసింప నడవికి బయలుదేరెను. అది యర్ధరాత్రి సమయము. ఛన్నునితో తన మనో నిశ్చయమును వివరించి కంటకంబు నాయితంబు గావింపుమని నుడివెను. ఛన్నుడు

మిసిమి నెసంగు ప్రాయమును మేటిసిరుల్కడలేని రాజ్యము
న్రసికతయుం బసందొసఁగు రాకొమరుండవు సాధ్వియైన నీ

దు సతి నకారణంబ విడి దొంగతనమ్మున రాత్రి వేళ స
న్యసమున పూన నెంచెదకటా! సుఖమానె విరాగమేరికిన్.

స్థలమునఁ బండఁగావలెఁ బ్రసాదమటంచును సాధ్విలిచ్చు భి
క్షలు గ్రహియింపఁగావలెఁ బొసంగదు వేళకుఁదిండి తిన్నచో
నిలువఁగరాదు నిల్చినను నిల్చినచోటఁ బరుండరాదు నీ
తలమగునే యతిత్వమును దాల్చుటయు న్నరపాలబాలకా.

కొడుకులఁ గూతులం గనియుఁ గొండొకకాలమువారిప్రోపు మే
ల్గొడిచియు వార్ధకంబొదవఁ గోరికలం దిగద్రావి రాజ్యముం
గొడుకుల కప్పగించి కయికోఁదగు సన్యసనంబు కోస మి
ప్పుడు ప్రయత్నించెదక్కటా! నృపుం గడుదుఃఖపరీతుఁ జేయుచున్

ఈ పద్యములు తిరుపతి కవుల రసవత్తర కవితారచనకు మచ్చుతునకలు. బుద్ధచరిత్రయంతయు నిట్టి మృదులములగు పదముల కూర్పుతో రసము చిప్పిలుచునుండును. కవి యనుభవమునకు ప్రతిబింబము కావ్యమని ప్రసిద్ధ విమర్శకులు నుడివిరి. రెండవపద్యము వేంకటశాస్త్రిగారికి స్వానుభవమునందున్న విషయము కావుననే యీ పద్యమంత రమణీయముగా నున్నది. కంటకము నధిరోహించి సిద్ధార్థుడు వనమున కరిగెను. ఛన్నునితో తండ్రికిట్లు కబురంపెను.

వగవఁగ వలదని నొడువుము
యుగములు గతియించినను వియోగము మానం
దగువారు గలరె నిత్యం
బుగ మృత్యువు వెంట నంటి మొగియుచునుండన్.

పద్యము చిన్నదే. విరాగము నొంది మోక్షార్థియయి సన్యసింపనున్న సిద్ధార్థుని హృదయపుట భేదనము గావించుకొని యుద్గతంబైన వేదాంత విద్యాశకల మిది. ఇందలి ప్రతి పదమునందు వైరాగ్యోపదేశముతోపాటు దుఃఖరస మిబికి పొంగులువారి పరవళ్ళు త్రొక్కుకొనుచు మానవహృదయము వెల్లివిరియించుశక్తి పొందు

పడియున్నది. దీనిని చదువునప్పు డెంత కఠిన హృదయమైనను కరిగి కనుల వెంట నీరయి కారక మానదు. సిద్ధార్థుడు నీమాట చెప్పు నప్పుడు కంటతడి పెట్టెనేమో యనిపించును.

అంతేకాదు. సిద్ధార్థుని ప్రశాంత మధురమూర్తి యీ పద్యము చదువునపుడు పాఠకుని కనులకు కనిపించును. ఇందలి వృత్త్యనుప్రాస రసోపస్కారకముగా తనంతట తాను దొరలిన యలంకారమే కాని ప్రయత్నించి వేసినది కాదు. తిరుపతి కవులు కావలయునని యే యలంకారము వేయరు. వారి కవిత రసాను మేయమై స్వభావముల నొరసికొని పోవుచుండును. సిద్ధార్థుడు కంట కమును గాంచి

అడలకు ముష్టవారి నయనాంచల పూరితమా చుఁ జెక్కలం
బడి దిగజాఱ నాల్క దిగవంచి పదంబుల నాకఁబోకు కీ
డ్వాడకుము నీకు నాకు ఋణబంధము తీరెను నేఁటి కింక నీ
పడిన పరిశ్రమంబు పరిపక్వ ఫలప్రదమా హరీశ్వరా!

ఈ పద్య మెవరికి హృదయ విదారకము కాకుండును? దీని యందు విషాదము నొందుచున్న కంటకముయొక్క చేష్టలు స్ఫురింప చేయుటయేకాక సిద్ధార్థుని దయాస్వభావమును తిరుపతికవులు చక్కగా నిరూపించిరి. కావ్యములందు రసపోషణవలెనే పాత్ర పోషణము కూడ ప్రధానాంగము. తిరుపతికవు లీ కావ్యమునందు సిద్ధార్థుని పాత్ర యథాస్థితిగా పోషించుచూ వచ్చిరి. ఈ దయా మయత్వము నహింసాతత్త్వము సిద్ధార్థునియందు నివురు గవిసిన నిప్పువలె ప్రారంభమునందుండియు నున్న గుణములు. నిద్రపోవు చున్న యశోధర నరయుచు సిద్ధార్థుడు అడవికి బయలుదేరునప్పుడు మోహావేశమున దాను చూపిన కాఠిన్యమును దలంచుకొని

మృదులంబంచు నెఱింగియు న్నిను సముష్ణీల న్మనోజాగ్ని దా
హదశ న్నిర్దయ బుద్ధినై ప్రతిపదం బత్యార్తి నొందించు నా

యదయత్వంబు సహించి స్వీయమగు రాగాఢ్యత్వముస్వీడ కో
యధరంబా! సెలవిచ్చి పంపుము కృపాయత్తైక చిత్తంబునన్.

మది నహింసయె పరమధర్మం బటంచు
గుఱుతెఱింగియు నినుఁ గొనగోటి పోటు
లం గలంచితి నన్న చలంబు విడిచి
సెల వొసంగుమ యో కుచసీమ నాకు

ఈ పద్యములలో సంభోగ శృంగారము వర్ణింపబడినది. తన్మూలమున సిద్ధార్థుని యంతరంగమున నిబిడీకృతమైయున్న కరుణాహింసలు ద్యోతకములగుచున్నవి. మొదటి పద్యమునందు 'రాగాఢ్యత్వమున్ వీడకో యధరంబా!' అనుచోట శ్లేష చక్కగా ప్రతిపాదింపబడినది. రాగమనగా ప్రేమయనియు నెఱ్ఱదనమనియు నర్థములు. స్త్రీల యధరము లెఱ్ఱగానుండును. దుఃఖాతిశయమువలన నవి రక్తిమ వీడి వెలవెలపోవును. యశోధర నిద్ర మేల్కొని వియోగము భరింపలేక విలపించును. అందుమూలమున వాతెర తన తొగరువన్నె బాసి పాలిపోయినట్లగును. అట్లు కావలదని ఫలితార్థము. నాయందు తొల్లింటి ప్రేమ విడువ వలదని యర్థాంతరము. ఈ ప్రబోధము అధరమునకు కాదు. యశోధరకని యెఱుంగునది. ఆమెను దుఃఖింపవలదనియు తనయందు ప్రేమ విడువ వలదనియు సిద్ధార్థుడు ప్రబోధించెను. ఈ రెండు పద్యములు సిద్ధార్థుని చిత్తమునందు రేగిన రాగ విరాగముల సంఘర్షణమును సూచించుచున్నవి.

కంటకము ఛన్నుడు తిరిగి వచ్చిరి. యశోధర—

కుచముల మీఁద కుంకుమ పూత బురదగాఁ
గరిగించి కన్నీరు కాల్వగట్ట
నిష్కారణ క్రోధ నిర్వాహకములైన
కొలికి కన్నులు నల్ల గ్రుమ్మరింప

వెనుదీయఁగా రాని వేడి నిట్టూర్పుల
వలుద చన్నుఁ౦దోయి వాడుదోపఁ
బొంగు పొంగున వచ్చి పొరలు వల్వాస వంత
గదియించి కంఠ గద్గదికఁ జూపఁ

గంపమునఁ గాలుఁ జేయి గడ్గడ వడంక
నిముసమైనను నొకచోట నిలువలేక
కాంత లందఱు విలపించుకడకు వచ్చి
కంటకముఁ గాంచి యిట్లనెఁ గరుణ మొలుక

సిద్ధార్థుని వీడివచ్చిన కంటకము మీది క్రోధము పతి వియోగము వలని దుఃఖము మేళవించిన యశోధర యాకృతి వర్ణన మిది. తండ్రియానతి చొప్పున సిద్ధార్థుడు తిరిగి కపిలవస్తుపురమునకు వచ్చెను.

సహకార కిసలయ చ్ఛవితోడఁ దలనిండ
జడలు కట్టిన శిరోజములతోడ
రోహిణీ సహితార్క రుచితప్త సుమలతా
గ్రంబుఁ బోలిన శరీరంబుతోడ
దినకరచ్ఛన్నుఁడై తేజఁ గాసిన పూర్ణ
చంద్రుఁ బోలిన ముఖచ్ఛాయతోడఁ
జిరదృష్ట పతిరూప పరిపుష్ట వైవర్ణ్య
దైన్య సంతోష భేదములతోడఁ

గూడ నేడేండ్లు రోహిలుం 'డేడకేగె'
దంచుఁ జెలరేగుచును జీరయంచు లాగ
నెడఁద నేవేళ భావింపఁబడుచు నున్న
జీవితేశ్వరు గుర్తించి చేరఁబోయి

అని యశోధరను తిరుపతి కవులు వర్ణించిరి. సౌందరనందము నందు పునరాగమములో నిదే స్థితియందు యశోధర యీ క్రింది విధముగా వర్ణింపబడినది

కజ్జలహీనమై కాంతి బాసిన కనుం
గొనలందు బాష్పాంబు కణము లురుల
విగత సంస్కారమై వ్రేలు పెన్నెఱి కురుల్
సెదరి వెన్నునఁ జిక్కుజీరు వడఁగ
వసివాళ్ళు వాడిన పసిడి మైఁ దీవ సం
భ్రమ యానవశతఁ గంపము వహింపఁ
బాలిన చెక్కిళ్ళ పయి పయిన్ జాలువా
ఱిన కంటినీరు చారికలు గట్ట

నంతిపురి వీడివచ్చి శూన్యావలోక
నములఁ గాంతునిఁ గనుచు రూపము వహించు
శోకమున దాల నిల్చె యశోధరయును
గొడుకు కూకటి నొక కేలఁ బుడికికొనుచు

అంటు కట్టిన మావిమొక్క మూలమునుండి యాహారము గ్రహించినను మూలముకంటె తియ్యని ఫలముల నిచ్చును. సౌందర నందము కృతికర్తలు తిరుపతికవుల శిష్యులు. వారి కవితా మారందమును కుత్తుకబంటిగా త్రావి జీర్ణించుకొనినవారు. ఈ పట్టునందు సౌందర నందము కృతికర్తల లేఖని శిల్పకళావైశద్యము ప్రకటించుటయందు వాడి కదలయి యశోధరమూర్తిని చక్కగా చిత్రించినది. ఇట్లనుటచేత తిరుపతి కవులు వారికి తీసిపోవుదురని నా యభిప్రాయము కాదు. ఒక్కొక్కరి బుద్ధి ఒక్కొక్క విషయమునందు నిశితముగా బనిచేయునని తలంపు. తిరుపతి కవులు మనస్సును మూలమట్టుగా కదలింపజాలు రసవత్తరములగు సంభాషణలతోను అంతరాంతరములందు మనోరంజకములగు వర్ణనలతోను కథను నడిపించుటయే కాక బుద్ధచరిత్ర నొక వేదాంతగ్రంథముగా కూడ ప్రదర్శించిరి.

ఆ యా ఘట్టములు చదువునపుడు పాఠకునిబుద్ధి పరమార్థము మీదికి మళ్ళించును. నాస్తికుడైనను ఆస్తిక్యుడగును. కసాయివాడయినను కరుణాలుండగును. తిరుపతి కవులు శృంగార కరుణరసము

లందు వలెనే శాంతరసమును దయా వీర ధర్మవీరములను పాఠకుల మనస్సున కెక్కునటుల విరచించుటయం దందె వేసిన చేతులు. వారి హృదయములు నవరసములకు స్థానములు. సమయానుకూలముగా నవి పొంగి పొరలి జ్వాలారుచు నా యా శబ్దములను రసగర్భితము గావించి లేఖని కందించుచుండును. తిరుపతి కవులు వేదాంత శాస్త్రము నామూలాగ్రముగా చదివి యనుభవమునకు తెచ్చుకొని ప్రపంచమునకీ బుద్ధచరిత్రమూలమున నొక సందేశము నందించిరి.

పూర్వమీమాంస కర్మప్రధానముగా బోధించు గ్రంథము. ఉత్తరమీమాంస మోక్ష సంపాదకమైన జ్ఞానమును బోధించు గ్రంథము. తిరుపతికవులకు నిత్యనైమిత్తికములైన యజ్ఞ యాగాది క్రతువులవలన స్వర్గము లభించు నను నమ్మక మే కోశమునందును లేదు. పైగా పాపము పశుహననమువలన కలుగునని వారికి నమ్మకము. పూర్వహరిశ్చంద్ర చరిత్రయందు, గోదేవి కావ్యమందు, తదితర కావ్యములం దా సంగతి సందర్భము వచ్చినప్పుడెల్ల ప్రకటించిరి. మానవుడు జ్ఞానమువలన మోక్షము సంపాదింపవలయునని వీరి మతము. శంకరాది మతకర్తల ప్రబోధము నట్టిదే. తిరుపతి కవులు ఋషితుల్యులు. బుద్ధుని ముఖమున నిర్వాణపదమును సంపాదించుటకు సాధనములను లోకమునకు బోధించిరి.

పట్టుపురువు తాను పచరించు కాయలోఁ
దగులుకొనెడు భంగిఁ దా నొనర్చు
కర్మ జాలముననె కట్టఁగఁబడు జీవుఁ
డింతకంటె హేతు వెందుఁగలదె

హత్యలోనగు క్రూర కృత్యము లొనర్చు
వార లే తత్ఫలమ్మును వడయుపొంటె
హీనమగు యోని జనియింతు రింత నిజము
కర్మఫల మేరి నేనియుఁ గట్టికుడుపు

ఇంద్రియముల జయించియు వృత్తులడఁచి
శాంతి వహియించి మృదుల భాషణము చిత్త

శుద్ధి భూతదయయుఁ గల్గు సుజనులకుఁ గ్ర
మమ్ముగా జన్మరాహిత్య మమరు నిజము

స్వచ్ఛముగ వెల్గి దీపంబు చమురుతోడ
న శమియించెడి చందమ్మునఁ గ్రమముగఁ బొ
సంగుఁ గర్మరాహిత్యంబు జన్మ రహిత
తయును సమకాలమున నింత తథ్య మరయ

జ్ఞాన మార్గమందు సమరీతిఁగఁ బ్రవేశ
మబ్బెనేనిఁ దృష్ణ యుబ్బఁ జేయు
దాహ మెల్ల నడఁగుఁ దున్మార్గమున దివ్య
సుమ చయంబువంటి సుఖము దొరకు

మనస్సునకెక్కి నాటుకొనిపోవునట్టి యుపమానములతో నరటి పండొలిచి చేతిలో పెట్టినటుల మోక్షసంపాదనకు సాధనంబయి జ్ఞానావబోధకంబయిన నుత్తర మీమాంస సారమును సముద్రము నాపోశనకు తెచ్చినటుల నైదు పద్యములలోనికి తెచ్చిరి. బుద్ధచరిత్రయందు దాదాపు రెండువందల పద్యములు పరమార్థమును బోధించు పద్యములు గలవు. గోదేవి పూర్వహరిశ్చంద్ర లందలి వేదాంత విషయములనుగూడ నేకముచేసి చూచినచో నద్వైత విశిష్టాద్వైత మతముల సారము పిండి స్వానుభవములను వానితో రంగరించి జ్ఞాన సమ్మిశ్రమైన రసాయనము పాఠకులకు తయారుచేసి యందించిరని తోచును. ఈ కావ్యము వ్రాయునప్పటికి తిరుపతికవుల వయస్సు కొంత పడమరకు తిరిగినది. తరువాతి కావ్యములెంతో కొంత వేదాంత విషయములవైపు మొగ్గుచునే వచ్చినవి. వీరి కావ్య రచనలు జీవితకథతో సమ్మేళనముచేసి చూచినచో

శైశవేఽభ్యస్త విద్యానాం
యౌవనే విషయైషిణాం
వార్ధకే ముని వృత్తీనాం
యోగేనాంతే తను త్యజాం

అను కాళిదాసు శ్లోకము జ్ఞాపకమునకు వచ్చును. తిరుపతి కవులు దేవీభాగవతము అను పురాణమునుగూడ తెనిగించిరి. దానిని తమ గురువులగు చర్ల బ్రహ్మయశాస్త్రిగారి కంకిత మిచ్చిరి. దేవీ భాగవతము పండ్రెండు స్కంధముల గ్రంథము. అందు నవమ స్కంధములోని మొదటి వై దధ్యాయములు చివరి రెండధ్యాయ ములు దివాకర్ల వేంకటావధానిగారును మిగిలిన స్కంధము నిశ్శం కుల కృష్ణమూర్తిగారు నాకొండ రామమూర్తిగారు నాంధ్రీకరించిరి. దశమ స్కంధము వేంకటశాస్త్రిగారి పినతండ్రి కుమారుడు చిన వేంకటశాస్త్రిగారు తెనిగించిరని భాగవత పీఠికయందు కలదు. మిగి లినది తిరుపతి వేంకటకవులు రచించిరి.

దేవీభాగవతము నంతకు పూర్వము త్రిపురాన తమ్మనదొర గారు, పాపయారాధ్యులు, దాసు శ్రీరాములుగారు నాంధ్రీకరించిరి. వీరిలో దాసు శ్రీరాములుగారి యాంధ్రీకరణము తొల్లింటి పురాణ కవులదారి ననుగమింపక చాల విషయములందు స్వతంత్ర మార్గము త్రొక్కినది. పాపయారాధ్యుల తెనిగింపు కొంత బిగింపుకలదైనది. తిరుపతికవులు తిక్కనాదుల దారి ననుసరించి యొకొక్క చోట పెంచియు నొకొక్కచోట కుంచించియు ననౌచిత్యములను పరిహరించి రసవంతముగా కృతిని రమణీయాకృతి కలదానినిగా చేసిరి. అశ్వినులు సుకన్యను కలిసికొనిరి. ఆమె యందచందముల కబ్బురపడిరి.

ఒక్కింత నిలువు మో జల
ముక్కచ! అశ్వినుల మేము మోదమ్మున ని
న్నొక్కటి యడిగెద మిక్కడ
కెక్కతమున వచ్చి తేడ కేగెదు చెపుమా?
స్తుతి కాదు నీకు నెవ్వఁడు
పతి? జనకుం డెవఁడు?

అని నిగూఢ ప్రణయమున ప్రశ్నించిరి. సుకన్య—

ఏను శర్యాతి కూతుర మాననీయుఁ
డైన చ్యవన మునీంద్రున కనుఁగు భార్య

నంధుఁడును ముదుసలి యగునట్టి భర్త
కెల్లపుడు సేవ చేయుదు నిచట నుండి

నను నా యనుమతి గొని మ
జ్జనకుం డమ్మునికినిచ్చె సద్వర్తనుఁ డా
యనఘుని యాశ్రమ మల్లది
చనుదేఁ దగు మీర లెవరొ సచ్చారిత్రుల్

అని సమాధానము చెప్పినది. ఈ రెండు పద్యములు రెండు రత్నములవలె గంభీర భావమరీచి మాలికలను వెలారించుచున్నవి. సుకన్య మహారాజసముగా మొదట 'నేను శర్యాతి కూతురను' అని నుడివినది. శర్యాతి లోకప్రసిద్ధుడగు మహారాజు. ఆయన కూతురనుటచేత తాను ఆగర్భ శ్రీమంతురాలనని తెలుపుకొనినది. తరువాత తన వల్కలాజినములకు కారణము 'మాననీయుడగు చ్యవన మునీంద్రునకు భార్య' నన్నది. మాననీయు డనుటచేత చ్యవనుని కీర్తి ప్రతిష్ఠలు లోకమునకు విదితములు. అతడందరిచేత గౌరవింపఁబడు వాడని తెలుచున్నది. అతడు మునులం దింద్రునివంటి వాడని తనభర్త గొప్పతనము, తనకు భర్తయందుగల యభిమానము వ్యక్తపరచినది. అట్టి చ్యవనునకు నే 'నునుఁగు భార్య' నన్నది సుకన్య. అందువలన చ్యవనునికి సుకన్య యందుగల ప్రేమగూడ విశదపరచినది.

ఆ కారణముచేత తాను రాచకూతురైనను భోగభాగ్యములను పరిత్యజించి ప్రియుడగు తన భర్తను సేవించుచుంటినని ఫలితార్థము. వా రశ్వినీ దేవతలమని చెప్పుకొనిరి. దేవతలనగానే యామె కాశ పొడమినది. తనభర్త ముదిమి యంధత్వము వాపుదురేమోయని తలంపు. 'అంధుడు ముదుసలియగునట్టి భర్త కెల్లపుడు సేవచేయుదు నిటనుండి' అన్నది. వారికి తనయందు దురూహ కలుగకుండవలయునని 'తాను చ్యవనుని స్వయముగా వరించితి' ననుచు 'నను నా యనుమతి గొని మజ్జనకుం డమ్మునికిచ్చె' నని

తెలిపినది. పై పెచ్చు చ్యవనునివలన తనకే కష్టములు కలుగనేరవని సద్వర్తను డా యనఘుండని విశదపరచినది. ఇట్టి మిక్కుటములగు గంభీరభావములతో సుకన్య సమాధానము చెప్పినది. ఇట్టిపద్యములు భారతమునందు తప్ప మరేపురాణమునందు కనిపించవు. ఇవి తిరుపతి కవుల పద్యములు. పాపయారాధ్యులు

> శర్యాతి యనునట్టి జననాథు పుత్రిని
> చ్యవన మహర్షి కి సతిని నేను
> అవనీశుఁ డిమ్మని యంధుఁ డంచని యెంచ
> కర్పించె మీరు మా కతిథులైరి

అని సుకన్యచేత ననిపించిరి. 'అంధుఁడంచని యెంచకర్పించె' అనుటవలన సుకన్యకు భర్తయందనిష్టత ద్యోతకమగుచున్నది. ఆశ్వినుల దురూహకు మరింత సావకాశము కలిగించుచున్నది. పూర్వకథా సందర్భమునకు విరుద్ధముగా నున్నది. అందుమూలమున నసత్యదోషము సుకన్యయందు నాపాదింపబడినది. సుకన్య పాత్రపోషణ చెడిపోయినది. తిరుపతి కవులు పూర్వాపరకథా సందర్భములకు విరుద్ధము రానీయకుండ సుకన్యపాత్ర పోషణము భావగాంభీర్యతతో జతపరచి రసవంతముగా నొక చిన్న కావ్యమువలె నాటక రచనను బోలు సంభాషణలతో కథ చివరి వరకు మనోరంజకముగా నుండు నటుల వ్రాసిరి. ఏమాత్రపు విజ్ఞానముగల స్త్రీ పురుషులైనను చదివి యర్థము చేసికొనునట్లు పేలవముకాని తేట తెనుగు పదముల కూర్పుతో దేవీభాగవతమును తిరుపతికవులు రచించిరి. మచ్చునకు

> తన్వి వేసవి తాలవృంతమ్ము విసరి
> నిదుర పట్టెడిరీతి ననిలము గొల్పు
> మగువ హేమంతమునఁ జలిమంట వైచి
> యడుగు సుఖమగునె యని యమ్మునీంద్రు

పద్యము పద్యభావ మొకదానితో నొకటి పొందుకలసి స్వభావ సిద్ధముగాను రసవంతముగాను నున్నవి. దాసు శ్రీరాములు

గారు ఈ భావమును మూలానుసారముగా గీతము కందపద్యములలో నమర్చిరి.

సుప్తి సుఖముకొఱకు సురటిని జేఁబట్టి
వీచుచున్....
ఒడయఁడు చలికాలంబునఁ
గడగడ వడకంగఁజూచి కాష్ఠంబులఁ దా
నడవికిఁ జని తెచ్చి పదం
పడి రవులంజేసి యుష్ణభావము చూపున్

తిరుపతికవుల రచనకు దాసు శ్రీరాములుగారి రచనకు గల తారతమ్యము చదువరు లూహించుకొన గలరు. పాపయారాధ్యుల వారు రెండవ పద్యభావము నొక శార్దూల వృత్తమునందు వ్రాసిరి. చాలవరకు నిరర్థక పదములతో నింపిరి.

తిక్కన భారతాంధ్రీకరణమునందు మూలములోని యనవసరములను విడిచి, కావలసినచోట రసముకొఱకు నందముకొఱకు పదములను చేర్చుచు వచ్చెను. ఆ పద్ధతినే తిరుపతికవులు భాగవతాంధ్రీకరణమునం దనుసరించిరి. ఇక్ష్వాకు రాముని చరిత్ర హరిశ్చంద్రోపాఖ్యానము, సత్యవ్రతోపాఖ్యానము, ధ్రువసంధ్యుపాఖ్యానము మొదలగు కథలు హృదయంగమముగా నున్నవి.

తిరుపతికవులు దేవీ ఉపాసనాపరులు. ఆమెను కర్తృపదముగా వాడవలసి వచ్చినప్పుడు "అంబ, అమ్మ, తల్లి" అను పదములనే పెక్కుచోటుల వాడుచు నా దేవియందలి వారి యపారభక్తిని మాతృభావమును చదువరులకు గోచరించునటుల చేయుచు వచ్చిరి. బ్రహ్మాది దేవతలు చూచిన యాదిశక్తి—

అరుణాంబరమునఁ జెన్నలరారు వగలాడి
యెఱుపైన యధరోష్ఠ మెసఁగుబోటి
కావిపూల్ గల మాలికలు ధరించిన చాన
రక్త గంధంబూను రంగులాడి

శోణమ్ములగు నేత్రకోణము ల్గల కొమ్మ
యౌవన మధ్యస్థమైన చాన
తొలకరి మించుతోఁ దులఁదూఁగు నెలనాగ
యర్కబింబ స్ఫూర్తినలరు కలికి

ఇందిరాకోట్ల నెదురించు మందయాన
ప్రతి పదమ్మును దయచిమ్ము పద్మనయన
మంద మందస్మితం బొప్పు సుందరాంగి
యెన్నడును జూడఁబోని యయ్యింద్రు వదన

బిసరుహ ముకుళమ్ముల పస
గసిమసఁగెడి గుబ్బదోయి గడలుకొనఁగ సొం
పెసఁగు మణిభూషణము లిం
పెసలార నెసంగె సర్వశృంగారముగన్

అని వర్ణింపబడినది. వీరి కావ్యములందలి వర్ణనకు దీనికి కొంత భేదమున్నది. ఇది పౌరాణికము. తిక్కనగారి వర్ణనా వైశద్యము దీనియందు లేదు. మహిషాసురుడు దేవినిచూచి

వీరుఁడనైన నాయెడ వివేకము కల్గినదానవై సుధా
సారము వోని చూడ్కులఁబొసంగఁగఁజేసి కఱంచితేని దు
ర్వారసుఖంబు దాననగు బాలరో! యిర్వురకీ సుఖంబుతో
నారయనే సుఖమ్ములును నంద వనుత్తమమౌ కతమ్మునన్

సురపతిఁ దొట్టి నిర్జరుల సొంపఱఁ జేసితిఁ గామరూప చా
తురిఁగలవాఁడ నిట్టిననుఁ దొయ్యలి! దాసునిగాఁగ నేలి యా
దరముగఁ బట్టరాజ్ఞివయి దానవులెల్ల విధేయులై మెలం
గ రమణ నాదు వైభవము గైకొని పొందఁగరాదె భోగముల్

అనినాడు. దేవి మందహాసము గావించుచు

నరునకు బందనార్థముగ నాతి సృజించఁబడెన్ దురాత్మ యి
వ్వరవు రహస్యముం దెలిసి భంగురమై కడు హేయమైన సౌ

ఖ్యరసమునం జరింపకుము గల్గు నొకప్పుడు ముక్తిశృంఖ లా
స్థిరులకునేని, వీరలకుఁ దీరదు ముక్తికి నేగ నెన్నఁడున్.
శమమిచ్చుఁ స్థిరసౌఖ్యమద్ది హృదయస్థానమ్మునం జేర్చి యీా
యమరావాసము వీడి జీవమును నీ వాసింతు వేనిన్ నివా
స మొనర్పంగ రసాతలమ్మరుగు మీా చందంబుగాఁగొండు చం
దమయేనిన్ రణమాచరింపుము నినున్ దర్పాంధు దున్మాడెదన్.

అని హితబోధ గావించినది. మహిషాసురుడు—

పూలకుమించి యెక్కుడగు పొల్పునఁ బొల్చెడి మేనిదాన! నే
నాలముచేసి నిన్నడచునంతటి సాహస మూన నిస్సిరో!
బేలనె? నీ కృపంబడసి పెండిలి చేసికొనంగ నుంటి ని
న్నో లలితాంగి! యిట్టి కఠినోక్తులు నన్నన నీకు న్యాయమే.

అని సమాధానము చెప్పెను. ఇటువంటి యసిలోమ బిడాలాదులతోడి దేవి సంభాషణలు అంతరాంతరములందు యుద్ధ వర్ణనలు పంచమ స్కంధమంతయు చదువుటకు మనస్సు పుట్టించుచుండును.

కర్ణముదాక చాపమును గాఢఁగలాగి శరమ్ములన్ రయో
దీర్ణత నేయ యంబ వెనుదీయక యంతరమంద యన్నిటిన్
జూర్ణముచేసె నిర్వురకుఁ జూపఱు భీతి మునుంగ నిట్లు సం
పూర్ణరణంబు వాటిలె నపూర్వము ఘోరమునై పొరింబొరిఁ.
తత్తరపాటు మాని తగు దర్పమున న్నిలు మిప్డు మాధవిన్
హత్తినవేడ్కఁ ద్రావి సురలందఱునుం గొనియాడ దుర్మదో
న్మత్తుని నిన్నుఁ జంపెద రణమ్మున నంచు సువర్ణపాత్ర మా
యత్తముసేసి త్రావెఁ దగ నాసవముం జల ముప్పతిల్లఁగన్.

ద్రాక్షాసవ పానం బిటు
లక్షీణ గతిం బొనర్చి యయ్యంబిక బల్

దక్షుత మెఱయఁగఁదా హా
ర్యక్షారావం బొనర్చె నమరులు బెగడన్.

ఓరిమదాంధ! చక్రమిది యోడక నీదు శిరంబుఁ దీసి దు
ర్వారత నయ్యమాలయ నివాసము నీకొనరించు నెమ్మొయిం
బోర నొకింత నిల్వు మని భోరన నెత్తురు మీఁది కొల్కఁ న
వ్వైరి శిరంబుద్రుంచినఁ గబంధము భూద్రమునాఁ భువింబడెన్

ఇట్లు యుద్ధఘట్టములందు సైతము పాఠకులకు విసుగొదవ కుండునటులు నాతికఠినములగు పదములతోడను నాతిదీర్ఘములగు వర్ణనలతోను దేవీభాగవతమును దెనిగించిరి. దేవీభాగవతమునందు తిరుపతికవులు మొదటనుండి చివరివరకు సంస్కారసహితములైన జానగు దేశీయపదములనే వాడుచువచ్చిరి. భాషా సౌలభ్యము నాజూకుతనము వంటిది. దానికి తోడు బిగువు కూడ నుండ వలయును. కృతియొక యువతి. అంగసౌందర్య మెంతయున్నను కదియ రాదిగినచో ప్రిదిలి పోకూడదు పాపయారాధ్యులకైతలో కొంత బిగువున్నది కాని యది కృత్రిమము. సహజసిద్ధముకాదు. అందుమూలమున తిరుపతికవుల దేవీభాగవతము బిగువు తరిగినను మెరుగనిపించును.

## ౬
# వివాద కావ్యములు

తిరుపతికవులు రాజుల మన్ననలను బడయుచు ప్రజాసముదాయముల యాదరమును బొందుచు పండితుల వినుతుల నందికొనుచు తెనుగు దేశ మంతటను సంచారము గావించిరి. ఏనుగులపై నెక్కిరి. బిరుదులను బడసిరి. గండపెండరములను తొడిగించుకొనిరి. పతకములను ధరించిరి. వారి కీర్తి దిగంత విశ్రాంతమైనది. తెలుగు సరస్వతికి బంగారు పల్లకీలు కట్టించి యూరూర నూరేగించిరి. విజయ శంఖము పూరించి వీరవిహారము గావించిరి. ఎచ్చటికి పోయినను వారి కెదురులేకపోయినది. ఎదిరించినవారి నదలించి మొదటి బెదురులోనె విజయము సాధించిరి. సాధించిన విజయములు చిరస్థాయిగా నుండవలయునని కాబోలు వానిని గ్రంథస్థములు గావించిరి.

అట్టివానిలో గీరతము ప్రధానమైనది. గీరత మనగానె భారతము స్మృతిపథమునకు వచ్చును. భారతమునకు నిందార్థకము గీరతమని తలంచుచున్నవారు కలరు. గీః అనగా మాట యని యర్థము. గీః=మాటయందు, రతాః=ఆసక్తి లేక ప్రీతికలవారు, గీరతాః=గీరతులు వాచాలురు అని యర్థము. గీరతులను గురించి చెప్పిన కృతి గీరతము. ఈ కృతికి కథానాయకులు రామకృష్ణకవులు. వీరిలో మొదటివారు ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, రెండవవారు వేదుల రామకృష్ణశాస్త్రిగారు. ఈ జంటకవులు మేనత్త మేనమామ బిడ్డలు. ఆరామద్రావిడ శాఖీయులగు బ్రాహ్మణులు. రామకవి జన్మస్థానము కాకినాడ తాలూకాలోని పల్లెపాలెము. కృష్ణకవి జన్మస్థానము తణుకు తాలూకాలోని కాకరపఱ్ఱు. రామకృష్ణకవులు చర్ల నారాయణశాస్త్రిగారియొద్ద సాహిత్య గ్రంథములు చదివిరి. వేంకటరామశాస్త్రిగారు స్త్రీ ప్రత్యయాంతమువరకు సిద్ధాంత కౌముది చెళ్ళపెళ్ల వేంకటశాస్త్రిగారియొద్ద అధ్యయనము గావించిరి.

కొంతకాలము రామకృష్ణశాస్త్రిగారు కూడ శుశ్రూష గావించిరని వాడుక. భ్వాది ప్రకరణమునుండి రెండుమాసములు జయంతి భగీరథ శాస్త్రిగారియొద్ద వేంకటరామశాస్త్రిగారు కౌముది చదివిరి. అనంతరము రామ కృష్ణకవులు రామడుగుల వీరేశ్వరశాస్త్రిగారి యొద్ద వ్యాకరణశాస్త్రము పూర్తిచేసికొని న్యాయశాస్త్రము విశ్వపతిశాస్త్రిగారి యొద్ద నభ్యసించిరి. తిరుపతికవుల యొద్ద శుశ్రూష కావించు కాలమునందే రామ కృష్ణకవులు శతావధానాష్టావధానములు శత ఘంటకవనము లల్లుచు పేరు సంపాదించిరి. కావున రామకృష్ణకవులు తిరుపతి కవులకు శిష్యులు.

రామ కృష్ణకవులు తమ యవధాన చాకచక్యముచేత శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరాయేంద్రులను మెప్పించిరి. మహీపతి సూర్యరాయేంద్రులు పిఠాపుర సంస్థానాధిపతులు. ఉభయ భాషా పోషకులు. పెక్కుమంది కవులను పండితులను సన్మానించిరి. ఆంధ్రభోజుడను బిరుదనామము తాల్చిరి. దేవులపల్లి సోదరకవుల యనంతరము సూర్యరాయేంద్ర మహీపతి రామ కృష్ణులను తన సంస్థానకవులుగా నియమించుకొని మిగుల గౌరవించెను. పిఠాపురము నుండి రామ కృష్ణకవులు కవితయను నొక మాసపత్రికను వెలువరించిరి. అందు తిరుపతికవుల గ్రంథములను విమర్శించిరి. దానితో వైరాగ్ని రగులుకొన్నది. తిరుపతిశాస్త్రిగారు వారిని శిష్యభావమున గర్హించిరి. కాకి కోకిలయను వ్యాసమును ప్రకటించినారు రామ కృష్ణ కవులు. పక్షము లేర్పడినవి. మంటలు రేగినవి. గీరతము బయలు వెడలినది.

గీరతము నాలుగు భాగములు. అధిక ప్రసంగదమనము, గురుదక్షిణ, విగ్రహారాధన, లోకాభిరామాయణము. అందు మొదటిది పదునైదు పర్వములు. రెండవది పదిపర్వములు. చివరివి రెండు పర్వములు. మొత్తమిరువదియేడు పర్వములు. గీరత భాగములకు పర్వములని పేరు పెట్టుటచేత భారత ప్రయోజనమే గీరతమునకు గూడ కలుగవలయునని తిరుపతికవుల తలంపయి యుండవచ్చును.

భారతము ధర్మాధర్మములకు పోరాటము. గీరతముకూడ నట్టి గ్రంథమే. రెంటియందు ధర్మమునకే విజయము వాటిల్లినది.

గీరతము వివాదగ్రంథము. పద్యములు చదువగానే వారివారి వివాదములు జనసామాన్యమునకు సులువుగా నర్థము కావలయునను తలంపుతో తిరుపతికవులు నిరాడంబరమగు తేలిక భాషను గీరతము నం దుపయోగించిరి. అట్లని నడకలో కుంటు పడుటగాని ధారలో కుంచింపబడుటగాని యుండదు. రైలుబండి ధాటితో కవితా వాహిని పరవళ్ళు త్రొక్కుకొనుచు ముందునకు పరుగులెత్తుచుండును.

తిరిగితి కొంత దేశము ప్రతిజ్ఞ లొనర్చితి నిల్పుకొంటి మ
మ్మరుల నదల్చి సత్కవుల గౌరవపద్యము లందుకొంటి ది
క్కరికెనయీతఁడన్ యశము గాంచితి కాంతువు కాంచుచుంటివో
తిరుపతిశాస్త్రి నేడనుమతింతువె భీరులతో వివాదముల్.

నిరాఘాటమగు ధాటితో వైశికివృత్తియందు రీవిగా పద్యమును నడిపించుటలో తిరుపతికవులకు సాటియగువా రింకొకరు లేరు. పదము లెంత చిన్నచిన్నవయి ముద్దు లొలుకుచుండునో పద్యము లందలి వాక్యములుకూడ అంత చిన్నవయి చక్కగా పొందుకలిగి యుండును. తిరుపతికవుల పద్యము లన్నియు నేక కర్తృత్వముగల భిన్న వాక్యముల సంపుటీకరణములయి యుండును. నన్నయాదులవలె పద్యమంతయు నేక వాక్యత కలిగియుండదు. ఈ పద్ధతి తిక్కనగారిది. పదములు చిన్నవయినకొలంది వాక్యములు తదనుగుణముగా చిన్నవగుచుండును. మచ్చునకు

వరమునఁ బుట్టితిన్ భరతవంశము చొచ్చితి నందు పాండుభూ
వరునకుఁ గోడలైతి జనవంద్యులఁ గాంచితి నీతి విక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్ సహాజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాథ యిన్నిటఁ బ్రశస్తి వహించినదాన నెంతయున్.

పై పద్యమునకు దీనికి రచనలో నెట్టిభేదము కన్పించదు. కాని తిక్కనయందు నచ్చటచ్చట కనిపించు క్లిష్టాన్వయములు తిరుపతి

కవుల పద్యములందు మచ్చునకైనను కనిపించవు. వారి కవితలో ప్రసాదగుణము మెండు. ఏ పద్యము చూచినను తేలికగా నన్వయమగుచుండును. గీరత మొక యావేశముతో వ్రాసిన గ్రంథము. ఆ యావేశము ప్రతిపద్యమునందు కనిపించును.

చుక్కలు రాలలేదు రవి సోముల పోకడ మాఱలేదు న
ల్దిక్కులు కూలలేదు జలధిజ్వలనం బుబుకంగలేదు నేఁ
డక్కట! రామ కృష్ణకవు లర్భకు లేగతి సేయనేర్తు రా
ధిక్కృత వైరి వేంకటసుధీకవి మాళికి శృంగభంగమున్.

గోణము కట్టుటాది బుధకోటి నుతింపఁ గవిత్వవైదుషీ
వేణికయాచుఁ బేర్పడిన వేంకటశాస్త్రికి శృంగభంగమన్
వాణి వినంబడన్ బ్రజలు నమ్మరు చింతవహింప రింతకుం
బ్రాణముతోడఁ బంపిరని మాత్రము మిమ్ము నుతింత్రునిచ్చలున్.

తిరుపతి వేంకటకవు లుభయ భాషలందు నిగ్గుదేరిన పండితులు. వారి హృదయములు శబ్ద సముదాయములకు తరగని కొటారులు. లేఖిని చేతపట్టినంతనే కవితావేశముతో రసావేశము పొత్తుకలిసి పదములు పరంపరలుగా దొరలుకొని వచ్చును. కావుననే యా పద్యములంత దూకుడు కలిగి పాఠకుల మనస్సు వానితోపాటు లాగుకొనిపోవుచు రసావేగము కలిగించును. ఇట్టి పద్యములు గీతరమునందు పందలకొలంది కాననగును. వారి లేఖిని సర్వసమర్థమైనది. అది మహావేగము గలిగి నన్నయ గవితావాహినితో పందెముచరచి హిమవత్పర్వత శృంగాగ్రమునుండి ఘుమంఘుమారావములతో చరియల నొరసికొని క్రిందికి దుముకుచు వచ్చు గంగా తరంగిణివలె నతి గంభీర వాగుంభనలతో

మాకన్న న్మహనీయులైన కవులీక్ష్మామండలిన్ లేక పో
రీ కాలమ్మున యుష్మదీయ కవితా ద్వీపమ్ము ముంచంగ న
స్తోక శ్రీకమదాశుధార కవితా తుంగార్భటీ ఘోర గం
గా కల్లోలవతీ ప్రవాహ భరవేగ ప్రక్రియల్ చాలవే.

గరువపు మాటలందుఁ జెలఁగన్ జగమెల్లఁజరింపఁజాలు ద్రి
మ్మరితన మే కవీంద్రులకు మైకొనఁ జాలు నిరర్గళామృతా
కర రసపుంజ మంజుల వికస్వర చారుకథా సుధా ధురం
ధర బహుళ ప్రబంధకవితా వనితా చతురోక్తి లేనిచోన్.

ఇట్లు ఆవేశము పెరిగినకొలంది వ్యస్తపదములతో నారం
భించిన పద్యము సంస్కృత దీర్ఘసమాసములోనికి మారి చివరి వరకు
నొకటే ధాటితో శబ్దాలంకార సహితముగా పరుగెత్తును. ఈ విధపు
నడక నన్నయ పెద్దనలయందు మాత్రమే కనిపించును, నన్నయ

జలధి విలోలవీచి విలసత్కలకాంచి సమంచి తావనీ
తల వహన క్షమం బయిన దక్షిణ హస్తమునం దదున్నమ
ద్గళదురు ఘర్మవారికణ క్రమకరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిందిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్

పెద్దన—

బహురత్నద్యుతి మేదురోదర దరీభాగంబులం బొల్చు ని
మ్నమహీకాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమ న్నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మత్కాంతారసంతానముల్

ఈ పద్యములు నాలుగు నొకటితరువాత నొకటిగా చదివి
నచో నెరుగనివా రివి యన్నియు నొక్కరే రచించిరని తలంపక
పోరు. తిరుపతికవుల గీరతములోని శాంతింపు పర్వమునందలి యైదు
పద్యములు నింతకంటె మరింత దూకుడు కలిగియుండును. నన్నయ
సమాస రచనకు తిరుపతి కవుల సమాసరచనకు కొంత తారతమ్యము
కలదు.

నన్నయ పోకడలు బాగుగా నర్థము చేసికొనినవా రది
గ్రహించుకొనగలరు. నన్నయ పద్యరచన తిక్కన చెప్పినటుల
కవితావేశమువలన సమాసములు గొలుసులోని గొల్లెములవలె
పదములు ఒకదానితో నొకటి లంకె కలుపుకొని లయ తాళ సహి

తముగా పొందిక కలిగియుండును. అందు నడకలో దూకుడుకంటె పదములలో ప్రసన్నత మెండుగా నుండును. మాదిరికి

వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలావనై లావలీ
లవలీ లుంగ లవంగ సంగత లతా లాస్యమ్ము లీక్షించుచున్

ఈ సమాసము కూర్పులోని పదముల పొందిక లయాతాళ సహితమగు శబ్దాలంకారములోని యందము చదువరులు గ్రహించు కొనగలరు. పెద్దన నన్నయగారిని సర్వవిధముల సమాసఘటనము నందు చాలవర కనుకరించెను.

అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహు ర్లురదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానురూప పరిఫుల్ల కలాప కలాపి జాలమున్.

ఈ రెండు రచనలయందు దూకుడుకంటె ప్రసన్నత యెక్కువ కలదు. తిరుపతికవులకు ఇట్టి పద్యరచనలో దూకుడధికముగా కని పించును. దానికి తిరుపతి కవుల కోపావేశమే కారణము. ఆవేశ పూరితములగు వారి హృదయములనుండి పదములు దుముకులాడుచు వచ్చును. అదియే వారి పద్యములం దగుపించు విశేషము.

శాంతింపుండని రాయబార మపురా శాంతింప కేమున్న ద
శ్రాంత ప్రస్మయ దస్మదీయ కవితాచండాసి ఖండికృతా
హంతాదంతుర కాకవి ప్రతివచః ప్రారంభ రంభా కురు
ట్కాంతారమ్ములు నగ్గిమగ్గి యసదై కన్పట్టు నిప్పట్టునన్

మొదలగునవి చూచుకొనవచ్చును. నన్నయ పెద్దనల సమా సములం దగుపించు నిబ్బర మీ సమాసరచనయం దగుపించదు. ఇట్టి సమాస సంఘటితములైన పద్యము లనుప్రాసతో నంత మొనరించుట నన్నయ కొక యలవాటు. దానిని పెద్దన యనుకరించెను. తిరుపతి కవులు కూడ నా యలవాటును పుణికి పుచ్చుకొనిరి.

''విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్'' అని నన్నయ ''మత్కాం తార సంతానముల్'' అని పెద్దన. ''కన్పట్టు నిప్పట్టునన్'' అని

తిరుపతి కవులు. తిరుపతి వేంకట కవులకు గురుదత్తమగు వ్యాకరణ శాస్త్రము వజ్రాయుధము. దానిని నూరి పదునుపెట్టి యెప్పటికప్పుడు ప్రయోగమున కుపయోగించునటుల చేసికొనిరి. ఆ శాస్త్ర పాండిత్యమునందు వారికి సంపూర్ణ విశ్వాసము కలదు. అది వారికి వజ్ర కవచము. దానికితోడు రెండు భాషలలోను కవిత్వపు సాములందు వారారితేరిన దిట్టలు. వందలకొలది యవధానములు శతఘంట కవచములు దేశ దేశములు తిరిగి చేసినవారు. విజయములు సాధించినవారు. తమ్ము జయింప గలవా రెవరు లేరని వారి శక్తిసామర్థ్యములందు గట్టి నమ్మక మున్నది. అది వారి కాత్మబలము ప్రసాదించినది. వారు గుండె తీసిన బంటులు

ఆశుకవిత్వమందున జయంబు వహింతురొ శబ్దశాస్త్రమం
దాశ వహింతురో మఱియు నద్భుతరీతి శతావధాన ఘం
టాశత పద్యకల్పనల డంబు వహింతురొ యీ సభార్థ మే
దేశము మీకు సమ్మతమొ తెల్పుఁడు సల్పుఁడు తత్ప్రయత్నమున్

అని రామ కృష్ణ కవులను కయ్యమున కాహ్వానించిరి. పాండిత్య ప్రకర్ష యందలి విశ్వాసము, ఆత్మశక్తియందలి నమ్మకము, ఈ రెంటి మూలమున తమ్మెదిరించిన రామ కృష్ణ కవులందలి కోపావేశము, గీరతములోని ప్రతి పద్యమునందు కనిపించును. తిరుపతి కవులం దొక గొప్ప సుగుణ మున్నది. ఆ సుగుణము సర్వ సామాన్యముగా నితరులం దుండదు. వైరియైనను వానియందు సుగుణ మున్నచో దానిని గుర్తించి ప్రశంసింతురు. రామకృష్ణ కవులు చక్కని కవితాధార కలవారు. తిరుపతికవు లది గుర్తించి

గారెల పిండివంటకయి కాంతుఁడు కాంతను బృచ్ఛచేయ నా
సారసనేత్ర వ్రేలొకటి చయ్యన చూపి "యిదొక్కఁడున్న దా
ధార" మటన్న సామెతగ ధార యొకించుక కల్గుమాత్ర నే
వీ రవధానపుం బనికి వీఁడుదులై ప్రయత్నించి రక్కటా!
దారిం జిక్కిన లాడ మొందుగొని మోదంబంది "యీ మీద నే
స్వారిం జేయఁగ మూఁడులాడములు నశ్వమ్మొక్కఁడుం" లో"టటం

చూరం జొచ్చిన భంగి బాలకవు లేదో కొంచెమార్జించి యా
ధారాధారమునన్ భవత్పదవిక్తై ధ్యానించుచున్నా రహో

అని వెక్కిరించిరి. వారి గుణమునందువలెనే యీ వెక్కి రింతయందు సైతము రాజస మున్నది. ఆ రాజసము పద్యభావము నందు నడకయందు కూడ కలదు. వారి కవితాధార యమోఘ మయినది. సౌలభ్యమున్నను "ఎన్నడు బెండుపడ లొక్కదవ దెవ్వని నాల్కకు" అని సౌందరనందము కృతికర్తలు చెప్పినటులు ఆశు పద్యములందును పేలవముండదు. తాము బోధించు విషయములు పౌరాణిక చరిత్రాత్మక కల్పిత దృష్టాంతములతో హృదయంగమ ముగా చెప్పుదురు. అదియొక కవితా సౌందర్యమునకు కారణము. అందుమూలమున పద్యము వినసొంపుగా నుండును.

కల్లుద్రావుదురొక్కొ కలఁడల్ల బలరాముఁ
డని యెంచి యెవ్వరే నలఘు మతులు
జూదమాడుదురొక్కొ సూరు లేరేని ధ
ర్మాత్మజాతుండు దృష్టాంత మనుచు
తల్లిఁ జంపుదురొక్కొ తగవేది యెవ రేని
పరశు రాముండన్న వాఁడటంచు
కుక్క మాంసము తిందురొక్కొ విశ్వామిత్ర
మునిమౌళి యున్న వాఁడని తలంచి

ఉత్తమ గుణంబు నేర్చుకో నొప్పుఁగాని
యధమ గుణమున కకట! దృష్టాంత మేల
కోకిలముగాఁగఁ జక్కని గొంతు వలయుఁ
గాని కృతమును మఱచుటగాదు సూవె

అని రామ కృష్ణులను చక్కగా మందలించిరి. ఇట్లు దృష్టాంత ములను చూపుచు రచించిన పద్యములు గీరతమునందేకాక నానా రాజ సందర్శనాది యితర గ్రంథములందును పెక్కు గలవు. అవి యా యా సందర్భములందు మింట వెలుంగు మినుకు తారలవలె

వికాసము కలిగించుచుండును. ఇట్టి పద్యములు తిరుపతి కవుల సద్య స్స్ఫూర్తియు పౌరాణిక చారిత్రక లౌకిక విజ్ఞానసంపత్తియు వేనోళ్ళ చాటుచుండును. ఇట్టి మందలింపులతో రామ కృష్ణకవులను తిరుపతి కవులెంత విచిత్రముగా నుపాలంభించిరో యీ క్రింది పద్యమునందు గోచరించును.

గుట్టును మట్టునుం దెలియ కోయిలపిట్టవుగాన నా యెడం
జెట్టయటన్న నిశ్చయముఁ జేసితె నీకుఁ గుమార! నాకడన్
జుట్టమొ దైవమో యనిన చూపుననున్న నృపాలు రెందరో
పట్టణసీమలం గలరు పల్లెలయందుఁ గలారు పుత్రకా!

ఇందలి "కుమార, పుత్రక" శబ్దముల యర్థవైచిత్ర్యము పాఠకు లూహించుకొనగలరు. తిరుపతికవుల గీరతము వివాదగ్రంథమయినను శిష్యులగు రామ కృష్ణకవుల యధర్మవర్తనము గురువులగు తిరుపతి కవుల సత్యధర్మసంస్థాపనార్థ మొనరించిన వాక్సమరము భారత యుద్ధమువలె సాగి కావ్యత్వమునకు స్థానము కల్పించుకొనినది. అందొ కొక్కచోట నన్నయ కవనంపుఁ బోకడల కనుగతమ్ములగు దీర్ఘ సమాస సమాకలితంబులగు పద్యములును తిక్కన రచనల కనుకార ములయిన మృదుమనోహరములగు దేశీయ పదముల పొందిక గల పద్యములు చాలవరకును గలవు.

ఏ రకపు రచన వారు సాగించినను ప్రతి పద్యములోను చదు వరుల మనస్సు నాకర్షించుకొనిపోవు ధారాపటిమ, పాండిత్య ప్రకర్ష, ఆత్మవిశ్వాసము, రాజసము కనిపించుచుండును. నిండికగల పండి తుడు తిరస్కారము సహింపలేడు. సూర్యకరస్పర్శచేత సూర్యకాంత మణివలె వాని హృదయము భగ్గున మండిపోవును. కవనంపు సహా చరత్వ మున్నవో నది రసమయత్వమును బొంది బహుముఖముల బహురీతుల నావేశముగాను పరిహాసముగాను నుపాలంభముగాను ఆత్మస్తుతి పరనింద లంతర్భూతములయి పద్యరూపములతో వెలు వడును. అటువంటిదే గీరతము.

తిరుపతికవుల కవితారీతులు కావ్యములందు సైతము సులువు దారులు పట్టును. అంతకంటె మరింత సౌలభ్యమును వహించినది భాష గీరతమునందు. ఎంత తేలికతనము తాల్చినను ప్రతిపద్యమునం దావేశము రాశీభూతమయి కనిపించును. తిరుపతికవులకు రామ కృష్ణ కవులు సమాన ఉజ్జీలు కాలేకపోయినారు.

ఐదాఱేఁడులు వోవుదెంచెఁ గలహం బారబ్ధమై, కృష్ణుఁ డే
సోదో గెల్కునెగాని శాంతికొఱకై చూడండు, నే నింట నా
మోద మ్మించుక లేని మోమున నఘమ్ముల్ వ్రేల నిట్లుంటి నా
కేదే రీతిని గోడు వాపఁగదె లోకేశా! కృపాశాలివై

అని యెంతేనియు వేడివేడి మది కాయాసమ్ము రా నిద్రకై
కొని స్వప్నమ్మున నెవ్వరోయొకరు 'నీకుం దేశికాంఘ్రిద్వయా
ర్చనచేఁ దక్క శమంబు గల్గ దురకాశాపాశ బంధమ్ముచే
ననిశంబున్ శివువేఁడి యేమిఫల మయ్యాచార్యు సేవింపుమా

అని బోధించిరి. రామ కృష్ణకవులు పశ్చాత్తాపము నొందిరి.

లోఁదప్పించు నెఱింగి పైకఘువు జల్లుల్ వీఁక వర్షించు ను
న్మాదిన్ శిష్యు నెఱుంగుఁగాక జగ మంతస్తాపముంబట్టియే
పోఁద్రోయన్ బ్రయత్నింత్రుగా కఘును శంభుండాదియా దేవతల్
వాదం బియ్యది శిష్యశాసనముగా వర్ధిల్లుఁగా కెల్లెడన్

అన తిరుపతికవులు మన్నించి యూరకుండిరి. గీరతము ముగిసినది.

గుంటూరుసీమ మొదలయినది. కొప్పరపు సోదరకవులు గంటకు రెండువందల పద్యముల పైన చెప్పగల సమర్థులు.

సున్నయె సంస్కృతంబు పరిశోధన సేయఁగఁ దెల్గుభాషలో
నున్న ప్రవేశ మయ్యదియు నొక్క రవంతయె సత్కవిత్వమం
దున్న రసప్రసార మదియున్ లవమే

యిటువంటివారు కొప్పరపు కవులు. ఇంక

చరణంబుల్ విడనాడి కొన్నిటను బ్రాసస్థానముల్ గొన్ని తొం
దరలోఁ బాడొనరించి కొన్నిట యతిస్థానమ్ములన్ మార్చి య
క్షరముల్ గొన్నిటి మధ్యమధ్య దిగ్భ్రమింగన్ నేర్చియున్నట్టి కొ
ప్పరపున్ వారల యాశుధార కవితావ్యాపార మేపాటిదో

యను ప్రవాదము కలదు. రెండవ సంగతి యందలి సత్యా
సత్యము లెట్లున్నను మొదటి విషయమున గట్టి నమ్మకము ప్రజల
యందు కలదు. నమ్మకమే కాదు సత్యముకూడ అట్టిదే. ఆశుధారా
కవనమ్ము నందు తిరుపతికవులను కొప్పరపు సోదరకవులు మించుదు
రని కొంత లోకము భ్రమసినది. కొప్పరపుకవులు నియోగులు. ఆశు
ధారా వాహినిని వెల్లివిరియించి గ్రామములను నగరములను
ముంచెత్తుచు తెలుగుదేశమునందు సంచార మొనరించుచుండిరి.
వారికి తలకు మించిన పని శతావధానము అష్టావధానము. క్రమ
క్రమముగా నా రెంటియందు వ్రేలుపెట్టుచు వచ్చిరి. కొప్పరపు కవు
లకు నియోగులు వెన్నెముకలై నిలిచిరి. అందుమీద కొప్పరపు
కవులు తిరుపతికవుల మీద దూకులు పెట్టిరి. వివాదము రేగినది.
అది రానురాను నియోగి వైదికి కక్షలుగా పరిణమించినది. కావున
తిరుపతి కవులు

మామయు నల్లుఁడే వెనుకమాటకు నత్తయుఁగోడలే యటుల్
భూమి నియోగు లెల్లరును బూర్వము వైదికులయ్యె నెందు కీ
సాములు సాముచేసెద రసత్యము నూఁతగనూని వైదిక
స్వాములమీఁద నేఁడిది విచారణ సేయఁగదమ్మ శాంకరీ!

అను పద్యముతో గుంటూరుసీమ నారంభించిరి. వీరి వివాద
ములకు ప్రధానరంగము గుంటూరు. అచట జరిగిన విశేషము లీ
గ్రంథము నందు వర్ణితములు. కావున గుంటూరుసీమ యను పేరు
పెట్టబడినది. ఇది పూర్వరంగము, ఉత్తరరంగము అని రెండుభాగ
ములు. కొప్పరపు గవుల యాశుధారావధానములను గురించి తిరుపతి
కవులు వినిరి. తిరుపతికవుల కాటపట్టు బందరు. కొప్పరపుఁగవులకు
గుంటూరు పెట్టని దుర్గము. తిరుపతి కవులు

బందరువచ్చి యచ్చటి సభాసదులం దనియించి వారిచేఁ
జందనమో సుమంబొ మఱి శక్తికి మించని దేదిగాని మీ
రంది కృతార్థులన్ సలుపుఁడయ్య!మమున్ మిముఁజూచు కోర్కెమా
డెందములందు మిక్కిలిఁ గడిందిగ సందడిచేసెడిన్ జుఁడీ

అని కొప్పరపుఁగవుల కాహ్వానము పంపిరి. గుణమున్నచోట ప్రశంసించుట సన్మానింప తలంచుట తిరుపతికవులకు గల యుదార గుణము. ఇట్టి సద్గుణము వారి జాతక చర్యలోను అనంతర చర్య లోను రెండుమూడు చోటులందు కనిపించును. విరోధులయి తమ్ము తిట్టినను దానిని గణింపరు. కొప్పరపుగవు లే కారణముననో బందరు రాలేదు. తిరుపతికవులకు నదురు బెదురులు లేవు. వారి పాండిత్యము వారికి వజ్రకవచము. వారి యాత్మవిశ్వాసము వారికి శ్రీరామరక్ష. తిరుపతికవులు

అచట నియోగి వైదికుల కంతకుఁబూర్వమె కక్షలుంట త
త్ప్రచురత సుంతయుం దెలియవచ్చినవారము గామిఁ బేర్మి మే
మచటికి నేగి మేటిసభయం దవధానము చేయుచుంటి మ
ప్డచటికి వచ్చెఁ గొప్పరపుటాయన చూచు కుతూహలమ్మునన్

అంతవరకు నొకరి నొక రెరుగరు. వారిలో వారికెట్టి వైషమ్య ములు లేవు. "తరచు మీ పాదములె మాకు దొరలుచుండుఁ గైతలో నని కొప్రంపుఁగవి వచించె" ఆ మాటందుకొని

స్నేహముకల్మి తిర్పతి వచించె నొకించుక మీరు శాస్త్రస
న్నాహము కల్గియుండిన ఘనప్రతిభుల్ మిము నింతకన్న ను
త్సాహముతోడ మెచ్చెదరు సంస్కృతభాషకుఁ దెన్గుభాషకున్
స్నేహము మెండు.

ఆ మాట కసలువారి కారాటము లేకపోయినది. మధ్యవారికి మంటలు పుట్టుకొని వచ్చినవి. మాటకు మాట పెరిగినది. ఆ నాటి కది తీరిపోయినది. ఎవరి దారిని వా రరిగిరి. ఆ మరునాడు తిరుపతి కవులను విందునకు పిలువ వచ్చిరి. మీరు "విద్వచ్ఛయ మాన్యతన్

మునుపె తద్దయుఁ గాంచితిరి" "ఆశువునఁ బామరులన్ గరగింపు"
డని యావచ్చినవా రర్థించిరి. "వధానమైన యవ్వల నది యట్లు
చేయుదము పండితు లొప్పని ఫక్కి యేల? వారలు మఱి యన్యు
లొప్పికొను రాణనె పోవుద"మని వేంకటశాస్త్రిగారు సమాధానము
చెప్పిరి. తిరుపతి శాస్త్రిగారు.

కొప్పర పాశుధార యది గొప్పగ మీ మదినెంచి మీరు మ
మ్మప్పగిదిన్ దడాబిడగ నల్లుట కోరుచునున్న వార లా
తప్పుడు కైత చెప్పిన పదంపడి పండితులెల్ల నవ్వ నా
యొప్పమి కేరు పొల్పుడుదు రూరక వాగుటయుం గవిత్వమే

అని తన యసమ్మతిని తెల్పిరి. వచ్చినవారు తమ యాప్తులతో కలిసి
మరలిపోయిరి. తరువాత తిరుపతిశాస్త్రిగారికి వేంకటశాస్త్రిగారికి
జరిగిన సంభాషణ హాస్యరసపూరితము. ఆ పద్యములు చదివి తీర
వలయును.

పద్దెములకన్న నాశువు
సుద్దులలో నెక్కు వేనుఁ జూపించెద నా
సుద్దియుఁ జూతువు నాకీ
విద్దెలలోఁ గలదుసూ ప్రవేశంబు సఖా!

అన్నారు వేంకటశాస్త్రిగారు. ఆ నాడు సభకు పోవునపుడు
వేంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారితో నన్నది.

నాకెందు కూరకుండెద
నీకున్ సివ మెక్కె నేని నేఁ గాదుగదా
లోక మ్మెల్లను నొకసై
తాఁకియు వారింపలేమి తథ్య మెఱుఁగుదున్.

అని వచించిరి. తిరుపతి శాస్త్రిగారి యావేశ మటువంటిది.
విద్వత్కవుల సంభాషణ లిట్లు రసవంతముగా భావపూరితములై
చమత్కారములతో కూడుకొని యుండును. వారు నిందింపనీ
వందింపనీ వారి మాటలు రత్నాల సరములు. పర్యాలోచనా

కిరణములు శోకినగాని వానియందు నిమిడియున్న వెలుగులు ప్రసరించవు. గ్రామ్యకవులకైతె లట్లుండవు.

బుఱ్ఱ గొరిగించి సున్నపు బొట్లు పెట్టి
ఖరము నెక్కించి యూరేగఁగా నొనర్చి
మాల దాసులు ''ఛీ''యని గేలిసేయ
తిరుపతిని వేంకటన్నను ద్రిప్పినాము

ఇది కొప్పరపు గవుల పద్యము. తిరుపతి కవులకు కొప్పరపుఁ గవులకు గల తారతమ్య మీ పద్యములబట్టి గ్రహించుకొనవచ్చును.

ధార యొక్కటి మాత్రమే తనకుఁ గలదు
దాని కెన్ని యుండిన మీఁదఁ దఱ్ఱుఁ డొప్పు
తండులమ్ములు మాత్రమే యుండి యెవఁడు
షడ్రసోపేతముగ భుక్తి సలుప నేర్చు

అని తిరుపతి కవులన్న మాట నిజము.

శాఖలో కొంద ఱాకాశ సౌధ మొకటి
గట్టిపెట్టిరి కొప్రంపుఁ గవులకొఱకు
ఎక్కలేము మెుత్రోయన నెక్కి తీఱ
వలయు నని త్రోయుచున్నారు బలము కొలఁది.

బలవంతపు బ్రాహ్మణార్థ మయినది. సభలో ఆసనమును గురించిన చర్చ వచ్చినది. కొందరు వారికి వీరు తుల్యులన్నారు. ఇవి మధ్యవారు పెట్టిన పుల్లలు. వైరము రాజ రగిలినది. కొప్పరపు సోదరులాశుధారా కవులు. యధారీతిగా తెలుగు దేశమునందు నగరములు పల్లెలు రాజాస్థానములు తిరిగి సభలు చేయుచువచ్చిరి. సన్మానములను బొందిరి. గుంటూరులో రగిలిన వైరాగ్ని పత్రికా ముఖముననను నుత్తరములవల్లను సమీరితమయినది. మంటలు రేగి కాకినాడలో సభాముఖమున ప్రజ్వలించినది.

ఘోర సింహంబు లట్టుల కొప్పరంపు
కవులు చనుదెంచి నాటి రీ కాకినాడ

యందు కవితోన్నతిని విజయ ధ్వజంబు
మిన్నయై దీని పీకు మగన్న యెవఁడొ

బట్టితిమి విజయ ఘంటిక
మెట్టితి మదివరకు కుకవి మూర్ధము లగలన్
బట్టితిమి కాకపురి జయ
మట్టిట్టనరాని మీ దయాశక్తి శివా!
కొండవీటి మహాగుహా కూర్కు జెందు
సింహములు రాగ నీ గ్రామసింహములకు
బ్రతుకు తెరువును వర్తన పరిథ విలునె
చాటుమాటున మొరుగుటే జరుగుఁగాక.

అనుచు ననేక పద్యములు కొప్పరపు గవులు తమ మిత్రులకు నుత్తరములలో వ్రాసికొనిరి. నిండుకుండలు తిరుపతి కవులు. వారిలో 'మెత్తని పులి' వేంకటశాస్త్రిగారు. లోక మెదుటి వానిని పూర్తిగా నిందించునంతవర కోపిక పట్టి యుండును.

కొండలు వ్రీల బండలాగిఁ గొట్టుకపోవుచుఁ దేల గౌతమీ
చండతర ప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వ నెన్నియో
కొండలనుండి వచ్చి యడఁగున్ సెలయేళ్ళట నూరుఁబేరు లే
కుండఁగ దివ్వటీ సరస నుండెడి దీపములో యనన్ బొరిన్.

అని యూరకుండిరి. పాకము ముదిరినది. ఆవేశము పొడమినది తిరుపతి కవులకు. ఇంక వారిని బ్రహ్మదులైన నాపలేరు "సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి" యున్నట్లైనది. గుంటూరు పురమున కరిగిరి. ఈ పట్టునందు గుంటూరు సీమలో వారు వ్రాసిన పద్యములు "మదరాసు రైలు" పరుగులు పెట్టినవి. ఆ పద్యములం దగుపించు నావేశము నావేగము గీరతమునందు కూడ కనిపింపవు.

ఏ పండితుఁడు వచ్చి యివ్వారితో మమ్ముఁ
దులఁదూచి తన కీర్తి నిలిపికొనునొ

ఏ కవీంద్రుఁడు వచ్చి యివ్వారితో మమ్ము
సరిచేసి సద్యశశ్శాలి యగునో
ఏ జమీందార్వచ్చి యివ్వారితో మమ్ము
నెనఁజేసి తా వన్నె కెక్కఁగలఁడో
ఏ దైవతము వచ్చి యివ్వారితో మమ్ముఁ
బురుడించి దీప్తి నిల్పుకొనఁగలఁడొ

చూచియే తీరుదుము, మీఁదఁ జూడవచ్చు
సంధి సంగతు లెల్లని సభ యొనర్పఁ
గడఁగుఁడయ్య వేరొక గతి గాంచఁబోకుఁ
డయ్య వేత్తల రప్పింపుఁడయ్య యొయ్య

అని సింహగర్జనము గావించిరి. ఇంక తిరుపతికవులను హరి హరాదులైన వారింపలే రనుట తేలిపోయినది. విజృంభించినచో "తలపోలమునఁగాని నిలువ" దన్న సంగతి స్పష్టమైనది. గుంటూరు సీమ కావ్యము దాదాపంతయు నాశు వనియే తలంపవలయును. అట్టి యాశువులో కావ్యంపు తీరులు నడచినవి.

ఆంధ్రభారత కర్తయైన తిక్కన సోమ
యాజి జన్మ స్థానమైన కతన
శ్రీనాధ కవిరాజ శేఖరు నేలిన
కొండవీటికిఁ బ్రక్క నుండు కతన
ప్రకృతంపుఁ గవుల సంభావించు గద్వాల
రాజ్యంపుఁ ద్రోవలోఁ గ్రాలు కతన
వెనుక కాలము నందు వినుతింపఁ దగు పెద్ద
విద్వత్కవులు దీన వెలయు కతన

నింత కవితాదరమ్ము మీ కిచ్చె మెచ్చు
వలదె గుంటూరు పురిని? విద్వత్కవీంద్ర
జనని, కేవల కవితిరస్కారిణి, దీని
మహిమ మెంతేని శ్లాఘ్యంబు మాన్యులార!

పటు జంఝూనిల ధోరిణీ రణరణత్ప్రాగ్భార నున్నాటవీ
తట శాఖాపటలాంత రుద్గత నితాంతస్ఫార ఘోరాగ్ని రు
ఘ్ఘటనా ఘూపిత భస్మసాత్కృత కురుట్కాండంబుతో వహ్నికిన్
ఘటియింపం దలపెట్టినారుకద సఖ్యం బార్యచూడామణుల్.

ఈ రసవత్కవితా ధాటికి ముం దెవరు నిలువగలరు. తిరుపతి కవులు జయపతాకము చిరస్థాయిగా నెలకొల్పిరి.

కొంపంపువారు మాకుఁ గనిష్ఠు లవ్వారి
కరయఁగా జ్యేష్ఠుల మగుదు మేము
కొంపంపువారు మాకు సుశిష్యు లవ్వారి
కరయఁగా నొజ్జల మగుదు మేము
తత్కవిత్వంబు సదరు మరాటారైలు
మదరాసు రైలయ్యె మాదుకైత
మిత్రుల నవ్వారు మెప్పింతు రేము శ
త్రులఁ గూడ మెప్పింపగల మొకింత

వయసుకా పెద్దలము మేము వారు పిన్న
లింతియే భేద మింతకు నింత కలహ
మెందుకు స్నేహితుల మైత్రి మింక మీరు
శంక దక్కుండు సెలవు నొసఁగుఁడు మాకు

గీతరము నందుకంటె గుంటూరుసీమయం దే పద్యము చూచి నను ధారతోపాటు బిగువు పెన వేసికొని తిరుపతి కవుల కవితాపాట వము ప్రకటించుచున్నది. ఆవేశ మల్లుకొని పోయినది. ఆగ్రహ మంతర్భూత మయినది.

గోదావరీ నదీ కూలమ్మునకుఁ గొండ
వీటి కూపమ్ముఁ వేర మేల
ఆమ్రాది తరుజాల మలరుతోఁటలకు గోఁ
గాకు భూములమీఁద గాఁక యేల

ఎచటఁ జూచిన నిక్కులే వొల్చు పొలముల
కేలయ్య జొన్నపొలాల చెలిమి
తిరుపతి వేంకటేశ్వరున కంకాలమ్మ
జాతర మీఁది విశ్వాస మేమి

ఇంతకును గ్రాలు ద్రవ్విన దెవ్వరో యె
ఱుంగుదురు మీర లెవరి స్వరూప మెట్టి
దో యెఱుంగుదు రరక యేదో విధమున
మమ్ము నెపపెట్ట నేల యో మాన్యులార!

ఈ సమయస్ఫూర్తి మనోరంజకమగు వాగ్జాలము నీ భావ వైచిత్ర్యము కొప్పరపు కవులలో గనబడదు. తిరుపతికవు లవతార పురుషులు. వాణీమనోహరులు. వారిని జయింప గలవా రెవరు? 'ప్రతిఘటించిన నెంతవాఁ డైన లక్ష్యింపము' అన్నారు తిరుపతికవులు. రామ కృష్ణ కవులును కొప్పరపు కవులు నేమి లెక్క? తమ గురువుగారగు శ్రీపాద కృష్ణమూర్తిగారినే లెక్కచేయలేదు.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు షడంగములతో వేదాధ్యయనము గావించినవారు. భాష్యాంతము వ్యాకరణ శాస్త్రమును క్షుణ్ణముగా వల్లనవేసిన పండితులు. యజ్ఞ హగాది క్రతుకర్మలు చేయించగల సమర్థులు. అష్టావధానములు చేసినవారు. ఆశువుగా కవిత్వము చెప్పగలవారు. వేంకటశాస్త్రిగారు కుమారసంభవము నందు రెండుమూడు సర్గలు, మేఘ సందేశమునందు కొన్ని శ్లోకములు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారియొద్ద చదివిరి. కావున వేంకటశాస్త్రిగారికి గురుకోటిలోనివారు కృష్ణమూర్తిశాస్త్రిగారు. ఉభయ భాషలయం దనర్గళముగా కావ్యములు రచియింపగలరు. శతాధిక గ్రంథకర్త! వ్యాసభారత మంతయు మూలానుసారముగా తెనిగించి పేరుగాంచిన కవిసార్వభౌములు! ప్రభుత్వమువారు శ్రీపాద కృష్ణమూర్తిగారికి మహామహోపాధ్యాయ బిరుదము నిచ్చిరి. ఆయన విద్వత్కవి. వేంకటశాస్త్రిగారి యనంతరము ఆంధ్ర రాష్ట్రీయ ఆస్థాన

కవులయినవారు. వేంకటశాస్త్రి తిరుపతిశాస్త్రిగార్లకు తెలుగుదేశము నందు సమానమైన కవి.

కాని తిరుపతి వేంకటేశ్వర కవులు శతావధానులు శతఘంట కవులు కూడను. వీరికున్న సాధన శ్రీపాదవారికి లేదు. వీరు చేసి నంత సంచారము వారు చేయలేదు. తిరుపతికవులు మహాలాక్ష్యులు. శ్రీపాదవారు కొంచెము ఛాందసులు. విశ్వామిత్ర గోత్రులగుట చేత కాబోలు కొంచెము ముక్కున కోపముండును. ఆ కోపములో కొంత తొందర పడుటకద్దు. వేంకటశాస్త్రిగారు వేయి యాలో చించినగాని యొకడుగు ముందునకు వేయరు. వీరి కైతలో ప్రాచీన నాగరికతా రూపమున గోచరించుచు ప్రాతక్రొత్తల సమ్మేళనము చేత జనుల నాకర్షించును. వారి కైతలో నవనీత యుండదు. కాని వారు స్వతంత్రించి వ్రాసిన బొబ్బిలి నాటకము వారి కృతులలో మేలిమిబంగారము. తిరుపతి వేంకటకవుల పాండవవిజయమువలె చిర స్థాయిగా నిలుచునది. తిరుపతి కవులకు కొప్పరపు కవులతో వివాదము కలిగినప్పుడు శ్రీపాదవారు తిరుపతి కవుల పక్ష మవలంబించిరి. వ్యాసములను వ్రాసి ప్రకటించిరి.

ఏ కారణముననో గురుశిష్యులకు వైరము పొడసూపినది. వేంకటశాస్త్రిగా రా యాతావులందు రచించిన పద్యముల యంతః సారము పరిశీలించిన చో శ్రీపాదవారికి వేంకటశాస్త్రిగారి యెడ గల యసూయ కారణమని తోచును. నిజము కావచ్చును, కాక పోవచ్చును. ఇరువురు నొకటే వృత్తియందున్నవారు. గురువును మించిన శిష్యుడు వేంకటశాస్త్రిగారు. వీరికున్న సభారంజకత్వము కంఠమాధుర్యము శ్రీపాదవారికి లేదు. గురుశిష్యులు దిగ్దంతులు. పోరాట మారంభమయినది. శ్రీపాదవారు వేంకటశాస్త్రిగారి బొబ్బిలి పట్టాభిషేక గ్రంధమునందు తప్పులు పట్టిరి. వానిని ప్రక టించిరి.

దానికి సమాధానముగా 'జయంతి' యను గ్రంధము ప్రక టించినారు తిరుపతి వేంకటకవులు. గురుశిష్యు లొకరిని మించినవా

రింకొకరు. బొబ్బిలి పట్టాభిషేకమునందు 'అయిదో నాలుగో వంద లుండెడివి పద్యాల్' వానిలో దప్పులో వేయియుంగాదొక రెండు వేలు' కలవని శ్రీపాదవారివాదము.

ఒకటో రెండో గణించిన న్నిలుచునో యొక్కండును న్నిల్వదో
ప్రకటింతున్ సమయంబు నీ యెదుట మ త్పాండిత్యమే కాక దే
శికు పాండిత్యముకూడ నీ వెఱుఁగు దీ చెల్పిళ్ళయే రేగుచో
నిక దిక్కెక్కడ కృష్ణభారత గవీన్ర్విత్యానకున్ జూడవే!

శ్రుత పాండిత్యము తక్క లేని గురు డీసుం బూనినన్ రేఁగఁగా
ట్టి తదాద్ధత్యము చూపుఁగాక గురుతో ఢీకొక యాత్మావన
స్థితి కే కొంచెమొ పోరుచుంటి నది వీక్షింపంగఁ బ్రార్థింతు నీ
మతికిం దోఁచిన మాట పత్రికలకుం బంపింపు మార్యాగ్రణీ!

అని వేంకటశాస్త్రిగారు జయంతి రామయ్యగారి నర్థించిరి. ఈ కృతిని వారి కంకిత మొసంగిరి. జయంతి రామయ్యగారు మాధ్యస్థము వహించి యొక నిర్ణయమునకు వచ్చిరి. అది జయంతి పీఠిక యందు సూచింపబడినది. వేంకటశాస్త్రిగారికి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారియందు గౌరవము కలదు భక్తియు గలదు.

గురువుల్పల్పురు గల్గియుండినను నేఁగొన్నాళ్ళకున్ మున్నె యీ
గురునిం దక్కఁ గ్రమమ్ముగా నితరులం గోల్పోతి శ్రీపాదు లే
గురువ న్మెచ్చుట దీరఁగా మిగిలి నాకుం గూర్చువారైరి యె
వ్వరితోఁ జెప్పిన దేశికుండనియె నే వాక్రుత్తు నాలించితే

అని నుడివిరి. శ్రీపాదవారియందు వేంకటశాస్త్రిగారికి గల భక్తి వినయ విశ్వాసము లీ పద్యము వేనోళ్ళఁ దెలుపుచున్నది.

కవితన్ దోషము లేరఁ బూనిరను వాక్యం బేను విన్నప్పుడే
యవమానం బిఁకఁ దప్పిదం చెరిఁగి యయ్యా సంధిమిచ్ఛంతిసా
ధనయంచున్ శిరమున్ దదంఘ్రియుగళిన్ దాకించితిన్ భార్యవో
యి విచారింపఁ బరామృశించుతతిఁ దప్పేయయ్యో యో సుద్దియున్

శ్రీపాదవారు శిష్యుల పరిస్థితినైన గమనింపలేదు. కింకవీంద్ర ఘంటాపంచాననము శిరము వంచినదని మాత్రమే తలంచిరి. ఆ వంచుట దేనికొరకో వారూహించలేదు. బొబ్బిలి పట్టాభిషేక కృతిని విమర్శించిరి. శ్రీపాదవా రసలే కోపస్వభావులు. వారి విమర్శనలలో నోటికి దుడుకు తనము మెండు. దూకు డెక్కువ. వెంకటశాస్త్రి గారికి తమ శరీర ప్రాణములమీదకంటె కూడ తమ కవిత్వముమీద అభిమాన మంతు లేనిది.

తిట్టుల్ గాలికిఁబోవు నొట్టులును నంతే నా మనంబందు నీ
కొట్టుల్ నే గణియింప నాకు భువిలో గోరంత పేరెందులోఁ
బుట్టెన్ దాదృశ సత్కవిత్వమున నే మూలమ్మునన్ లేని చ
ప్పట్టుల్ గొట్టు గురున్ సహింపనుజుమీ పై లోక మేమైననున్.

శిష్యత్వం బిసుమంత యుండు టదియున్ సిద్ధాంత మే నెప్పుడున్
శిష్యత్వానకు నాఽస్తి చెప్పఁగఁ బ్రయత్నింపంజుమీ వీడెటో
భాష్యాంతమ్ముపరించెఁజర్ల కులజున్ బ్రహ్మయ్యశాస్త్రిన్ మహా
ఋష్యంశోద్భవుఁగొల్చి నెట్టఁగలరే శ్రీపాదు లీ పామరున్.

"మీసా లిప్పుడులేవు గాక కవితో న్మేసానకున్ లేవాకో మీసాలు" అని రేగినారు వేంకటశాస్త్రిగారు. ఆ విజృంభణలోనె కొంత పరిహాసము

ఈ వాదమ్మున గెల్చి యాత్మకురిలో నేనుంగు నే నెక్కినా
మీవిట్టేనుఁగు నెక్కఁజేసినను నే నెక్కంజుమీ దాని యా
పావం తేనియుఁ దట్టుకోఁదగిన సామర్థ్యంబు లేదయ్య యీ
జీవం బీ గురునాథు వాదుకొఱకే చెర్లాడు నీ మేనిలోన్

వేంకటశాస్త్రిగారి నోట వెలువడిన మాట నిజమైనది. ఈ గురుశిష్య సంవాదము వెంకటశాస్త్రిగారు స్వర్గస్థు లగునంతవరకు చిటపొటలతో మండుచునే వచ్చినది. ఆయన కవిసార్వభౌముడు. ఈయన కళాప్రపూర్ణుడు. ఒకరి కొకరు తీసిపోవువారు కారు. ఎవ

రంతటివారు వారు. ఎవరు మాధ్యస్థము వహించి వివాదము మాయింప చూచినను ఇద్దరు వినువారు కారు. కాని వారిదొక విచిత్ర ప్రకృతి. ఇరువురు ప్రేమమూర్తులు. కోమల స్వభావులు. వాదములు భేదములు తృణాగ్నులవలె భగ్గుమని యప్పటి కప్పుడు మండుచుండినను వెంటనే చల్లారి సమయము వచ్చినప్పు డాత్మీయత సౌమనస్యత వెల్లడించుకొను చుండెడివారు. వేంకటశాస్త్రిగారు మరణించిరని విని "ఆవురు"మని ఘంటల తరబడి కన్నీరు కాలువలు కట్ట నేడ్చినారు శ్రీపాదవారు. నాలుగైదు దినము లన్నము ముట్ట లేదు. నిద్దురలోకూడ వేంకటశాస్త్రిగారిని గూర్చి పలవరించిరని వాడుక. ఆవేశముచేత వారు విమర్శించినను శాస్త్రప్రవేశముచేత వీరు సమర్థించినను తీర్పరులు తెనుగు దేశమున వారి నడుమ లేరని వేంకటశాస్త్రిగారికి తెలియును. కావుననే—

ఒకచోఁ దిట్లకుజంకి దేశికుని నిర్వ్యక్తి ప్రసంగంబు దు
ర్వ్యకటాభాస విమర్శనంబుఁ గనియు న్వీక్షింపకున్నట్లు లూ
రక విద్వాంసు లుపేక్ష చేసినను ధైర్యంబేను గోల్పోను ద
ప్పక ముందేని జనించు సత్యమును దేల్పంజాలు వాఁడెవ్వఁడో

క్రీస్తుఁ దిట్టిరి కొర్తఁబెట్టిరి తుదిన్ గ్రీస్తంతకున్ దాళె నం
తస్తాపమ్ము వహింపఁ డించుకయుఁ ద ద్వాదంబు గొన్నాళ్ళకున్
శస్తంబై మఱి ఖండ ఖండములకున్ వ్యాపించె నామ్నాయమై
దుస్తంత్రమ్ములు వోవు సాక్షియగు నా దుర్యోధనుండేయిటుల్

అనుచు వేంకటశాస్త్రిగారు జయంతి కృతిని ముగించిరి. జయంతి రామయ్యగారి నర్థించుట మాట మాత్రమునకే యని తేలినది. ఈచివరి పద్యము శ్రీ శాస్త్రిగారి బైబిలు గ్రంథపరిచయమును సూచించు చున్నది.

## ౭
# లఘు కావ్యములు

ఇంతకు పూర్వము పేర్కొనిన ప్రబంధములేకాక తిరుపతి కవులు శతకములు స్తవములు ఖండకావ్యములు పెక్కు వ్రాసిరి. వానిలో కొన్ని యాంధ్రీకరణములుగూడ కలవు.

కామేశ్వరీ శతకము నూటేడు పద్యముల గ్రంథము. ఇది వేమన శతకమువలె లోకజ్ఞానాపాదియు కాదు. దాశరథీ శతకమువలె వినుతియు కాదు. భాస్కరశతకాదులవలె సూటిగా నీతిని బోధించునది కాదు వేంకటశాస్త్రిగారు తమ జీవితమునకు సంబంధించిన యనుభవముల నిందు పొందుపరచిరి. మచ్చునకు

నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధి
స్థిరవాస మ్మొనరించునట్టి పని నాచేఁగాదు నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెరిగి విద్యాబుద్ధులన్నేర్చి నేఁ
బరులన్నిత్యము గొల్చుటొప్పగునె యంబా! దేవి! కామేశ్వరీ!

ఆచారమ్ములు పోయె వేదములయం దాసక్తి లేదాయె దు
ర్థీ చాతుర్యము హెచ్చె నీచులకు నాధిక్యమ్ము దా వచ్చె సం
కోచంబెందునులే దిహమ్ము పరమన్ గొండాటకుంబోరు వా
రేచోటం గనరారు పాపమిది యేమీ? తల్లి కామేశ్వరీ!

ఇందు భక్తి ప్రధానమగు పద్యములు లేకపోలేదు.

నానాసాల విశాలమై మఱియు నానాకల్పవృక్షాఢ్యమై
నానారత్న మయాచలాకలితమై నానామర ప్రాప్యమై
నానాశక్తికమై సుధాలసదుదన్వత్తోయమై యొప్పు ద్వీ
పానం బొల్చెడి నీకు మ్రొక్కెద ననుం బాలింపు కామేశ్వరీ!

ఈ పద్య మంత్యప్రాసలతో పోతనగారి పోకడను జ్ఞప్తికి తెచ్చుచున్నది. కామేశ్వరీ శతకములోని పద్యము లన్నియు తన మనోభావములను వేంకటశాస్త్రిగారు కామేశ్వరీ దేవతతో ప్రత్యక్ష

నెలలోఁగా నను నా తనూభవు నెటో నిర్వ్యాజకారుణ్య ధా
రల నారోగ్యము నందఁ జేసితి గదా! ప్రత్యక్ష మీ వృత్త మ
న్యులు మోక్షాదికమిచ్చినన్ సుఖము నిన్నుంబోలె వేరొండు వే
ల్పులు వైళంబయొసంగఁజాల రనుచున్ బోధించితో భాస్కరా!

అని తమ కృతజ్ఞతను దెలిపిరి.

కవితార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి యీ
భవ మద్దానఁ దరింతు తద్భవమ మద్భాగ్యంబు సర్వంబు మృ
త్యువు నద్దాన జయించితిన్ రుజ జయింతు న్దానిచే

నని గట్టిగా చాటించి చెప్పఁగలిగిరి. కవితాశక్తికి నసాధ్య మగున దేదియు లేదని వేంకటశాస్త్రిగారి నమ్మకము. నమ్మకమే కాదు, వారి జీవితమందు ఋజువు చేసిరి. అది అంతటిదే యనుటలో సందేహాము లేదు.

పైన వివరించిన గ్రంథముల తెగకు చెందినదే మృత్యుంజయ స్తవముకూడ. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి శరీరారోగ్యము మొదటి నుండి చాల తక్కువ. ఆత్మశక్తిచేతను కామేశ్వరీ మహా దేవి తోడ్పాటుచేతను దేశ సంచార మొనరించి విజయ పరంపరలు సాధించిరి. ఎప్పటి కప్పుడేదో యనారోగ్య మాసించుటయు తన్నివృత్తికయి దేవతా స్తవ మొనరించుటయు వారికి పరిపాటి యయినది.

సురలో ముప్పది మూఁడుకోట్లుగల రీశుల్ గారు నిన్ బోలె శం
కరులుంగా రిది నీకె చెల్లినది, నిక్కంబింత నిన్ వేఁడు చోఁ
గలవే? సౌఖ్య మెఱింగియున్ జెడితి నజ్ఞానంబుచే నేఁడు నీ
శరణంటెం గనుకల్గి నాదు రుజ నిష్కాసించు మృత్యుంజయా!

శ్రీ వేంకటశాస్త్రిగారికి హరి హరులందు సమానమగు భక్తి కలదు. వారు శివపంచాక్షరీ మంత్రోపాసకులు కావున సహజ ముగా శివుని యందొక వాసి భక్తి భావ మెక్కువయుండక తప్పదు. దానికి వారు

అతి యోగ్యుల్ హరిఁగొల్చి యుండుదురు గాకర్థమ్ము లేలాటి దు
ర్మతులున్ బొందఁగవచ్చున్ బాగడి, దూరక్షుస్సమాజంబు యి
కృతికిన్ సాక్షు లమాయికుండ వగుటన్ గీర్తింత్రు నిన్నెల్ల పం
డితులున్ సారెకు 'నుబ్బులింగఁ'డనుచున్ దేవేశ మృత్యుంజయా

అని సాక్ష్య సహితముగా సమర్థించి చెప్పిరి. అందులోకూడ 'లింగ'డని పరిహాసము. వేంకటశాస్త్రిగారి దాష్టీకము నవ్వు పుట్టించును. రాజులమీదనే కాదు. దేవునిమీదకూడ ఒకటే పద్ధతి.

శరణన్నం గరుణింప కూరక యిటుల్ జాలమ్ము గావించుచో
జరుగంబో దటుమీఁదటన్ సరిగ నిచ్చున్ జాల చర్చించి శం
కర శంభ్వాఖ్యల కర్థ మన్యగతిగాఁ గల్పింతు వేమయ్య! యో
వరదా! వల్వదువాద మార్తుఁడ నను బాలింపు మృత్యుంజయా

తెగుదాకన్బిగలాగి చూతురొకొతంత్రిన్ ద్వాదృశుల్ మార్దవం
బగుపట్టున్ వలె నార్తకోటిపయి దేవా! యట్లు గాకున్న చో
నగజామాతను వేఁడి కొమ్మనెదవా! నా భాగ్య మేలాటిదో
నగ జామాతవుకూడ నీ వగుచున్నావయ్య మృత్యుంజయా.

మహాపండితులకు మాటలో చతురత్వము పిలువకుండగనే ప్రత్యక్షమగును. అది యుంగరములో పొదిగిన రవ్వరాయివలె గ్రహించుకొనగల విద్యావంతుల చిత్తమున కాహ్లాదము కలిగించును. నగజామాత-తల్లియగు పార్వతి. నగ జామాతవు - కొండయగు హిమవంతున కల్లుడవు అని పద విచ్ఛేదము. అందులో "సర్వం శివమయం జగత్" అను వేదాంతము. మనోహరమగు రచన.

కలికాలం బిది 'దేవునై గురువునై' కాబట్టి నావంటి భ
క్తులె నీ యునికి స్థిరీకరింపవలె నాకున్ "ఫీజు" వే తీయఁగా
వల దారోగ్య మొసంగు మేను సుఖమై భావత్కపాదద్వయిన్
గొలుతున్ జాటుదు నీ దయారసము లోకుల్ మెచ్చ మృత్యుంజయా!

అని యారోగ్యమె ఫీజుగా మృత్యుంజయ స్తవము గావించినారు శాస్త్రిగారు. హాస్యరస సమ్మిళితమైన ఇట్టి రచన శాస్త్రిగారికి స్వభావసిద్ధము.

వేంకటశాస్త్రిగారు సతీ స్మృతి యను నొక లఘు కావ్యమును గూడ వ్రాసిరి. అందు

వనితా రత్నము లెక్కయేమి మఱి యా ఫాలాక్షుఁడేయైన నే
నను నమ్మాటకు నడ్డు చెప్పనెడ నా కావంతయున్ గిట్ట దే
మనుకో నియ్యది జన్మకాల ఫలితంబో నేమొ? యీ పూన్కి
నెగ్గనో లేదో యితరత్ర భార్యకడ నెగ్గన్ దల్లి సంపూర్తిగన్.

అని చెప్పకొనిరి. (శ్రీ) శాస్త్రిగారు ఇంట బైట దేవుని యెదుట కూడ మహారాజసముగా మాట చలామణి కావించుకొనిరి. ఇల్లాలు ప్రాణాంతావస్థయందున్నది.

నా ప్రాణమ్మున కడ్డుగాఁగఁ దన ప్రాణంబొడ్డి కాపాడె న
న్నీ పూఁబోఁడి కృతజ్ఞతం దెలుపఁగా నే నిట్లు ప్రార్థింతుఁ బ్రా
ణాపాయమ్మును దప్పఁజేయు మెటులో యాచింతు దీనార్థినై
నీ పాదమ్ములె దిక్కు వేఱుగతి లేనే లేదు కామేశ్వరీ!

అని సతీభిక్షుకయి యతి దీనముగా నర్థించినారు శాస్త్రిగారు. ఆ దైన్యత పద్యములోని పదజాలమునందు ప్రతిఫలించుచున్నది. ఆనాటి రాత్రి పరిస్థితి—

ఒకచో గేహిని శ్వాసదూరవము లింకొండొక్కచో ఘోర త
క్షక దాయాద మహాహి వక్త్రవిగళద్గంభీర ఫూత్కార దు
ర్వికటారావము లిట్టిరాత్రి నెటు లే నేగింతు నోయమ్మ నీ
యకలంకాదర చంద్రికా ప్రసృతి కాసంతైన లేకున్నచోన్

అని వర్ణించిన శాస్త్రిగారి కవితా సామర్థ్యము నెంతైన నుతింప దగియున్నది. మృత్యుదేవత నిశిత కరాళ దంష్ట్రాంకురంబుల భీకరంబయిన వదన గహ్వరంబు తెరుచుకొని యిల్లాలిని గబళింప

మీఁది మీఁది కే తెంచుచుండుట కన్నార నరయుచు నావేదన యనుభవించు చున్నను కవితా వాహిని కుంటుపడలేదు. నన్నయ ధాటికి దీటయి సమాసము పరుగులెత్తినది. పదములు పరిస్థితి కనుగుణములై భావమును స్ఫురింపఁజేయుచున్నవి. ఈ రచనా చమత్కారమునకే వర్డు ఎకోయింగ్ ది సెన్సు అని పాశ్చాత్యులందురు. ఈ పద్ధతి తెనుగు కవులలో నన్నయ పెద్దనలయందు మాత్రమే కనిపించును. అది శాస్త్రిగారి రచనలయం దచ్చటచ్చట నగుపించును. అల్లసాని పెద్దన మహాకవిని శ్రీకృష్ణరాయలవారు కృతిని రచింపమని యర్థించిరి. ఆయన

నిరుపహతిస్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినఁగాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే?

అని సమాధానము చెప్పెను. వెంకటశాస్త్రిగారికి వీనిలో నొక్కటియు లేదు సరికదా ఆ భయంకర నిశాసమయమునందు నిర్గతప్రాణి యగుచున్న భార్యాశవము, రోదించు సంతతులయార్త రావములు, చింతా భరంబుచేత చివికి చిదుకబారుచున్న హృదయము, ఎప్పటి కప్పుడు క్రిందు మీఁదొనరించు చుండెను. ఐనను కవితావాహిని గట్లు తెంచుకొని సమాసములతో నలంకారములతో నేకధారగా హృదయ కుహరమునుండి రసావేశమున పొంగి పొరలి పారినది. కవితా సిద్ధులకు కాలా కాలములతో పనియుండదు. ఎప్పుడైనను రసానుభూతి కలిగినప్పుడు కవితావాణి రమణీయ పదమంజీర ఘులంఘులా రావములతో కవి రసనాగ్రమున నాట్యము చేయును. పోతన కేమున్నది నిరుపేద. భాగవతమువంటి గ్రంథమును వ్రాసెను. తిరుపతి కవు లట్టివారు. కావుననే రసవంతమగు నిట్టి కవిత వ్రాయ గల్గిరి.

తిరుపతి కవుల లఘుకృతులలో 'శుక రంభా సంవాదము' సుప్రసిద్ధమైనది. ఇది సంస్కృతమున కనువాదము. సంవాద రూపకమైన

ఖండకావ్యము, నాటకమువలె నుండును. శుకుడు ప్రశ్నించుటయు రంభ సమాధానము చెప్పుటయు, రంభ ప్రశ్నించుటయు శుకుడు సమాధానము చెప్పుటయు కలదు. శుకుడు వేదాంతి. రంభ భోగాంగన. వారి వారి ప్రశ్నలు, సమాధానములు వారి వారి మనః ప్రవృత్తులనుబట్టి యుండును. సంస్కృతభాషయం దీ సంవాదము లలితములు, మృదు మనోహరములగు పదముల పొందికతో చదువుటకు నాహ్లాదకరముగా నుండును. రచనలో సౌలభ్యము కలదు. ప్రసాదగుణ మంతటను విలసిల్లు చుండును. ప్రతిపదము రస వంతమయి ద్రాక్షాపాకమున రచింపబడినది. అంతకంటె నతి మనోహరముగా తీర్చిదిద్ది పలుకులలో రసముట్టి పడునట్లు తిరుపతి కవులీ కృతిని రచించిరి. ఈ యాంధ్రీకరణము కావ్యముల యాంధ్రీకరణము వలెకాక యే శ్లోకమున కా శ్లోకము అర్థము దుసికిలి పోనీయకుండ తెనిగింప బడినది. రంభ

వెలదులఁ గూడినం గలుగు వేడుక కన్నను లేదు మోక్ష మా
చెలువల పొందు లిట్లు నిరసించినఁ గల్గునె యట్టి మోక్ష మీ
యిలఁ బితలేని యట్టి కొడు కెచ్చటఁ గల్గునొ చూడుమా జగం
బులకును ముఖ్యకారణము ముద్దుల గుమ్మల కూట మొక్కటే.

అని శుకయోగీంద్రునకు మాయా వాగురులు పన్నినది. రంభ త్రయీ ధర్మములు నేర్చిన పూర్వ మీమాంస శాస్త్రోపాధ్యాయిని. ఆమె విజ్ఞానము స్వర్గమునందలి భోగానుభవములతోనే సరిపోయినది. ఆమె కనుభవము నందున్నది యంతవరకే. శుకమహర్షి విజ్ఞాన యోగి. శుద్ధ పరబ్రహ్మోపాసకుడు. జనన మరణ విరహితమగు మోక్ష సంపాదన ఆయన లక్ష్యము.

వేడుక కన్న మోక్షము భువిన్ వినరా దటువంటి వేడుకం
జేడియ లెన్నడుం గలుగఁ జేయరు తుచ్ఛసుఖంబె కాని మా
వేడుక సత్తపంబున లభించును, స్త్రీజన లోలుఁడైన వాఁ
డేడ? దురూహ మోక్షపద మేడ వృథావచనంబు లేటికిన్.

అని శుకుడు సమాధానము చెప్పెను. ఇద్దరు ఆనందోపాసకులే. అనుభవములోను సాధనలోను ద్వైవిధ్య మున్నది. రెంటికి రెండు దారులు. రంభ దొక దారి. శుకున దొక దారి. అది కర్మప్రవృత్తి. ఇది జ్ఞానప్రవృత్తి. మూలమునందు "ఆనందాత్ పరమం పదం నహి మునే!" అని రంభ, "ఆనందాత్ పరమం పదం నహి తథా ప్యానందదా న స్త్రియః" అని శుకుని సమాధానము. ఈ రెంటియందు ఆనంద శబ్దము "ఆనందో బ్రహ్మ" యను సూత్రమునుండి గ్రహింపబడినది. ఆ శబ్దమునకు తిరుపతి కవులు వాడిన వేడుకకు హస్తిమశ కాంతర మున్నది. "ఆనందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంత ర్భుద్ధి నూహింపుమా" యని వరూధినిచేత ననిపించిన పెద్దనగారి పలుకు సమంజసము. ఆనందశబ్దమున కే పర్యాయపదము వేదాంత శాస్త్ర మొప్పుకొనదు. వేడుక ఆ యర్థమును అందుకొనదు. ఇట్టివి లోపములనరాదు కాని జారుపాటు లందందు కలవు. ఒకటి రెండు పద్యములు చదువునపుడు ఆంధ్రీకరణమను నూహ పొడమనీయక ధారాళముగా మూలమా యనునట్లు నడచిపోవును.

నను వెడవిల్తుఁడాశుగ గణంబుల గాఁడఁగ నేసె నోర్వఁజా
లను శరణంటి నీ పదములంబడి నీ జపమాలతోడు రా
దనక ముదంబునం గవయుమా శరణాగతరక్షణంబు క
న్నను తపమున్నదే ఋషిగణ ప్రవరుండవు నీ వెఱుంగవే

అన్నది రంభ. దానికి శుకుడు—

శరణనువారిఁ బ్రోచుటయె సత్తపమన్న విశేష మేనునుం
గరమును విన్నసంగతియె కాని సమర్థత కల్గియుండినం
బరిపరి చెప్పగావలెనె బాలరో! యుద్ధపరాజితుండు కా
తరు శరణంబు వేఁడిన వృథాయగుఁగాక ఫలింప నేర్చునే

అని ప్రత్యుత్తరము చెప్పెను. రంభ శాస్త్రవాదములు శుకుని ముందేమియు పనికిరాలేదు. చివరకు

అకట మునీంద్ర! యిట్లనుట న్యాయముగా మదిఁదోచెనే నపుం
సకుఁడవె! యేలయిట్లు పదిసార్లనిపించెదవయ్య! యెంతవా

రికిని మృగాక్షి కంటను జరింప విరాగము లాగునా వెలం
దుకలను గూడరే ముసుకనుంగొనుమాత్రఁ బరాశరాదులున్

అని నిందించినది. ఈ పద్యము మూలముకంటె రసవంతముగా నున్నది. రంభలోని యసహనత్వము విరుగు నేకముఖమున నగుపించు చున్నవి.

అకట నపుంసకుండు యదహ్రశ్శ్రుతిరీతిని సన్యసించువాఁ
డొకఁడును దైవయోగ విరహుండయి పుంస్త్వము లేకయుండువా
డొకఁడనుమాట నీ వెఱుఁగవో? శరణంటివిగాక యూ నపుం
సకులగువారిలోఁ బ్రథమమందుఁడ నేనుఁ జుమీ తలోదరీ!

అని సమాధానము చెప్పిన శుకుని శాంత సహనములు పద్యమునందెంత మనోహరముగానో చిత్రించిరి. ఈ పదలాలిత్యము తెనిగించు పద్ధతి వీరి ముద్రారాక్షసమునందు కుదురలేదు. శుక రంభా సంవాదములోని పద్యములన్నియు నింత చక్కగానే యున్నవి.

కృతి కేవిధమునందు తీసిపోని మరొక యాంధ్రీకరణము 'రసికానందము' సంస్కృత భాషయందు కాళిదాసాది మహాకవులు రచించిన రసవంతములు నందములగు శ్లోకములనేరి రసికానంద మను పేరుతోఁ దెలిగింప బడినవి. వీనియందలి యొకొక్క శ్లోక మొకొక్క ప్రత్యేకమగు కృతి. మొత్తము ఇరువదియేడు కృతుల యాంధ్రీకరణము లిందు కలవు. వానిలో గొన్ని ధ్వని ప్రధానము లగు పద్యములు.

పతి చనె వర్తకమ్మునకు వార్తయునైన వినంగరాదు తా
సుతప్రసవించు కాలమనుచుం జనె నత్తయు నల్లునింటి కే
నతినవయౌవన న్నిలుచు టర్హముగాదిట నీకు రాత్రి యూ
చతుర మరొక్క చోటికిఁక సాగుము వేగమె ప్రొద్దుగ్రుంకెడున్.

ఇందు వ్యతిరేకలక్షణ మూలమున రాత్రికి రమ్మను నర్థము తేలుచున్నది. దానికి పైనుడివిన పరిస్థితు లాధారములు.

రాతిరి మబ్బుచేత తిమిర మ్మధికమ్ముగనుండె వ్యాప్తిమై
నాతతకర్కుఁడై పతి రయమ్మున నిద్దురపోమె దొంగలీ
రాతిరి యూరుచొచ్చిరి కరమ్మును బాలనుగాన నెంతయున్
భీతిలుచున్న దాన నిఁక వేగమె నిద్దురమాను పాంథుఁడా!

అని పాంథుని ప్రబోధించుచు నొక నాయకురాలనిన మాట లివి. పద్యమెంత మనోహరముగా తెనిగింపఁబడినది? ఒక్క వ్యర్థ పదము రానీయక మూలము నతిక్రమింపక నింత రసవంతముగా వ్యంగ్యము చెడనీయక తెలిగించుట యనిన సామాన్యమగు పని కాదు. ఖండిత నాయిక భర్తనాయకునితో నన్నది.

నాదు మొగమ్మున న్మోగము నవ్వుచుఁ జేర్చెదు సిగ్గులేదె పో
పో దరిచేరి పయ్యెదను ముట్టకు టక్కరిమాట లాడినం
గాదిఁక రాత్రి నీకతనఁ గన్నులుమూయను డస్సియుంటి నా
పై దలి పంచ కేగు మళి వాడిన పూవుల నింపు నించునే?

చెలిమికత్తె తెల్లవారి నాయకురాలిని చూచి యన్న మాటలు

కలికిరో! చెక్కుల న్మకరికల్ సెడె లే దల చందనంబు చ
న్నులఁ జెదరంగలే దదె కనుంగవఁ గాటుక జార లేదు త
మ్ములమునఁ గల్గు కౌని పొలుపు న్నెర వాతెఱ వీడ లేదు నె
చ్చెలి! మదిఁగోపగించితివొ చెల్వుఁడు తాఁ బసివాఁడొ చెప్పుమా

స్వీయ

గళమున నంగదక్షతి మొగమ్మునఁ గాటుకగీటు వక్షమం
దలవడు కుంకుమ న్నొసట యూనరసమ్మును జూచి పాప మా
చెలియ మనంబులో దిగులుఁ జెందుచు బాష్పములొల్క భర్తతో
నలుగక పాణి శోణకమలాంతరముం గమలించె నూర్పులన్

రసికానందమునందు తిరుపతి కవులు తెనిగించిన శ్లోకములను మరికొందరు తెలిగించిరి. వానియం దీ సరళత్వము మృదుత్వము కని పించవు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి అప్పయదీక్షితుల వారనిన మహాప్రీతియు గౌరవము గలదు. ఆయన మహా పండితుడు. ఆలం

కారికుడు. ఉత్తమ కర్మిష్ఠి. ఆయన రచించిన వైరాగ్య శతకమును తిరుపతి కవులు తెనిగించిరి. మచ్చునకు

నాల్గు గడెలు సంస్కార మొనర్పకున్న
రెండు జాములు తిండి లేకుండ నేని
తెల్లమగు మేని సొగసింత దీనికోస
మెంత కష్టించుచున్నారొ హీనమతులు

భార్య కోసము పలవించు బ్రహ్మచారి
యొకతె యున్నను నేడ్చు నింకొకతె కోస
మిరువు రున్నను బరదారకొఱకుఁ దివురుఁ
దృప్తు లెవరున్న వారింక స్త్రీల యెడల

---

# ౮

## అన్యాపదేశ కావ్యములు

తిరుపతికవులు తెలుగుదేశమునం దెల్లెడల బర్యటించిరి. నగరములందును గ్రామములందును నవధానాదికము లొనరించి జయపతాకములను నెలకొల్పిరి. రాజాస్థానములందు బ్రవేశించి విజయశంఖములను బూరించిరి. వేంకటగిరి, విజయనగరము, గద్వాల, మొగల్తుర్రు, చిత్రాడ మొదలగు సంస్థానాధిపతులు వారి ప్రజ్ఞా వైదుష్యములకు నబ్బురపడి యథావిధి నర్చించి సత్కరించిరి. "ఆస్థాన పండితులు కవులు నమోనారాయ" ణేతి మంత్రమును పఠించిరి. వారి కవితాధాటికి రాజాస్థానము లనువత్సరము రహదారులైనవి. వారి కావ్యగీతికలకు వసంత వనములైనవి.

తిరుపతి వేంకటకవులు ఆత్మకూరు సంస్థానమునందు ప్రవేశించిరి. సీతారామభూపతి విద్యాపోషకుడు. కవితా ప్రియుడు. కళారాధకుడు. కవులను పండితులను పోషించుచుండెను. ఆ యాస్థానమునందు ధర్మాధికారియగు నొక వైష్ణవ పండితుడు కలడు. అతడు కవి యనికూడ ప్రతీతి. సంస్థాన విద్వాంసులు తిరుపతి వేంకట కవులను బరీక్షించిరి. ఆశుకవిత చెప్పించిరి "అరవిరి పాన్పుచేర చనరా విట రాయడవేగ వచ్చెదన్" అను సమస్య నొసంగిరి.

మఱఁదియు బావయు న్మగఁడు మామయు న త్తయు నింటిలోనఁ జి
చ్చఱపిడుగుల్ సుఖమ్ము కొనసాగదటంచుఁ దలంచి పానుపే
ర్పఱచితిఁ దోటలో సగమురాతిరిపోయినమీఁద నీవు గ్ర
చ్చఱ విరిపాన్పుచేరఁ జనరా విటరాయఁడ వేగ వచ్చెదన్

అని వారు దానిని పూర్తి చేసిరి. అంతటితో వారూరకుండ లేదు. "రంధ్రమ్మయ్యె శిలీంధ్రమాంధ్రమున సైరంధ్రీ పురంధ్రీమణి" అని దుష్కర ప్రాసతో నింకొక సమస్య నిచ్చిరి. దానినిగూడ వా

రాశువుగానే పూర్తిచేసిరి. పరీక్షయైనది. తిరుపతి కవులు దేవీభాగవతమును ఆస్థానమునందు చదివి వినిపించిరి. 'నా పలు కాలకింపుము' యను పద్యమునందు "గుణాలయ" యను శబ్దము వచ్చినది. తిరుపతి వేంకటకవుల పాండిత్యము కొంత పట్టిచూడవలయునని ధర్మాధికారి తలంచెను. "గుణాలయ" యనరాదు. "టాప్" రాదు "జీష్" వచ్చును. అచ్చునకు లోపమగునని యాశంకించెను.

తిరుపతికవులు సమాధానము చెప్పిరి. దాని నాయన ప్రత్యాఖ్యానము చేసెను. వాదోపవాదములు ముదిరినవి. చివరకు తిరుపతి కవులు భారతమునందు నన్నయ ప్రయోగము చూపించిరి. ధర్మాధికారి తృప్తిపడ లేదు. రాజుతో వీరు కవులుగాని పండితులు కారు, "శతలేఖన్యవధానమన్న యొక కష్టంబా" యని నుడివి మతి చెరిచెను. అంతటితో నూరకుండ లేదు. "నినుందిట్టి"రని నోటికసితీర నేమో కొండెములు చెప్పెను. రాజు కోపముతో కొలువు నుండి వెడలిపోయెను. తిరుపతికవుల కొడలు మండినది. భూపతి నెట్టెటో మెప్పించి తమ కార్యము నెరవేర్చుకొనిరి.

ధర్మాధికారిని నిందించుచు 'శనిగ్రహము' అను నిరువదియేడు పద్యముల లఘుకృతిని వ్రాసిరి. దీనికున్న ప్రచారము మరే యితర ఖండకావ్యమునకు లేదు. ఇందలి యిరువది యేడు పద్యములు కంఠస్థము గావింపని వారా దినములలో లేరు. పద్యముల యందచందముల మాటటులుండనిండు. రచనా చమత్కార మటువంటిది. ఉపాలంభ గర్భితములైన పద్యములను వ్రాయుటలో తెనుగు భాషయందు తిరుపతి వేంకటేశ్వరకవులే ప్రథములని చెప్పవలయును.

అందు వారొక వినూతన పంథా నవలంబించిరి. వేములవాడ భీమకవి యొక తిట్టుకవి. తన్నగౌరవించిన రాజులను ముఖమెదుటనే తిట్టెను. ఆ ఫలితము వారనుభవించిరి. అతడు వరసంభవుడు. శాపానుగ్రహ సమర్థుడు. భీమకవియనిన రాజాధిరాజులుకూడ భయపడిరి. భయపడుటయే కాదు వాని కర్ఘ్యపాద్యములిచ్చి పూజించిరి. తిరుపతి కవులుకూడ దాదాపంతటివారు.

భీమకవి కాలము సర్వస్వతంత్రమైనది. తిరుపతికవులనాటికి రోజులు మారిపోయినవి. కోర్టులు వెలసినవి. ముఖమెదుట పేరెత్తి తిట్టినచో మాననష్టపు దావాల కవకాశమున్నది. కోర్టులవెంట తిరుగవలసిన పని పట్టును. కావున నెవరినైన తిట్టతలంచు కొనినచో నోటి కసితీరుటకు పాండిత్యమును చాటుచేసికొని మాట చమత్కారములతో పిల్లిమీదపెట్టి ఎలుకమీద పెట్టి అన్యాపదేశముగా నారాటము తీర్చుకొనవలయును.

కందుకూరి వీరేశలింగం పంతులుగారి ప్రహసనము లన్నియు దాదా పిటువంటివే యనవలయును. ఇట్టి రచనలకు రెండువైపుల పదును లుండును. ఏ వైపుతోనైన తెగ నరకుకొని రావచ్చును. ఒకవైపు పాలబుగ్గలు, బుంకెత్తి పారలి పారుచుండును. ఒకవైపు హాలాహలము పుక్కిలించి యుమియుచుండును. ఆ రచనలోని చమత్కారమది.

తిరుపతికవుల బిడాలోపాఖ్యాన మటువంటిది. అంతకు మించి నది శనిగ్రహము. ఆ పేరులోనే పెద్ద విశేషమున్నది. శని నీచ గ్రహము. పట్టిపోకార్చి యెంతమంచి జాతకునినైన క్రిందుమీదు చేయును. వానిచర్య యటువంటిది. తిరుపతికవులు శనిగ్రహము మీదపెట్టి ధర్మాధికారి పుట్టు పూర్వోత్తరములు తూర్పారపట్టిరి. తిట్టినా నేర్పుగా తిట్టుటలో తిరుపతికవు లందెవేసిన చేతులు. ఆ పోక డలు మరెవ్వరికి నలవడునవి కావు. నారాయణదాసు మహాపండి తుడు – మాటనేర్పరి. "ఉత్తముండవెకా పురుషోత్తముండ" అని బందరులోని నాదెళ్ళ పురుషోత్తముగారిని గురించియు "పరమ ధూర్తుండు పూకంటి పండితుండు" అని మరొక పండితుని గురించియు చెప్పినటుల వినికిడి. వీనియం దుపాలంభములు ప్రాదేశమాత్రములు. శనిగ్రహమునందలి పద్యము లన్నియు నిందాగర్భితములే. ఈ కృతిని తిరుపతి కవులు

ధరణీనాయకుఁ "డుత్తముండ"వని నిన్ ధర్మాధికారమ్మునం
దు రహిన్నిల్పుట తుచ్ఛబుద్ధివయి క్రిందుర్ మీదునుంగాన కె

ల్లరి కార్యమ్ములు పాడుచేయుటకె నీ లక్ష్యంబు మాంబోటు లెం
చరు చండాల! శనిగ్రహంబ! యిఁక మాసామర్థ్యమున్ జూడుమా!

అను పద్యముతో ప్రారంభించిరి. ధరణీనాయకుడనగా రాజని యర్థము. ఈ యర్థముచేత చంద్రుడు సూచింపబడెను. అని కృతి కర్తల వ్యాఖ్య. దీని సమంజసా సమంజసత్వములు ఆలోచింపవలసి యున్నది. చంద్రుడని అంగీకరింతుముగాక. చంద్రునకు గ్రహరాజను పేరుండిన నుండవచ్చును. అతడు ఛాయాగ్రహము. సూర్యుడు గ్రహాధిపతి. కావున చంద్రునకు శనిని ధర్మాధికారమున నిల్పు సామర్థ్యము లేదు. ధరణీ నాయకుడను దానికి భూదేవి భర్తయగు విష్ణువని గ్రహించినచో కొంతవరకు సరిపెట్టుకొనవచ్చును. సర్వ నియంతృత్వము విష్ణువునకు కలదు. కనుక బృహస్పతికి స్వస్థానమైన ధనుర్లగ్నమునందు శనిగ్రహంబ నిన్ను నిలిపెను. ధర్మమనగా విల్లు, ధనువు అని యర్థము. ధనుర్లగ్నము అని భావము. ధనుర్లగ్నాధిపతి గురుడు. "గురుడుండఁదగిన చోటునందు నిన్నుంచెను. నీవు చండాలుడవు. శని చండాలగ్రహము. క్రిందుమీదు తెలియక నీ వందరి కార్యములను పాడుచేయు చుందువు" అని భావము. మిగిలినది తేలికగా గ్రహించుకొన వచ్చును.

తిరుపతికవులు కవులు పండితులు మాత్రమేకాదు. జ్యోతిశ్శాస్త్ర పారంగతులు కూడను. శనిగ్రహ మను పేరీ కృతికి నిర్ణయించుటలోనే వారి వైదుష్యము తెల్లమగుచున్నది. వీరి జాతకచర్య దీనికి ప్రబల నిదర్శనము. గ్రంథము సాగినది

నీ తోఁబుట్టువు దున్న నెక్కు మఱియు న్నీతండ్రి వారాంగనా
చేత శ్శోచ్చరుఁడు తీర్థపత్ని రమియించె న్నీదు మేనల్లుఁ డీ
వాఁత న్గలిన నీకుమాత్ర మెటులన్ బాటించు సద్వృత్తి నీ
చా! తుచ్ఛాత్మ! శనిగ్రహంబ ఇఁక మాసామర్థ్యముంజూడుమా

అని చుట్టపక్కములనుగూడ పేరు పేరు వరస నాడిపోసికొనిరి. శనికి తోఁబుట్టువు యముడు. అతడు మహిషి వాహనుడు. స్త్రీత్వము

నందుకూడ "తోఁబుట్టువు" అను రూపమే యేర్పడును. అప్పుడు మరింత సారస్యముండును. అదియే కవుల యభిప్రాయమై యుండవలయును. వాని పుట్టుపూర్వోత్తరములు తిరుపతికవుల కవగతములు. కావుననే

కోపం బేలర నీ పురాణ మది మాకుం దేట తెల్లంబ నీ
పాపం బిట్లు ఫలించెనా సుకవిరాడ్వైర స్వరూపమ్ముగా
రూపు న్మాపుఁజుమీ కవీశ్వరుల శత్రుత్వంబు నిర్భాగ్యుఁడా
శాపంబిద్ది శనిగ్రహంబ! యిఁకమా సామర్థ్యముం జూడుమా

అనుచు శాపము కూడ నిచ్చిరి. వారు దేవీ ఉపాసకులు. శాప మొసంగ గల సమర్థులు.

కుంకా! పాపమటంచు నెంచక వృథాకొండెమ్ములన్ రాజుతోఁ
బింకంబొప్పఁగఁ జెప్పి యాతని మదిన్ ద్వేషమ్ము పుట్టించి తీ
వింకన్ జేసెడి దేమిలేదు కడ నిన్నేమందు మీపైన మా
చంకన్నాకు శనిగ్రహంబ! యిఁక మా సామర్థ్యముం జూడుమా

శని యింతకంటె చేయగలిగినది లేదు. అతడు ధర్మాధికారమునందు రెండు సంవత్సరముల ఆరుమాసములుండును. అందు

నిరుడే తెంచిన వచ్చు వత్సరమటంటే కాదె? నీ మాట చే
త రహిన్ వచ్చితి మిప్డు నిన్ బలుమరున్ దర్శించి లాలించినన్
బిరుసై పోతి ప్రజాపతింబలె సరే బేష్ మెచ్చఁగావచ్చు నీ
సరసత్వమ్ము శనిగ్రహంబ! యిఁక మా సామర్థ్యముంజూడు మా.

ఒక సంవత్సరము భుక్తమయినది. దీనికంతకు కారణము

నీకంటెన్ ఘనులంచు మమ్ము జను లెంతేన్ బేర్కొ-నం దానబల్
శోకం బందికదా? సభన్ చెరచి నీ శూరత్వముం జూపి తీ
శోకంబే కడ తేర్చు నిన్ను, కడ తేర్చు న్నిక్క-మీమాట, దు
ష్టా! కంకోష్టా! శనిగ్రహంబ! యిఁకమా సామర్థ్యముం జూడుమా

పదివేలేండ్లు ప్రయత్నమున్ సలిపి సంపాదింతువే సత్కవి
త్వదశన్, మాలనికెంత కష్టపడినన్ బ్రాహ్మణ్యముం గల్గునే?
పద నీవే కవివైనచోఁ గవులుగావా పందులున్ గాడ్దెలున్!
సదసద్ జ్ఞాన! శనిగ్రహంబ! యిఁక మా సామర్థ్యముంజూడుమా

కవి యనగా శుక్రుడు. శుక్రుడు పరమోపకారి బ్రాహ్మణుడు. శని మాల గ్రహము. పరమ నీచగ్రహము. అపకారి. అట్టియెడ పదివేలేండ్లు ప్రయత్నించినను శుక్రత్వ దశ వానికి రాదని యర్థము.

గురుఁడు న్సూర్యుడు చంద్రుడుం గుజుఁడు శుక్రుండున్బుధుండుంబర
స్పరముంగార్యము నిర్వహించుటకునై పల్మారు యత్నించుచుం
డిరి కాకుండనె రాహుకేతువులతో నీ వొక్కడుం జేరి మ
త్సరముంజూప శనిగ్రహంబ! యిఁక మా సామర్థ్యముం జూడుమా

తిరుపతి కవుల ప్రజ్ఞా వైదుష్యములకు రాజగురువు ఆస్థానకవి యితర పండితులు మహానందము నొందిరి. వారు ప్రయత్నముచేసి రాజు మనస్సు మార్చిరి. తరువాత సీతారామభూపతి తిరుపతి కవులకు సందర్శన మొసంగెను. వారిచేత నవధానము చేయించి ఘనముగా సత్కరించెను. ఏనుగుపై నెక్కించి యూరేగించెను. తమ యాస్థానకవియగు కవిసార్వభౌమ కృష్ణమాచార్యులవారిచేత రచింపబడిన శ్రీనివాస విలాసమును తెనిగింపుడని తిరుపతికవుల కొసంగెను.

సరసాలం కృతి చారుచిత్ర కవితాసారమ్ము మాసొమ్ము సు
మ్మరవిందాసను రాణి మాజననియౌ నాలాటి మాబోఁట్ల కం
దరికిన్ విఘ్నము సేయఁజాలు దశ యెన్నన్నీకు నింకొక్క వ
త్సర మేసుమ్ము శనిగ్రహంబ యిఁక మా సామర్థ్యముం జూడుమా

అని శపించిరి. అది యట్లే జరిగెనని ప్రతీతి. ఉత్తమ కవితా ఖడ్గహస్తులు తిరుపతికవులు. వారి నలిగించి యెవరు నెగ్గించుకొనగలరు.

అకలంకమ్ముగ దేవరాకృతులుగా నైనన్ మహారాజవ
ర్యకృతుల్ గాగను నైన గ్రంథములు చేయంబూను మాచేతఁ ది
ట్టు కవిత్వమ్మును జెప్పఁజేసితివి పాడుంబుద్ధి చూపించి దు
ష్ట కులభ్రష్ట! శనిగ్రహంబ! యిఁకమా సామర్థ్యముం జూడుమా

అని చివరకు లోలోన నొచ్చుకొనిరి. తిరుపతి కవులు సర్వతోముఖ పాండిత్యము కలవారు. అది బంధకవిత్వము కానిండు శ్లేష కవిత్వము కానిండు. వారి లేఖిని పూలకంటె మెత్తనగు పదజాలములను గుమ్మరించును. నిరాఘాటముగా పరవడులు త్రొక్కుచు పరుగులెత్తును. ఏ పద్యము ప్రయత్నపూర్వకముగా వారు రచించినటులఁ గాన్పించదు. అసలు వారి హృదయములు మెత్తిన. అంతకంటె మెత్తన వారి శబ్దజాలము. కోపము రేగినచో చెప్పవలసిన పనియే లేదు. శతారముకంటె కరకుతేరి యరాతి జనుల యంగరంగమును వికలము కావించును. తిరుపతి కవుల శిష్యులలో నగ్రగణ్యుడు, అగ్రగణ్యుడేకాదు వారి తరువాత వారియంత కీర్తిని సముపార్జించినవాడు విశ్వనాధ సత్యనారాయణగారు.

తనయెద యెల్ల మెత్తన కృత ప్రతి పద్యము నంతకంటె మె
త్తన తన శిష్యులన్న నెడదంగల ప్రేముడి చెప్పలేని మె
త్తనయయి శత్రుపర్వత శతారము సత్కవి చెళ్ళపిళ్ళ వేం
కన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగు నాడులన్.

అని వినుతించిన పద్యభావము వారి విషయమున సరిగా సరిపోవుచున్నది. తిరుపతి కవులు సాహిత్యదేవతా ప్రసాదసిద్ధిని బొంది జన్మించిరి. వారు పుట్టుకవులు. కవితా దేవతను మనసార నారాధించిరి. సేవించిరి. దానికెట్టి యపకృతి యెవరివలనను కలుగకూడదు. కలిగినచో వారు సహించరు. వారి లేఖిని వెనుక ముందులు చూడక వారి మీదికి దూకులు పెట్టును. అప్పుడు దాని రచనా చమత్కారము కల్పనా చాకచక్యము చూచి తీరవలయును. రామ కృష్ణ కవులు కవితయందు కాకీ కోకిల యను పద్యవ్యాసము ప్రకటించిరి. తిరుపతి కవులు లేఖినికి పని పట్టించిరి.

బిడాలోపాఖ్యానము రచించిరి. ఇది నలుబదియేడు పద్యముల ఖండకావ్యము. అందు వారు చూనిపించిన హాస్యములకు నెద్దేవల కంతులేదు. ఇందలి బిడాలములు రెండు రామకృష్ణకవులు. పులులు తిరుపతి కవులు. సింహము చర్ల బ్రహ్మయశాస్త్రిగారు.

కలదొక్క పెద్దపులి తి
ర్మల గుహలో వేంకటేశ్వర దయాధిగతో
జ్వల పౌరుషభరితము మెక
ముల దొరయనఁగ వన రాజ్యముం బాలించున్.

అని కథ ప్రారంభింపబడినది. ఈ పులి వేంకటశాస్త్రిగారు.

చాల విధంబుల దానిం
బోలం గల్గిన మఱొక్క పులి మిత్రంబై
పాలించెం దద్రాజ్యము
మేలంచు మృగాళి వినుతి మిన్నులు ముట్టన్.

ఈ పులి తిరుపతి శాస్త్రిగారు. ఇది రచించినదికూడ తిరుపతి శాస్త్రిగారే. కావుననే 'చాలవిధంబుల దానిం బోలంగల్గిన' అనుచు వినయమును ప్రదర్శించిరి.

ధవళగిరిం బెరుమాళ్ళను
వ్యవహారము గల్గు నొక్క పండిత సింహం
బు వసించుట విని యవి త
త్సవిధంబున నభ్యసించెఁ దద్విక్రమమున్.

వీరు ధవళేశ్వరము నందలి బ్రహ్మయ్య శాస్త్రిగారు. తిరుపతి కవుల యూహ యనన్యసామాన్యమైనది. కల్పన పాండిత్య ప్రకర్షతో కూడుకొన్నది. రచన రసిక జనానందకరమైనది. సౌలభ్యములో సొగసులు సమకూర్చుట వారి సొమ్ము. ఆ పులులు రెండు

తిరుగుచు దేశముల్ మరల దేశికు నొద్దకు వచ్చి తద్గతుల్
గఱచుచుఁ గొంతకాల మెసకంబు వహింపఁగ నైజ విక్రమ

స్ఫురణకుఁ దోడుగా యశము పొంపిరి వో వఁగ సింహావిక్రమ
స్ఫురణముఁ జూపసాగెఁ బులి జో డలరంగ వనంబు లోపలన్.

పులులు శాస్త్రపాండిత్యమునందు గురువునంతవైనవి. ఆ జంట పులులకుఁ బులిపిల్లలు శిష్యులైనవి. వానిలోఁ గొన్ని యేక లవ్య శిష్యులట. అవును ఆ దినములలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చెప్పినట్లు "వేంకన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెనుంగు నాడులన్" వారియొద్ద చదువుకొనినను చదువుకొనక పోయినను అందరు తిరుపతి కవుల శిష్యుల మని చెప్పుకొనెడివారు. అది యొక ఘనత. పిల్లివంగడమునం జనియించిన యొక్క కూన

విని పులియొద్దం దద్గుణ
మును నేర్చుకొనంగఁ దలఁపు పొడమి తనంతం
జనెఁ దిరుమల దరిని వసిం
చిన పులి దగ్గరకు నేరిచిన వినయమునన్

వీరు ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.

ఒడలెల్లం బలు చారలుండుటయు వాలోపాంతమం దాని ముం
దడుగుల్మోపుచు కూరుచుండుటయు మున్నా చిన్న ముల్కంటఁ గ
న్నడు రంగుం దిలకించి మీసముల చందంబు ల్విలోకించి వీ
రిడిపిల్లిం దన శాఖలోని దనుచుం బ్రేమించె శార్దూలమున్.

వేంకటరామశాస్త్రిగారుకూడ ఆరామద్రావిడశాఖకు చెందిన వారు. కావున వేంకటేశ్వర శార్దూలము బిడాలమును ప్రేమించి నది. "చిరకాలము ప్రవాసమున్ సలుపుచున్ సేవించె" శార్దూల మును బిడాలము

వనమున మృగములు పులి క
ప్పనఁ జేసిన మాంసమెల్ల భక్షించుచు మె
క్కినదానికిఁ దగు మేనిం
గని యా పృషదంశు కార్శ్యకము తెగబలిసెన్.

"కాని పిల్లికిఁ బులికిఁ గల్గు చెయ్వులం దొక్కచైదియుఁ జేతఁగాక యుండె" నట. చక్కని హాస్యము. "మతిమంతులైన శిష్యులకుఁ దక్క గురుని విద్యావిశేషంబు కొలుకఁ బడునె" యని యందొక యర్థాంతరన్యాసము. తిరుపతి కవులు తమ పద్యములం దర్థాంతరన్యాసములు, లోకోక్తులు వాడుచు నొక గంభీరమగు భావమును ప్రదర్శింతురు. శార్దూలమునకు విసుగు జనించినది. బిడాలమును చేరఁబిలిచి చిరుకానలకుఁబోయి యచట బ్రతుకుము

పులుల నెదుర్పకు మెందుం
బులు లుండిన చోటు లరసి పోకుము పులి చే
ష్టల నెఱుఁగని వారల కడఁ
బులినంచుం జెప్పుకొనుము పొమ్మని పనిచెన్.

దానితో నొక శావురు పిల్లి స్నేహము చేసినది. బావురు పిల్లి వేదుల రామకృష్ణశాస్త్రిగారు. గురువులమాట మదియం దుంచుకొని శార్దూలావాసనుగాని యొక్క వనమందుం గూడి క్రీడించు మార్జాల ద్వంద్వమును తద్గహన భూజాని మంత్రి కాంచెను. తద్గహన భూజాని పిఠాపురాధీశ్వరులగు (శ్రీ) రావు వేంకట కుమార మహీపతి సూర్యారాయ ప్రభువులు. వారి మంత్రి మొక్కపాటి సుబ్బారాయుడుగారు. ఆయన విఖ్యాత పురుషుడు. విద్యా విభవ సంపన్నుడు. ఆ మంత్రివరుడు

అరిగి నృపాల రత్నమ! వనాంతిక సీమకు వచ్చి యున్న వ
బ్బురమగు రెండు బెబ్బులు లపూర్వము లింతకుమున్ను చూచియే
నెఱుఁగ భవద్భుజాబల విజృంభణకుం దగు గుర్తుగాఁగ దే
వర కొని తేవలెం బురుజు వాకిలి వానికి నిల్లు కావలెన్

అంచు బోధించి వానిఁ బట్టించి కోట
దరికి రప్పించి గోపుర ద్వారమందు
వాని నాడించి చూపించి పంజరంబు
నందు నుంపించె నద్భుతం బంద నతఁడు

అవి దేవీ నవరాత్రములు. పిఠాపురాధీశ్వరులు ఆ దినములలో ప్రతి సంవత్సరము పండిత సభలు చేయింతురు. పరీక్షలు జరిపింతురు. నానా దేశములనుండి విద్వాంసులు కవులా సభలకు వచ్చుచుందురు. తమ పాండిత్యమును చూపుచుందురు. మహారాజుచేత విజయదశమినాడు సత్కారములను బొంది వెళ్ళుచుందురు. ఆయన మహాదాత. ఉదార స్వభావుడు. మంత్రియందమిత గౌరవము కలవాడు. మంత్రి మాట ననుసరించి రామ కృష్ణకవులను బిలిపించెను. దిగ్దంతులవంటి పండితులు నెలకొన్న సభయందు శతావధానము చేయించెను. శతఘంటకవనము చెప్పించెను. అష్టావధానము జరిపించెను.

రామ కృష్ణకవు లపూర్వ ప్రజ్ఞాపాండిత్యములు కవితాసామర్థ్యములు వెల్లడించిరి. పండిత ప్రకాండు లమితాశ్చర్యము నొందిరి. వారిపైన ప్రశంసా శ్లోకములను గురిపించిరి. మహారాజు మూడు నూటపదార్లు పట్టుశాలువుల జతలు బహూకరించెను. తమ యాస్థానమునందు కవులుగా నుండ నర్థించెను. ఆ సమయమున రామ కృష్ణులు ఆశువుగా నూరు పాదము లేక ప్రాసగల చంపకమాలికను చెప్పిరి. తుదకు

ఇట్టిరవుగఁ గొన్ని పాదములనే మును కబ్బము తాత చెప్పెన
బ్బురపడి తత్సభాస్థలిని బోరన గద్దియ డిగ్గి గండపెం
డెరమును గృష్ణరాయలు తొడెన్ నృపపుంగవ!

అని ముగించిరి. రాజు పరమానందము పొందెను. సాభిప్రాయముగా చెప్పిన తుది పాదములందలి భావము గుర్తించి మహారాజు రామ కృష్ణ కవులకు గండపెండేరములు తొడిగించెను. దివాణమునకు సమీపముగా నిరువురకు సుందరములగు భవనములను కట్టించి యిచ్చెను. జరిగిన సంగతి యిది. దీనిని పై పద్యములలో నట్లనుసంధించిరి. తిరుపతి కవులు కథ చివరివరకు నతి రమణీయముగా నడిపిరి. ఇది నిందాగర్భితమైన ఖండకావ్యము. బిడాలము మీదపెట్టి

రామ కృష్ణ కవులను నిందించిరి. దీనినే "సెటైర్" అని ఆంగ్లేయు లందురు. బిడాలోపాఖ్యానమునందు చక్కని హాస్యము పోషింప బడినది.

ఈ తెగలోనిదే గ్రామసింహము అను లఘుకృతి కూడ, ప్రత్యేకమగు ప్రయోజనము కలది. భారతమునందలి శాంతిపర్వము తృతీయాశ్వాసములోని "కుక్కుర నీచత్వముం దెలుపునట్టి యితిహాసము" అను నారుపద్యములలోని కథను తమ ప్రయోజనమున కనుకూలముగా కొంత మార్చి ముప్పదిమూడు పద్యముల లఘు కావ్యముగా వ్రాసిరి. దీనిని ప్రత్యేకించి రామ కృష్ణకవులలో మొదటి వారగు వేంకటరామశాస్త్రిగారిని మనస్సునం దుంచుకొని తిరుపతి కవులు రచించిరని లోక ప్రతీతి. ఒక ముని కలడు. అతడు

"నా నృషిః కురుతే కావ్య" మనెడు కతన
నతనిఁ గవియని చెప్పుట యక్కజంబె
యా మహామహుఁ డెల్లప్పు డలరుచుండు
శిష్య వర్గమ్ము తన చుట్టుఁ జెలఁగుచుండ

ఈ కథయందు వేంకటశాస్త్రిగారు ఋషిగా వర్ణింపఁబడిరి.

"నానృషిః కురుతే కావ్యం" అను లోకోక్తినిబట్టి శ్రీ శాస్త్రిగారు ఋషి యని చెప్పబడుట చాల సమంజసము. అదియుగాక శ్రీశాస్త్రి గారు కామేశ్వరీ పాదపూజా ధురంధరులు. కావున ఋషి వాచ్యము నకు సర్వవిధముల నర్హులు. వాని నెల్లప్పుడొక కుక్క యాశ్ర యించుకొని తిరుగుచుండును. అతఁడున్ మక్కువ దానియం దునిచి మన్ననమై నరయుచుండును. తిరుపతి కవులు సర్వసమర్థులు. తాము చేసిన పనిని సమర్థించుకొనుటలో నతి నిపుణులు.

శ్వానములఁ గుక్కుటముల మార్జాలములను
నెవఁడు పోషించు మూఁడు నాళ్ళెంత మంచి
విప్రుఁడేనియు నిహమున వృషలుఁ డతఁడు
మాలఁడై పుట్టుఁ గోటి జన్మముల దనుక

అను ధర్మశాస్త్ర మెఱింగియు
శునకముఁ బోషించు నతఁడు

దీనికి ముఖ్య కారణము

..... శుద్ధాత్ములకున్
బని లేదు తక్కినవి నె
మ్మనమున కెది తోఁచు నదియె మహనీయ మగున్

"ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అని కవికుల గురు వగు కాళిదాసు అదివరకే దారి చూపించెను. చివరి పద్యపాదము లను తిరుపతి కవుల మనఃప్రవృత్తిని వెల్లడి చేయుచున్నవి. వారు మహామహులు. సకలశాస్త్రవిదులు. మనస్సునకు తోచినది చేయుదురు. దానిని సమర్థించుకొందురు. వేంకటశాస్త్రిగారికి మీసములు గలవు. ఆత్మకూరు సంస్థాన విద్వాంసులు మీరు పండితులు గదా మీసములేల పెంచితి రని ప్రశ్నించిరి.

"దోసమటం చెఱింగియును" అను పద్యమును సమాధానము చెప్పిరి. వారికి సద్యఃస్ఫూర్తి యున్నది. ఒక్కొక్కప్పుడు వారి రచనలయందు విపరీతములు గోచరించును. వాని యన్నిటికి వారి "నెమ్మనమున నెది తోఁచు నదియె మహనీయమగున్" అను వాదము సమాధానము. అవి యంత సమంజసములు కావని లోక మెఱింగియు నొకప్పుడు "వెలార్ప వెఱఁగందుదు రమ్మని శక్తి కోడుటన్" ఇది సత్యము. శ్రవణానందమునందు చతుర్థాశ్వాసము లోని "వేసవి వచ్చె" అను పద్యమును వ్రాసితిమే కాని దానికర్థము మాకే తెలియదు. అంత ధైర్యముచేసి మమ్మడుగువారు ఇంతవరకు కనిపించలేదు. అంత కనిపించినప్పుడేదో యొకటి చెప్పలేక పోదుమా యని వ్రాసితిమి అని నొక వ్యాసములో కథలు గాథ లందు వేంకటశాస్త్రిగారు వ్రాసిరి. అట్టి ధైర్యము వేంకటశాస్త్రి గారికి కలదు.

"ఆ మాన్యున్ దగు పూజలం దనిపి పై నాతిథ్యముంజేసి లో
నేమేనిం బలుకంగ నెంచియును బై నేమన్న నేతప్పొ యం
చోమంబూని"రట

ఇందులకు ప్రధాన కారణము "ఎదిరి నిల్చిన మృగేంద్రమేని చెడున్ లేనిచో లేడియేని బ్రతుకున్" బిడాలోపాఖ్యానములోని పులుల ప్రవృత్తి గ్రామసింహములోని ముని మనోవృత్తి రెంటిని జత చేర్చి పరిశీలించినచో తిరుపతి కవుల గుణసంపత్తి చక్కగా గోచరించును. మిగిలిన కథయంతయు భారతములో నడచినట్లే గ్రామ సింహమునందును నడచినది. కుక్క విశ్వాసముగల జంతువు. ఋషి దానిని సర్వవిధముల సంరక్షించుచు వచ్చెను. అభివృద్ధికి తెచ్చెను. శరభముగా రూపొందించెను.

అది విశ్వాసమును వీడి మునినే చంప నెంచెను. అది యెరింగి ముని దానిని మరల కుక్కగాఁ జేసెను. వేంకటరామశాస్త్రిగారిని మహోన్నత స్థితికి తెచ్చినవారు వేంకటశాస్త్రిగారు. వారినే తిరస్కరించి రామశాస్త్రిగారు నిందించిరి. శ్రీ శాస్త్రిగారు వాని గర్వ మడచి యూరు పేరు లేకుండ చేసిరి. ఇట్టి రచనలచేత తిరుపతికవులు తమ్మెదిరించిన వారినందరిని నొక కొలుకునకు తెచ్చి నామ రూప విరహితులను జేసిరి.

## ౬

## ఆంధ్రీకృత రూపకములు

కవి స్వతంత్ర కావ్యము లెన్నైనను వ్రాయవచ్చును. వాని యందు కష్టము లేదు. స్వేచ్ఛ యున్నది. తన కిష్టము వచ్చిన పదము వాడవచ్చును. భావము కల్పించుకొనవచ్చును. అలంకారము లుప యోగించుకొనవచ్చును. శయ్య ననుకరింపవచ్చును. వానిని ప్రశ్నించు వారుండరు. ఆంధ్రీకరణము లట్లుకాదు. పదప్రయోగము మొదలు కొని ప్రతి విషయమునందు మూలము నతిక్రమించి పోకూడదు. దేని యందును స్వాతంత్ర్య ముండదు. పదము కుదిరిన చో భావ మిముడదు. రెండు కుదిరినచో శయ్యలో సరళత పొందు పడదు. ఏదో యొక దానియందు లోపము కలుగుచునే యుండును. అన్నిటిని కుదురు పరచుకొనుట కష్టసాధ్యము. కావున రసజ్ఞులగు కవులు చాల వరకు భావము దుసికిలి పోనీయకుండ మూలమును తెలిగించుటకు ప్రయ త్నించుచుందురు. తిరుపతి కవులు నాటకములను తెనిగించునప్పుడు సైతము నదే పద్ధతి ననుసరించిరి. కావుననే వారి యాంధ్రీకృత రూపకములు చాలవరకు స్వతంత్ర రచనలవలె నుండును.

వానిలో మొట్ట మొదటిది బాలరామాయణము. ఇది పది యంకముల నాటకము. సంస్కృతమున రాజశేఖరుడను కవి రచించెను. రాజశేఖరుడు మహేంద్రపాలుని యాస్థాన విద్వాంసుడు. అతడు ప్రౌఢ కవి. బాలరామాయణమును రావణుడు సీతా స్వయం వరమునకై మిధిలా నగరమునకు వచ్చుటతో ప్రారంభించెను. జనక శతానందులు వాని కెదురుపోయి కొనితెచ్చిరి. ముక్కంటి విల్లును సీతను వానికి చూపిరి. రావణుడు సీతను చూచి

తన మదికి తోచినట్ల విధాత యీ వి
శాల లోచన రూపు సంసార సార

కలితముగఁ జేసి మదనుఁ బెఁగాపు వెట్టఁ
బోలు లేకున్న మరుఁడు నన్నేల యేచు

నని తలంచుచు శివ ధనువును సమీపించెను. ప్రహస్తుడు

కలిత రణచ్ఛల ద్వాలయకంబగు డాపలి చేత గౌరియున్
వలయిత సర్పమైన కుడిబాహున శూలియు లాగ సైచి త
ట్టు లిపుడు కాదు రావణుఁడటుల్ రజతాద్రి నదల్చినట్టి చే
తుల నిను నెక్క వెట్టు నెటుతూలక తాళెదొ చాపరాజమా!

అని చాపమును

కదలకుమమ్మ భూమి! కడఁకన్ దలఁదాల్పుము దీనిఁగుండలీ!
బెదరక మోయు మిర్వురను వీపునఁగూర్మమ! వీరి మువ్వురన్
బదిలముగాగ మోయుఁడు సమంబుగ దిగ్గజవర్యులార! యీ
త్రిదశులసూడు నేఁడు హరదేవుని కార్ముక మెక్కు వెట్టెడున్

అని భూమ్యాదులను హెచ్చరించెను నాటక రచనకును కావ్యరచనకును మిగుల తారతమ్య మున్నది. నాటకము రంగస్థలముమీద ప్రయోగింపబడునది. నటులు ప్రేక్షకులు నంతపండితులయి యుండరు. పామరులకు గూడ నొక్కసారి చదువునంతలో నర్థమగునట్లు రచన యుండవలయును. అప్పుడుగాని రసానుభూతి కలుగదు. నాటకము ప్రచారములోనికి రాదు. కావుననే కవులు తమ నాటకములను తేలిక భాషయందు రసవంతముగా వ్రాయుటకు ప్రయత్నింతురు.

పాండవ విజయోద్యోగములు గయోపాఖ్యానాది నాటకములు నంత ప్రచారమునకు వచ్చుట కిది యొక కారణము. బాలరామాయణము తిరుపతి కవులు తెనిగించుటకు పూర్వము వడ్డాది సుబ్బారాయుడుగారు వేణీసంహారమును తెనిగించిరి. అప్పటి కితర కవులు పెక్కు నాటకములను తెనిగించిరి. వానియందలి రచన యాకర్షణీయముగా లేదు. అవి ప్రచారమునకు రాలేదు.

వేణీసంహారము సుందరమగు రచన కలది. అది నటకుల నాకర్షించెను. పెక్కు చోటులందు రంగస్థలము మీద ప్రదర్శింపబడి నది. జనుల పొగడ్తలను పొందినది. అప్పటిలో దానికున్న ప్రచారము మరే నాటకమునకు లేదు. తిరుపతి శాస్త్రిగారు రహస్యమును గ్రహించిరి. బాల రామాయణము నంతకంటె బాగుండవలయునని తెనిగింప నారంభించిరి. అప్పుడు వేంకటశాస్త్రిగారికి శరీరములో నారోగ్యముగా లేదు. తిరుపతిశాస్త్రిగారి యొక్క చేతిమీదుగా నిది చివరివరకు నడచినది. ఆ కారణముచేతనే

బుధుఁడును గవియు మాన్యుండునై చె
లంగు తిరుపతిశాస్త్రి తెలుంగుఁ జేసె

నని ప్రస్తావనయందు చెప్పుకొనెను. అంకాంతములందు "తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగు" నని యుండుట వారి సమయము. తిరుపతిశాస్త్రిగారు నాటక రచనా విధానమున కుచితమగు శయ్య ననుకరించిరి. సౌలభ్యము పాటించినను సహజమగు బిగువు సడల సీయలేదు. పై పద్యములు చదివిన వారెవరు వాని నాంధ్రీకరణము లని తలంపరు. కవిత జాలువారినది. రావణుడు విల్లెత్తెను. "ధనురా రోపణంబు పణంబుగా సీతం బెండ్లి యాడుటకై యత్నింపఁ గూడ" దని తలంచెను. వింటిని నేలకు జారవిడిచెను. జనకునకు కోపము వచ్చినది. రావణునితో యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను. రావణుడు

శిథిలమై త్రుప్పు వట్టిన శివుని ప్రాఁత
ధనువు పఙ్క్తిముఖుఁడు దోర్మదమున విడిచె
జనకుఁ డిది సైప కనికి చొచ్చునట పోరు
తగదనుచు నవ్వుఁ డొకపెట్ట మొగములార!

అనుచు పక పక నవ్వెను. ఎంత సరళమగు శయ్య. యతి కొరకుగాని ప్రాసయతికొరకుగాని తడుములాడుకొనుట తిరుపతికవుల కలవాటు లేదు. పదములు యథారీతిగా వచ్చి వాలును. పద్యము

స్వతంత్ర రచనవలె సాగినది. "నవ్వుఁ డొకపెట్ట మొగములార!" చక్కని దేశీయము. ఇట్టి రచన మూలముననే వన్నె తెచ్చును. శునశ్శేఫ శతానందులు రావణ జనకుల సంరంభము మాన్పిరి.

రెండవ యంకములో మిథిలానగర పరిసరోపవనమునందు రావణుడు సీత యందము తలంచుకొని పరితపించుచు

నన్నుఁ బీడించుచుంటి వైనను సమస్త
సురలలో నాకు నీవ యిష్టుండవో మృ
గాంక బాంధవ! రావణునం దమర్చు
బాణములు సీతపైఁ గూడఁ బఱపుచుంటె?

అని తల్లడపడుచుండును. అంతలో పరశురాము డచటికి వచ్చును. వా రిరువురు పోరి కాయత్తపడుదురు. పరశురాముడు

పతి చాపంబుఁ దిరస్కరించి తని కోపస్వాంతమై యున్న పా
ర్వతి వక్త్రంబున నైజకాంతి మగుడం బర్వంగఁ దచ్చాప ధి
క్కృతిఁ గావింపఁగ మేటివైన కర మేదీ తెల్పు మీగొడ్డటన్
క్రతుభుగ్బృందిక లందఱున్ బొగడఁగా ఖండించెదన్ రావణా!

అని వీరావేశమున మీదికి వచ్చెను. ఇరువురకు వాగ్వాదము కొంత నడచినది. పరశురాముడు

కోతికదా సురాధిపునకుం దనుజుండగు వాలి చంకలో
నీ తల లన్నియుం దిగిచి నీరధు లన్నిటియందు నార్చు నా
డూతము లేక యూర్పెడల కుక్కిరి బిక్కిరియౌ మొగాలతో
నే తడవుంటి వోరి రజనీచర! యెవ్వ రెఱుంగ రింతయున్

అని దెప్పెను. రసానుగుణములగు పదము లూతముగా పద్యమునందు తిరుపతిశాస్త్రిగారికి పడుచుండును. "ఉక్కిరి బిక్కిరియౌ మొగాలతో" నట. ఇది పరిస్థితిని స్ఫురింపఁజేయు చక్కని వాడుక పదము. రావణ పరశురాముల పోరాటము భృంగిరటుడు

విండ్లు పదియుఁగూడ విడువు మో దశకంఠ
దురము మానుమయ్య పరశురామ
యుద్ధభూమి మీఁద లొండొరు ల్మార్కొంట
కొడఁబడంగఁ బోఁడుచుఁడు పురారి

అని మానిపించును. మూఁడవ యంకమునందు మదనతాప మనుభవించుచున్న రావణుని యెదుట భరతాచార్యుడు సీతా స్వయంవర నాటక మాడించును. ఇది యంతర్నాటకము. రాముడు విల్లెక్కు పెట్టుచు లక్ష్మణునితో నన్నమాట లివి

వత్స! లక్ష్మణా! తగఁ గనువై చికొంచు
నుండుమా మద్భుజా కాండ యుగ్మ మార్భ
టింప హరచాప మదియె పటేలు మనునొ
యెక్కిడఁగరాక ౹ తాడె పుటుక్కు మనునొ

భావముతో పాటు పద్యము మనోరంజకముగా నడచినది. తిరుపతిశాస్త్రిగారు తమ పద్యములందు సమయానుకూలముగా నిట్టి వాడుక పదములను వాడుచుందురు. అందుమూలమున చెప్పదలంచుకొనిన భావము స్ఫురించి రసపుష్టి గావించును ఈ ధ్వన్యనుకరణ శబ్దములు తెగునొ విరుగునొ యను భావములు తోపించును. అది యొక యందము. నాల్గవ యంకమునందు దాశరధుల వివాహము. ఐదవ యంకమునందు రావణుడు తాపజ్వరమువలని బాధపడుచుండ విశాంరదునిచే నిర్మింపబడిన సీతా విగ్రహమును తెచ్చి నిజముగు సీత యని చూపింతురు. దానితో నాతడు కొంత మోదించును. చివరకు సత్యము తెలిసికొని మరల మదనతాపమును బొందును.

ఈ నాటకములో మిగుల మనస్సును ఆకర్షించునది రసానుభూతి కలిగించునది యారవ యంకము. ఇందు రాజశేఖరకవి కైకేయీ దశరథులకు కళంకము కలుగకుండ పాత్రపోషణ గావింప యత్నించెను. చాలవరకు కృతకృత్యుడయ్యెను. రామాయణము నందు కైక దశరధుని రెండు వరము లడిగెను. దశరధు డొసంగెను.

అందుమూలమున "ముదుసలిగాన లేఁజిగురుబోడికి వశ్యుఁ డటంచు" దశరథునకు నింద వాటిల్లినది. "ఇట్టి దురితమెట్లు చేసినదో డెందము రాయిగనంచు కైకకు" దూరు కలిగినది. "ఇయ్యది తనకిష్టమేనని" భరతునకు కళంకము చేకూరినది. దినకరాన్వయమునకు నల్పు లిఖింపఁబడినది" వీనిని తొలగించుటకు రాజశేఖరుడు శూర్పనఖా మాయామయులచేత కైకేయీ దశరథుల రూపములు వేయించి కథ నడిపించెను. అప్పుడు దశరథుఁడు కైకతో నమరావతికి నింద్రునకు రాక్షసులతోడి యుద్ధమునందు సాయ మొనరింప నరిగెను. కథ చక్కఁగా నతికినది. శూర్పనఖా మాయామయులు మాల్యవంతునితో తాము చేసివచ్చిన కార్యమును దెల్పుటతో నంక మారంభ మయినది. మాయామయుడు.

> ఇల్లు వాకిలి విభవంబు లెల్ల విడిచి
> తండ్రి పనుపున నుగ్ర కాంతారములకుఁ
> బోవు నాఁడును గనుమాయఁబోక రాము
> మొగము పున్నమ జాబిల్లి పగిది నుండె

నని తన యుపన్యాసము ముగించెను. తిరుపతిశాస్త్రిగారి కవిత్వము నందొక ప్రత్యేకత కలదు. వైకృతాచ్ఛికపదములను తత్సమములతో గుచ్చెత్తి యడప తడప పద్యములందు వాడుచుందురు. అందు మూలమున పద్యము మృదుమనోహరమయి శయ్యబిగువు కలిగియుండును. ఇందులకు పై పద్యములె తార్కాణములు. ఇంకను 'జగజెట్టియైన రజనీచర నాధుని, వేల్పుటావుంబోలి వెలలేని ముత్యాల ధన మెవ్వని కొసంగు తామ్రపర్ణి, కట్టఁ బుట్టంబులేదు. నాగములు నగలు పాణిఁబునుక గళంబున బాపదండ బూది మైపూత, ముజ్జగము మేడ మొగసాల మొనయు హస్తదీపికలు' మొదలగు పద్యములు చూచుకొనవచ్చును.

ఈ పద్ధతి శ్రీనాథుని కవితయందు కలదు. 'చదలేటి బంగారు జలరుహాంబుల తూండ్లు' ఇత్యాది. అది పెద్దనగారికి సంక్రమించినది. 'చేర్చుకఁగా నిడ్డ చిన్న జాబిల్లిచే సింధూర తిలకంబు చెమ్మగిల్ల'

ఇత్యాదు లరయునది. ఇట్టి రచన కవిత్వమునకు ప్రాణముపోయును. పాఠకుని కుత్తేజము కల్పించును. వేంకటశాస్త్రిగారి యందిట్టి దరుదుగా నగుపించును.

రాముడరణ్యమున కరిగెను. దశరథు డమరావతినుండి వచ్చెను. జరిగిన వృత్తాంతమును విని విలపించెను. పిదప సుమంతుండరుదెంచెను. అతడు సీతారామలక్ష్మణు లడవిని పయనము సాగించిన విధమును దెలిపెను. ఈ కథాభాగము చదువునప్పు డెంతటి కఠినచిత్తమయినను శోకరసమున చివికి శిథిలము కాకమానదు. ఇచటి పద్యములు మూలముకంటె నందముగా నున్నవి. అది తిరుపతి శాస్త్రిగారు తెలిగించిన విధములో నున్నది. కవి హృదయమును చక్కగా నవగతముచేసికొని జానగు తెనుగుపదముల కూర్పుతో రచన సాగించిరి. మచ్చునకు

కుశపథంబు చూచుకొని మెల్ల నడువుము
పైనఁ గప్పికొనుము పైటకొంగు
నెండ ప్రబలునంచు నేడ్చుడు నేర్పిరి
పథిక సతులు సతికి బాట నడక

ఈ పద్యము సీతామహాదేవి ముగ్ధత్వమును విప్పి చెప్పుచున్నది.

అలసి కూర్చుండు తరి నాథుఁ డవనిజాత
యలసియును దాను విసరుఁ బైఠాంచలమున
వత్స లక్ష్మణుఁ డంఘ్రి సంవాహనంబు
పరుసఁ గావించు నలసటవడక తాను

ఘోర కాంతారములలోని దారులందుఁ
బుడమికానుపుతోఁ గూడ నడచునపుడు
శాష్ప సంరోధ యత్న సంపాతిమైన
రాఘువుని దృష్టి భ్రాతపై ప్రాలుచుండు

ఈ పద్యము లాయా పాత్రల గుణశీలములకు వ్యాఖ్యానములు. ఈ యంకములోని పద్యము లన్నియు నింత మనోహరముగా నున్నవి. తరువాత రత్నశిఖండుడను పక్షిశేఖరుడు దశరథుని దర్శింపవచ్చును. సీతాపహరణ వృత్తాంతమును జటాయు మరణంబును వినిపించును. ఏడవ యంకమునందు సేతుబంధనము. రాముడు సముద్రునిమీద బాణప్రయోగము గావించెను. సముద్రుడు రాముని యెదుట కనిపించి యన్న మాటలివి

అగ్ని శిఖలను జిమ్మె నీ యంబకములు
నాటఁగా నన్ను తాడించు నప్పుడకట
మఱచిపోతివె పడకింటి మాట దేవ!
కమలకును నీకుఁ బ్రలయాంత కాలమందు

ఈ యూహ అసలు రామునకుఁగూడ స్ఫురింపలేదేమొ. రాజశేఖరునకు స్ఫురించినది. రాము డా మాటలు విని సిగ్గుపడినాడట. నిజముగా సిగ్గుపడవలసినదే. అనాలోచితముగు పని. కావుననే దివి కాననిచోఁ గవి కాంచునను సామెత పుట్టినది. ఈ పద్యము చదివి సరిగా నర్థము చేసికొనినవారు చిన్న నవ్వు నవ్వి హరి గాననిచో నని దిద్దుకొందురు.

ఎనిమిది తొమ్మిది యంకములందు యుద్ధము వర్ణింపబడినది. తిరుపతిశాస్త్రిగారి యాంధ్రీకరణ మెంత సహజముగా నున్నదో యందుండి యొక్క పద్యముకూడ చూపి యింతటితో ముగింతును. రాముని సింహనాథుడు దెప్పిపొడిచెను. దానికి రామచంద్రుడు

క్రోతియని వాలి ననకుము కొంప ములుగు
నమలినంబగు నీ తండ్రి యశముగూడ
నాల్గు వారాసులను ముంచి నాన్చెఁగాదె
చంకలో నొక్కిపట్టి నీ జనకు నతఁడు

అని సమాధానము చెప్పెను. ఆ వేళాకోళంపు సరళి నిసర్గములైన పదములసంపుటి సౌలభ్య సౌందర్యములు, జాలువారు శయ్యా

పరిశీలించినచో రసజ్ఞుల చిత్తము లుప్పొంగి యానంద మొందక మానవు. ''ఆనందోరసః'' అదియే రసానుభవము. అదియే కావ్య ప్రయోజనము. ఇట్టి యతిహృదయంగమములగు పద్యములు బాల రామాయణమునందు కలవు.

తిరుపతిశాస్త్రిగారి యాంధ్రీకరణ కౌశలము ప్రతిబింబించు నిగ్గుటద్దము బాలరామాయణము. ఐననేమి దీనికి లోకమున ప్రచారము చాలతక్కువ. దానికి కారణము మూలముననే కలదు. నాటకమునకు కవిత్వ మొక్కటే ప్రధానముకాదు. ఇతి వృత్తము, అంక నిర్మాణము మొదలగునవి పెక్కుగలవు. అవి హృదయరంజకము లుగా నుండవలయును. కథాప్రదర్శనమునకు నాట్యకళాదృష్టి తోడు కావలయును. అది రాజశేఖరునియందు లేదు. కావున నాట్యరంగ మున నీ నాటకము ప్రదర్శించుటకు వీలులేదు. ప్రదర్శించినను రక్తి కట్టదు.

దీనికంటె ముద్రారాక్షసము లోకములో వ్యాప్తి చెందినది. దీని ననేక సమాజములు రంగస్థలము మీద ప్రదర్శించి యధికకీర్తిని గడించుకొనినవి. వానిలో బందరు రాయల్ థియేటరువారు ప్రధానులు. నాట్యకౌశలమునందు ప్రసిద్ధిని సంపాదించిరి. అందు తిరుపతి కవుల శిష్యుడును కోమల కవితా వల్లీమతల్లికి నాలవాలము నగు లక్ష్మీకాంతముగారు రాక్షసపాత్రను ధరించి రంగస్థలముమీద నటించునపుడు ప్రేక్షకలోకము మహానందమును పొంది వేనోళ్ళ వినుతించుచుండెడిది.

ఆ నటకులశేఖరుడు తన యభినయ కౌశలముచేత ముద్రా రాక్షసమున కొక వెలుగు సంపాదించి పెట్టెను. ప్రజానముదాయము నందు పేరు ప్రసరింపజేసెను. ముద్రారాక్షసము చరిత్రాత్మకమగు నాటకము. దీనిని సంస్కృతమునందు విశాఖదత్తుడను మహాకవి రచించెను. ఈయన మహారాజగు పృథుభత్తుని కుమారుడు. కౌటిల్యుని యర్థశాస్త్రమంతయు నిం దిమిడించి రూపకల్పనము గావించెను. విశాఖదత్తుడు చక్కని నాటకకళాదృష్టి కలవాడు. సుప్రసిద్ధుడగు

కవి. ఈ రెంటి సమ్మేళన మీ నాటకమునకు సంస్కృత భాషయం దుత్తమస్థానము సముపార్జించినది. ఈ కవి కళాసృష్టి నాటకారంభ మున పాత్రను రంగస్థలముమీదికి ప్రవేశపెట్టుటలోనే గోచరించును. సూత్రధారుడు నటితో చంద్రగ్రహణమును గురించి ప్రసంగము గావించుచు

క్రూరగ్రహం గాము కేతువు దారి చంద్రు
నిపుడ సంపూర్ణ మండలు నింతి! యభిభ
వం బొనర్పంగఁ జూచెడు బల్మిమెఱయ

అని నుడివెను. అది విని చాణక్యుడు చంద్రుడనగా మౌర్య చంద్రగుప్తుడని భావించెను. వీరావేశమున "ఎవడురా! నేనుండఁగనే చంద్రగుప్తు నభిభవింపఁ దలంచుచున్నాడు" అనుచు రంగస్థలము మీదికి ప్రవేశించును. చాణక్యుడు ప్రధానపాత్ర. ఈ పద్ధతి ప్రేక్షకులను మిగుల నాకర్షించును. ఆదినుండియు రసావిష్టులను గావించును. నాటకమును రక్తికట్టించును. వేణీసంహార నాటకము నందు కూడ నిట్లే జరిగినది. కోపాటోపమున భీముడు రంగస్థలము మీదికి వచ్చును.

ఈ రెండు నాటకములు ప్రారంభమునుండి రసపోషకము లైనవి. ప్రథమాభిప్రాయములు సుస్థిరములయి చిత్తములందు నెల కొని యుండునని పాశ్చాత్య పండితుల అభిప్రాయము. ఈ నిర్మాణ కౌశలము తిరుపతికవుల పాండవోద్యోగ విజయములందున్నది. బాల రామాయణ కర్తకీ దృష్టి లేదు. శునశ్శేఫుని రంగముమీదికి ప్రవేశ పెట్టుటలోనే నాటకములోని జీవము చప్పబడినది. దానికితోడు పాత్రలచేత ప్రదర్శింపబడదగిన కథాభాగములను కథా కథన పద్ధతి నన్యపాత్రలచేత చెప్పించెను. ఇది నాటకమును మరింత చప్పపరచి నది. చాణక్యుడు రంగస్థలము మీదికి వచ్చి

ఆవులించిన మృగరాజు నాననంబు
నందుఁ గబళిత గజరక్త సుందరమయి

సంజ జాబిల్లి రేకతో సామ్య మొందు
కోఱ నెవ్వాఁడు పెకలింపఁ గోరు బలిమి

అని సింహాగర్జనము గావించును. దానితో మొలకెత్తిన వీర రసము చిగురాకు తొడిగినది. ముద్రారాక్షసము నప్పటి కిద్దరు తెని గించిరి. అందు

తిరుపతి వేంకటేశ్వరులు తెన్గొనరించిన దానియందు నా
కరయఁగ గౌరవంబు కలదయ్యది యే మృదు పద్యగద్య బం
ధురమగుటన్ గవిత్వరస ధూర్వహతన్

అనిన సూత్రధారుని మాటలలో నసత్యము లేదు. తరువాత చాలమంది ముద్రారాక్షసమునందలి యితివృత్తము నాధారముగా తీసికొని కొలది మార్పులతో స్వతంత్ర నాటకములు వ్రాసిరి. అవి యేవియు దీనితో సరికాలేక పోయినవి. ముద్రారాక్షసము నందలి ప్రథమాంకమునందు

నృపతి భయంబునన్ మొగము లెత్తక నందొలి పీటనుండి లా
గి పరాభవించునాఁడు పరికించుచు హా యని యేడ్చినట్టి వా
రిపుడు ముదంబు చెందరె, మృగేంద్రుఁడు దంతిని కొండనుండి లా
గు పగిది గద్దెనుండి పడఁగూల్చిన నందకులంబు గాంచినన్

ఈ మొదలగునవి పద్యములు పూర్వకథను దెలుపుచు నుత్తర కథాభాగమునకు బీజాయమానముగా నున్నవి.

పుడమికి బొమ్మజబ్బు లనఁబోలిన నందుల నారుమూఁగురన్
గెడపితిఁ జెర్వునందు నలినింబలె లక్ష్మిని చంద్రగుప్తునం
దిడితిని నిర్వురందుఁగల యెక్కువ తక్కువ లెన్న నేల? పా
ల్పడిన దయాగ్రహంబుల ఫలంబుల రెండును పంచిపెట్టితిన్

అని సంతృప్తి చెందినాడు చాణక్యుడు. బాల రామాయ ణములోని రచనకు ముద్రారాక్షసములోని రచనకును చాల భేద మున్నది. అందలి పద్యములు కరడు గట్టిన పెరుగువలె శయ్యలో

సడలింపులేక బిగువుకలిగి యున్నవి. ముద్రారాక్షసమునందు మొదటి రెండంకములు చివరి రెండంకములలోని పద్యములు పాలవలె జాలువారుచున్నవి. అందలి తెనుగు తనము పదములూాతము కలిగి వైకృతాచ్ఛికములు తత్సమములతో సమ్మిళితములయి కనిపించును. ఇందు దేశీయత రూపొంది యన్వయములో సులువుతనము గోచరించును. అందలి పద్యములు నూటికేబదిపైన కొంత ప్రయత్నపూర్వకముగా రచించినటుల తోచును. మచ్చునకు

అడవిలో నేనుఁగుల రెంటినడుమ నాడ
యేనికకుఁ గష్టపా టుదయించినట్లు
బుద్ధిశాలులు మంత్రు లిర్వురకు నడుమ
నంద కుల లక్ష్మి కష్టంబు చెందుచుండె (ముద్రా)

ఘోర కాంతారములలోని దారులందుఁ
బుడమికానుపుతోఁ గూడ నడచునపుడు
బాష్ప సంరోధ యత్న సంపాతియైన
రాఘవుని దృష్టి భ్రాతపై వ్రాలుచుండు (బా. రా.)

మొదటి పద్యమునందలి ప్రసన్నత మార్దవము రెండవ పద్యమునందు లేదు. మొదటి దానిలో రసస్రుతి యున్నది. రెండవ దానిలో పాండిత్యప్రకర్ష యున్నది. ఇంకొక పద్యముకూడ నుదహరింతును.

నందు డానంద పెట్టుచున్నను త్యజించి
చంద్రగుప్తునిఁ గూడెడే చపలురాల!
గంధ గజము నశించునుగాక దాని
దాన జలరాశి యింకదా దానియంద

ముద్రారాక్షసములోని మొదటి రెండంకములకు తరువాత మూడంకములకు శైలిలో భేదమున్నది. చూడుడు.

కాంత బహు వల్లభత్వంబుఁ గాంచి కలఁగి
సన్న గిలుచున్న దానిఁ బ్రసన్న జేసి

రతి కథాభిజ్ఞయగు దూతి గతిగ శరద్ధృ
తువు గలిపె జహ్నుసుతను సింధుపతితోడ (3 వ అం)

దేశకాలంబు లనెడి బిందెలఁ జెలంగు
మతి యనెడి నీటిచే సిచ్యమాన మగుచుఁ
బెరిఁగి మౌర్యద్రుమాశ్రయ స్ఫీతమై ఫ
లించుఁ జాణక్య నీతి వల్లీమతల్లి (5వ అం)

ఆరు ఏడంకములలోని పద్యములు మొదటి యంకములలోని పద్యములను బోలియున్నవి

గొడ్డలి దెబ్బచేత నరకుల్పడి కొమ్మలనున్న పావురా
బిడ్డల కూతలన్ మిషను వృక్షము లేడ్వఁగఁ దద్వ్రణంబులన్
గుడ్డలు చుట్టుచుండె ఫణికోటి వగర్చుచుఁ దొల్తఁ జేసి కోఁ
బడ్డ స్వమైత్రి పేర్మి పెనుపం దమ కూసముల న్నెపంబునన్

శయ్య యందలి యీద్వైవిధ్యము రచయితల చేతులు మారుటచేత నై యుండవచ్చును. కాని యెవరేది వ్రాసినది నిర్ణయించుట యసాధ్యము. జంటకవుల రచనా రహస్యములు దంపతుల చాటుమాటల వంటివి. అవి పైకి పొక్కవు. వారు వెల్లడింపరు. తిరుపతిశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారికంటె చాల పండితులనియు గీరతములోని శాంతింపు పర్వమునందలి ఐదు పద్యములు తిరుపతిశాస్త్రిగారి వనియు ''దగ్గర లేరు'' ఇత్యాది పాండవ విజయము లోని పద్యములు వేంకటశాస్త్రిగారి వనియు మొదటి యంకమంతయు తిరుపతిశాస్త్రిగారి రచన యనియు, అందుకనే యదియంత బిగువు కలిగి రసము చిప్పిలుచుండు ననియు చాలమంది చెప్పగా వింటిని. మా తిరుపతిశాస్త్రి–దివాకరాస్తమయ మను వ్యాసములు చదివిన తరువాత నిజము తెలిసినది. వేంకటశాస్త్రిగారీ రహస్యమును బైట పెట్టవలసిన పనియేమి వచ్చినదో తెలియదు. అవును. భర్త మరణించిన తరువాత భార్యకొకప్పుడు భర్తమాటలు జ్ఞాపకమునకు వచ్చును. పట్టరాని పరితాప మనుభవించును. తన యావే

దన నెవరితోనైన జెప్పుకొనిన గాని తీరదు. అట్టిదే యై యుండ వచ్చును. కాని రహస్య గోపనములోనున్న గొప్పతనము నుతింప దగినది. వెల్లడించుటవలని యెల్లిదము వాటిల్లక తప్పదు.

ఈ శయ్యాభేదము శ్రీనివాస విలాసమునందు బాగుగా పరిశీలించిన గోచరించును. బుద్ధచరిత్రయందు నాలుగువందల పద్యములు తాను రచించితిననియు నారువందలు తిరుపతిశాస్త్రిగారు వ్రాసిన దనియు దివాకరాస్తమయము నందున్నది. కాని బుద్ధచరిత్రయంతయు నొక్కచేతిమీద నడిచిన ట్లుండును. అందందు నీ నాటకములోని పద్యములు కరుకుతనము కలవిగా కనిపించినను మొత్తముమీద నాటకమంతయు రసవంతముగా నుండును.

ముడిచె నెవఁడు వటంబున ఘనజ్వాలా క
రాళమై దావాగ్ని గోళకంబు
బంధించె నెవ్వఁడు పంజరంబున దంతి
దానవాసిత సటంబైన హరిని
నిలిపె నెవఁడు పగ్గములచేతఁ గట్టి క
ల్పాంత కాలాకులం బైన గాలి
నీదె నెవ్వాఁడు బాహాదండముల నక్ర
భీకరంబైన రత్నాకరంబు

లీలఁ గొనవ్రేలఁ బెకలింపఁ జాలె నెవఁడు
త్రిపుర సంహార కాలోగ్ర దేవదేవ
కంఠభూషణ ఫణి ఫణాకలిత రత్న
కోరకంబులతోఁ గూడఁ గొర లెల్ల

ఇటువంటి రసవంతములైన పద్యములు ముద్రారాక్షసమునం దెల్లడలను గలవు. కవిహృదయము నవగతము గావించుకొని భావము చెడకుండ తెనిగించుట తిరుపతికవులకే చెల్లినది. ఇట్టి ధారాశుద్ధికల పద్యములు స్వతంత్ర రచనలయందైనఁ గనుపించుట చాల యరుదు. ఇంతకంటె నన్నివిధముల చాల మెఱుగైనది పీ

రాంధ్రీకరించిన మృచ్ఛకటికము. పై రెండు నాటకములను తెనిగించుటచేత గడితేరిన వారిచేయి యీ ప్రకరణమునందు సిద్ధి పొందినది.

ఎందరెందరో నాటకములను తెనిగించినవారు కలరు. కందుకూరి వీరేశలింగముగారి శాకుంతలము వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీసంహారము తిరుపతికవుల మృచ్ఛకటికమువంటి సుప్రసిద్ధ రచనలు తెలుగునందు కనిపించవు. అవి మొదటినుండి చివరివరకు వేలుపెట్టి చూపించుటకు వీలులేని నిగ్గైన కావ్యములు. మృచ్ఛకటికమును సంస్కృతమునందు శూద్రకుడను కవిశేఖరుడు రచించెను. అతడు విశాఖదత్తుని మించిన కళానైపుణ్యము కలవాడు. సాంఘిక నాటకములు వ్రాయుటలో గీర్వాణభాష యందు దీతడే మొదటివాడు. వ్యభిచారము ధనిక కుటుంబములందును, జూదము జనసామాన్యమునందును, నతని కాలమున నలవాటుగా నుండెను. వానిని తన నాటకమునందు చక్కగా చిత్రించెను. వానివలన కలుగు నష్టములను నిరూపించెను. ప్రజలయందు చైతన్యమును కలిగించి నీతిమార్గమునకు మరలింప యత్నించెను. ఇది వాని కళాసృష్టి. ఈ సృష్టి విశేషమునందు సర్వశ్రేయములు నిమిడియున్నవి. "విశ్వశ్రేయః కావ్యం." నీతి బోధించుట కిదియొక మార్గము. ఆలంకారికులు సామాన్యా పరకీయాది వివిధ నాయికలను సృష్టించిరి. నాయికాది భేదములచేత కావ్యభేదములు కలుగుచుండును. కవితావాణికి అవన్నియు రాచబాటలు. కవి యే దారినైన ననుకరించవచ్చును. అందుమూలమున రచనలో వినూతనత్వము వాటిల్లును. ఏ కవి యే మార్గ మనుసరించినను

కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతర క్షతయే
సద్యః పర నిర్వృతయే
కాంతాసమ్మితతయోపదేశ యుజే

ఈ సంగతి గ్రహింపలేనివారు ఇట్టి కావ్యము లవినీతి బోధకము లందురు. తిరుపతికవులు శ్రవణానందము పాణిగృహీతలను రచించిరి. కావ్యరచనయందు లోకమునకొక వినూతన మార్గము చూపిరి. తత్త్వ మెఱుగక యవి యవినీతి బోధకములని విమర్శించిన వారు కలరు. అది యవివేకము. అట్టి వారీ నాటకము నెంత విమర్శింప వలసి యుండును. పూర్వు లెవ్వరు నిట్టికావ్యములను వ్రేలు పెట్టి చూపినవారు లేరు. మీదు మిక్కిలి ప్రశంసించిరి.

మృచ్ఛకటికమునందు శాంతిరసము (దానవీరము) ప్రధానము. నాయకుడు ధీరశాంతుడు, బ్రాహ్మణుడు. నాయకురాలు సామాన్య. హాస్యరసమంగము. ప్రతినాయకుడు శకారుడు. రాజుగారి యుంపుడుకత్తె సోదరుడు. శకారుడొక విచిత్రమానవుడు. ఇటువంటి పాత్ర మరే యితర సంస్కృతాంధ్ర వాఙ్మయములందు కనిపించదు. ఆంగ్లేయ వాఙ్మయమునందును సృష్టింపఁ బడలేదని నా నమ్మకము. శకారుని పాత్ర మృచ్ఛకటికమున కొక వినూతనత్వము కల్పించుచున్నది. ఈ రూపకమునందు వచ్చు పాత్రలు దాదాపన్నియు నీచమైనవి. భాషయు వారి కనుగుణముగా వాడబడినది.

ఇది తిరుపతి కవుల పాణిగృహీతయందుపయోగించిన భాషకు మార్గదర్శకమై యుండవచ్చును. ఈ నాటక మాంధ్రీకరణము మొదటినుండి చివరివరకు నొక్క విధముగా నడచినది. తిరుపతికవులాంధ్రీకరణ పద్ధతికిని ఇతరుల ఆంధ్రీకరణ పద్ధతికి చాల తారతమ్యమున్నది. వీరు తెనిగించుటలో నెక్కువ స్వాతంత్ర్యమును వహింతురు. సంస్కృతమునందలి భావమునకు తెనుగున గల వ్యావహారిక పదముల నుపయోగించుటకు ప్రయత్నింతురు. మక్కికి మక్కి తెనుగు చేయరు. ఆ కారణమున వారి యాంధ్రీకరణము స్వతంత్ర రచన వలె నుండును. ఒక్క శ్లోకమును చూపి తరువాతి విషయము ప్రస్తావింతురు.

సత్యం న మే విభవనాశకృతాస్తి చింతా
భాగ్యక్రమేణ హి ధనాని భవంతి యాన్తి

ఏతత్తు మాం దహతి నష్ట ధనాశ్రయస్య
యత్సౌహృదా దపి జనా శ్శిథిలీ భవన్తి

ఇది మూలము

బ్రతికి చెడితినటంచు నే వగవ సిరులు
వచ్చియును బోవుఁ బోయియు వచ్చుచుండు
ధనము లేకున్న మిత్ర బృందమ్ము కూడ
వదలునను దుఃఖమే నన్ను వదల కుండె

"నమే విభవ నాశకృతా స్తిచింతా" యనుటకు లోకవ్యావహారికమైన జాతీయ పదము "బ్రతికి చెడితి నటంచు నే వగవ" నని యుపయోగించుటలో నందమున్నది. అదియే యీ పద్యమునకు సౌందర్యము కలిగించినది. ఇట్టి చెణుకులు తిరుపతికవుల తెనిగింపునకు సహజత్వము ప్రసాదించును. ఇది వారి యాంధ్రీకరణములోని రహస్యము. ఇట్టివి యితర కవులం దగుపించవు. హాస్యము పొసగించుపట్ల వారుచూపిన నైపుణ్యము గొప్పది. శకారుడు వట్టి మూర్ఖుడు. తాను మహాపండితుడననియు రసికుడననియు వసంతసేనకు తోపింపవలయునని వాని యాశయము.

గల్లురని నగల్ మ్రోయఁగ వెళ్లెదేల?
రామునకు జంకి పరువెత్తు ద్రౌపదివలె
హనుమ విశ్వావసుని చెల్లెలగు సుభద్ర
పగిది నిను బల్మి హరియించువాఁడఁ జూవె

ఏను దుశ్శాసనునివలె నిపుడ నీదు
కొప్పు దొరకొందు జమదగ్ని కొడుకు భీము
సేనుఁ డేతెంచి యాఁపునో? చాన! కుంతి
కాత్మజుండగు దశకంఠుఁ డాపగలఁడొ

అని పారిపోవుచున్న వసంతసేనతో జనును. తిరుపతికవులు మూలగ్రంథకర్త భావమును బాగుగా నవగతము గావించుకొని

సహజముగా నుండునటులు తెలిగించిరి. వసంతసేన శకారునిమాటలు విని 'పాపము శాంతించునుగాక' యనును. శకారుడు "బావా! బావా! నే నూరువిడిచి పోతినా? పురము విడిచి పోతినా? నన్ను రమ్మా అలసితివి, అనుచున్నది" అని విటునితో ననును. మాటల ధోరణియు నెంత సహజములై యున్నవో చూడుడు. వర్ణనలందును ధారాశుద్ధి కుంటుపడలేదు. మచ్చునకు

మెఱుపు పగ్గముల్ గట్టిన కరులు నాఁగ
నొక టొకటి మీరి యీ మబ్బు లుదకధార
లీనుచున్నవి, సురపతి యానఁ బుడమి
వెండిగొలుసులఁ బైకీడ్చు చుండెననఁగ

శ్లేషాలంకారములున్న పట్టులందు

ఉన్నతముల్ నిరంతర పయోధరముల్ గల నన్నుఁగాక ని
న్నన్నన సేయునే బయిసి మాలిన దాన! ప్రియుండటంచు గ
ర్జన్నవ నీరద ధ్వనిమిషంబున నన్ను నిశాపురంధ్రి నా
తెన్నరి కట్టుచు న్నిగులఁ దిట్టుచునుండె సపత్ని పోలికన్

అని హృదయంగమముగా తెనిగించిరి. ఇది నిగ్గుతేరిన శయ్య. ఒక్క వ్యర్థపదము కనిపించదు. యతికొరకు ప్రాసకొఱకు పాటుపడి నట్లసలు తోపదు. ఇట్లు తెలుగు చేయగలుగుట తిరుపతికవుల ప్రజ్ఞావిశేషము. వా రన్నిట సిద్ధహస్తులు. మొదటినుండి చివరివరకు నింత బిగువు కలిగి కవిత నడచినది. అన్ని పద్యములు నొకతీరుగా నున్నవి. ఈ నాటకమునం దీ పద్యము బాగుండ లేదనుటకు వీలులేకున్నది. ముద్రారాక్షసమునందువలె కరుకుతనముగాని బాలరామాయణమునందు వలె కుదింపుగాని యీ నాటకమునం దెందును కనిపించదు. వచనముకూడ నంత సరళముగానే నడచినది. ఇంకొక పద్య ముదాహరింతును. చారుదత్తుడు శ్మశానవాటి యందలి వధ్యస్థానమునకు కొనిపోబడుచుండెను. తన స్థితిని

తొరఁగు విలోచనాంబువులఁ దోఁగుచు నాని ధరాపరాగ ధూ
సరమగుచున్ శ్మశాన సుమసంతతి పైఁబడ రక్తగంధ బం
ధురమగు నాదు మేను బలికూడని యెంచితినం దలంచి యం
బరమున మూఁగుచున్నవి రవంబులతో బలిభుక్కు లక్కటా!

అని సవిషాదముగా దలంచుకొనెను. ఈ వరుసనున్న మూడు పద్యములు నిజముగా చదువునపుడు విషాదము కలిగింపకమానవు. ఇంత రసవంతముగా బిగువు సడలని రచన కలిగి మృదుపదముల పొందికతో నున్న పద్యములు పై రెండు నాటకములం దగుపించవు. కావుననే యిది రంగస్థలముమీఁద ప్రదర్శింపబడినపుడు ప్రేక్షకుల చిత్తమును చూరకొన్నది. ఇతివృత్తము కూడ చక్కగా కూర్చబడినది.

# ౧౦

## పాండవ నాటకములు

నాటకాంతం సాహిత్యం—సాహిత్య సౌధమునకు తుది మెట్టు నాటకము. పరసమున కెట్లో రచనకు నట్లే. ముందు కావ్యరచనయం దారితేరిన కవి నాటక రచనకు తరువాత పూనుకొనును. కావ్యరచనకంటె నాటక రచన చాల కష్టము. రసవంతములగు సంఘటనలు, రమణీయములగు రంగములు, పాత్రపోషణము మొదలగునవి పెక్కు విషయములు పరిశీలింపవలసి యుండును. వీనికితోడు నాటక లక్షణ మొకటి యున్నది. అది యడుగడుగునకు నడ్డమువచ్చును. దాని కనుగుణముగా నాటకము నడిపింపవలయు నన్నచో మిగుల కష్టము. నాటకరచన కవుల ప్రజ్ఞా పాండిత్యములకు, నేర్పునకు నొరిపిడిరాయి.

ఈ సంగతులను గుర్తించియే కాళిదాసు రఘువంశాది కావ్యరచనలందు కొంత నైపుణ్యాదులను ననుభవమును సంపాదించి, తరువాత నాటక రచన కుపక్రమించెను. ఐనను మొదటి నాటకము లంతగా రాణించలేదు. చివరిదగు శాకుంతలము సంస్కృత సాహితీ సీమంతినికి సీమంత రత్నమయినది. తెనుగు సాహిత్యము పదునొకండవ శతాబ్దమునందు నాకృతి తాల్చినను ఇరువదవశతాబ్దారంభము వరకు నే కారణముననో నాటకములు రంగమున కెక్కలేదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు కాళిదాస విరచితమగు నభిజ్ఞాన శాకుంతలమును బురస్కరించుకొని శృంగార శాకుంతలమును శ్రవ్యకావ్యముగా వ్రాసెను. పింగళి సూరన దృశ్య ప్రబంధముల పోకడలు మఱియం దుంచుకొని ప్రభావతీ ప్రద్యుమ్నమును నాటక రూపమయిన శ్రవ్యకావ్యముగా తయారుచేసెను. ఇట్లు చేయుటలో ప్రాచీ నాంధ్రకవులకు నాటకములయెడఁ గల యనాదరభావము కారణమై యుండవచ్చును.

ఇరువదవ శతాబ్దారంభమున ధర్మవరము కృష్ణమాచార్యుల వారు చిత్రనళీయము, విషాద సారంగధర మొదలగు కొన్ని నాటకములు మొదట రచించిరి. వారి తరువాత స్వతంత్ర నాటకములను విరచించినవారు తిరుపతి వేంకటకవులు. కవిత్రయమువారు వ్యాస భారతమును శ్రవ్య ప్రబంధముగా తెనుగునం దనువదించిరి. తిరుపతి కవులు దాని నారు నాటకములుగా రచించిరి. వానిలో మొదటిది పాండవ జననము.

ఇది యే డంకముల నాటకము. నాందీ ప్రస్తావనలతో యధాలాక్షణికముగా నారంభింప బడినది. లాక్షణికులు ప్రధానాంగములలో నొకటిగా వివరించిన ఋతువర్ణనము ప్రస్తావనయందు విడిచి పెట్టబడినది. పరాశరుడు తీర్థయాత్రలు గావించుచు యమునా తీరమునకు వచ్చుటతో ప్రథమాంకము ప్రారంభమగును. ఈ యంకమునందు భారత మాదిపర్వము తృతీయాశ్వాసములోని 34 వ పద్యము మొదలు 47 వ పద్యము వరకుఁగల మత్స్యగంధి పరాశరుల వృత్తాంతము కలదు. పరాశరుడు యమునా నదిని సమీపించు నప్పటికి దాశుడు నావను దిగి ఇంటి కరుగుచుండెను. పరాశరుడు తన్ను నదిని దాటింపుమని దాశుని కోరెను. తాను భోజనమునకు పోవుచుంటి ననియు, తన కుమార్తెను పంపుదుననియు జెప్పి వెడలి పోయెను.

మత్స్యగంధి వచ్చులోపల నదీ తీరమునందలి ప్రకృతిని పరాశరుడు పరిశీలించు చుండెను. ఈ పరిశీలనము భావి శృంగార ఘట్టమున కుపాంగము. భారతమునందు "పరాశరుఁడన్ మునీంద్రుఁ డయ్యతివన్ దలోదరిం గనియె నయ్యమునా నది యోడ రేవునన్ ఇష్టైకతంబ యేక వస్త్రయయి యోడనెక్క వచ్చువారి నిరీక్షించుచున్న సత్యవతింజూచి" యని యున్నది. ఈ మార్పునకుఁ గారణము పరాశరునకు నదీ తీరమునందలి యందమగు ప్రకృతిని వర్ణించుటకు నావకాశము కల్పించుటయే. మరియు నాటకమునందు నదిని తరించి యావలి యొడ్డును చేరిన తరువాత సత్యవతీ పరాశరులకు సమాగమ

మయినట్లు మార్చబడినది. భారతములో "తత్ప్రసాదంబున ననేక దివ్యాంబర భూషితయయి యమునా నదీ ద్వీపంబున నోడఁ జేర్చి"

"ఆ యమునా ద్వీపమున న
మేయుఁడు కృష్ణుండు లీల మెయిఁ గృష్ణద్వై
పాయనుఁ డన"

అని యున్నది. ఈ విషయమున భారతమే సమంజస మనక తప్పదు. ద్వీపమునందు జన్మించుట చేతనే వ్యాసునకు ద్వైపాయను డను పేరు వచ్చెనని ప్రతీతి. ఈ యంకమునందు సత్యవతీ పరాశరుల ప్రణయ సంభాషణము రసవంతముగా నడచినది. విముఖురాలయియున్న సత్యవతిని వరదానములచేత సుముఖురాలినిగాఁ జేసికొనుటలో పరాశరుఁడు చూపిన నేర్పు పాఠకుల మనస్సున కాహ్లాదము కలిగించుచున్నది.

రెండవ యంకమునందు భీష్ముడు సత్యవతిని తెచ్చి తండ్రి యగు శంతనునకు వివాహము చేయును. భారత మాదిపర్వము చతుర్థాశ్వాసములోని 168వ పద్యము మొదలు 193వ పద్యము వరకుఁగల కథ యిందు చక్కగా ననుసంధింపఁబడినది. శంతనుడు విరహబాధ ననుభవించుటతో నంక మారంభమయినది. భీష్ముడు తండ్రిని దర్శింపవచ్చును. విచార కారణమేమని ప్రశ్నించును. శంతనుడు గంగావృత్తాంతము నుడివి

ఒకకొడుకు కొడుకునుం గా
డొక కన్నును గన్నుగా దయో పుత్రా! యిం
కొకఁ డేని యధమ పక్షం
బకటా! యుండంగవలదె యాత్మజుఁ డనఘా!

అని వివాహమువిూది తన యభిలాషను తెలిపెను. భారతమునందు నన్నయభట్టు

వినవయ్యా యేకపుత్రుఁడు
ననపత్యుఁడు నొక్కరూప యని ధర్మవులన్

విని నీకుఁ దోడు పుత్రుల
ననఘా! పడయంగ నిష్టమైనది నాకున్

అని వ్రాసెను. తిరుపతికవులీ పద్యమును చూచియే తామా పద్యము వ్రాసిరి. ఈ రెండు పద్యములందలి మెరుగు తరుగులు చదువునందరికి విదితము. మూడవ యంకమునందు భీష్మ పరశురాముల యుద్ధ వృత్తాంతము కలదు. ఇది యుద్యోగపర్వము 4 వ ఆశ్వాసము 287వ పద్యమునుండి 360 వ పద్యము వరకుగల కథాభాగము. ఈ యంకమునందు భీష్ముని గురుభక్తి పరాక్రమములు పరశురాముని శిష్యవాత్సల్యము పరాక్రమము యథామూలముగా ప్రదర్శింపబడినవి.

చతుర్థాంకమునందు సత్యవతి వ్యాసుని సంతతి బడయుటకయి యంబిక అంబాలికలందు నియమించును. ఇది యాదిపర్వము 4 వ యాశ్వాసము 240 మొదలు 255 వరకుఁగల పద్యములలోని కథ. పంచమాంకమునందు కుంతి మంత్రశక్తిచేత సూర్యు నాకర్షించి కర్ణునిఁ బడసిన కథకలదు. ఇది యాదిపర్వము 5 వ యాశ్వాసములోని 19 మొదలు 30 వరకుఁగల పద్యములలోని వృత్తాంతము. భారతమునందు కుంతి "ఏకాంతంబ గంగకుం జని గంగనీళ్ళఁ గాళ్ళు మొగంబు కడిగికొని" యని యున్నది. ఈ నాటకమునందు కుంతి చెలికత్తెతో వచ్చినది.

జలకంబాడి మడుంగుకట్టియు నిశాంచద్దీప్తిఁ బయ్యంటలో
వెలికింబారఁగ కేశపాశ మురువై వెన్నంటి జారంగ మేల్
తిలకం బంతగ దిద్దుకున్న నొరపై దీపింప నిచ్చాన సొం
పులు శృంగార రసాధి దైవతములై పొల్పొందు శుద్ధంబులై

అని వర్ణింపఁబడినది కుంతి. రాజకుమార్తెలకు చెలికత్తెలు వెన్నంటి యుండుట సహజము. రహస్య గోపనమునకు భంగము కాదాయను భావము చదువరులకు పుట్టవచ్చును. దానిని నివారించుటకు

వారలె మీరు మీరె మతివారలు వాండ్రకు మీకు నించుకే
నారయ భేదముండ దిటులైననె మీ మరియాద సాగు నా
చార మనాదిగా నిటు లెసంగుచు నున్నది చంపలాక్షి న
న్నారక యేఁచనేల దయయుంచి కృతార్థునిఁ జేసి పంపుమీ

అని "అదిగో నా పరిచారక. దానికీ రహస్యము తెలియ కుండు టెట్లు? అని యాటంకపరచిన కుంతీదేవికి సూర్యునిచేత సమాధానము చెప్పించినారు తిరుపతికవులు. ఈ విషయమును సాకుగా తీసుకుని వేరే విష్కంభాదులతో పనిలేకుండ సూర్యునిచేత ధృతరాష్ట్ర పాండురాజ విదురుల జన్మ ప్రకారమును కుంతికి జెప్పించి వెనుకటి యంకముతో దీనిని కలిపిరి. ఇట్టి ప్రసంగముచే కుంతి కను మానము తీరుటయు నుద్రేకము కలుగుటయుగూడ ప్రయోజనములు. మరియు

మొన్న మొన్న పరాశర మునివరుండు
దాశ కన్యకతో నిట్టి తగు లొనర్చె
నతఁడు తప్పగు నేని యెట్లనుమతించు
ధర్మశాస్త్ర మొనర్చిన ధన్యమూర్తి

అని సూర్యుడు మరొక దృష్టాంతముకూడ చూపి కుంతిని సమ్మతింపఁ జేసినాడు. తిరుపతికవులు సమయము దొరికినప్పు డెల్ల సంఘ దురాచారములను తమ కావ్యములందు విమర్శించుచు వచ్చిరి. కుంతీ సూర్యులు వెడలిపోయిన తరువాత చెలికత్తె "కన్నియలకు రజస్వలా వివాహమెంత దుర్దశ కలిగించుచున్నది. అతి బాల్య వివాహముల వలెనే యియ్యవికూడ దూష్యమే కాని వేరొండు కాదు" అనుచు లోకములోని రజస్వలానంతర వివాహములను అతి బాల్య వివాహములను ఖండించినది. ఇది తిరుపతికవుల ఖండనము, చెలికత్తెది కాదు. వారు లోకానుభవము కలవారు. కుంతి నడివయస్సు నందున్న కన్యక. ఆమె తన స్వానుభవమును

ఏమని చెప్పినారొకో మునీంద్రులు దాము రజస్వ లాంగనన్
ధామములందుఁ బెండ్లికి నెదన్ దపియించెడురీతి కక్కటా!
కామముగెల్వ శక్యమె యఖండ మనీషుల కేని యట్టిచోఁ
గామిను లేడ కాముని వికారము లేడ సతుల్ యతీంద్రులే

"జౌరా! యనుభవ శూన్యులగు మాన్యులవలన జగమున కెట్టి ఇక్కట్టు లుప్పతిల్లుచున్నవి" అని సాక్ష్యమిచ్చినది. పంచమాంకము మిగుల రసవంతముగా మొదటినుండి చివరివరకు నడపబడినది. ఇంక ఆరవయంకము పాండురాజు మునిచేత శపియింపబడి శతశృంగమునం దుండుట ఆదిపర్వము 5వ ఆశ్వాసము 46వ పద్యము మొదలు 64 వ పద్యము వరకుఁగల వృత్తాంతము. ఏడవ యంకమునందు కుంతీదేవి పాండవులతో హస్తినాపురము చేరుట. ఆదిపర్వము 5వ ఆశ్వాసము 149 మొదలు 156 వరకుఁగల పద్యాలలోని కథ యిందుఁ గలదు.

తిరుపతికవులకు కవిత్వముమీాద నెంత యభిమానము కలదో జ్యోతిష్యముమీాద నంత యభిమానము కలదు. ప్రత్యేకించి జాతకభాగము ప్రశ్నభాగములందు నాదర మపారముగాఁ గనిపించును. ఈ విషయము వారి జాతకచర్యయందును పతివ్రత కావ్యమునందు సుశీలయందు ప్రత్యక్షముగా కనిపించును. ఈ పాండవ జననమునం దేడవ యంకమున ప్రారంభమునందు ఒక జ్యోతిష్కుని ప్రవేశ పెట్టిరి. అతడు గాంధారికి జన్మించిన మాంసపుఁ బిండము నూర్గురు కొడుకులు నొక్క కూతురుగాఁ బరిణమించునని తాను జ్యోతిష్యము చెప్పితి ననియు, అది యట్లే జరిగెననియు, దానికి మెచ్చుకొని ధృతరాష్ట్రుం డొక యగ్రహార మిచ్చెననియు, దానివలన తాను సుఖముగా జీవించుచుంటి ననియు, తలంచుకొనుచు ధృతరాష్ట్రుని దర్శింపవచ్చును. ధృతరాష్ట్రుడు జ్యోతిష్కుని ప్రశ్నించును. ఆతడు పాండవుల జన్మప్రకార మంతయు జరిగినది జరిగినట్లు చెప్పును. అంతలో కుంతి పాండవులు కొందరు మునులు ప్రవేశింతురు. మునులు మరల పాండవుల జన్మప్రకారమును మాద్రీ పాండురాజుల మరణ

వార్తయు వివరించిరి. ఇది చరిత్ర చర్వణము. ఈ సందర్భమునందు జ్యోతిష్కుని పాత్ర యనవసరము. అనవసరముగా నొక పాత్రను కల్పించుట నాటకమున కొక కళంకము.

ప్రతి నాటకమునందు ప్రధానమగు కథ యొకటి యుండును. కథనుబట్టి నాయికా నాయకులో లేక నాయక ప్రతినాయకులో యుందురు. ఆ యా సన్నివేశముల యందచందములనుబట్టి క్రమక్రమముగా రస మభివృద్ధి నొంది స్థాయీభావమును పొందును. ఈ నాటకమునందు ప్రధానమగు కథలేదు. ఏడంకములందు మూడు ప్రత్యేకములగు కథలు గలవు. అవియు నొండొంటితో సంబంధము లేనివి. కావున ఈ నాటకమునందు కథావస్తువునకు సమైక్యములేదు. నాయకురాలిని బట్టి కథ నిర్ణయింత మనిన సత్యవతీ కుంతుల కథలు రెండగును. నాయకులనుబట్టి కథ నిర్ణయించినచో నాలుగు కథలగును. ఎట్లు సరిచూచుకొన తలంచినను వస్త్వైక్యత కనిపించదు. వస్త్వైక్యత లేనప్పుడు రసోదయము కలుగదు అట్టినాటకము ప్రేక్షకుల నాకర్షింపజాలదు. ఈ నాటకము నాల్గు నాటికల సంపుటము. నాయకుడు లేని నాటకము, ప్రధాన రసములేని ప్రబంధము.

దీని తరువాత "పాండవ ప్రవాసము." ఎనిమి దంకముల నాటకము. ప్రథమాంకమునందు పాండవులు ద్రుపదుని కట్టి తెచ్చి ద్రోణునకు గురుదక్షిణగా సమర్పింతురు. భారత మాదిపర్వము 6 వ ఆశ్వాసము 65 మొదలు 92 పద్యములవరకును పంచమాశ్వాసము 196 మొదలు 206 వ పద్యము వరకుఁగల కథ యీ యంకమునందు కలదు. ద్రోణుడు పాండవులతో ద్రుపదునితోడ విరోధకారణమును చెప్పుచు ప్రవేశించుటతో నాటకము ప్రారంభమగును. ముందు ద్రుపదునిమీదికి రణమున కరిగిన కౌరవులు ఓడివచ్చుటయు భీమార్జున నకుల సహదేవులు ద్రుపదుని మీదికి దండెత్తిపోవుటయు, ద్రుపదుని కట్టితెచ్చి ద్రోణున కర్పించుటయు, ద్రోణుడు ద్రుపదునుల్లసమాడి విడచుటయు గలదు.

ఈ యంకమునందు ద్రోణునిపాత్ర పోషణ చక్కఁగా చేయ బడినది. ద్రోణుడు బ్రాహ్మణుడు. ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర మన్నటుల నొకచేత వేదవిద్యయు నింకొకచేత విలువిద్యయు దాల్చిన మహానుభావుడు. బ్రాహ్మణునందలి శాంత సహనములు క్షత్రియు నందలి పౌరుష పరాక్రమములు ద్రోణునియందు మనోహరముగా జిత్రింపబడినవి. నకులుడు "ప్రాణమ్ముల తోడఁ దెమ్మనుచుఁ పంపం గాడియే" యని ప్రశ్నించెను. దానికి ద్రోణుడు "నాయనా! యితఁ డిప్పు డెట్టివాఁడయినను క్రమముగాఁ గష్ట సుఖము లొంటఁబట్టి పిదప లోకోపకారి కావచ్చును. కావున మన మితనిం జంపఁజనదు. లేని దాతకంటె నున్నలోభి మేలనికదా పెద్దలు చెప్పుదురు." అని సమాధానము చెప్పెను. ఇందు ద్రోణుని సహనము శాంతము దూ రాలోచనయు నిమిడియున్నవి. అదియుఁగాక ముందు జరుగఁబోవు ద్రౌపది పరిణయము భారతయుద్ధమందు ద్రుపదుని సహాయము బీజ ములలోని యంకురములవలె ద్రోణుని సమాధానమునందు దాగి యున్నవి. ద్రోణుడు ద్రుపదుని విడిచిపుచ్చెను. ధర్మజుడు "కష్టపడి కట్టి తెప్పించి కడకు నింత వైళమె యీతనిని విడువంగ వలెనె" యని యడిగెను. దానికి ద్రోణుడు

అవనీసురులకుఁ గోపము
దవులంగాఁ జన దొకంటఁ దవిలిన నొక జా
మవధిగఁ బోవలె నటుగా
కవివేకపుఁ గోప మొందు నతఁ డంత్యజుఁడౌ

నని నుడివెను. ఇందు బ్రాహ్మణస్వభావము మూర్తీభవించి ప్రతిబింబించుచున్నది. ద్రోణుడు ద్రుపదునితో

పేద పారుఁ డెవఁడొ పెద్ద రాజెవ్వఁడో
యిప్పుడైన నీకు నెఱుకపడెనె
రాజ్య మేలు టుడిగి రాఁజన్నె? రిక్తుల
మైన మమ్ముఁజూడ నో నరేంద్ర!

అని చెప్పిపొడిచెను. ఇందు రాజసము పరిహాసము పొందు కలిసి మింటవెలుగు జంటతారలవలె మినుకు మినుకుమని వెలుగొందు చున్నవి. ఈ సందర్భమున నన్నయభట్టు

వీరెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె యిట్లు కృపణులయి పట్టుపడన్
వీరికి వలసెనె యహహా మ
హారాజ్య మదాంధకారమది మాసెనొకో?

అని ద్రోణాచార్యుల వారిచేత ననిపించెను. దీనియందు కోపావేశముతో పరిహాసము ముప్పిరులుగొని యేకముఖమున ద్రోణుని స్వభావద్వయము స్ఫురిత మగుచున్నది. ఈ రెండు పద్యములు రెండు రకములు. తన్ను గౌరవించిన మానవుడు కంటబడినప్పు డభిమానవంతుడగు పౌరుషశాలియందు సహజముగా పొడము నుద్రేక జ్వాల నన్నయ పద్యమునందు "గప్పున" వెలిగినది. ఆ యుద్రేకము పరిహాసములో నంతర్లీన మయినది.

తిరుపతి కవుల పద్యము రచనా విధానములో నన్నయ ముందు చాలలేరు. రెండవ యంకము బకాసురవధ. బ్రాహ్మణీ బ్రాహ్మణుల సంభాషణలతో ప్రారంభమగును. ఆదిపర్వము షష్ఠాశ్వాసము 237 పద్యము మొదలు 307 పద్యమువరకు గల కథాభాగ మీ యంకమునందు కలదు. భారతమునం దిది హాస్యరస సమ్మిళితమై వీరరస పోషకముగా వ్రాయబడిన కథ. దీనిని నన్నయ పొడి పొడి తత్సమతద్భవ పదముల కూర్పుతో రచన సాగించెను. కథ యంతయు సంభాషణా రూపకమై యొక చిన్న నాటకమువలె నుండును.

ఈ నాటకమునందు ప్రథమాంక ద్వితీయాంకముల మధ్య జరిగిన కథాభాగము వేరె విష్కంభాదులతో పనిలేకుండ తిరుపతి కవులు భీముని నోటినుండి

కలయంగట్టి సుయోధనాదిశతముం గాలాంతకుండో యనం
బలిమి న్నెత్తిని బెట్టితెచ్చి జతుసద్మంబందు మున్నగ్ని సం
ధిలఁగాఁ జేసి యొకొక్కనిన్ గ్రమముగా దీపించు నావహ్నికిం
బలిగా నిచ్చిన వో ననున్ జగము సేబాసంచు శ్లాఘింప దే.

అని చెప్పిరి. పాండవ జననమునందు నీ పద్ధతినే యవలం
బించిరి. కావున ఆ నాటకమునందు విష్కంభాదులతో పనిలేక
పోయినది. ఇది చక్కని పద్ధతి. ఇందుమూలమున రసమునకు
భంగమువాటిల్లదు. కథ చక్కగా జరిగిపోవును. ప్రేక్షకులకు విసుగు
పుట్టదు. ద్వితీయాంకములోని కుంతీ భీముల సంభాషణమూలమున
మధ్య విడిచిపుచ్చిన కథ పూర్తిచేయబడినది. కుంతివలన భీముఁడు
బకాసురుని సంగతి వినును. కోపముతో

ఇపుడే పోయి మదాంధు నచ్చెనటి నా హీనుం దురాచారు న
చ్చపలున్ గ్రూరు నరాళిఁబట్టి త్రుటిలో సంగ్రామరంగంబునన్
విపులం గూల్చి

అనుచు బయలుదేరెను. ఈ యుద్రేకమంతకంతకు నభివృద్ధి
పొంది రౌద్రములోనికి మారవలసినది. ఆ విజృంభణ భీముని
యందంతగా కనిపించలేదు.

ఇంచుకయేని పాపమున కెన్నఁడు రోయక యెల్లవారి బా
ధించి మనుష్య మాంసములు దించును గ్రొవ్విత వాని నెల్లఁగ్ర
క్కించెద నీ మదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలుద్రోలి కే
గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా!

అని నన్నయ నిప్పులు కురియించు రౌద్రరసపూరితమైన పద్య
మును భీమునినోట పలికించెను. ఆ తీవ్రత యా దుడుకుతనము నా
రచనావేగము కల పద్య మీ యంకమునందొక్కటియు గనిపించదు.
భీముఁడు శ్రీరంగనీతుల కారంభించెను. అంతటితో నా యుద్రేకము
చప్పబడినది. 'ఢిల్లికి ఢిల్లియే పల్లెకు పల్లెయే' యందురుగాక. విమ
ర్శింపవలసివచ్చినప్పుడు వన్నె యొరిపిడి పెట్టి సరిపోల్చక తప్పదు.

కొంత హాస్యరసమునకుఁగూడ తిరుపతికవులు ప్రయత్నించిరి. బకాసురుడు 'నాకై తెచ్చిన పదార్థము లుచ్ఛిష్టములు చేయుచుంటివా!'' అనును. భీముడు 'ఈ పదార్థములు నేను తినుటవలన నీ కొక నష్టము లేదు. నేను గూడ నీ కాహారమగువాడనే కదా!'' అని సమాధానము చెప్పును. ఇది కొంత నవ్వు పుట్టించును. కాని నన్నయ రచనలోని హాస్యరస మిందు లేదు.

మూడవ యంకమునందు ద్రౌపతీ స్వయంవరవృత్తాంతము కలదు. నాల్గవ యంకము జూదపు కొలువు సభాపర్వము ద్వితీయాశ్వాసములోని 154వ పద్యము మొదలు 270వ పద్యము చివరి వరకుఁ గల కథాభాగ మిం దిమిడియున్నది. ఈ యంకము విదురు డింద్రప్రస్థమున నున్న పాండవులను పిలుచుటకు వచ్చుటతో ప్రారంభమగును. విదురుడు రంగస్థలమునీాదికిఁ బ్రవేశించి ధృతరాష్ట్రుడు పాండవుల కర్థరాజ్య మిచ్చినది మొదలు తన్ను సుహృద్ద్యూతమునకు పాండవులను గొని తెమ్మని పంపినంతవరకు మూడు నాలు గంకముల మధ్య కథాభాగము నేకరువు పెట్టును. తరువాత పాండవులను దర్శింప నరుగును. పాండవులు హస్తినాపురమున కరుగుట, ధర్మరాజు జూదమాడుట, ద్రౌపదీ వస్త్రాపహరణము, భీముడు ప్రతిజ్ఞ గావించుట, ధృతరాష్ట్రుడు ద్రౌపదికిఁ గోరినవరము లొసంగుట, మొదలగు విషయములు రమ్యముగాఁ బ్రదర్శింపబడినవి.

భారతమునందు వ్యక్తావ్యక్తముగా చిత్రింపబడిన ధర్మరాజు ద్యూతప్రియత్వము తిరుపతికవు లీ యంకమునందు సువ్యక్తము గావించి భావికథా పరిస్థితులకు రసభావములకు నిశ్రేణిని కల్పించిరి. ఇందుమూలమున కథానుగుణముగా రసము క్రమక్రమాభివృద్ధిని బొంది భీముని ప్రతిజ్ఞలతో స్థాయిని చేరుకున్నది. భీముని ప్రతిజ్ఞా వచనములైన రెండు పద్యములు భావప్రదర్శనమునందు నన్నయ యడుగుజాడలలో నడచినను రచనలో

కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపది నిట్లు చేసిన ఖలుం దుశ్శాసనుం డోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైలల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

అను నీ పద్యమునందున్న దుడుకుతనముగాని తీవ్రతగాని, యావేశముగాని

పిన్నల్ పెద్ద లనేకులున్న సభలోఁ బెంపేది దుర్మార్గుఁడై
వన్నెం వాసియు సుంత చూడ కకటా! పాంచాలి నీ రీతిగా
బన్నంబందఁగఁ జేయు నీ ఖలుని నిర్బధించి వక్షస్థలం
బున్నే నై పగిలించి శోణితము నామోదంబు మైఁ ద్రావెదన్.

అని వ్రాసిన తిరుపతికవుల పద్యమునందంతగా కనిపెంచదు. దానిముందిది చప్పచప్పగా నున్నదేమో యని తోఁచును. ఇదే కాదు భీముడు దుర్యోధనుని తొడలు ఛేదింతునని ప్రతిజ్ఞగావించిన సందర్భమునందును నన్నయగారి పద్యమునకును తిరుపతికవుల పద్యమునకును నిట్టి తారతమ్యమే కలదు. తిరుపతికవుల పద్య రచన శయ్యా సమృద్ధి నన్నయగారి స్థాయి నందుకొనలేకపోయినవి. ఈ సంగతి వారు రచించిన కథలు గాథలు లోని నన్నయ యను వ్యాసమునందు వారే యొప్పుకొనిరి. పాండవ ప్రవాసములోని మైదవ యంకమునందు నూర్వశీ అర్జునుల ప్రణయ గాథ కలదు. ఇది యరణ్యపర్వము ప్రథమాశ్వాసములోని 359 మొదలు 370వ పద్యమువరకుఁ గల కథ. ఇంద్రుని యానతి పురస్కరించుకొని యూర్వశి యర్జునుని చూడవచ్చుటతో నీ యంక మారంభమగును. ఊర్వశీ ముఖమున

వ్యాసు డిచ్చిన మంత్రమ్ము పఠన చేసి
య మ్మహాదేవు నారాధన మ్మొనర్చి
పాశుపతమును గైకొని స్వర్గలోక
మరుగు దెంచుటచే ధన్యురాల నయితి.

కావలు లైన కౌరవుల కారణమై వనవాస మబ్బె మీ
కేవురకున్ సతీమణికి నియ్యది మీ కతి కష్టమైననున్
భావుక మయ్యె మాకు

అని యుభయార్థ సూచకముగా నాలుగైదంకముల మధ్య జరిగిన కథ చెప్పింపబడినది. 'సత్కవితా రచనం బోలె నేదో యొక విధమునం బ్రకృతమును సూచించుచునే యున్నది' అని యర్జునునిచే ననిపించిన మాటల కీ పై రెండు పద్యములు దృష్టాంతములుగా నున్నవి. ఈ యంకమునందు

అన్నదమ్ముల రగు మీకు నైదుగురికి
ద్రోవది యొక ర్తె కద భార్య యీ వివేక
మచట నే మాయె జ్యేష్ఠు నిల్లాలు కాక
తండ్రి యుంపుడు కత్తెయే తల్లి యగునె.

ఇత్యాదికములగు నూర్వశి చతురములగు ప్రశ్నలు, నర్జునుని యుపాయసహితములగు సమాధానములు చదువరుల మనస్సునకు నాహ్లాదము కలిగించుచుండును. 'తండ్రీ! నీ యింద్రియ జయమ్మునకు మెచ్చితిని' అనిన యింద్రుని పలుకు అర్జునుని పాత్రపోషణయందు చక్కగా విశదమగుచున్నది. ఆరవయంకము ద్రౌపదిని బలాత్కరించిన సింధురాజును పాండవులు పరాభవించుట. అరణ్యపర్వము షష్ఠాశ్వాసములోని 144 మొదలు 251 వ పద్యమువరకుఁగల కథ.

ఏడెనిమిది యంకములం దుత్తర గోగ్రహణము కథ కలదు. సప్తమాంకారంభమునం దొక గాయకుడు ప్రవేశించి దక్షిణ గోగ్రహణ వృత్తాంతము సూచించిపోవును. ఇది విష్కంభము. ద్రౌపది యుత్తరకు నుత్తర గోగ్రహణ వృత్తాంత మెరింగించి 'నీయన్న యుద్ధ సన్నద్ధుడయ్యెను తగిన సారథికై వెదకుచున్నవాడు మీ గురువునకు సారథ్యమునందు నేర్పు కలదని విన్నాను. వానిని గొనిపొమ్ము' అని వెడలిపోవుటతో కథ ప్రారంభమగును. ఇది

విరాటపర్వములోని 4-5 ఆశ్వాసము లందలి కథ. ఈ యంకమునం దుత్తరుడు గోపాలకులతో

ద్రోణుం ద్రుంచెద భీష్ము నొంచెదఁ గృపు న్దూలించెద న్గౌరవ
శ్రేణిం దంచెద మించెదన్ గురుసుతున్ శిక్షించెదన్ గర్ణునిన్
గ్రేణింతున్ గవలన్ బృధాతనయులన్ గీలింతు వాలమ్ములన్
స్థాణున్ గూల్చెద వేయు నేటికిఁ దగున్ సారథ్యమే యుండినన్.

అని యొడలు తెలియని యాటోపముతో పలికెను. మూలమునందు తిక్కన

కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజ ముఖ్యులు మత్స్యముద్య మ
స్ఫురణము చూచి పార్థుఁ డనుబుద్ధి కలంగఁగ బెట్టు గిట్టి

యని రచింపగా తిరుపతికవులు 'కవలన్ బృథాతనయులం గీలింతు' ననిపించుటలో నుత్తరుడు తాను మాట్లాడుచున్న దేదో తనకు నా వేశములో తెలియుట లేదని నిరూపించుటకే యని యూహింపవలసియున్నది. తరువాత స్మృతి నభినయించి 'వారల ద్రుంచి రాజ్యమును పార్థుల కిచ్చి యశమ్ము గాంచెదన్' అనును. ఇందు మూలమున నుత్తరకుమారుని యవివేకాభిభాషణము ఆడంబరము వ్యక్తమగుచున్నది. తిక్కనగారి రచన కిది ప్రక్కదారి. అర్జునుడు (బృహన్నల) ఉత్తరుని మాట లక్ష్యపెట్టక రథము నమిత వేగముతో పోనిచ్చును.

అకట! డబ్బు పెట్టి యాబ్దికమును గొన్న
పగిది వీఁడు నాకుఁ బ్రాప్త మయ్యె
వీణపట్టె కాని వింటి పట్టెఱుఁగని
కాంత కెఱుఁక పడునె కదన బాధ

అని యుత్తరుఁడు తలంచును. రథమునుండి దుమికి పారిపోవును. లోకోక్తిని పొందుపరచిన యీ పద్యరచనలో కొంత హాస్యరసము, ఉత్తరుని పిరికితనము, నైరాస్యము గోచరించును. ఈ యంకమునందు కర్ణాశ్వత్థామల వివాదము ప్రశంసింపఁదగినది.

ఆలము సేయువానివలె నాయుధముం గొని సారె సారె మీ
సాలను దువ్వుకొంచు నృపు సత్రమునం బడి మెక్కి మెక్కి పైఁ
గాలము వచ్చినప్పు డిటు కాతరతన్ గని తిన్న యింటి వా
సాలను లెక్కవెట్టు నినుఁ జంపి కురు ప్రభు నప్పుదీర్చెదన్.

అన్నాడు కర్ణుడు.

కందాలోఁ బడి భుక్తశేషమును జక్కన్ మెక్కి బల్పెక్కి తే
నిం దుర్నీతికిఁ దిప్పు నీ బ్రతుకు నేనేకాదు లోకంబులో
నిందన్ జేయనివార లుండ రదిగో నీ చావు దాపయ్యె నో
పందా! నోటికి బుద్ధి చెప్పుకొనుమా పైఁబైకి రాఁబోకుమా

యని యశ్వత్థామ కత్తి దూసెను. ఒకదానిని మించిన పద్య మింకొకటి. నాటకము చివరివరకు నీ రెండంకములు రసవంతముగా నున్నవి.

తరువాతిది పాండవ రాజసూయము. ఇది యేకాంక నాటకము. భారతములోని సభాపర్వమునందు పాండవరాజసూయము ప్రధాన ఘట్టము. ఈ భాగమును తిరుపతికవు లే కారణముననో పాండవ ప్రవాసమునందు విడిచిపుచ్చిరి. అది వారి కొక లోపముగా తోచియుండవచ్చును. పాండవ ప్రవాసము రంగస్థలమున ప్రదర్శింప తలంచుకొనిన వా రీ యంకమును మూడు నాల్గంకముల మధ్య కలిపి యాడుకొనుటకు వీలుగా నుండునటుల రచించియుందురు.

పాండవ రాజసూయమునకు ప్రస్తావన వ్రాయుటలో తిరుపతికవు లొక నూతన మార్గము త్రొక్కిరి. ఆ దారి నింతవరకు సంస్కృత నాటకములందుగాని తెనుగు నాటకములందు కాని పోయినవారు లేరు. ముందుకాలమునందును పోదురని తోచదు. దీనియందు లక్షణానుగతమైన నాందిగాని కవి ప్రశంసాదులుగాని నటీ సూత్రధారుల సంభాషణగాని లేవు.

పాండవ రాజసూయ యాగమున శిశుపాల వధ ప్రదర్శనమున కిది యుపోద్ఘాతము. కావ్యరూపమున రచింపబడినది. ఇం

దరువది పద్యములు గలవు. చిన్న కల్పిత కథ. సాయంకాలము లందు పరమశివుడు తాండవమాడుచుండును. దానిని చూచుటకు దేవతలు వచ్చుచుందురు. ఆ తాండవమునకు పరమహర్షము పొందుచుందురు. ఆయన తాండవమాడుట విష్ణుప్రీతికొరకు. నాటి తాండవానంతరము దేవదేవుడగు మహాదేవు డిట్లనెను. 'ఉత్థాన ఏకాదశి రానున్నది. యానాడు మీరందఱు హరిని పూజింపవలయును'. ఆ మాటలకు తనయంగమునం దలంకారముగానున్న యొక సర్పమంగీకరింపలేదు. 'మా వంశీయుడగు కాళీయుని మర్దించిన హరిని భజింపనోప' మని హరుని తిరస్కరించెను. హరుని యక్షీ యగు సూర్యుడు వానిని మందలించెను. ఈ తిరస్కారమునకు కారణము వీరభద్రుడని శివుడు గ్రహించెను. ఎదుటనున్న హనుమంతుని చూచి పరమశివుడు 'చెప్పుమో యనఘ హరినిం గురించి మన యజ్ఞులా తిక్క లడంగు ముచ్చటల్' అని నుడివెను.

హనుమంతుడు—

శిష్ట రక్షణమును దుష్ట శిక్షణంబు
నతని కృత్యమ్ము లగుట మీయందె కాదు
ఎవరియందేని దుష్టుల నేరి శిక్ష
సేయు, శిష్టుల నెలమిఁ గైసేసి ప్రోచు

అని బోధించెను. ఆ మాటలు సర్పమునకు నచ్చలేదు. 'ప్రత్యక్షమ్మునఁ గాని లోఁగ రిల నప్రాజ్ఞుల్' అన్నాడు మారుతి. 'ఔనది బాగు బాగు' అనినాడు సాంబుడు.

ఆ నగజా మనోహరుని యంతరమున్ గనిపెట్టి వెంటనే
ధీనిధి నందికేశ్వరుఁడు తెయ్యి తక త్తక యంచు మర్దల
ధ్వాన మొనర్చె దిగ్గజ వితానము గుండెలుగూడ ఝల్లనన్
నాంది పఠించె సూచనఁ గనం బఱచెన్ శిశుపాల దుర్వచః
క్రందనముల్ వినంబడిన కైవడి సభ్యులకెల్లఁదోఁచె న
స్పంద యశుండు ధర్మజుఁడు శౌరికి నర్ఘ్యమొసంగు సత్కథా
చందన మల్లికా కుసుమ సౌరభ సారభరంబు వెల్వడెన్.

అని శ్రవ్యప్రబంధపుఁ బోకడను ప్రస్తావన రచించిరి. పిమ్మట సహదేవుడు రంగస్థలము మీఁదికి వచ్చి

వామం బీ చరణంబు వాని తలపై వర్తింపఁగాఁ జేయుఁ దా
నీమై సహదేవుఁ డెవ్వఁడు వృథా హేయమ్ములం గూసి స
ర్వామేయుఁ జగదీడ్యు గోపతిని సత్యాలంబి నర్ఘ్య ప్రదా
నామాన్యుం డని ప్రేలునో మరల నవ్యాజాంతరంగమ్మునన్.

అని సాట్టహాసంబుగా ననును. దీనితో నాటక ప్రారంభ మగును. శిశుపాలుడు భీష్మ శ్రీకృష్ణులను నిందించును. శ్రీకృష్ణుడు తన చక్రముచేత శిశుపాలుని కంఠము ఛేదించును. తెరపడును. ఆ పిమ్మట నందికేశ్వరుడు ప్రవేశించి భరతవాక్యము చెప్పును. ఇది క్రొత్త సంగతి. తెరపడిన తరువాత భరతవాక్య మన్యపాత్రచే ప్రత్యేకముగా చెప్పించుట యే నాటకమునం దుండదు. చివరి రంగమునం దుండు పాత్రలలో నొకనిచేత తెరపడక ముందు చెప్పించుట యలవాటుగా వచ్చుచున్న యాచారము.

తరువాతి నాటకము సుప్రసిద్ధమైన పాండవోద్యోగము. ఇది యారంకముల నాటకము. ప్రథమాంకమునందు దుర్యోధనార్జునులు భావి భారతయుద్ధమునందు శ్రీకృష్ణుని సహాయము కోరుటకలదు. అర్జునుఁడు

ద్రుపదుని పంపునన్ జనెఁబురోహితుఁ డా ధృతరాష్ట్రసూతి బల్
కపటి వినండు సంధి చెడఁగాఁ గమకించెడి గాని తప్ప దా
లపుఁ బని సర్వమున్ గడపు లావు గలండు యశోద పట్టి యా
రిపు జనకాలుఁ దోడుగ వరించెద సర్వము నిర్వహించెదన్

అని తలంచుచు రంగస్థలముమీఁద ప్రవేశించును. ఈ పద్యము నాటకమునకుఁ బూర్వరంగముగాఁ బనిచేయును.

అదిగో! ద్వారక యాలమంద లవిగో! నందందుఁ గోరాడు న
య్యది యేకోట, యదేయగడ్త, యవె రథ్యల్, వారలే యాదవుల్

యదుసింహుండు వసించు మేడయదిగో! యాలాన దంతావళా
భ్యుదయంబై వరమందురాంతరతురంగోచ్ఛండమై పర్వెడున్.

అను పద్యముతో నసలు నాటకము ప్రారంభమగును. ఈ రచనలో నొక గొప్ప విశేషమున్నది. భావిభారత యుద్ధమునకు శ్రీకృష్ణ సహాయార్థియై బయలుదేరిన యర్జునుడు మార్గమునందు ద్రుపదుని పంపునఁ జనిన పురోహితుని కార్యము నిరర్థకము కాగల దనియు, యుద్ధము తప్పదనియు, దానిని నిర్వహించుటకు యశోద పట్టితో డర్థించెద ననియు దలంచుట యర్జునుని మానసిక తత్త్వమును తెలుపుచున్నది. ఇది లోక సహజము. కార్యార్థియై జనువాడు దారియందు తన పనినిగురించి తలంచుకొనుట సహజ స్వభావము. మానవ చిత్తప్రవృత్తి స్వానుభవముచేత గ్రహించుకొనిన తిరుపతి కవులు ఈ పద్యమును నాటకరంగమునకు రత్నతోరణమువలె నలంకరించిరి.

ఇది మార్గమునందు సాగివచ్చుచున్న నరుని యాంతరంగిక ప్రవృత్తి. ఇట్టి ప్రవృత్తితోడను కార్యభారము తోడను బరువెక్కిన మనస్సును వహించి వచ్చుచున్న యర్జునుడు తలయెత్తి చూచెను. ఎదుట ద్వారకాపురము కనిపించినది. బహుయోజనములు శ్రమపడి నడిచివచ్చిన బాటసారి తన గ్రామము చూడగానే కృంగిపోవుచున్న ప్రాణములు లేచివచ్చి యమితానందము పొంది గ్రామస్థ విశేషములను విప్పారిన కనులతో నవలోకించి వర్ణించుకొనునట్లు అర్జునుడు 'అదిగో ద్వారక' యని ప్రాణము లేచివచ్చినట్లొకసారిగా నన్నాడు ఒక నిశ్వాసమును విడిచి తన భారమంతయు తీరిపోయినట్లు. ఆ పద్యము నట్లు ప్రారంభించుటలో నా భావోద్రేకత గోచరించును. తరువాత దాపునకు వచ్చినకొలది ఆలమందలు, కోట, అగడ్త, రథ్యలు, యాదవులు క్రమక్రమముగా కనిపించిరి. చివరకు యదుసింహుడు వసించుమేడ నయనగోచరమైనది. అంతటితో నర్జునుని మనస్సు చంద్రోదయమున పాలసముద్రమువలె నుప్పొంగి మిన్నంటుకొన్నది. ఒక్కసారిగా భావపేటిక విచ్చుకొని యానందాతిశయ

మున పరవశత్వము నొంది యొక దీర్ఘసమాసముతో 'ఆలానదంతావళాభ్యుదయంబై వరమందురాంతర తురంగోచ్చండమైపర్వెడున్' అని ముగించినాడు. ఈ పరవశత్వ మర్జునునకు కాదుకలిగినది. ఆ పద్యము రచించిన మహాకవులకు దాదాపు రెండు పాదములన్నర పై చిలుకు పొడిపొడి మాటలతో నడిచి పద్యమును చివరికి సమాసముతో పూర్తి చేయుటలో నట్టి యాధిక్యత పద్యమున కొదవినది. దీనికే భావానుగుణమైన రచన అంటారు మహావేత్తలు.

ఆ యానందాతిశయముతో నర్జునుడు శ్రీకృష్ణుని సౌధము నందు ప్రవేశించినాడు. నారాయణావతారుండగు నందనందనుం డర్జునున కగుపించినాడు. పరమేశ్వర సాక్షాత్కారముచేత భక్తుని హృదయమువలె భక్తిరసావేశమున నర్జునుని మనస్సు పరవశత్వము నొందినది. అర్జునుడు పరమభక్తుడు. ఆ భక్తి పారవశ్యమున

'అరవిందాక్షుఁడు శేషశాయి జగదేకారాధ్యుఁడంభోధి జా
వరుఁ డార్తావనుఁ డంగజాంగజుఁడు శ్రీవత్సాంకుఁడు'

అని పెక్కునామములతో వినుతి గావించినాడు. నిద్రాముద్రితములైన కనులను గాంచినాడు 'ఏమో! నిరంతర నిర్నిద్రుఁడు నిద్రఁ జెందెడి పవల్'' అను సందేహము కలిగినది. తలవంక చూచినాడా సందేహముతోడనే 'తచ్ఛీర్షపుం బ్రక్క నక్కరు నాథుండదె కూరుచుండెఁ దళుకుల్ గుల్కంగఁ బీఠమ్మునన్' అని గ్రహించుకొన్నాడు. ఇది యసూయ. ఈ మూడు భావము లీ పద్యమునం దున్నత స్థాయిని బొందినవి. ఆ రచనలోని సొంపటువంటిది. మొదటి రెండు పాదములు భక్తి పరవశత్వమున రచించు పోతన్నగారి పోకడను తలపించు రచన. మూడవ పాదము సాక్షాత్పరమేశ్వరునకు నిరంతర నిర్నిద్రునకు నిద్రయేమిటా యను ననుమానము. అందును పగటిపూట 'తళుకుల్ గుల్కంగ పీఠంబునన్' అను మాటలోనున్నదా మూడవది యసూయాభావము. ఇన్నిభావము లిమిడ్చి యింత చక్కగా పద్యము వ్రాయనేర్చుట తిరుపతి మహాకవులకే సాధ్యమయినది. అసాధారణ తేజస్సనాథుండగు సూర్యుని వెలుంగులో

దీపకాంతులు నిస్తేజము లయినట్లు అర్జునుని భక్తిభావములో నసూయానుమానము లగోచరము లయినవి. విశుద్ధ సాత్వికభక్తి యుద్దీపించినది. నమ్రభావము తోచినది.

జలజాతాసన ముఖ్యదైవత శిరస్సంలగ్న కోటీర పం
క్తుల కెవ్వాని పదాబ్జపీఠి కడు నిగ్గుల్ గూర్చుఁ దత్సన్నిధి
స్థలిఁ గూర్చుండి భవంబు పావనముగా దైవారఁ గావించి నా
తొలి జన్మంబునఁ గూడు పాపముల నాందోళింపఁగాఁ జేసెదన్.

అని శ్రీకృష్ణభగవానుని పాదముల ప్రక్క నిలుచున్నాఁ డర్జునుడు. ఇటువంటి మహోత్కృష్టభావములు గలిగి రసవత్తరములు ప్రతిపద రమణీయములగు పద్యములతో నారంభించినది కావుననే ఈ నాటకము రంగస్థలముమీద జవనిక నెత్తినదాదిగా రక్తికట్టుచున్నది. సన్నివేశము సకల మానవలోక హృదయాకర్షణీయమగు శ్రీకృష్ణ దుర్యోధనార్జునుల రంగము. కవిత్వమా యింత బిగువుగల కవిత్వము తొల్లింటి పాండవ నాటకములం దెక్కడ మచ్చునకైనఁ గనిపించదు. పండితపామర జనాకర్షణీయమేల కాకుండును?

అర్జునుడు రాగానే శ్రీకృష్ణుడు కపట నిద్రనుండి మేలుకొనును. వారిద్దరిని సంభావించిన విధానములోనే ఆత్మీయత కపట ప్రేమ తొణికిస లాడినది. అర్జునుని ప్రశ్నించిన విధమిది

ఎక్కడనుండి రాక యిట కెల్లరునున్ సుఖులేకదా? యశో
భాక్కులు నీదు నన్నలును భవ్యమనస్కులు నీదు తమ్ములున్
జక్కఁగ నున్నవారె భుజశాలి వృకోదరుఁ డగ్రజాజ్ఞకున్
దక్కక నిల్చి శాంతుగతిఁ దాను జరించునె తెల్పు మర్జునా!

దీనిని గురించి వ్యాఖ్యానింపవలయు ననిన కొన్నిపేజీలు పట్టును. దుర్యోధన భీములకు మొదటినుండియు పచ్చిగడ్డి వేసిన భగ్గుమని మండును. అది యెరిగిన కృష్ణుడు ప్రత్యేకముగా భీముని పేరెత్తి యడిగిన యా మాటలో భారతమంత భావ మిమిడియున్నది.

అది దుర్యోధనునికి కారము రాచినట్లయినది. ఇంక దుర్యోధనుని ప్రశ్నించిన విధమిది

బావా! ఎప్పుడు వచ్చితీవు సుఖులే? భ్రాతల్ సుతుల్ ల్చుట్టముల్
నీ వాల్లభ్యముపట్టు కర్ణుఁడును మన్నీలున్ సుఖోపేతులే

ఇత్యాది. పైమాట ఎట్లున్నను రెండవపాదము దుర్యోధనున కూదరపెట్టు. శ్రీకృష్ణుఁడు జగన్నాటక సూత్రధారుడు. గిల్లి ఖజ్జాలు పెట్టుటకు పుట్టినవాడు. ఆ బీజమిక్కడే ప్రారంభమయినది. శ్రీకృష్ణ పాత్రపోషణ ఈ నాటకమునందు చివరివరకు నిల్లే తిరుపతికవులు మహానిపుణముగా సమర్థించుచు వచ్చిరి. అర్జునుని భక్తిభావము, వీర రసావేశము, సమరోత్సాహము, నీ యంకమునందు వెల్లివిరిసి పోయినది. మచ్చునకు

సారథియంట వేదముల సారము శౌరి, తదంఘ్రి భక్తి చె
న్నారెడు క్రీడి తా రథికుఁడౌనఁట చిందము విల్లు దేరునున్
వారువముల్ మొదల్ దివిజవర్గ మొసంగినవంట! యస్త్ర వి
స్తారగురుల్ శివాదులట సంగరమం దెవఁ డాగఁజాలెడిన్

నిజముగా నెవ్వరు నాగలేరు. ఆ సాధనసామగ్రియు నాపద్య రచనకూడ అటువంటివే. తిక్కనగా రీరచన ముందాగలేరేమోయని పించును. ఆ ధారాశుద్ధి యా భావసౌలభ్యము ఆ రచనా సౌష్ఠవము ఆ పదముల పొందిక మరెవ్వరియందు లేదని చేయెత్తి దండము పెట్టవలసినదే. ఈ నాటకమునం దీ పద్యము బాగుండలేదని యన గలవా రుండరు. పద్యము లన్నియు నింత బిగువుగాను రసవత్తరము గాను నడచినవి. తరువాతి యంకము పాండవుల పర్యాలోచన రంగము. ఇందు సంధి ప్రసంగపు సంగతు లట్లుండ ప్రథమాంకము నందు నాటిన బీజమునకు దోహదముగా ధర్మజునందలి 'భక్తికతం బునఁ గాళ్ళ సంకెలన్ తగులుప లోపల న్వగచుదంతి విధంబున నున్న' భీమునకు సిళ్ళుచూపి శ్రీకృష్ణుడు కోపమున విజృంభించు నటుల గావించిన ఘట్టము ప్రశంసింపఁ దగినది. భీముని రోషము అమాయకత్వము ఒక విధముగా నవ్వు పుట్టించును. భీముడు

క్రుద్ధుఁడవౌచు సంధిఁ జెడఁగొట్టక ధర్మతనూజ కార్య సం
సిద్ధియొనర్పు మయ్యనఘు సేమమె మాకును సేమ మన్నిటన్

అన్నాడు. భీముని రెచ్చగొట్టినఁగాని తన కార్యము ఫలింపదు. కృష్ణుడు

నిదుర వోవుచుంటివో లేక బెదరి పల్కు-
చుంటివో కాక నీవు తొల్లింటి భీమ
సేనుఁడవె కావో యెన్నఁడీ చెవులు వినని
కనులు చూడని శాంతంబు గానవచ్చె

కురుపతి పెందొడల్ విఱుఁగ గొట్టెద నొమ్ముపగిల్చి నెచ్చనె
త్తురు కడుపారఁ గ్రోలి యనిఁ దున్మెద దుష్టుని దుస్ససేను భీ
కరగదచేత నంచును ప్రగల్భము లాడితి వల్ల కొల్వులో
మరల నిదేల యీ పిఱికి మానిసిపల్కులు మృష్టభోజనా!

అన్నాడు. చక్కని సంబోధన. దానిలో పరిహాసము, వెక్కిరింత, మరుగుపడియున్నది. భీమునకు కోపమలంకారము. ఆ కోపము ముక్కుమీద నుండును. ఇక విజృంభించినది బృంహిత ధ్వనులతో భీమ మత్తమాతంగము. 'అంబుధు లింకఁగాక' అని రేగిరేగి 'ఎందునే నడుగు దాటరు పాండవు లన్నమాటకున్' అని యొక్క ఱంకె వైచినది. 'అన్నమాటకున్' అను మాటమీద వీరరసము హాస్యరసము సమ్మిళితముగా తిరుపతికవులు పెంచిన యీ సంభాషణ వినోదజనకముగా నున్నది. దానికి ద్రౌపది యొకొక్క ఇంధనము తగిలించుచు వచ్చినది. భీముడు చేయునది లేక యుడుకులెత్తి

గొల్ల యిల్లాండ్ర వంచించి కొంపకొంప
కరిగి పాల్వెన్న పెరుగు దొంగతికమున
బొట్ట నిండించి జీవించినట్టి వెఱ్ఱి
గొల్లనికి నీకు విద్యల గోలయేల?

అని నిందలకు దిగినాడు. ఈ వినోద సంఘటనమునకు దారి చూపినవారు తిక్కనగారు. దానిని తిరుపతికవులు పెంచి మహోన్నత

స్థితికి తెచ్చి మరింత రసవంతముగా తీర్చిదిద్దినారు. ఇచట వీరి రచన హృదయాహ్లాదకరముగా నున్నది. చివరకు తమ్ముల ప్రబోధమునకు అక్కఱ్ఱు పట్టలేక గదా ప్రహారముచేత తల పగులఁగొట్టుకొను స్థితికి వచ్చినాడు. ఈ యంకమునందు భీముని యమాయకపు కోపస్వభావము, శ్రీకృష్ణుని మాయానటన చాతుర్యము చక్కఁగా చిత్రింపఁబడినది. ఇది వేంకటశాస్త్రిగారి చేతి చాకచక్యము.

బందరు రాయల్ థియేటరువారీ పాండవ నాటకములు ప్రదర్శించుటయందు పేరు వహించిరి. వేంకటశాస్త్రిగారి శిక్షణలో నలిగి యారితేరినవారు నటులు. అందు పింగళి నరసయ్యగారు భీమపాత్రను ధరించెడివారు. ఆయన భావాభినయములతో నీ పద్యములు పాడు నప్పుడు ప్రేక్షకులు రసావేశమును బొంది పద్యపద్యమునకు ప్రశంసలను కురిపించు చుండెడివారు. దీనినిబట్టి యీ పద్యముల గొప్పతన మూహించుకొన వచ్చును.

ఇందు బిందువ్యాప్తి గోచరించును. ఈ యంకమునందు వ్యక్తావ్యక్తమైన బీజము తృతీయాంకమున ఫలోన్ముఖము పొందును. మూడవ యంకము సంధిరాయబారపు రంగము. ఇది విష్కంభముతో ప్రారంభింపబడినది. ఒక వృద్ధపురోహితుడు వాని కుమారులు సంభాషణ మూలమున శ్రీకృష్ణుఁడు హస్తినాపురమునకు వచ్చుటయు, విదురుడు పురోహిత సహితముగా నెదురుపోయి తోడ్కొని తెచ్చుటయు, అచటనుండి కుంతి కడకును, దుర్యోధనుని కడకును బోయి శ్రీకృష్ణుడు విదురునింట విందారగించుట కరుగుటయు, మొదలుగాగల సంగతులు చెప్పింపఁబడినవి. ధృతరాష్ట్రుని కొలువు కూటమునకు శ్రీకృష్ణుడు వచ్చుటతో నస లంకము ప్రారంభమగును. శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో తాను వచ్చిన కార్యమును దెల్పి

తమ్ముని కొడుకులు సగపా
లిమ్మని రటు లిష్టపడవ యేనియు నైదూ
ళ్ళిమ్మని రైదుగురకు ధ
ర్మమ్ముగ నీ తోచినట్లు మనుపుము వారిన్

అని ముచ్చటగా మూడుమాటలలో సంధిసారాంశమంతయు నుడివెను. అంతటితో నూరకొన్న బాగుండును. శ్రీకృష్ణునకు సంధి యనభిమతము.

అయినను పోయి రావలయు హస్తిన కచ్చటి సంధిమాట యె
ట్లైనను శత్రురాజుల బలాబల సంపద చూడవచ్చు

నని మొదలే ధర్మరాజుతో చెప్పెను. చంక దుడ్డు శరణార్థి యన్నటుల

తనయుల వినిచెదవో యీ
తనయులతో నేమి యని స్వతంత్రించెదవో
చను మొకదారిని లేదే
నని యగు వంశక్షయంబు నగు గురునాథా!

అని యొక యొడలు మండించు బెదురుమాట విసరినాడు. వంశక్షయంబగునట. అభిమానవంతుడగు వీరక్షత్రియ వంశజాతున కెవనికి గుండెకంట పొడిచిన బల్లెపుంపోటు కాకుండును? "తనయులతో నేమియని స్వతంత్రించెదవో" అనుటలోనే తండ్రి కొడుకుల మధ్య వైరము రగులుటకు పుల్లపెట్టిన భావము నిగూఢముగా దాగియున్నది. దానికి తోడిది, "వారిచేత శుశ్రూషనే చేయించుకొనెదవో సంగరమునే చేయించుకొనెదవో" అనునది పైపెచ్చుమాట. అసలే దుడుకుపిండము కర్ణుడు. దుర్యోధనునిమీద ఈగ వాలనీయడు. వానికి కోపము పొడుచుకొని వచ్చినది. "అధిక ప్రసంగము మాని నీ కర్తవ్యాంశమేదో చెప్పుకొను" మనినాడు కర్ణుడు శ్రీకృష్ణుని. ఇంకేమున్నది కర్ణుడనిన భీష్మ ద్రోణాదులకు కళ్ళలోని కలికెము. శ్రీకృష్ణుడు నారాయణాంశ సంభూతుడు. ఈ తిరస్కార మెవరు విని సహింపగలరు? మంటలు రేగినవి. కొలువు కూటము కలహ కూటముగా మారినది. సమయము కనిపెట్టి సకలతంత్రవేత్త యగు శ్రీకృష్ణుడు పాండవులకు విజయసాధకమైన యింకొక యింధనమును తగిలించినాడు.

సేవాధర్మము సూతధర్మమును రాశీభూతమై యొప్ప వా
చావాత్సల్యత చూపెఁ గర్ణుఁడిటు మాత్సర్యంబు మీకేల రా
జేవేళన్ మిముఁ గోరునోయనికి నాఁడే పొందు పోరాడ లే
దా వర్జింపుఁడు కర్ణు చావువరకో యత్యంతమో యుద్ధమున్

అని. ఇది భేదోపాయము. చక్కగా పనిచేసినది. పరస్పర విద్వేషములు పెరిగినవి. ఎవరికివారు కొలువుకూటము విడిచి లేచి పోవునంతవరకు వచ్చినది. శ్రీకృష్ణుడు దుర్యోధనునితో "బావా! నీ కొలువుకూటము క్రమక్రమముగా రణకూటమగుచున్నది. పదుగు రుండగనే నా చెప్పఁబోవు పలుకులుగూడ నాలింపుము" అని విజృంభణపూర్వకముగా

చెల్లియొ చెల్లకో తమకుఁ జేసిన యెగ్గులు సైఁచిరందఱుం
దొల్లి గతించె, నేఁడు నను దూతగఁ బంపిరి సంధిసేయ నీ
పిల్లలు పాపలుం బ్రజలు పెంపు వహింపఁగఁ బొందుచేసెదో
యెల్లి రణంబుఁగూర్చెదవొ యేర్పడఁ జెప్పుము కౌరవేశ్వరా!

అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముఁ డజాతశత్రుఁడే
యలిగిననాడు సాగరము లన్నియు నేకము కాకపోవు క
ర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
పలుకులు విశ్వసింపుము విపన్నుల లోకులఁగావు మెల్లరన్

జెండాపై గపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబుంగొని తోలు స్యందనముమీఁద న్నారి సారించుచుం
గాండీవంబు ధరించి ఫల్గుణుఁడు మూఁకం జెండుచున్నప్పు డొ
క్కండున్ నీ మొఱ నాలకింపఁడు కురుక్ష్మానాథ సంధింపఁగన్

సంతోషంబున సంధిసేయుదువె వస్త్రంబూడ్చుచో ద్రౌపదీ
కాంతం జూచిననాఁడు చేసిన ప్రతిజ్ఞల్ దీర్ప భీముండు నీ
పొంతన్ నీ సహజన్ము ఱొమ్ము రుధిరమ్మున్ ద్రావు నాఁడైన ని
శ్చింతం దద్గదయుం ద్వదూరుయుగమున్ ఛేదించునాఁడేనియున్

అని దుర్యోధనుని రెచ్చఁగొట్టినాడు. సంస్కృత వాఙ్మయము నందు కాళిదాస కృత శ్లోక చతుష్టయమున కెట్టి ప్రతీతి కలదో తెలుగు వాఙ్మయమునందు తిరుపతికవులు రచించిన యీ నాలుగు పద్యములకు నంతకంటె నెక్కువ ప్రతీతి కలదు. శ్లోక చతుష్టయమునకు పండితులలో మాత్రమే ప్రచారమున్నది. ఈ పద్యములు తెలుగు దేశమునందు బండితోలుకొనువాని దగ్గరనుండి మహాపండితునివరకు గల ప్రతివ్యక్తికి కంఠస్థములు. ఈ పద్యములు రాని మానవుడు లేడు.

ఇంత ప్రచారమున కెక్కిన పద్యములు తెలుగుభాషయందు మరేవియు లేవనియే చెప్పవలయును. ఈ పద్యముల రచనయందొక విశేషవిశిష్టత్వము కలదు. "చెల్లియొ చెల్లకో" యని సామముగా నారంభించిన రచన రెండేసి పాదములకు నిశ్రేణిమెట్లవలె నంతకంతకు నుద్రేకాభివృద్ధిని పొంది చివరకు రోషావేశాతిశయమున "త్వదూరుయుగమున్ ఛేదించు నాడేనియుఞ్" అనుటలో శిఖరాగ్రమును చేరినది. ఇది సామ దాన భేద దండోపాయముల క్రమమును ప్రదర్శించు పద్య చతుష్టయము. "చెల్లియొ చెల్లకో తమకుఁజేసిన యెగ్గులు సైచిరందఱుం దొల్లి గతించె నేడు నను దూతగఁ బంపిరి సంధిచేయ" అని సామముగాఁ జెప్పినాడు శ్రీకృష్ణుడు మొదట. అట్లు సంధిగావించినచో "నీ పిల్లలు పాపలుం బ్రజలు పెంపు వహింప" గలరని దానోపాయమును ప్రదర్శించినాడు. "కర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ" యని కర్ణునియందు నైరాశ్యము కల్పింప యత్నించినాడు. ఇది భేదోపాయము. "నీ పొంత న్నీ సహజన్ముఱొమ్ము రుధిరమ్ముంద్రావు నాడేని నిశ్చింతం దద్గదయుం ద్వదూరుయుగముఞ్ ఛేదించు నాడేనియుఞ్" అని యుద్ధమునందలి ఫలితాంశము నిరూపించి దండోపాయమును వాగ్రూపమున నవగతము గావించినాడు.

నయమునను, భయమునను శ్రీకృష్ణుడు చెప్పఁదలుచుకొనిన మాటలు చెప్పినాడు. భావి భారతయుద్ధ ఫలితమును చివరి మూడు

పద్యములతో విశదపరచినాడు. జరిగినదికూడ అంతే. అజాతశత్రు డలుగుటచేతనే యానాడు కర్ణునిచావు తటస్థించినది. ఇవి భావవైలక్షణ్యముగల పద్యములు గావుననే పాండవోద్యోగమునందే కాక పాండవ నాటకము లన్నిటిలో వీని కుత్తమస్థానము కలదు. ఇంత వరకు శ్రీకృష్ణుని యపూర్వ రాజనీతి నేతృత్వము చక్కగాఁ చిత్రింపఁబడినది. వీనిని విశదముగా వ్యాఖ్యానించుటకొక గ్రంథము పట్టును. విశ్వరూప ప్రదర్శనముతో శ్రీకృష్ణుని దేవత్వము నిరూపింపఁబడినది. ''సంధిమాట యెట్లైనను'' అని బయలుదేరిన శ్రీకృష్ణుడు పాండవులకు విజయసాధకంబుగా కౌరవబలమునందు వైరము కల్పించి తన సంకల్పము నెరవేర్చుకొనినాడు

ఈ యంక రచనమునందు తిరుపతికవులు సంపూర్ణముగా సర్వతోముఖమైన ప్రతిభా నైపుణ్యములను ప్రదర్శించి సిద్ధసంకల్పులైనారు. శ్రీకృష్ణుని నొక యపూర్వ రాజకీయవేత్తగాను, దైవతమూర్తిగాను చిత్రించగలిగిరి. ఈ యంకములోని కథావిధానమున భారతములోని తిక్కనగారి పోకడయందును, తిరుపతి కవుల రచనయందును చాల తారతమ్యము కలదు. తిక్కన్నగారి భారతమున రాయబారపు రంగమునందు కర్ణుని ప్రసక్తియే లేదు. కర్ణాశ్వత్థామల పోట్లాటగాని, భీష్మ ద్రోణ ధృతరాష్ట్రాదులు కర్ణుని నిందించుటగాని, వికర్ణుడు కర్ణుని సమర్థించుట కాని లేదు. తిరుపతి వేంకటకవులు ఈ యంకమునందు ముప్పాతిక మూడుపాళ్లు స్వతంత్రించిరి. దానికి తగినంత కారణము, ఆధారములేకపోలేదు. గ్రంథవిస్తర భీతిచేత నిచట చర్చింపఁబడలేదు. అభిప్రాయభేదమే యిట్టి రచనకు కారణము. నాల్గవ యంకమునందు శ్రీకృష్ణుడు కుంతిని వీడ్కొని ఉపప్లావ్యమునకు తిరిగిపోవుచు మార్గమున కర్ణుని కలిసికొని మాట్లాడును. ఇది భారత ముద్యోగపర్వము నాల్గవ యాశ్వాసము మొదటి 74 పద్యములలోని కథ. శ్రీకృష్ణుడు

కన్నె ప్రాయంబు నందు భాస్కరుని కరుణఁ
బది నెలలు మోసి నినుఁ గన్న పడతి కుంతి

చేరఁగాఁ దీసి నిన్నుఁ బెంచినది రాధ
నీవు రాధేయుఁడవు గావు నిశ్చయముగ

అని కర్ణునితో సంభాషణ ప్రారంభించినాఁడు. పాండవ జననమునందు కర్ణుడు కుంతికి సద్యోగర్భమునందు జన్మించినటుల తిరుపతికవులు నిరూపించిరి. ఈ సందర్భమున పది నెలలు మోసి కన్నదని వ్రాయుట విరుద్ధముగా నున్నది. తిక్కనగారు అటు నిటు నిర్ణయింపక దాటవేసినారు.

అంచితులైన బంధుగుల యందఱి ముందఱఁ జెప్పి నిన్ను మె
చ్చించెదఁ గుంతిచేత రవిచేత నిజంబని నీకు సాక్ష్య మి
ప్పించెద ఫల్గున ప్రముఖవీరులు గొల్వఁగ నెల్ల భూమి యే
లించెద నచ్ఛకీర్తి విమలీకృత సర్వదిగంతరంబుగన్

అని యాశ కల్పించినాడు శ్రీకృష్ణుడు కర్ణునకు. "రవిచేత నిజంబని సాక్ష్యమిప్పించెద ననుటలోఁ దన మాహాత్మ్యమును గర్ణుని యెదుట చెప్పుకొనినాడు. అందుమూలమున కర్ణునకు తనయందు విశ్వాసము కలుగవలయునని శ్రీకృష్ణుని తలంపు. అంతమాత్రము చేత కర్ణుడు లొంగువాడు కాడని కృష్ణునకు తెలియును. స్త్రీ వాంఛకు లొంగనివా రుండరు. కావున ద్రౌపదిమీద ఆశ కల్పించినాడు. తిక్కనగారు

పాంచాల రాజపుత్రియు
నంచితముగ నిన్నుఁ బొందు నారవ వరుసన్

అన్న భావమును గ్రహించి తిరుపతికవులు

ఏ సతి వహ్నిలోన జనియించెను జన్న మొనర్చువేళ ము
న్నే సతి పెండ్లినాఁడు నృపులెల్లఁ బరాజితులైరి క్రీడిచే
నే సతిమీది మోహమున నింతలు చేసిరి రాజు నీవు ని
న్నా సతి పెండ్లియాడఁగల దాఱవ భర్తగ సూర్యనందనా!

అని పెంచి మిక్కిలి రసవంతముగాను, భావబంధురముగాను, వ్రాసి మూలమునకు వన్నె పెట్టిరి. ఇదేకాదు

అనుజులు ఋత్విజులుగ నీ
పని నిటు సేయు మని నీ వుపద్రష్టవుగా
విను కురుకుమార పశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్

అను తిక్కనగారి పద్యమునకు రసపుష్టి కల్పించి భావమునకు తీర్పులు దిద్ది

అరయన్ నేరనివాఁడఁగాను విను కృష్ణా! యుద్ధ యజ్ఞంబొగిన్
జరుగున్ దానికి హోత యర్జునుఁడు, స్రుక్స్రంపత్తి గాండీవ ము
క్కురురాట్సైన్యమదంబ యాజ్యమగుఁ దక్కంగల్లు సర్వంబు నే
ర్పరి నీవే ఘటియింతు వేత్తవును నధ్వర్యుండవున్ గావునన్

అని వ్రాసిరి. తిరుపతికవుల యీ పద్యములోని నిండికగాని శయ్యలోని సరళత్వముగాని భావములోని వైశద్యముగాని రచనలోని యందముగాని తిక్కన్నగారి పద్యమునందు లేదు. ఈ విధముగా నాల్గవయంక మంతయు మూలముకంటె చాల సరస వంతముగా తిరుపతికవులు విరచించిరి.

ఐదవయంకము శ్రీకృష్ణుడు పాండవులతో కౌరవుల సభ యందలి విశేషము లెరిగించుటయు మనోహరముగా రచింపబడినది. ఆరవయంకము యుద్ధరంగము. ధర్మరాజు భీష్మ ద్రోణులను సందర్శించుట కలదు. పాత్రల పోషణయందు పద్యరచనయందు పాండవోద్యోగమునందు తిరుపతికవులు సిద్ధహస్తులైరి. ఇందు శ్రీకృష్ణుడు నాయకుడని కృతికర్తలే నిర్ణయించిరి. పాండవోద్యోగము నందలి పద్యములు చాలవరకు జనబాహుళ్యమునందు ప్రచారములో నున్నవి. అందుమూలముననే యీ నాటక ప్రాశస్త్యమును గ్రహించుకొనవచ్చును. దీనితోపాటు తెనుగు దేశమునందు నసమాన గౌరవము సంపాదించుకొనిన నాటకము పాండవ విజయము.

ఇది పాండవ నాటకములందైదవ దైనను రచనము నందు మొదటిది. ప్రథమ ముద్రణమగు పాండవవిజయమునకును తరువాతి ముద్రణములకును చాల తారతమ్య మున్నది. బాలరామాయణ

మును తెనిగించిన తరువాత తిరుపతిశాస్త్రిగారికి భారతయుద్ధమును కూడ నాటకముగా వ్రాయవలయునను బుద్ధి పుట్టినది. పాండవ విజయ మను పేర నెనిమిది యంకముల నాటకమును రచించిరి. దానిని సరస్వతి పత్రిక యందు ప్రకటించిరి. ఆ ప్రకటించినది ప్రకటించినటులనే ముద్రింపబడినది. ఆ నాటకమును బందరు రాయల్ థియేటరువారికి వేంకటశాస్త్రిగారు తరిఫీదిచ్చి యాడించిరి.

నాటకమతి రసవంతమయి మొదటినుండియు రక్తికట్టి జనుల పొగడ్తలను బొందినది, కాని నాటకము చాల పెద్దదయినది. ఆడుటకు చాల కాలము పట్టుచు వచ్చినది. వేంకటశాస్త్రిగా రది గ్రహించి దానిని పాండవోద్యోగము విజయమను పేరుతో రెండుగా విభజింప తలచిరి. అది తిరుపతిశాస్త్రిగారికి నచ్చలేదు. తొల్లింటి విజయములోని మొదటి రెండంకములు నుద్యోగములో చేర్చిరి. తరువాత యుద్యోగమంతయు వేంకటశాస్త్రిగారే పూర్తిచేసిరి. తిరుపతిశాస్త్రిగారిని ఉద్యోగమునకు సాయపడమని యడిగిరి. వారు తీరిక లేదని జవాబిచ్చిరి. అదియే గీతములో వేంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారిని

''పాండవోద్యోగమునకుఁ దోడ్పడు మటన్నఁ
దీర దన్నట్టి వాడవు''

అని దెప్పిరి. తరువాత విజయమునకు క్రొత్తగా మొదటి యంకముచేర్చి రెండుగా విభజించిరి. పిమ్మట పాండవజనన, ప్రవాస, రాజసూయాశ్వమేధము లను పేరిటి నాటకములు వేంకటశాస్త్రిగారు వ్రాసి ప్రకటించిరి. ఇప్పటి పాండవ విజయమునందు నెనిమిది యంకములు గలవు. మూడవనాటి యుద్ధము మొదలుకొని దుర్యోధనుని మరణాంతమువరకు గల దాదాపు యుద్ధపంచకములోని ప్రధాన కథాఘట్టము లన్నియు కూర్చి యతిమనోహరముగా నీ నాటకము వ్రాయఁబడినది. భీష్ముడు ధనుః పాణియై రంగస్థలముమీఁదికిఁ బ్రవేశించి

అనలము గ్రుమ్మరించెడు మదస్త్ర పరంపరచేతఁ జాల నొ
చ్చినకతనన్ యదూద్వహుఁడు చేత సుదర్శనముఁ ధరించి తా
మును బొనరించు నా సమయమున్ దిగఁద్రావి ననున్ వధింపఁగా
ననికిఁ గడంగె యర్జునుని యానన మల్లదె వెల్ల నయ్యెడిన్

అని శ్రీకృష్ణుని విజృంభణము వర్ణించుటతో నాటకము ప్రారంభమగును. భీష్ము నిట్లు రంగమునందు ప్రవేశపెట్టుటలోనె తిరుపతికవుల నాటకమున కొక మహోన్నతస్థితిని కల్పించిరి. ఇందు మూలమున నాటకారంభమునుండియు ప్రేక్షకుల హృదయమునకు నుత్సాహము చేకూర్చి ప్రదర్శనము నెడ సుముఖత్వము కలిగించుటకు చక్కని యవకాశము నాపాదింపఁ గలిగిరి. నాటకము ప్రారంభించుటలోనే కవి ప్రతిభాసామర్థ్యములు వ్యక్తమగును. శ్రవ్య ప్రబంధములకు పూర్వకవిపరంపరాసమాగతమగుచున్న యే పుర వర్ణనయో మేలుబంతిగా తీసుకొని ప్రారంభించుటకు కొంత యవ కాశమున్నది. కాని దృశ్య ప్రబంధముల కట్టి యవకాశము లేదు. సంపూర్ణముగాఁ గవి తెలివితేటలమీద నాధారపడియున్నది.

ఏ ప్రబంధారంభము దానిది. ఒకరి నింకొకరనుకరించుటకు వీలులేదు. పాండవోద్యోగ విజయములు రెండు సర్వప్రేక్షక జన సమాకర్షణీయములగు రెండు ప్రత్యేక సంఘటనములుగల సన్నివేశ ములతో నుదాత్త పాత్రల ప్రవేశముచేత నారంభింపఁబడినవి. కావున నీ రెండు నాటకములు రంగస్థలము మీద నాదినుండియు రక్తికట్టుటకు సావకాశము లభించుచున్నది. అది తిరుపతికవుల నేర్పని యంగీకరింపవలయును అదియుఁగాక యారంభ పద్యములు విన సొంపయి మిగుల రసవంతములుగాను హృదయాకర్షణీయములు గాను వ్రాయబడినవి. అట్లు ప్రవేశించిన భీష్ముడు శ్రీకృష్ణుని యాధ్ధ త్యమును రెండు పద్యములలో నిట్లు వర్ణించెను.

తన కేలంగల పగ్గముల్ కశయు భద్రంబౌగతిన్ డాఁచి హు
మ్మని చక్రంబును గేలఁ గైకొని యధర్మారంభుఁడయ్యున్ సధ

ర్జుని౯ బార్థుం గెలిపింప నెంచి యచలంబుంబోని కౌంతేయుస్యం
దనమందుండి మృగేంద్రుభంగి ధరకుఙ్ దైత్యారి లంఘించెడిఙ్
వెనుకకులాగు బాహువులు బిగ్గఁగఁబట్టి ధనంజయుండు కో
పనుఁడు సుదర్శనాయుధుఁడు పార్థునితోడన వచ్చుచుండె ముం
దునకు మహోశుగోద్ధతిని దూగుచు సంభ్రమ సాంద్రభంగి ని
స్వనితముగాఁగ నేగుతటి సంయుతమాతరి యేపుదోఁపఁగఙ్

ఈ పద్యములందు శ్రీకృష్ణుడు పగ్గములు కళయుభద్రముగా దాచి చక్రమును కేలఁగైకొని కౌంతేయుని స్యందనము మీదనుండి భూమికి లంఘించుటయు నర్జునుడు బాహువులు వెనుకకు లాగి పట్టుకొనఁగా నౌద్ధత్యమున ముందునకు తూగుటయు చలనచిత్రము నందువలె పాఠకుని కనులకు గోచరమగునట్లు వర్ణింపఁబడినాడు. ఇట్టి చిత్ర రచనా శిల్పము నాటకములందు నెందును గనిపించదు. ఆ శిల్పమును రెండు పద్యములందలి యలంకారము లలంకారములై మరింత విస్ఫుట మొనరించుచున్నవి. పోతనగారి భాగవతములోని

కుప్పించి యెగసిన కుండలమ్ముల కాంతి
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ

ఇత్యాది సీసపద్య ముత్తమములైన పద్యములలో నొకటిగా రసజ్ఞులగు పండితకవులు తలంతురు. దానియం దీ నైసర్గిక చిత్ర రచనా శిల్ప వైశద్య మంత గోచరించదు. తిక్కనగారు శిల్పకవితయందు పేరుమోసిన మహాకవి. ఆయన "చక్రంబు గైకొని దక్షిణకరంబున నమర్చి పేర్చి యుగ్యంబుల పగ్గంబులు నొగల ముడిచి యరదంబు డిగ్గనురికి.

అవని కంపింప లలిత పీతాంబరంబు
చెఱఁగు దూలఁ జక్రాంశులు దుఱఁగలింప
సింహనాదంబు క్రోధరంజిత భయంక
రాననంబునఁ జెలఁగంగ నడరెఁ బెలుచ.

అర్జునుండు రథయంబున రంబు డిగ్గనుఱికి పరచి పురుషోత్తము పిరిందిదెసం గ్రుచ్చిపట్టిన...'' అని వర్ణించినాడు. తిరుపతికవుల రెండు పద్యములలోనున్న ఆ వేగము పదగుంభనము వర్ణనా వైశద్యము తిక్కనగారి యీ రచనలో లేదు. తిక్కనగారిని తిరుపతి కవులు మించిపోయిరనిన నతిశయోక్తి కాజాలదు.

గంగానందనుగూల్చి ద్రోణుపని సక్కంజేసి కౌరవ్య వీ
రాంగంబుల్ నుఱుమాడి తత్ప్రబల సైన్యంబెల్ల మాయించి యి
త్తుం గాంతేయుల కిమ్మహీవలయమున్ దుర్దాంత చంచద్భుజా
సంగస్ఫూర్జిత చక్రవిక్రమ కళా సంక్రీడ నోన్మాదినై

అని తిక్కనగారి పద్యము

గాంగేయుం బరిమార్తు మొట్టమొదటన్ ఖండింతు నామీద దు
స్సంగున్ ద్రోణు వధింతు నా పయిని నశ్వత్థామ నా వెన్క న
య్యంగాధీశు గతాసుచేయుదు సహోదర్యంబుగా రాజు ను
ర్వింగూల్తున్ వెనువెంట నిత్తు నవనిన్ వేయేల నీ యన్నకున్

తిరుపతికవుల యీ పద్యములోని యందచందములు సరళత్వము పై పద్యమునందు లేవు. తిక్కనగారు పాదపూరణ కొరకు చివర వేసిన సమాసము నిరర్థకమని యెట్టివారికైన నీ పద్యము చదివిన మీఁదట తోచకపోదు. మోక్షప్రదుండును త్రిలోకైక వీరుండును మూర్తిత్రయ స్వరూపుండును నగు శ్రీకృష్ణుని తన శరవిద్యా పాండిత్యముచేత నొంచియు కావలయునని కయ్యమున కవ్వించి యుద్రేకమున మీఁదికి వచ్చుచున్న హరి సంరంభమును వింతగా చూచుచు నానందోత్సాహములు ముప్పిరులు గొన భీష్ముండు

నేఁడుగా నా ధనుర్నిగమంబు లోకైక
విఖ్యాతమయ్యె సంవిత్స్వరూప
నేఁడుగా నా జన్మ మీఁదులేని యశం బ
జాండంబు నిండించె దండితారి

నేఁడుగా నా శాహునాడులఁ బ్రవహించు
రక్తంబు శక్తంబు ముక్తగేయ
నేఁడుగా శంతను నృపతివరేణ్యుండు
పుత్రవంతుం డబ్ధి భూకళత్ర
నేఁడుగా నిర్జరాపగ సిక్కమైన
వీరమాత ప్రఫుల్ల దంభోరుహాక్ష
రమ్మ దయసేయు మిటు వేగిరమ్మ సంగ
రమ్మ తీర్పుము భూమిభరమ్ముతోడ

అని ప్రబోధము గావించెను. ఈ పద్యములో ప్రతిపాదము నందు వీర రసము నంతర్విలీనము గావించుకొని భక్తిరస ముబు కెత్తుచున్నది. దీనిని చదువునప్పుడు తాను భీష్ముఁడై భక్తిరసావేశమున నోడలుప్పొంగ నానందోత్సాహములతో మేనుమరచి ప్రమోదాశ్రువులను విడువని వారుండరు. ఈ పద్యమును దీని తరువాతి 'దయచేయం గదవయ్య కృష్ణ' అను పద్యమును త్రిజగత్కళ్యాణ స్వరూపుండగు శ్రీకృష్ణుని కనులయెదుట సాక్షాత్కరింపఁ జేసుకొని యమితభక్తి రసావేశమున పరవశత్వమును బొంది తిరుపతికవులు విరచించి యుందురు. లేనిచో నంత రసవంతముగాను, హృదయంగమముగాను కుదురవేమో? ఈ పద్యములే కావు, ఈ యంకము నందలి పద్యములన్నియు ప్రతిపదరమణీయకములయి రసము తొణికిసలాడుచున్నవి. తిక్కనగారికిఁగూడ యిటువంటి కవితాపాటవము లేదనిపించు ఘట్టములు పాండవ విజయమునందు చాలగలవు. వానిలో నభిమన్యువధ ఘట్ట మొకటి. ధర్మరా జభిమన్యుని రావించి

కయ్యముసేయ రమ్మని త్రిగర్తులు పిల్వఁగ గెల్వఁబోయె మీ
యయ్య, గురుండుజేని కభయంబిడె నన్గొని తెత్తునంచుఁ దా
నొయ్యన, నెందుఁజొత్తుఁ బ్రబలయోగ్రుఁడనంగ వెలుంగుచున్న వా
డయ్యనఘాత్ముఁ డేది తెరువయ్య వచింపుము మాకుఁ బుత్రకా!

మాకెవ్వారి కభేద్యమైన యొక పద్మవ్యూహముం బన్ని క
న్నాకై వాకిలి గాచియుండె గురుఁడన్నా! యెట్లు పోనేర్తు మే
వీఁకం గెల్చెద మింతసేపు సమరోర్విం గ్రీడియుం గృష్ణుఁ డుం
డీకోకుండిన యుత్తదే యను వదంతిం బాపి కాపాడుమా.

అని యంకారంభమునం దీ రెండు పద్యములలో నప్పటి పరిస్థితి చక్కఁగా నిరూపించి చెప్పెను. అంతలో భీముఁ డందుకొని యన్నమాట లివి

పెనుగదఁబూని శత్రువుల బిప్పి యొనర్చుట తప్ప యెన్నఁడుం
బనివడి యిట్టి వ్యూహములు పన్నుట విప్పుట యేనెఱుంగ నా
కనువుగ వాఁడి సూది మొనయంత కదిల్చితివేనిఁ జొచ్చి య
మ్మొనఁ గలగుండు వెట్టి పడమొత్తెద మత్తగజంబు చాడ్పునన్

ఈ పద్యమునందు భీముని యమాయకపు బోళాతనంపు మాటల విధంబునకు నవ్వువచ్చును. ఇందు వీర హాస్య రసములు ముప్పిరిగొని యున్నవి. పిప్పి యొనర్చుట, పన్నుట, విప్పుట, వాడి సూది మొనయంత, పడమొత్తెద అను దేశీయములగు వాడుకపదము లుపయోగించుటచేత పద్యమునకు మరింత రసపుష్టి వాటిల్లినది. ఇట్లే

అంచిత సత్త్వతా మన మహారథు లీరును నాల్గుప్రక్కలం
బొంచి కుమారునేమరక ప్రోచుచుఁ దామర మొగ్గరంబు వోఁ
జించిన వెంట వే రిపులఁ జిందరవందర చేసి మూట ద
క్కించుఁడి క్రమ్మర న్సుతునిఁ గృష్ణసహోదరి కప్పగించుఁడీ

"ఇందు చిందరవందర చేసి మూట దక్కించుఁడి" యను దేశీయమగు వాడుక పదమును వాడుటచేత పద్యమునకు మరింత శోభ కల్పించినది. ఇది వీరి పద్యములలోనున్న గొప్ప విశేషము. ఏ పదము నే ప్రదేశమునం దుపయోగించిన నెట్టి రసపుష్టియు రమణీయతయు కలుగునో తిరుపతి కవులకు బాగుగా తెలియును. అంతే కాదు. ఏ పదము నే విధముగా వాడిన భావోద్రిక్తత విశేషార్థము వాటిల్లునో వారికి హృదయగతమే. ఈ పద్యములో "కృష్ణ సహో

దరి కప్పగింపుడీ'' యనుటయందు విశేషార్థమున్నది. కృష్ణుడు పాండవులకు మాన్యుడు. అందు మూలమున నభిమన్యుడు ప్రాణము కంటె మిక్కుటముగా సంరక్షణీయుం డని సూచితార్థము. తిరుపతి కవుల పద్యములందు జాతీయములగు వాడుక పదములు ధారాళముగా దొరలుచుండును. వానితోపాటు వైకృతపదము లంటిపెట్టుకొని యుండును. అందుమూలమున శయ్యలో సౌలభ్యము వాటిల్లినను బిగువు సడలకుండును. నీరసత్వముగాని బెండుతనముగాని రచన యందు మచ్చునకైన గోచరింపదు. ధర్మరాజు అభిమన్యునితో

దగ్గర లేరు మామయును దండ్రియు ద్రోణునితోడి పోరు కాఁ
దగ్గది భార్య గర్భవతి తల్లి సుభద్ర త్వదేక పుత్ర నీ
పగ్గె నిరంకుశంబు పసిపాపవు పాపులువారు మేనికిం
గగ్గురుపాటు పుట్టెఁ గొడుకా! నిను యుద్ధముసేయ పంపఁగన్

అని కన్నీరు పెట్టుకొనును. ఆ కన్నీరు ధర్మరాజున కేకాదు. ఈ పద్యము చదివినవారికి వినినవారికిఁగూడ కన్నీరు వచ్చును. ఇందు వాడిన పదములన్నియు వాడుక పదములు. విద్యావిహీనులకుఁ గూడ నర్థమగునవి. అందు ''పగ్గె''యను వికృతి చక్కగా అతుకు పడినది. ''కొడుకా!'' యను సంబోధనలో శోకరస ముప్పొంగి యుత్తరంగితమయి హృదయమునుండి వెళ్ళుకొని వచ్చి కన్నీటి రూపమున నయనములనుండి విగళితమగును. ఆ పదముతప్ప నింకొక పదమేది యచ్చట వాడినను ఆ రసోద్రేకము కలుగనీయదు. ఆ పదమింకొకచోట వాడినచో హాస్యాస్పదముగా నుండును. ఈ పద్యమును గురించి ప్రస్తావించుచు ''ఈ పద్యమును నేను దినమునకొక్క సారియైన తలంపక నిద్రపోను. ఇన్ని సంగతుల నొక్కచోట చేర్చి యింత రసవంతముగా పద్యమును రచించిన కవి తెనుగునందు లేడు'' అని కాశి కృష్ణమాచార్యులవారు ఒక సభయందు వచించిరి. వీరి పద్యరచనా వైదుష్యమునకు

కులము చెఱుపంగ నూర్గురు కొడుకు లేల?
యొకడు చాలఁడె నీ వంటి యుక్కలుండు

ఊర కుక్కలు పదివేలు చేర నేల
చాలదే వేటకై యొక్క జాగిలంబు

అను నీయొక్క చిన్న పద్యము దృష్టాంతముగాఁ జూపినఁ జాలును. ఇది దుర్యోధనాదులను దృష్టియం దుంచుకొని వ్రాసిన పద్యము. ''నూర్గురు కొడుకులేల'' అనుటచేత వంశనాశకులు ధార్త రాష్ట్రులనియు వ్యంజిత మగుచున్నది. అటువంటివా రుండి ప్రయో జనము లేదని వ్యంగ్యముగా చెప్పఁబడినది. చివరి రెండు పాదము లందు మనోహరమగు దృష్టాంతము కలదు. ఈ యంకమునందలి యంద చందము లెంత చెప్పినను తరుగునవికావు. తరువాత కథా భాగము ధర్మరాజు శోకము, అర్జునుని విలాపము. దీనిని రంగస్థలము మీఁద ప్రదర్శించునపుడు కంటనీరు పెట్టనివారుండరు. అది నటకుల యభినయ చాతుర్యము కాదు. ఆ పద్యము లన్నియు నటువంటివి.

ధర్మరాజు—

చదువు చెప్పుమనుచు సంధ్య నేర్పు మటంచు
వేఁడి యప్పగించినాఁడ నాడు
చంపుమంచు నొద్ది కంపించినాఁడ నేఁ
డౌర! నీకుఁ జేతులార గురుఁడ!

ఎంత హృదయ విదారకమైనదో యెంత స్వభావసిద్ధమైనదో పద్యము చదువరులు గ్రహించుకొనఁగలరు. అర్జునుడు

గాసిలి యుండియుం గరుడు గట్టిన నెత్తుటిలోనఁ బ్రాణముం
బాసియు వానికాంతి కనుమాయదు నిక్కము వీసమేని రా
కాసులు నాల్గు వంకల వికావిక నవ్వఁగఁ జంద్రమండలం
బేసరిపోవు వానిమొగ మేగతి బూడిదఁదోగి యున్నదో

అకటా! దిక్కటివోయెనే హరికి మేనల్లుండు గాండీవి పు
త్రకుఁ డాచార్యునకుం బ్రశిష్యుఁ డఖిలాస్త్రజ్ఞాత గీర్వాణ నా
యక పౌత్రుండువిరాటుపెండ్లికొడుకన్యాయంబు గొంతమ్మ కో
రిక లిట్లాఁడివో సుభద్రకెదఁ గార్చిచ్చింత దా కొల్పుచున్

తిక్కనగారు ఈ సందర్భమున

కటకట పేరిన పెన్నె
త్తుట జొత్తిలియున్న మేనితోఁ గొడుకే చ
క్కటిఁ బడియున్నాడో...

పడియుండి వాఁడిలఁ బొడిచిన చందురు
క్రియఁ దత్తలము వెలిఁగింప కున్నె

మేనల్లుఁడు గొంతికూర్చు మనుమం డస్మత్తనూజుండు సం
గరకేళీ నిపుణుండు దివ్యశరశిక్షాశాలి యవ్వీరు నె
వ్వారొకో నేలకుఁ దెచ్చి రొక్కరునిచే వాఁడేల చిక్కుం బొరిం బొరిఁ
బెక్కండ్రురు విచ్చుచుం బొదువుచుం బోరాటగ ల్గెం జుమీ

తిక్కనగారి భావములే తిరుపతికవులు తమ పద్యములందు పొందు పరచిరి. కాని తిక్కనగారి పద్యములకంటె తిరుపతికవుల పద్యములు రసోత్కర్షతకలవి. వాని యెత్తుగడలో నొక యంద మున్నది. నడకలో సమైక్యతయున్నది. పోకడలో పొందికయున్నది. అది తిక్కనగారి యీ రచనయందు లేదు. ప్రారంభించినది మొదలు చివరివరకు పద్యము లొక్క రకముగా నడిపించినారు తిరుపతికవులు. తిక్కన రచనలో నా ధోరణి లేదు. అది నాటకము, నిది పురాణ మనికూడ మనము మనసునందుంచుకొనవలసి యున్నమాట నిజము. తరువాత ప్రశంసింపఁదగిన కథాఘట్టము కర్ణవధ. ఇది యారవ యంకమునందున్నది. ఇది మూడు భాగములు. శల్యుఁడు సారథియై కర్ణుని యుత్సాహము క్రుంగదీయుట మొదటిది. కర్ణునిచే పరాభవింప బడిన ధర్మరాజు నర్జునుడు పరామర్శించుట రెండవది. మూడవది కర్ణుని వధ. కర్ణకృతంబగు నవమానంబున ఖిన్నుడయియున్న ధర్మజు నరయఁ గృష్ణార్జును లరుదెంచిరి.

ధర్మజుడు——

అని యొనరింపఁబోవు సమయంబునఁ గర్ణుని గెల్చు వారలీ
మొన నెవరంచు నే నడుగ మోసము చేసె నితండు నేను నే

నని నను, లేకయున్న విపినాంతరభూమికి వచ్చి తాఁక నే
ర్చునె నిశితాంబకంబులును సూతకులీనుని పోటుమాటలున్

కొడుకల నిర్వారం గనియెఁ గుంతిమమున్ బయికాను పక్కటా!
పడుచయి పుట్టకేల మగవాడయి పుట్టెనొ పుట్టుఁగాక ము
న్నుడుఁగిన పుంస్త్వమేటికి బయల్పడెవో పడుఁగాక యూర కీ
బడుగు కరంబు గాండివము పట్టఁగ నేటికి చెప్పు మచ్యుతా!

అని దెప్పరములాడెను. తిరుపతి కవుల సరళమగు పద్య రచనకు ప్రసాద గుణమునకు నీ రెండు పద్యములు తార్కాణములు. వారి రచనలలో ననౌచిత్యము మచ్చునకైనఁ గనిపించదు. తిక్కన ఈ సందర్భమున

గొంతి కడుపునందు కొడుకుఁ జూలై నీవు
దోపకుండవైతి తోఁచినట్టి
పిండ మెడలి యైనఁ బిదప దిగంబడ
దయ్యె నింత పుట్ట దట్టులైన

అని నిందించెను. ఇట్టిమాట ధర్మరాజువంటివాని నోట రాఁదగినది కాదు. అట్టి యనౌచిత్యమును బరిహరించి "కొడుకుల నిర్వరం గని యెఁగుంతి"యను పద్యమును రచించిరి. తిరుపతికవుల లేఖిని యన్ని రకముల కవితారచనయం దారితేరిన ప్రౌఢసాధనము.

ద్యూతములోన రాజ్యము సుయోధనుపా లొనరించికాదె నా
వ్రాతము లేలఁ బోయిన గరాసవు నీ వనికేగ నేల రా
ధా తనయాశుగోత్కర విదారిత విగ్రహ తాగ్రహంబునన్
నీతి దొరంగనేల నను నెట్టనఁ దిట్టఁగ నేల ధర్మజా!

అని యర్జునుఁ డన్న మాటలివి. పై పద్యములకు దీనికి రచన యందు చాల తారతమ్య మున్నది. పై పద్యములందు ప్రసాదగుణము పాటింపఁబడినది. ఇం దోజోగుణము విరాజిల్లుచున్నది. మొదటి రెండు పాదములందు వాడినవి పొడిమాట లైనను సెలయేటి నీటి

ప్రవాహమువలె ధార పరుగులు వారి మూడవ పాదమునందు సుదీర్ఘ సమాసముతో బలుపుమీరి నాల్గవ పాదమున సమతలమునకు వచ్చి చేరినది. మూడవ పాదములోని సమాసఘటన యతి రమణీయమయి పద్యమునకు నర్జునుని మనస్సుతోపాటు దూకుడు కల్పించినది. ఇట్టి దూకుడు "సంధియొనర్తు మన్నను దిసంతులుకొట్టినవారు లేరె" యను పద్యమునందు గూడ గోచరించును.

రసమునకు భావమునకు ననుగుణమగు ప్రాసమును ప్రారంభమున కూర్చుకొనుటలో తిరుపతి కవులు మహా నిపుణులు. వాని కనుగుణములగు పదములు సైతము వెంబడి నేను నేనని పరుగెత్తుకొని వచ్చుచుండును. వానికొరకు తడుములాడుకొనవలసిన పని లేదు. అందుకనే వారి కవిత్వ మంతధారాళముగా నుండును. "వృద్ధుండౌ నలజామదగ్న్యుఁ డనుకొంటే" యను పద్యమునం దీ సంగతి పరిస్ఫుటముగా గోచరించును. రసభావములనుబట్టి పదములు మారిపోవుచుండుట వీరి రచనలో నొక గొప్ప విశేషము. ఇది ప్రత్యేకించి పాండవ విజయమునందు గానవచ్చును. ఏడెనిమిది యంకములు దుర్యోధనుని వధాఘట్టము. దుర్యోధనుడు ద్వైపాయన హ్రదమునందు దాగియుండెనని యెరింగి పాండవులు శ్రీకృష్ణునితో నచటికి వచ్చిరి. ధర్మరాజు

చతురంభోధి పరీతమైన ధరణీ చక్రంబు శాసించి భూ
పతి వర్గం బరిగాపులై కొలువ సేనానమ్రరాజేంద్ర మౌ
ళి తలాలంకృత రత్నదీధితి సరోలీనుండవై యుండు నీ
స్థితి యీ రీతిగ నేటికిం బరిణమించెం గాదె దుర్యోధనా!

చచ్చిరి సోదరుల్ సుతులు చచ్చిరి చచ్చిరి రాజులెల్ల నీ
కచ్చకు మూలకందమగు కర్ణుడు మామయుఁ జచ్చి నీ గతిం
బచ్చని కొంప మాపితివి బాపురె! కౌరవనాథ! నీ నగం
బిచ్చెద జీవితేచ్ఛ గలదేని బయల్పడు మయ్య గ్రక్కునన్

అని చెప్పెను.

ఇవి రెండు రకముల రచనలుగల పద్యములు. అందు మొదటిది సమాస సంఘటితము. రెండవది శిష్టజన వ్యవహార సిద్ధంబులగు చక్కని జాతీయ పదముల తోడి కూర్పు. రెండు రచనా పద్ధతుల యందు తూర్పు పడమరలను చూచుచుండును. ఐనను ధారావాహిక యం దేమాత్రము కుంటుపడక యేకధాటిగా సాగిపోయినవి. ఏ రకపు రచనయందైనను తిరుపతి కవుల పద్యములం దొక ప్రత్యేకత కనిపించును. దానినిబట్టి యిది తిరుపతి కవుల పద్యమని చదువగానే గుర్తింపవచ్చును. ఇది మహాకవుల కవిత్వమునం దుండు ప్రత్యేక లక్షణము.

ఎవరయినను ప్రస్తుత కాలమున దేశీయములగు పదముల కూర్పుతో రసవంతముగా ధారాళమగు కవిత రచించినచో "తిరుపతి కవుల రచనను బోలియున్నద"ని యనుట సహజమైనది. రచనలో నిట్టి ప్రత్యేకత నన్నయ తిక్కన పోతన శ్రీనాథులకు మాత్రమే కలదు. కావుననే యాధునిక సాహిత్యయుగమునకు తిరుపతి కవులు సృష్టికర్తలయిరి. "తిక్కనగారి రచన మా కాదర్శమ"ని వేంకట శాస్త్రిగారు వారి కథలు గాథలలో చెప్పుకొనిరి. కాని తిక్కనగారి కవితకు తిరుపతి కవుల కవితకు, పోకడల పద్ధతులలో చాల తారతమ్యము కనిపించుచున్నది. తిక్కనగారి కవిత తద్భవ తత్సమపదములతో వైకృతపదములు కలయ కలుపుచేత నొక విశిష్టత్వము సంపాదించుకొనినది. సమాస సంఘటనమునందు నన్నయగారి సమాసముల పొందిక సరళతయుండదు. తిరుపతికవుల కవిత్వము జాతీయములగు వాడుకపదముల తోడి వైకృత తత్సమ పదముల పొందిక కలిగి యుండును. సమాసరచనయందు నన్నయగారి రచనలలో సరళత్వము చాలవరకు పుణికిపుచ్చుకొని నట్లుండును. నన్నయగారి సాపుతనము తిక్కనగారి కలయ కలుపుతనము. జాతీయములగు శిష్ట వ్యావహారిక పదములతోడి సమైక్యత కలిగి తిరుపతి కవుల కవితారచన సాగిపోవుచుండును. మచ్చున కీ పద్యము గ్రహింపవచ్చును.

దంభము పన్ని సంగర పదంబు తొలంగి హ్రదంబునన్ జల
స్తంభన విద్య డాగినను జావక యుందువె మూఢుఁడా! జలో
జ్జృంభణఁ జేసి జాలరులు చేపలఁ బట్టినరీతి గాదురా
లంభుని నిన్ను నా భుజబలంబున నే డెటులేనిఁ బట్టెదన్

భారతమునందు ధర్మరాజొకఁడే దుర్యోధను నుపాలంభించి నటుల నున్నది. ఈ యంకమునందు పాండవులైదుగురు దుర్యోధనుని దెప్పి పొడిచిరి. దుర్యోధను డభిమానవంతుడు. మడుగు వెడలివచ్చెను. "ఇందు దుర్యోధనుని పాత్ర చక్కగాఁ బోషింపఁబడినది. ఆయుధంబులు లేవనియు నేకాకి యనియు శంకించుచున్న దుర్యోధనునకు "ఇవిగో నీ యిచ్చవచ్చిన యాయుధములు గైకొని మాయేవురలో నీ యభిమతంబగు వానితోఁ గయ్యమొనర్పు" మనెను. దుర్యోధనుడు "ఔరా! ధర్మపుత్రుని న్యాయాతిశయము. తన్నొకవలనోవివ్వచ్చునో గదా యుద్ధమునకుఁ జేరొకనిన నాకు గెలుపు సులభముగదా! ఛీ! నేనేల వారిపేరులు తలపెట్టవలయును. చచ్చిన భీముని చేత నే చావవలయును. కడతేర్చిన వానినే కడతేర్చవలయును" అని తలంచెను. నిజమునకు దుర్యోధనుని తలంపు విజయసాధనమే. కాని యభిమానము కవలనుగాని యర్జునునిగాని ధర్మజునిగాని పేరొకనసీయలేదు. తొలుతనుండియు తనకు భీమునిమీద వైరము కలదు. చంపినను చచ్చినను భీమునివల్లనే జరుగవలయునని వాని నిశ్చయము. ధర్మజుమీద గౌరవము భీమునియెడ వైరము ఈ తలంపునందు వ్యక్తమగుటయేకాక దుర్యోధనుని స్వాభిమానము మూర్తీభవించిన ప్రతిబింబితమగుచున్నది. అంతలో బలరాము డచటకివచ్చెను. వానికి దుర్యోధనుడు నమస్కరించుచు నిట్లనెను.

కొడుకులఁ దమ్ములం గదనకోవిదుఁ బ్రాణసమానుఁ గర్ణు వృద్ధుఁడయిన యాపగాతనయు ద్రోణునిఁ దక్కిన యుక్కడీంద్ర నెవ్వడు పొలియించి తా మిగిలెఁ బాపభరంబునఁ జావకుండ నొక్కఁడగుచునా సుయోధనుఁడుకైకొనుమాకడసారిమ్రొక్కెడున్

ఇది హృదయ విదారకమగు పద్యము. ఇది చదువుచున్నప్పుడు దుర్యోధనునెడ జాలి జనింపనివా రుండరు. 'కడసారి క్రొమ్మెక్కెదన్' అను నప్పుడు కన్నులందు నీరు తిరుగును. ఈ పద్యమునందు దుర్యోధనుని పశ్చాత్తాపము బంధుమిత్రప్రీతి యావేదన గురుభక్తి తొణికిస లాడుచున్నవి. ఇంత రమణీయముగా నీ పద్యమిట్లు వ్రాయఁగలుగుట తిరుపతి కవుల కళానైపుణ్యము.

భీముడు—

ద్రౌపది కట్టుచీరలు సదస్సున డుల్చిన యన్నదమ్ములం
బాపులఁ జంపఁగాఁ బ్రతినపట్టి సహోదరు ముందుఁ జంపి సం
తాపము కొంత తీర్చుకొని న్యాయముగాఁ బెరవాని జీవముం
బాపఁ దలంచు పావని నమస్కృతిఁ గైకొను మచ్యుతాగ్రణీ!

యని నమస్కరించెను. ఇందు విజయోత్సాహమున మేనెరుంగక మత్తమాతంగమువలె తన ఘనకార్యమున కుప్పొంగి విజృంభించుచున్న భీముని గర్వాతిశయము దుర్యోధనునిపైఁ గసితీర్చుకొన నుద్దేశించు సమరోత్సాహము నుబికిసలాడుచున్నవి. ఈ రెండు పద్యములు నా యా పాత్రల మనః ప్రవృత్తులను ప్రతిఫలింపఁజేయు రసవంతములైన రచనలు. వీనివలన తిరుపతికవుల పద్యరచనా వైదగ్ధ్యమును సంపూర్ణముగా గ్రహించుకొనవచ్చును. వారి భావ ప్రదర్శనము లా యా పాత్రల యాంతరంగిక ప్రవృత్తులకు ప్రతిబింబములై యుండును. ఇట్టి రచనలు ఇతరకవులం దగుపించవు.

పాండవనాటకములలో చివరిది పాండవాశ్వమేధము. ఇది యారంకముల నాటకము. ఆశువుగా రచింపఁబడినది. ఇందు సౌప్తిక పర్వము ద్వితీయాశ్వాసము మొదలు స్త్రీ శాంతి అనుశాస నాశ్వమేధపర్వములలోని కథ కలదు. ప్రథమాంకమునందు సౌప్తిక పర్వములో ద్వితీయాశ్వాసము 38 వ పద్యము నుండి 105వ పద్యము వరకు కథాభాగము. అశ్వత్థామ యుప పాండవాదుల సమయించి యస్త్రపరిత్యాగము చేయుటయు, భీమార్జున శ్రీకృష్ణులు వెదుకుచు

వచ్చి తపోనిష్ఠుండగు నశ్వత్థామను గాంచుటయు, నశ్వత్థామ బ్రహ్మ శిరోనామకాస్త్రము విడుచుటయు మొదలుగాఁగల కథ కలదు.

రెండవ యంకమునందు స్త్రీపర్వములోని విదురుడు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనము గావించుట, వ్యాసాగమనము, గాంధారీ ధృతరాష్ట్ర విదురులు పొలికలనికరుగుట, గాంధారి శ్రీ కృష్ణుని శపించుటయు, యథామూలముగా రచింపఁబడినవి. తృతీయాంకమున శాంతి పర్వములోని ప్రథమాశ్వాసము కథ. నారదుడు కర్ణుని వృత్తాంతము వినిపించుట, ధర్మరాజు మనస్తాపము, తమ్ముల యోదార్పు, భీష్ముని యాదేశంబున ధర్మజుడు పట్టాభిషేక మొనరించుకొనుటకు కృతనిశ్చయుండగుటయు కలదు. నాల్గవ యంకారంభమునందు నొక కవి రంగస్థలము మీదికి వచ్చి

ఎక్కడి కేగినన్ శిశువులే నృపతుల్ కవితా రసాయనం
బెక్కడ కుబ్జలెక్కడ యినీ యిటు లందఱి రాజులన్ యశో
భాక్కుల దాతృతాఖనుల పాండవులేమని చంపిరోకదా
యక్కట సత్కవీశ్వరులకన్న మికేగతి కల్గఁగావలెన్

అని తలంచును. ఇందు మూలమున భారతఘోరరణమునందు పెద్దలగు రాజులందరు పూర్తిగా మరణించిరని సూచింపఁ బడినది. అతడు ధర్మరాజును జనులందఱు వినుతించుట యాలకించి ధర్మరాజును దర్శింప తలంచి యొకపద్యము విరచించును. ఆ పద్యమిది

కృతయుగమాది నిప్పటికి నెందఱు రాజులు గారు రామ భూ
పతి యొకరుండు దక్క నినువంటి నృపాలకులేరి? యాతఁడుం
ప్రతియని చెప్పఁజాల మొకపట్టున నింతటి భాగ్యశాలివై
క్షితి నలరించు నీకు దయసేయుత మాపతి సర్వసౌఖ్యముల్

దీనిని తిరుపతికవులే వ్యాఖ్యానించిరి. "రామునంత రాజు ధర్మరాజు. రాముడు కృతయుగములోనివాడు. వాని చరితము వాల్మీకి రచించెను. తరువాత అంతటిరాజు ధర్మరాజు. ఆయన ద్వాపరాంతమందు నివసించెను. ఈ నడుమ యంతటి రాజు లెవరు

లేరు. వీని చరితము వ్యాసుడు వ్రాయఁగలడు'' అని. ఇచట నీ పాత్రను ప్రవేశపెట్టుట ధర్మరాజు భీష్ముని దర్శింప నరిగెననియు, భీష్ముడా దినమున స్వర్గతుడు గాగలడని సూచించుటకే. రాబోవు రంగమునందు భీష్మ నిర్యాణము ప్రదర్శింపఁబడును. కావున ఈపాత్ర వలని ప్రయోజనము అంతగా గానరాదు. ఈ పాత్ర లేకున్నను నాటక కథా సమైక్యతకు లోపము గలుగదు.

తరువాత రంగమునందు అనుశాసనపర్వము 5 వ యాశ్వాసము 450 మొదలు 463 వ పద్యమువరకుఁగల భీష్మనిర్యాణము కథయు 374 మొదలు 481 వరకుఁగల గంగావిలాపము కథయు గలదు. మరణ యుద్ధాదులు రంగస్థలమునందు చూపింపరాదు కనుక శ్రీకృష్ణ విదురులు భీష్ముడు యోగప్రభావమున ప్రాణములు విడుచుటయు బ్రహ్మరంధ్రమునుండి తేజము వెడలుటయు సంభాషణ మూలమున వివరించిరి. తరువాత గంగాదేవి ప్రవేశించి భీష్ముని మరణమునకు విలాపించును. అర్జునుని ''నా యుసురు మిన్నకపోదు నరుని శిరము కోలఁదికాలమ్ము నన్ద్రెళ్ళగలదు'' అని శపించెను. వ్యాసకృష్ణుల వచనములచేత గంగ తేరుకొన్నది. 'మృతిగని యొకింత లోపల బ్రతుకున్' అని శాపాంతము ప్రసాదించినది.

ఈ శాపములోని తత్త్వము శ్రీకృష్ణవ్యాసులకు తెలియును. విదురుడు తన దివ్యదృష్టిచేత గ్రహించెను. బంధువధ వలని జనితంబైన పాపము తొలంగుటకు నశ్వమేధయాగ మొనరింపుమని ధర్మజునకు గంగ యుపదేశించును. విదురుడు సంగతిని గురించి గంగను ప్రశ్నించెను. ఆమె ''పాండవాగ్ర జన్ముండును నీవును ధర్మాంశ సంభవు లగుటంజేసి నీ తేజ మమ్మహాత్మునియం దైక్యంబు పొందఁ గలదని నుడివెను. వ్యాసుడు ''మాండవ్య శాపమున ధర్మరాజు నీవై జన్మించితివి''

''కొండొక కతమున మాండ
వ్యుం డాగ్రహమంది ధర్మునాగి శపియించెన్

దండధరుఁడు దాసీ పు
త్రుండై నాకతన నిట్లు తోఁచెను వత్సా!''

అని మిగిలిన సంగతి వెల్లడించెను. ఈ కథా విధానమునందు తిరుపతికవులు కొంతమార్పు గావించిరి. గంగాదేవి యర్జునుని శపించి నట్లు జైమిని భారతమందున్నదిగాని భారతమునందు లేదు. వ్యాసుడు ధర్మరాజుతో నశ్వమేధయాగము చేయుమని చెప్పినటుల భారత మందున్నది. ఈమార్పు సమంజసముగా నున్నది.

తెలుగు నాటకములో నంతర్నాటకము కల్పించినవా రెవరు లేరు. సంస్కృతమునందు భవభూతి యుత్తర రామచరిత్రలో రాముని మనస్తాపము వారించుటకు కుశలవుల జన్మవృత్తాంతమును సూచించుచు నొక యంతర్నాటకము కల్పించెను. దానిని దృష్టియం దుంచుకొని తిరుపతికవులు పాండవాశ్వమేధములోని షష్ఠాంకమునం దొక యంతర్నాటకము వ్రాసిరి. అర్జునుడు సవనాశ్వము వెంట నరి గెను. వానిని గురించిన వార్త తెలియరాలేదు. ధర్మజునకు విచా రముగా నుండెను. కాలయాపన కొరకు ధర్మరాజు సమక్షమునందు త్రికాలజ్ఞునిచేత రచింపఁబడిన యర్జున బభ్రువాహనుల యుద్ధనాట కము ప్రదర్శింపఁ బడినది. అందలి కథ యిది

అర్జునుడు సవనాశ్వము వెంట మణిపూరు నగరమున కరిగెను. బభ్రువాహనుడు తండ్రి కెదురువచ్చి నమస్కరించును. అర్జునుడు వానిని తూలనాడును. బభ్రువాహనుడు విచారముతో తిరిగిపోవు చుండెను. ఆ సమయమున నులూచి యెదురయ్యెను. బభ్రువాహ నుని యుద్ధమునకు ప్రేరేపించెను. బభ్రువాహనార్జునులకు యుద్ధము జరిగినది. అం దిరువురు మరణించిరి. ఉలూచి మణి ప్రభావమున నిరు వురను బ్రతికించును. భారతమునందు బభ్రువాహనుడు మూర్ఛపొంది నటుల మాత్రమే కలదు. మూర్ఛనుండి తేరుకొని బభ్రువాహనుడు పితృమరణమునకు విలపించును. మిగిలిన కథయంతయు భారతము లోని దున్న దున్నటుల గ్రహింపఁబడినది.

ఈ యంతర్నాటకమునకు నాంది ప్రస్తావనలుకూడ కలవు. ఇట్టి యంతర్నాటకము రచించుటలో ప్రత్యేకమగు ప్రయోజనము కలదు. యథారీతిగా నాటకము రంగస్థలముమీద ప్రదర్శించినపుడు రసానుభూతి ప్రేక్షకులకు మాత్రమే కలుగును. ఈ యంతర్నాటకము ధర్మజాదుల సమక్షమునందు ప్రదర్శింపఁబడినది. అందుమూలమున ప్రేక్షకు లనుభవించు రసానుభూతి ధర్మరాజాదులకుఁ గలుగును. అర్జునుడు పాండవులలో నొకడు. ఆ పాత్ర కొందవుమేలు కీళ్ళు తా మనుభూతి నొందుటవలన నా పాత్రయెడ ధర్మరాజాదులకుగల ప్రేమానుబంధము వెల్లడియగును. తన్మూలమున ప్రదర్శనము మరింత రసవంతము నాకర్షణీయమయి ప్రేక్షకుల హృదయమును సంపూర్ణముగా రంజించును.

అర్జునుని పాత్ర రంగస్థలముమీద ధర్మరాజు చూచెను. ఆయన ప్రాణములు లేచి వచ్చినవి. నిజముగా నర్జునుడనియే భావించెను. చిరవియోగముచేత నంతరంగమునందు తొణికిసలాడుచున్న విషాద మొక్కసారిగా నుబుకెత్తి పొంగులారి పొరలి ప్రవహించినది. "ఓహో! తమ్ముఁడా! నిన్నుచూచి యెంతకాల మైనదోయి" యని యనురాగాతిరేకమున వచించెను.

అర్జునుఁడు బభ్రువాహనుని తిరస్కరించెను. ధర్మరాజు ద్రౌపదితో "దేవీ! చూచితివా తమ్ముని యవివేకము. నేను చెప్పిన సంగతులను మరచినట్లున్నాడు. తనంతట తానే కయ్యమునకు దిగుచున్నాఁడు" అనెను. ద్రౌపది "యిది నాటకము" అని జ్ఞప్తి చేసినది. ధర్మరాజేకాదు. భీమాదులుకూడ నిట్టి భ్రాంతినే పొందిరి.

తండ్రి మాటలకు బభ్రువాహనుడు విషాదముతో మరలిపోవును. ధర్మరాజు "తండ్రి! కురు కులోద్భవుండ వగు నీ కిదియే యుచితము. ఎవ్వరో యొక్కడు తక్క మన వంశంబునం దవినీతులిప్పటికి జనింపలేదు" అని బభ్రువాహనుని నయగుణమును వంశోన్నతియుఁ బ్రశంసించెను. భారతయుద్ధమందు పెక్కుమంది రాజులు

మరణించిరి. బంధుక్షయమైనది. అందులకు ధర్మరాజు మిగుల విచారము నొందుచుండెను. అట్టి స్థితిలో

బభ్రువాహనార్జునులు యుద్ధమునకు సన్నద్ధులైరి. "ఇది యుచితము కాదని తమ్మునకు బోధింతునా" యనియు "ఓహో! చివికి చివికి గాలివాన యగుచున్నదే" యనియు "రణరంగమునకు ప్రారంభించినారు. నేనుబోయి వారింతు"ననియు మాటిమాటికి తనయావేదనము తత్తరపాటు వెళ్ళబుచ్చుచు వచ్చెను. ఇందుమూలమునధర్మరాజు నహింసాతత్త్వము సోదరప్రేమ బంధుప్రీతి వంశగౌరవము వ్యక్తమగుచున్నవి. యుద్ధములందనభిమతము వెల్లడగుచున్నది.

యుద్ధమునం దర్జునుని తల తెగినది. చిత్రాంగద మూర్ఛిల్లినది. ధర్మజాదులు మూర్ఛిల్లిరి. ఇట్టి యంతర్నాటకము మూలమున రెండు ప్రయోజనములు సాధింపబడినవి. కథావస్తువు సక్రమముగా ప్రదర్శించుట యొకటి. ధర్మరాజు నయవర్తనము పాండవుల సోదరప్రేమ వ్యక్తమగుట యొకటి. ప్రేక్షకులు రెండువిధముల రసానుభూతినిపొంది యమితానందము ననుభవింతురు. ధర్మజుని గుణములు హృదయగతము లగును.

తిరుపతి కవు లీ యంతర్నాటకమునందొక విమర్శకూడ చూపించిరి. అర్జునుని వేషధారణము నరసి ద్రౌపది తనలో "మూడుమూర్తుల నితడు నిజముగా పాండవ మధ్యమునివలె నున్నాడు. నాటకమైనను వేషము లిట్లుండిన నతిరమణీయముగా నుండును" అని ప్రశంసించినది. ఇందుమూలమున వేషధారణ పాత్రలనుబోలియుండవలయుననియు, నప్పుడే నాటకము రమణీయముగా నుండుననియు, కవులు నిరూపించిరి. భారతీయ సాంప్రదాయము ననుసరించి విషాదాంత నాటకములను పండితులు ఒప్పుకొనరు. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ" యనుటచేత కావ్యము శుభాంతముగా నుండవలయునని యాలంకారికుల యొక్కయు లాక్షణికులయొక్కయు మతము. కొందరు పాశ్చాత్య సాంప్రదాయముల ననుసరించి విషా

దాంత నాటకములు వ్రాసిరి. వారు లక్షణము తెలియని శుంఠలని తిరుపతికవులు నిందించిరి. చూడుడు.

మూర్ఛనుండి తేరుకొని భీముడు కోపమున సూత్రధారునుద్దేశించి "ఓరీ పండితమ్మన్యా! సూత్రధారా! యిట్టి దుష్టనాటక మెట్లు ప్రదర్శించితివిరా? ఇదిగో సీతల పగిలినది. చచ్చితివిరా! లక్షణజ్ఞానహీనులయిన శుంఠలు చెప్పిన నాటకము నాడి జగమును మోసము చేసెదవురా దురాత్మా! యని గర్జించును. లక్షణ జ్ఞానవిహీనులగు శుంఠలు రచించిన నాటకము లాడుట లోకమును మోసము చేయుట యని భీముని ముఖమున తమ యభిప్రాయమును తిరుపతి కవులు వెలువరించిరి. భీముని మాటలకు భయపడి సూత్రధారుడు ప్రవేశించి "ఇది మహాలక్షణ వేత్తలు త్రికాలజ్ఞులును నగు కైలాస శిరోమణి భట్టాచార్యులవారిచే రచింపఁబడినది. దేవర కోపముచే మధ్య నాటకము విరస మగుచున్నది. అనుగ్రహింప వలయును" అని మనవి చేసికొనును. ధర్మరాజు మూర్ఛనుండి లేచి "త్రికాలజ్ఞుఁడను చున్నాడు. ఇట్లు జరుగునని ముందే వాల్మీకివలె వ్రాసియుండును" అని తలంచును. ఎప్పుడో జరుగునని మును ముందెట్లు కవి వ్రాయ గలుగునను విమర్శకుల కిది సమాధానము.

ఈ యంతర్నాటకము ప్రదర్శనమునకు వీలుపడునా యను సందేహము పాఠకులకు కలుగవచ్చును. ప్రదర్శనమునకు దుస్సాధ్యము కావచ్చును. చదువుకొని యానందించి కవుల ప్రతిభా విశేషముల నభినుతించుటకు దుస్సాధ్యము కాదుకదా.

## ౧౧

## ఇతర నాటకములు

తెనుగు వాఙ్మయమునందు సుప్రసిద్ధ కవితల్లజుం డగు పింగళి సూరనార్యుడు విరచించిన ప్రభావతీ ప్రద్యుమ్నము ఉత్తమ కావ్యములలో నొకటి. దానిని దిరుపతి కవులు నాటకముగా రచించిరి.

ఈ నాటకమునం దయి దంకములు గలవు. దీనిని కోలంక వీరవరముల నేలు జమీందారు రాలు శ్రీరావు రామయాంబిక కంకిత మొసంగిరి. ఈ నాటకము రంభా నారదుల సంభాషణ రూపక మయిన విష్కంభముతో నారంభింపఁ బడినది. తరువాత అంకము నందు ప్రభావతి చెలికత్తెలతో వన విహారమునకు వచ్చును. అందరు నొక పొదరింటియందు కూర్చుందురు. ప్రభావతి రాత్రి తాను కనిన కలను చెలికత్తెలకు చెప్పును. చలిమల రాచబిడ్డ స్వప్నమందు తన కొసంగిన చిత్ర ఫలకము వారికి చూపును. "ఇప్పుణ్యా పురుషుని కుల గోత్ర నామాదులు నీ కచిర కాలంబుననే తెలియఁగలవు. ఇతండ నీ మనోహర విలాస సౌభాగ్యములకుం దగిన పెనిమిటి. ఇతని వలన నీకుం బొడమిన కుమారుఁ డీ వజ్రపురం బేలు" నని పార్వతి పలికిన మాటలను వినిపించును.

ఆ సమీపమునం దొక సరోవరము కలదు. అచటికి శుచిముఖి యను రాయంచ వచ్చుచు పోవుచుండును. అది బ్రహ్మ వాహనములలో నొక రాజహంసకు భార్య. దాని సహాయ మపేక్షించినా రా యువతులు. అది తన సామర్థ్య మిట్లు చెప్పు కొన్నది.

"చిన్నతనంబున సరస్వతికి శిష్యురాలనయి సంగీత సాహిత్యంబులు నేర్చితిని. వ్యాకరణంబుఁ జదివితిని. చదువుటయే కాదు, లక్ష్యలక్షణ చాకచక్యంబు నం దద్వితీయ ననిపించుకొంటిని. అది యునుంగాక"

"అర్థగంభీరంబులైన శబ్దముల పొం
  దిక ముత్యముల కోవ తీరు గాఁగఁ
దత్త్రదసోచిత తాత్పర్య పర్యాప్తి
  సురుచిరాలంకార శోభమాన
గుణ పాటవంబు దూషణ శూన్యతయుఁ బ్రౌఢ
  శయ్యా చమత్కార చతురిమంబు
వ్యంగ్య మర్యాదయుఁ బ్రతిభావిభావిత
  కల్పనా కౌశల్య గౌరవంబు

వెలయు నట్లుగ నాశు కవిత్వ మల్లు
టభ్యసించితి వాణి దయా విశేష
వైభవంబునఁ గొన్ని కావ్యములు గొన్ని
నాటకంబులు వ్రాసితి నవ్యఫణితి"

"నా కవిత్వంబునకు మెచ్చి సరస్వతియే బాల సరస్వతియను బిరుదం బొసంగి యీ గండపెండేరంబు కాలికిం దొడిగె. మఱియు రాజ రాజేశ్వరీ షోడశీ మహావిద్య నభ్యసించితి"

శ్రీకృష్ణుండు తమ తండ్రి వసుదేవునిచే యాగంబుఁ జేయించుచో శతావధాన విధానమునకై నన్నుఁ బిలిపించె. నేనును కొంత పరివారముతో

విద్వాంసు లనేకులు గల
తద్ద్వారక కేగి శతవధానముచే నే
తద్వాచ కాతురాళీ
మద్వర కల ధౌత బిరుద మాన్యత గంటిన్.

ప్రభావతి యామె చెలికత్తెలు దాని ప్రతిభాతి శయమునకు మెచ్చుకొని పార్వతి యొసంగిన చిత్రపటము చూపించిరి. "ఇందలి వీరాగ్రేసరు నున్కిపట్టు గని యీ వృత్తాంతముం దెల్పుమా" యని ప్రార్థించిరి. రాయంచ పడతి యంగీకరించినది.

పింగళి సూరనార్యుడు ప్రభావతీ ప్రద్యుమ్న కావ్యమునందు శుచిముఖి పాత్రను సృష్టించెను. సూరనార్యుడు కథాకల్పనలందు సుప్రసిద్ధుడైన కవి. శుచిముఖచేత దాదాపు కథ నంతయు నడిపించెను.

శబ్ద సంస్కార మెచ్చుటను జారఁగ నీక
పద మైత్రి యర్థ సంపదలఁ బొదల

నిత్యాది గుణములతో బలుక నేర్చిన పింగళి సూరనార్యుని శుచి ముఖికి నలినజు రాణి యుపమాతిశయోక్తి కామధేను బిరుద మిచ్చి తల్లిఖిత నూపురమును పాదమున తొడిగినది. తిరుపతి కవుల శుచి ముఖికి తమ పాండిత్యము శక్తి సామర్థ్యములు బిరుదము పొందు పరచిరి. దానికితోడు ద్వారవతియం దవధానము చేయునపుడు శుచి ముఖ కింకొక రాయంచ తోడుగా నిలచినదట. రెండవ యంకమున ప్రద్యుమ్నుని కలిసికొనునాటికి రెండవ రాయంచ ''యశఃకాయము మాత్రమే ప్రస్తుత మీ లోకమున నిల్చియున్న''దట. ఈ సందర్భ మున గౌతముడను ప్రద్యుమ్నుని నర్మసఖుడు

శతవధానంపు శకటమ్ము నతి రయమున
మీర లిరువురు నడుపు నా ధోరణి విని
యిచటి సత్కవి తల్లజు లెల్లఁ దలలు
వంచిరి నమస్కరించి నుతించి రెలమి

అని జ్ఞాపకము చేసెను. ప్రద్యుమ్నుడు

ఒండొరుల యాత్మలం గల యూహ లొండొ
రులు శ్రమమ్ము వినాగనె తెలిసికొనుచుఁ
బద్య సంపూర్తి యొనరించు భాగ్యమరసి
యిపుడు నిను మాత్రమే చూచు టెంత చింత.

అని విషాదము వెల్లడించెను. ఈ నాటకము వ్రాయు నాటికి తిరుపతి శాస్త్రిగారు దివగంతులైరని విశదమగు చున్నది. చివరి

రెండు పద్యములు తిరుపతి వేంకటేశ్వరుల శతావధాన విధానమును తెలుపుడు చేయుచున్నవి. ఈ విధముగా తిరుపతి వేంకట కవుల జీవితము లీ నాటకమునందు పొందు పరుపఁబడినవి. ఇది యీ నాటకమునందలి విశేషము. మూల ప్రబంధమునందు ప్రభావతీ సౌందర్యమును శుచిముఖి ప్రద్యుమ్నునకు వర్ణించి చెప్పను. నాటకమునందు పార్వతీదేవియే స్వప్నమునందు కనిపించి ప్రభావతీ చిత్ర ఫలకము ప్రద్యుమ్నునకు నిచ్చును. ఇందు మూలమున శుచిముఖి కార్యభారము. కొంత తగ్గినది.

మూడవ యంకమున ప్రభావతీ చంద్రావతీ గుణవతుల సంగీత నాట్యకళా పాండిత్యములను పరీక్షించి వారి గురువులగు రంభోర్వసుల కళానైపుణ్యము నిర్ణయించుటకు నారదుని వజ్రనాభుడు నియమించును. వజ్రనాభుని యానతి చొప్పున నారదుడు వచ్చును. నారదుని సలహా ననుసరించి కొలది దినముల క్రిందట శుచిముఖి ప్రస్తావించిన భద్రుడను నట శిఖామణిని తోడి తెచ్చుటకు శుచిముఖిని పంపును. నారదుడు నాట్యకళా పరీక్ష చేయుట తిరుపతి కవులు స్వయముగా సృష్టించిరి. మూలమునందు లేదు. నాల్గవ యంకమునందొక యంతర్నాటకము సృష్టింపబడినది. ఇది తిరుపతి కవుల కల్పనా వైదగ్ధ్యము. గద సాంబ ప్రద్యుమ్నులు ఇందు నటకులు. నాటకమునందు వజ్రనాభాదులకు క్రోధోద్రేకము కలిగింతురు. శ్రీకృష్ణుడనిపిన చక్ర సహాయమున ప్రద్యుమ్న వజ్రనాభాదుల శిరములు ఖండించి వైచును.

"ప్రయోగాత్మకం నాటకం" అని యాలంకారికుల మతము. శుచిముఖి వేషధారణము నటుల కెంతవరకు సాధ్యమగునో యాలోచింపవలసి యున్నది.

అనర్ఘనారదము – ఇది యారంకముల నాటకము. ఇందు శృంగార రసము ప్రధానము. శోక హాస్య క్రోధరసము లంగములు. ఒకనాడు నారద మహాముని సందర్శింప వైకుంఠమునకు వచ్చెను.

వానిని చూచి లక్ష్మి తటాలున లేచి లోనికరిగెను. అది నారదు నకు విషాద కారణమైనది.

బ్రహ్మచారిని పరమ పావనుని నన్నుఁ
గాంచినంతన యీ యమ్మ కలుషుఁ బోలె
నీసడించునె యిది సైచుటెట్లు నాకు

అని లోలోన గుములిపోయెను.

జటిలుఁడ జితమాయుఁడన్ బ్రశ_స్త హృదయుఁడం
దటుకున నను గని చనె లో
గిటిలోనికి లక్ష్మి యిదియుఁ గీర్తిద మగునే

యని నారదుఁడు విష్ణువును బ్రశ్నించెను. అంత హరి "నీ వెట్లు గెల్చితివో గాని మే మమ్మాయను గెలువలేదు. దానిస్వరూప మిట్టిదని కూడఁ దెలియఁ జాలము" అని సమాధానము చెప్పెను.

మాయఁ జూడ నీకు మదిఁ గట్టిగాఁ గోర్కె
గలిగెనేని రమ్ము కనఁగఁ జేతు.

అని నారదుని తన వెంటఁ గొనిపోయెను. ఇది ప్రథమాంకము. ద్వితీయాంకమునందు హరి నారదు లొక జలాశయమున స్నాన మొనరింప మునుగుదురు. నారదుడు స్త్రీ రూపమునొంది బయటికి వచ్చును. వానికి పూర్వస్మృతి పోయినది. ఆమెకు సౌభాగ్య సుందరి యని యాకాశవాణి నామకరణము గావించినది. ఆమె సౌందర్యము శ్రీహరికే యాశ్చర్యము కలిగించినది. ఈ సందర్భ మున తిరుపతి కవులు ప్రదర్శించిన సౌభాగ్యసుందరి విభ్రమాశ్చర్య భయ విషాదముల మధ్య నాందోళితమగుచున్న హృదయ సంచల నము ప్రశంసింప దగినది.

అది రెండు పేజీల పైచిలుకు స్వగతము. రచన యతి రమ ణీయము భావములు హృదయాకర్షణీయములు. ఒక్క యక్షరమైనను బీరు పోనీయకుండ నెన్నిసారులైన చదువవలయు ననిపించును. తన జన్మవృత్తాంతముగాని జననీ జనకులఁ గాని యెఱుగక యాకాశము

నుండి యూడిపడిన నిండు జవ్వనముగల యువతి మానసిక ప్రవృత్తి భావసంచలత సహజమగు నాందోళన నిసర్గముగా ప్రదర్శింపఁ బడినది. ఇన్ని భావముల సంపుటీకరణ మింకొక నాటకమునందు కనిపించదు. ఆంగ్లేయమునందు హామ్లెట్ స్వగతముకూడ దీనికి సరి కాదు. సంస్కృత నాటకములందీ సంఘటనము మృగ్యము. తిరుపతి కవు లీ సందర్భమున షేక్స్పియరును మరపించిరి. హామ్లెట్ పురుషుడు. సౌభాగ్యసుందరి స్త్రీ. అది మూలకము. ఇది యాశ్చర్య మూలకము. ఇంతే తారతమ్యము.

శార్దూలమువలని భయముచేత నొక లతా గృహముననున్నది సౌభాగ్యసుందరి. ఆమె యౌవనవతి. సిగ్గు నొదవించు వింత భావములు పొడమినవి. అది వెన్నెల వేళ. మలయమారుతము వీచినది. ఈ యుద్దీపన విభావముల మధ్య భావోద్రేకము కలిగినది. తనకొక గతిని కల్పింపుమని దైవమును ధ్యానించుచు కనులు మూసికొని కూర్చుండును.

అంతలో కన్యాకుబ్జ నగరాధీశుడు తాలధ్వజు డచటికి విదూషకునితో వచ్చెను. రాజ విదూషకుల సంభాషణలో హృదయరంజకమగు చక్కని హాస్యమున్నది. రాజు సౌభాగ్యసుందరిని చూచును. ఆమెయు రాజును చూచును. తన్ను వరింపుమని రాజామె నడుగును. తన స్థితిని వివరించి సౌభాగ్య సుందరి "నీ యిచ్చవచ్చినట్టులు న్యాయగతి నన్నుఁ జూడుము" అని తన్ను రాజున కర్పించుకొన్నది. తిరుపతి కవు లీ యంకమునందు క్లుప్తములో శృంగారము నందముగా ప్రదర్శించిరి. దానికి హాస్యము మెరుగుపెట్టి రసోపస్కారకమైనది.

మూడవ యంకమునందు యుద్ధములో పుత్రపౌత్రులు మరణింప శోకించుచు తాలధ్వజుడు భార్యతో నడవికి వచ్చును. ఇక్కడ కొంత శోకరసము. విష్ణువు బ్రాహ్మణ రూపమున వచ్చి సౌభాగ్య సుందరిని మరల నారదునిగా మార్చును. ఇక్కడ కొంత యద్భుత రసము. శోకమున కద్భుత రసము అంగముగా పనిచేసి రసపుష్టి

కల్పించినది. నాల్గవ యంకమున తుంబుర నారదులు తీర్థయాత్రలు గావించుచు సృంజయ మహారాజు నింట చాతుర్మాస్యములు గడుపు చుందురు. సృంజయ మహారాజు కూతురు మదయంతి. నారద తుంబు రుల సేవకు నియమింపఁబడినది. నారదుని గాన మాధుర్యము మద యంతి మనస్సును లోఁగొనినది.

మదయంతి నారదుని యొద్ద గానకళా రహస్యముల నభ్య సించుచు నాతనియందు క్రమ క్రమముగా బద్ధానురాగమైనది. ఆమె ప్రేమకు గాన ముద్దీపన కారణమైనది. అందుమూలమున సేవాదులందు తుంబురుని యందుకంటె నారదుని యం దాదర మెక్కువ చూప నారంభించినది. తుంబురు డది గ్రహించెను.

స్నాన మొనర్ప నుష్ణజలం బతని కిచ్చుఁ
జలినీళ్ళు నా కిచ్చు సరసిజాక్షి
పెరు గాతనికి బోయుఁ బ్రీతిమై బింబోష్ఠి
నాకుఁ దక్రముఁబోయు నళిన నయన
సెజ్జ కల్పించు మెచ్చెడి రీతి నతనికి
నా కొక్క కంబళి నాతి పఱచు
సొగసుమేల్ చూపులఁ జూచు నాతనిఁ బేర్మి
చూడదు నన్నట్లు సుందరాంగి

ఎల్ల యుపచారముల నిట్టు లేక రీతి
మాని ననుఁగొంచె పఱచె నిమ్మగువ మిన్న
యింతలో నిట్లు మాఱుటకెంత యేనిఁ
గారణం బొకఁడుండియే తీరవలయు

అని యనుమానించెను. దానికి తగినటుల నారదుడు మద యంతితో తాను స్త్రీయైన నాటి కథయంతయు చెప్పుచు నటు వచ్చెను. వారి సంభాషణలో నన్యోన్యానురాగము వెల్లడియైనది. తుంబురునకు రోషము బుకెత్తినది. నారదునిఁ గోతి ముఖము కలుగు గాతమని శపించెను. నారదుడు తుంబురునకు స్వర్గవాసము లేకుండు గాక యని ప్రతిశాప మిచ్చెను. మదయంతి

'నేనీ యనఘుని సౌందర్యమును జూచి మోహించినట్లు సూచించినాడవు. అది తప్పు. విద్యను చూచి మోహించితిని. అట్టిచో నా కితనిది కోతి మొగమే యైనను సంతోష జనకమే యగును. కావున శాపము క్షమ్మరింపుము' అనెను.

తుంబురుడు వెడలిపోయెను. అంతలో సృంజయ మహా రాజచటికి వచ్చును. మదయంతి తన మనోనిశ్చయము తండ్రి కెరిగించును. తండ్రి కుమార్తె కోరిక యంగీకరించును. ఇది యైదవ యంకములోని కధ. చివరి యంకమందు ఎవరి శాపములు వారు మరలించుకొందురు. తుంబురుడు స్వర్గమున కరుగును. నారదుడు మదయంతితో సుఖముగా నుండును.

ఈ నాటకమునందలి కధ మిగుల రమణీయమైనది. ప్రేక్షకుల చిత్తము నాకర్షించి చైతన్యమొదవించు శక్తి దానియం దిమిడి యున్నది. స్త్రీ జనస్వాభావికమైన ప్రవృత్తి యంతర్లీనమైయున్నది. యౌవనవతులగు యువతుల నాకర్షించునవి సౌందర్యము విద్య. సౌభాగ్య సుందరి తాలధ్వజుని యందచందములను చూచినది. 'ఆహా! యేమి! యీ సౌందర్య విశేషము. నా కనులు మిఱుమిట్లు గొనుచున్నవే' యనుకొన్నది. పురుషుని యాకృతి విశేషమునకు చిత్తము వశ మొనరించుట స్త్రీ జన సామాన్యమగు స్వభావము. అది యటులుండనిండు, సౌభాగ్యసుందరి నిరాధార భయాకుల చిత్త చంద్ర మలయమారుత కుసుమిత లతా కలకంఠ గానములచేత నుద్దీపితమైన శృంగార భావములు గలది. కావున తనకు సముత్తరణా లంబనము కాగలడని యూహించువాని కెవనికైనను ఆ స్థితియం దున్న యువతి తన్నర్పించుకొనుటకు వెనుకాడదు. ఆ కారణము చేతనే 'ఎవరైన నేమి? యిట్లు చేసెదను' అని తలంచి మును ముందు గానే రాజునకు నమస్కరించి 'అనాధనగు నన్ను మన్నించి మీ రెవరో యానతిండు' అన్నది సౌభాగ్యసుందరి. ఇది యొకరకమగు లోక ప్రవృత్తి.

గానము సర్వజీవ సమాకర్షణీయమైన లలితకళ. అది యెటు వంటివారి హృదయమునైనను సంపూర్ణముగా కరగించి మోహా పరవశము గావించును. గాయకుడు తానెంత నియమ పరుండనని డంబములు పలికినను వ్యభిచారికాక తప్పడు. నారదుడు మహా తపస్వి. నియమపరుడు, లోకోత్తర గాయకుడు. కావుననే పతివ్రత యగు లక్ష్మి నారదుని చూడగానే మానసిక సంచలమునకు భయ పడి లోని కరిగినది. ఇచ్చటనే తిరుపతి కవులు నాటకమునకు బీజము నాటిరి. మాయా విషయకమైన సంభాషణ దానినుండి యంకురించి నది. అది రెండు శాఖలై సౌభాగ్యసుందరీ మదయంతీ కథలుగా విస్తరించినది.

తిరుపతి కవులు నాటకమునుగాని కావ్యమునుగాని వ్రాయ తలపెట్టినప్పుడు ముందుగా సకలాంగములను నేర్పరచుకొని రచన కుపక్రమింతురు. కావుననే వారి కథాసరళిలో సమైక్యత పొందు పడియుండును. ఆ విషయమున నీ నాటకము ఒక ప్రత్యేకతను వహించినది. మదయంతి నారదుని గానము విన్నది. "ఔరా యీ కంఠ మాధుర్యము! ఎన్నడు వినలేదే! ఎంత పుణ్యముచేసి కొంటిని" అనుకొనినది. నారదుడు గానము నాపివేసెను. ఆమెకు విచార మొదవినది.

"ఇక్కడ నాలుగు మాసము లుండునుగదా! ఇన్ని నాళ్ళను వీరి పరిచర్య నేనే చేసెదనుగదా! ఇఁక నాకు వినిపించక యెవరికి వినిపించెదరు" అని ధైర్యము తెచ్చుకొనినది.

ఈ మూడు వాక్యము లొక దానికంటె నింకొకటి ప్రగాఢ మగు భావములు గలవి. మదయంతి గానకళా రహస్యము లభ్య సింప నారదు నాశ్రయించినది. ఆ గానమునకు తన్ను తన హృద యమును నర్పించుకొన్నది. ఇది మరొక లోక ప్రవృత్తి. ఈ రెండు తిరుపతి కవు లీ నాటకమునందు చక్కగా చిత్రించిరి.

దంభవామనము–ఇది యారంకముల నాటకము. దీనికి భాగ వతములోని బలిచక్రవర్తి కథ మూలము. ప్రథమాంకమునందు

బలిచక్రవర్తి స్వర్గము నాక్రమించుటయు, ఇంద్రుడు పదచ్యుతుండయి కాననముల పాలగుటయు దేవగురుండగు బృహస్పతిని ఆలోచన యడుగుటయు గలదు. బృహస్పతి "మాతృభక్తి కలవారలకు సమస్త సంపదలు గలుగును. తప్పక యదితిని సేవింపుము. ఆ దేవత నిన్ను వృద్ధి చెందించును" అని యుపదేశించును.

రెండవ యంకమునందు ఇంద్రు డదితి నాశ్రయించును. అదితి కశ్యపునిఁ బ్రార్థించి యుపాయము తెలిసికొనినది. అష్టాక్షరీ మంత్రోపాసనవలన విష్ణువును ప్రత్యక్షము గావించుకొన్నది. తన కుమారులకు రాజ్యమిప్పింపుమని వేడుకొన్నది. విష్ణువు "నేను నీ గర్భంబునందు వామనుండనయి జన్మించి యికార్యంబు నెరవేర్చి నిచ్చగింతును. ఇఁక నీవు సుఖంబుండుము" అని వరమిచ్చెను.

బృహస్పతి యుపదేశమున నింద్రుడు తన కుమార్తె యగు జయంతిని తపమొనరించుచున్న శుక్రుని యొద్దకు పంపును. మంత్రమును వశీకరించుకొనిన శుక్రుడు రాక్షసుల కుపదేశింపబోవుచు జయంతిని చూచి ప్రేమ కలవా డగును. తన ప్రయత్నమును మాని జయంతితో రహస్యముగా పదేండ్లు సుఖింపఁదలచి యామె నింటికి తీసికొనిపోవును. ఇది తృతీయాంకములోని కథ.

జయంతియందు శుక్రుడు కామోపభోగముల ననుభవించుచుండెను. ఆ కాలమున బృహస్పతి శుక్రుని రూపమున వచ్చి రాక్షసులకు బలిచక్రవర్తికి నాస్తికత్వము దురాచారములు బోధించును. అంతలో శుక్రుడు బలియొద్దకు వచ్చును. బృహస్పతి మాయాతంత్రమును గ్రహించి వానిని తరిమివేయుమని బలికి బోధించును. అతడు తిరస్కరించును. శుక్రుడు రాజ్యభ్రష్టుడవు కమ్మని బలిని శపించి కోపమున వెడలిపోవును. బృహస్పతియు తన కార్యము దీరినదని నిష్క్రమించును. సేవకులు వచ్చి దేవతల విజృంభణము రాక్షసుల పరాజయము బలికి తెలుపుదురు. బలి తన తప్పును తెలుసుకొని శుక్రుని దర్శింప నరుగును. ఇది నాల్గవయంకము.

ఈ నాటకమునందు అద్భుతము ప్రధానరసము. దానికి శృంగారరస మంగము. మొదటి రెండంకములందు కునుకులు వారిన కథావాహిని మూడవ యంకమునందు జయంతి ప్రవేశముతో నుత్తేజితమయి చేతనత్వమును కల్పించుకొన్నది. జయంతీ శుక్రుల సంభాషణ శృంగార రసజీవము కొంత సాధించి ప్రధాన కథకు పుష్టి సమకూర్చినది. నాల్గవ యంకములో కథాకల్పన యద్భుత రసమును సేకరించుకొని యుత్తరాంకములకు వాటము ప్రతిపాదించినది.

ఈ యంకములోని యద్భుత కథాకల్పనవలన సదాచార సంపన్నులైన రాక్షసులను బలిచక్రవర్తిని దురాచార పథానువర్తనులను గావించుటయు నందు మూలమున దేవతల విజయమునకు దారి కల్పించుటయు గలిగినది. నాయకుడగు బలిచక్రవర్తి యుత్తమ గుణశీలాదులు సూచించబడినవి. ఐదవయంకమునందు యజ్ఞ దీక్షితుండయి దాన మొనరించుచున్న బలియొద్దకు వామనుని రాక ప్రదర్శింపఁబడినది. ఇందలి బలి వామనుల సంభాషణ హృదయంగమముగా నున్నది. బలి వామనుని కుల గోత్ర నామాదులను గురించి ప్రశ్నించును. వామనుడు

ఇంటిలో నేడు, మరునాఁడు మంట నుండు
వానికి నివాస మన నెద్ది పేరు నేది
యూరు నెయ్యది కన్నట్టి వారు నేరు?
నీవు నేనను భేదమే నిజము కల్ల

ఇలఁగలఁ బ్రాహ్మణోత్తము లనేకులు వారలలోన నొక్కయు
జ్వలునకు నొక్కసాధ్వికి నపత్యము నేను సమస్త విద్యలం
గలదు ప్రవేశ మొప్పఁగ, జగంబఖిలంబు పరిభ్రమింతుఁ గా
వలసినఁ బేరు చెప్పెదను, వామనుఁడందురు నన్ను నెల్లరున్.

మంచి గడుసైన సమాధానము. అడిగినవి తప్ప మిగిలినవన్నియు చెప్పెను. చెప్ప లేదనుటకు వీలు లేదు. సమస్తవిద్యలంగలదు ప్రవేశమట. వేద పురాణ శాస్త్రాది సకలవిద్యలందు విష్ణు వభివర్ణింపఁబడుచుండును. గావున సకల విద్యలందు ప్రవేశము గలదు. అనగా

సకల విద్యలయం దుండువాడు అని ఫలితార్థము. విద్య యనునప్పుడు వేదవిద్యయనియే భావము, బ్రహ్మ విద్యాదులుకూడ వేదవిద్యలే. వీని యన్నిటియందు హరి నంతర్యామియై యుండును. అది యాయన నివాసము. వలసిన పేరు చెప్పెద. పరమేశ్వరునకొక పేరు లేదు. ఆయన నామరూపగుణ విరహితుడని శాస్త్రములు చెప్పుచు న్నవి. ఎవరికిఁ గావలసిన రూపనామములు వారు కల్పించుకొందురు. నీకు గావలసిన పేరు చెప్పెదను. ఇప్పటి యీ నా రూపమునుబట్టి 'వామనుఁడందురు నన్ను నెల్లరున్' అని సమాధానము చెప్పినాడు వామనుడు.

అట్టివానికి నూరు పేరు కన్నవారు నెవరుందురు. అతడాత్మ స్వరూపుడు. ఆత్మ యన్ని జీవులందు నొకటే. భిన్నమనుకొనుట యజ్ఞానము. 'నీవు నేనను భేదమే నిజముకల్ల' యనినాడు. నీవు నే నను భేదము ప్రత్యక్షప్రమాణముగా కనిపించు దేహముల విషయ మున నిజముగా తోచునది కల్ల. 'అస్మద్యుష్మత్' శబ్దములచేత నిరూపింపఁబడు నాత్మ విషయమయిన భేదకల్పన యందలి సత్యము అబద్ధము. ఆత్మ సర్వత్రా ఒకటే. అని మొదటి పద్యమున సూచింపఁ బడినది. ఈ భావములు భాగవతమునందు

ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
నొకచోటనక నెందు నుండనేర్తు

ఇత్యాది పద్యములోనివి. అయినను స్వకీయములుగా నొన రించుకొని విభిన్న మార్గముల వెల్లడింపఁబడినవి. ఇంత నిగూఢము క్లిష్టమునగు భావములను చక్కఁగ జాను తెనుగు పదములలో పొందు పరచుట యెంతటి మహాకవులకయిన సాధ్యమగునది కాదు. రెండు భాషలయం దపార పాండిత్యముగలవారు కావుననే తిరుపతి కవులకు సాధ్యమయినది. వామనుడు

బ్రహ్మచారిని నేను తపంబొనర్చి
కొనెద నొక్కెడ కూర్చుండి కొంకు దక్కి

యిమ్ము మూఁడడుగుల నేల యిదియ చాలు
మూఁడు లోకమ్ము లిడినంత ముదముగాంతు

అని యడిగెను. దీనినే పోతనగారు—

ఒంటివాఁడ, నాకు నొకటి రెండడుగుల
మేర యిమ్ము, సొమ్ము మేరయొల్లఁ
గోర్కె దీర బ్రహ్మ కూకటి ముట్టెద
దాన కుతక సాంద్ర దానవేంద్ర!

అని వ్రాసినారు. ఈ యొక్క చిన్నపద్యమే పోతన్నగారికి తిరుపతికవులకు రచనయందు తారతమ్యము నిరూపించుటకుచాలును. ఇందును నందును సమానభావములు పోకడలుగల పద్యములు మరి కొన్ని గలవు. అవి గ్రంథ విస్తర భీతిచేత నిచట చూపించలేదు. ఇదియు పోతనతో సరిపోల్చి చూపుట నా యభిప్రాయముగాదు. పోతన మహానుభావుడు. పుట్టుకవి. ఆయన కవితా సౌందర్యము నన్నయ యందుకూడ లేదేమో యని యొకొక్కప్పు డనిపించు చుండును. ఇతరకవుల విషయమై చెప్పవలసిన దేమున్నది. 'ప్రపే దిరే ప్రాక్తన జన్మవిద్యాః' అన్నటుల ప్రాక్తన జన్మ విద్యలు సహజ ముగా సంక్రమించినవి. అతడు సహజ పాండిత్యు డయినాడు. దానికి తోడు సరస్వతీ ప్రసాదసిద్ధి పొందెను. వాని కెవరు సాటి కాగలరు. తిరుపతి కవులుగూడ పుట్టుక తోడనే కవిత యలవడిన మహాపండి తులు. కాని యెవరి కవిత వారిది. బలి

దాత లుండవచ్చు దానంబు లీవచ్చు
నేరికిట్టి పాత్ర మెందు దొరకు
నిపుడో యపుడో యీరాజ్య మీ కాయ
మేగ కున్నె దీని కింత యేల?

అని తలంచినాడు. ఇది తిరుపతికవుల పోకడ. ఆరవయంకము నందు మూడడుగులు దాన మిచ్చుట కలదు. బలి పాతాళమున కరుగును.

సుకన్య—ఇది మైదంకముల నాటకము. దేవీ భాగవతము లోని చ్యవనుని కథ ననుసరించి వ్రాయబడినది. తపమొనరించు కొనుచున్న చ్యవనుని కన్నులు సుకన్య కంటకముతోఁ బొడిచినది. దానికి ఫలముగా ప్రజలలో రోగములు ప్రబలినవి. ప్రజలు శర్యాతి నరపాలునకు మనవి చేసికొనుటకు వచ్చిరి. దీనితో ప్రథమాంక మారంభమగును. శర్యాతి ప్రజలతో "నగరవైద్యు లేమైరి?" అనును.

వారు "బాబూ! యెందుకండి నగర వైద్యులు? వారివల్ల నేమియును లాభము లేదు. ఏవో యిన్ని నీళ్ళిచ్చి పొమ్మన్నారు. వారి కేదేని లంచ మిచ్చువారికి గాని మంచి యౌషధము లీయరు. బీదల మెట్లీయగలము?" అని సమాధానము చెప్పిరి.

ఈ సావకాశము పురస్కరించుకొని ప్రస్తుతపు ప్రభుత్వ వైద్యశాలలను వైద్యులను విమర్శించిరి. తిరుపతికవులు ఈ విమర్శ శర్యాతియొక్క పరిపాలన యందలి యసమర్థతనుకూడ వ్యక్తపరచు చున్నదని వా రూహించలేదు. శర్యాతి "పన్నులు హెచ్చించితినో" యని సంశయించును. మంత్రి "అది ప్రజాక్షోభమునకు హేతు వెట్లగును?" అని ప్రశ్నించును. రాజు వెఱ్ఱివాడా! అని సంబోధిం చును మంత్రిని. అట్టి సంబోధనకు తగినవాడే, లేనిచో మంత్రి యట్లడుగునా? వీరి సంభాషణలో రాజసమర్థుడు, వైద్యులు లంచ గొండులు, మంత్రి వెఱ్ఱివాడు అని తేలినది. కృతికర్త లిట్టి ప్రస్తా వనముచేత ప్రేక్షకులకు సంతోషము కలుగుననే యూహించిరి గాని పాత్రల నపాత్రులను చేయుచున్నా మను దృష్టి లేకపోయినదని తలంపవలసి వచ్చును. ఈ యంకము పరిహరించినను ఇంకొక విధ ముగా నాటకము రసికజనానందముగా నుండెడిది. రెండవయంకము శర్యాతి చ్యవనుని మనోభిప్రాయ మెరింగివచ్చి భార్యకు తెలుపును.

ఉటజమ్మున నఁట కాఁపుర
మఁట! ముదుసలి కోపియునగు నంధుండఁట య

క్కట! నా తనయకుఁ బతియఁట!
ఘటియించిన నాకుఁ బుట్టగతు లెట్లుండున్.

అని తలంచును. అంతలో సుకన్యవచ్చి "ముని వర్యునిఁ గృపాయుతుగా నొనరింతు నాత్మ దానాకలనమ్మునన్" అని తెల్పును. రాజు కన్నీరు నించును.

వనమున నమ్మునివరు సే
వనమునఁ దగులొంది భక్తి పరవశనై యా
తని మాట కడ్డుదాటక
జనవర నీకున్ యశంబు సంపాదింతున్.

నలుదిక్కులకు నేగి నానావిధమ్ములౌ
ఫలమూలములు దెచ్చి పజ్జ నునిచి
యగ్నుల నలరింప ననుగుణమ్మగు సమి
జ్జాలంబు శుష్కంబు సంతరించి
తిలలును గుశలును దెచ్చి తోమిన కమం
డలువుతో జతకూర్చి కెలన నిలిపి
యుష్ణోదక స్నాన మొనరింపగాఁ జేసి
యజినంబుపఱచి యందల్లఁ జేర్చి
యనఘ! యిఁక నిత్యకర్మమ్ము నాచరించు
కొనుఁడని వచించి కర్మాంతమునఁ గరమ్ము
పట్టికొని సంస్తరణమున కట్టెచొన్పి
మునికి ననుగుణమైన సేవన మొనర్తు

అని యంతయుఁ దానుచేయుచున్నట్లు జరుగుచున్నటుల నే చెప్పినది. ఇచ్చటనుండి సుకన్య పాత్ర చివరివరకు చక్కగా పోషింప బడినది. ఈ విషయము దేవీభాగవతమునందు విపులముగా చర్చింపఁ బడినది. మూడవ యంకమునందు సుకన్యా సహితుండయి శర్యాతి

చ్యవనుని యాశ్రమమున కరుగును. సుకన్యను చ్యవనునకు భార్యగా నర్పించును.

నడిచి యెఱుంగ దెన్నఁడునేని రత్నకం
బళములపైఁగాని వట్టినేల
కొలిచి యెఱుంగ దాకొల్లటఁగాని దేవదే
వుల నేనిఁ దల్లిదండ్రుల నెకాని
పలికి యెఱుంగ దెప్పట్లఁ బెంపుడు పులుం
గులతోనె కాని యన్యులకు నెదిరి
నిలిచి యెఱుంగ దే నెలవులందెపు డంతి
పురియందె గాని మాదరిని నేని

మాకొమిరెయంచుఁ జెప్పెడి మాటగాదు
శుద్ధముగ్ధావతార మీ సుందరాంగి
తప్పు లొప్పులుగాఁ జూచి దయను బ్రోచి
మమ్ముఁ గృతకృత్యుల నొనర్పుమా మునీంద్ర!

అని శర్యాతి చ్యవనునితో వచించును. సుకన్యకు

రాచకూతుర ననెడి గర్వంబుమాని
యణఁకువ వహించి మెలఁగు మీ యనఘుపట్ల
అమ్మరో! దాన నిహముఁ బరమ్ముగల్గు
సజ్జనారాధనము వృథా చనదుసుమ్ము

అని సంబోధించును. ఈ రెండు పద్యములీ అంకమునందు రసవంతములయి మనస్సును చూరఁగొనుచున్నవి. తల్లితండ్రులు వెడలిపోవుదురు. సుకన్యకు చ్యవనుడు నిత్యకృత్యము లుపదేశించును. ఆమె భర్తవలన సతీ ధర్మములు తెలిసికొనును. నాల్గవయంకమునందు అశ్వినులు సుకన్య సంభాషణ రసవంతముగా నిర్వర్తింపఁ బడినది. సుకన్య శీలము చాలబాగుగా పోషింపఁబడినది. చ్యవనుడు యౌవనుడగును. ఐదవ యంకమునందు చ్యవనుడు శర్యాతిచేయు యజ్ఞమునందు అశ్వినులను సోమపీథులను గావించును.

పండితరాజము—తిరుపతి కవులకు పండితరాయలనిన నమిత గౌరవము కలదు. అందును వేంకటశాస్త్రిగారి కాయనయం దత్యంత గురుభావమున్నది. దానికి కారణ మాయన తెలుగు వాడగుట యొకటి. వారు కాశికి పోయినప్పు డాయన ప్రభావములను గురించిన కథలను పండితులవలన వినుట యొకటి. కావుననే వేంకట శాస్త్రిగారి "పండితరాయాది కవులుచూపు త్రోవలంబట్టిపోదుము" అని తరువాతి చర్యయందు చెప్పుకొనిరి. ఆ భావమే నాటక రచనకు పురికొల్పి యుండవచ్చును.

పండితరాయలు మహాకవి. పండితలోక పూజ్యుడు. ఢిల్లీ పాదుషాయగు షహాబుద్దీను కుమార్తెయగు లవంగికను పరిణయ మాడెను. పండితరాయలు వేగినాటి బ్రాహ్మణుడు. లవంగి తురుష్కాంగన. ఈ వింత వివాహ సంఘటనము తిరుపతికవుల యుత్సాహమును మరింత బలపరచి యుండవచ్చును. ఇది సాంఘిక నాటకము. దీనిని తిరుపతికవులు మొట్టమొదటగా వ్రాసిరి. అప్పటికి తెనుగు దేశమునందు సాంఘిక నాటకములు వ్రాసినవారు లేరు. కావున యిట్టి రచనలకు దారిచూపిన వారు తిరుపతి కవులనియే తలంపవలసి యున్నది. ఈ నాటకము పండితరాయలు శిష్యులతో ఢిల్లీకిపోవుటతో ప్రారంభింపఁబడినది. మార్గాయాస మెడబాపి కొనుటకు ఒక చెట్టు నీడను కూర్చుండి పండితరాయలు శిష్యులతో

నాకున్ జాతక మొప్ప వ్రాసె విధికన్నన్మిన్న మా తండ్రి యం
దేకచ్ఛత్ర విభుండు గాఁ తునిడు నం చింతింత సూచించె ఢి
ల్లీ కాంతుండు వినాగఁ దాదృశ విభుల్ లేరేమి కానున్నదో
యే కాలమ్మునకేది వచ్చునో నరుం డెవ్వాఁడు దైవేచ్ఛకున్.

అని నుడువును. ఒకవేళ యీ యూహయే పండితరాయలు ఢిల్లీ ప్రయాణమునకు ప్రోత్సహించినదేమో. ఈ యొక్క పద్యమే పండితరాయల గుణములను భావికథా పర్యవసానమును సూచించుచున్నది.

రెండవ యంకమునందు ప్రత్యక్షముగాను స్వప్నమునందును చూచి మోహించిన పాదుషాకూతురు లవంగి పండితరాయలనుగొని రమ్మని విదూషకుని పంపును. అతడు పండితరాయల కా సంగతి చెప్పి సాంకేతిక మేర్పరచును. పండిత రాయ లదివరకే యామెను చూచి మోహము కలవాడయ్యెను. అతడు విదూషకునితో "జాతక మందు కొంత యీ జాడ లిఖించెఁ దండ్రి" అని వచించెను.

వేంకటశాస్త్రిగారికి జాతకములందు నమ్మకము మెండు. ఆ నమ్మకముతోడనే జాతకచర్య వ్రాసెను. పతివ్రత కావ్యమునందు మంత్రి కదే నమ్మకము కల్పించెను. సావకాశము లభించినప్పుడెల్ల జాతకము గ్రహముల చర్యలు తమ గ్రంథములందు ప్రసంగించుచు వచ్చిరి. తమ యీ నమ్మకమే పండితరాయల చిత్తమున కెక్కించిరి. పండితరాయలు తాను యవన కన్నియను వరించుట దోషము కా దనుటకు విదూషకునకు "వేంకటేశ్వరునంత వేల్పు యవన కన్యకను పెండ్లియాడి మార్గమ్ము వెట్టె" అని దృష్టాంతము చూపెను. పండితులు చేయు నే కార్యమునైన సమర్థించుకొనుటకు ధ్రువతారలు శుక్ర నక్షత్రములు పెక్కు దొరకును.

మూడవ యంకమునందు లవంగీ పండితరాయలులు రేయి యుద్యానవనమునందు కలిసికొందురు. నాల్గవ యంకమునందు పండితరాయలు షహాబుద్దీను పాదుషాను దర్శించును. వాని నాశీర్వదించును. పాదుషా సంస్కృత భాషావిదుడు. పండితరాయల యాశీర్వచన శ్లోకమునకు మహానందము నొందును. రాయలు

ఏ భూమీంద్రునిఁ జూడఁబోయినను నీవే పద్యమున్ జెప్పి నీ
వే భావమ్మును జెప్పికోవలయు నింకీ భూవిభుండన్నఁ దా
నే భావమ్ము గ్రహించు వాఁడగుట నీ కీ కష్టమీడేరెనా
హా! భో! సత్కవిపూర్వజన్మ సుకృతంబా నీకు దీర్ఘాయువౌ.

ఇది విజయనగరము మహారాజులంగారి యెదుట చదివిన పద్యములలో నొకటి. నానారాజ సందర్శనములోనిది, ఇందుఁ

బొందుపరచఁ బడినది. ఇతర కవులకు తిరుపతికవులకు రచనలోనున్న తారతమ్య మీ పద్యమునందు పరిశీలింపవచ్చును. ఇతరకవు లీ భావమును ప్రదర్శింతు రేమోగాని "సత్కవి పూర్వజన్మ సుకృతంబా నీకు దీర్ఘాయువా" నని యాశీర్వదించు విధానముండదు. అదియే పద్యమునకు తెచ్చిన యందము.

ఇట్టి చణుకు వారి పద్యరచనయందు సర్వసామాన్యముగా కనిపించును. అది పాఠకులను మెప్పింపజేయును. అదియే వీరి పద్య రచనా విధానములోని నూతనత్వము. ఇట్టివిధము వారికాలము నందలి కవుల రచనలందు మృగ్యము. అందుకనే వారి పద్యము లాకర్షణీయములుగా నుండును. పాదుషా రాయల ఏక సంధాగ్రాహిత్వము పరీక్షించి యబ్బురపోయెను. స్త్రీలకు వేణియేల వెనుక నుండ వలయును అను సందేహము పాదుషాకు కలిగినది. దానికి పండిత రాయలు

పురుషాయిత మొనర్చు పూఁబోడి కటి మీఁద
నాట్యమ్ము సల్పు పుణ్యమ్ముకొఱకొ
ఘన నితంబ స్థలమ్మను పెన్నిధానంబు
బహు భద్రముగను గాపాడు కొఱకొ
తానాశ్రయించు కాంతకు వెన్కభాగము
ననుగూడ సౌందర్యమునుచు కొఱకొ
పది మంది దృష్టులు పడినఁ గంటకమంచు
నూహించి కనపడకుండు కొఱకొ

వేణి కాంతల వెన్నంటె వ్రేలుచుండు
లేకయుండిన నిధువనలీల కుపచ
రించు నంగమ్ము లెదుటనే సంచు నించ
దాని కట్లుండ నే యుపద్రవము వచ్చె.

పాదుషా 'పాపము దాని కేమి యుపద్రవము వచ్చినదో మన మెట్లు గుర్తింపగలము' అని యాశంకించెను. దానికి రాయలు

'అఖండ రసికుడు కదా ప్రభువు' అని యానందించెను 'గుర్తింప కేమి' అని యెత్తుకొని

ఎదుటన్ వర్తిల్లునట్టి యంగముల కెంతేని స్నఖాదిక్షతా
పద పల్మారును గల్గు సంగతిని దాఁ బ్రత్యక్షమున్ జూచి నె
మ్మదిలో భీతిలి చాటు చోటనుచు సంభావించి వెన్నంటుచున్
బాదలంబోలును వేణి లేకునికిఁ దా ముందుండ కట్లుండునే.

అని సందేహమును తీర్చెను. పాదుషా మహానందమును పొందెను. పాదుషా యేమిటి పరమశివుడైన నీ పద్యములను విని పరమానందము నొంది యడిగిన దెల్ల నిచ్చును. పాదుషా తన కూతు నిచ్చుటలో నేమంత విశేషమున్నది? ఈ పద్యములు సందర్భ వశమున తిరుపతికవు లాశువుగా చెప్పినవి. ఈ సందర్భమునఁ బొందు పరచిరి. ఈ పద్యములు తిరుపతి కవుల సమయస్ఫూర్తి, రసజ్ఞత, పాండిత్యము భావకల్పనా వైచిత్ర్యము వెల్లడించు చున్నవి.

తెనుగు దేశమున నెంతమంది యాశు కవిత్వము చెప్పలేదు? ఎంతమంది యవధానములు చేయలేదు? వారిలో నెవరైన నింత రస వంతముగా పద్యము చెప్పగలిగిరా? ఈ పద్యములను వ్యాఖ్యానించుచో గ్రంథము పెరుగును. ఒక్క విషయము చెప్పి ముగింతును. సీసములోని రెండవ పాదమున నితంబములు నిధులకుఁ బోల్చఁబడినవి. నిధులను సర్పములు సంరక్షించుట లోక ప్రసిద్ధము. "ఘన నితంబ స్థలమ్మను పెన్నిధానంబు బహు భద్రముగను గాపాడు కొఱకొ" యనుటచేత నుపమానము భుజంగము వ్యజింత మగుచున్నది. స్త్రీల వేణి భుజంగమువలె నుండునని వ్యంగ్యము. ఆశువు నందిట్టి వ్యంగ్యార్థములను బొందు పరచుట యే కవులకు సాధ్యమయినది? ప్రస్తుత కాలమునందు కావ్యములందేయది సాధ్యముకాదు.

తిరుపతి కవులు మహా విద్వాంసులు. రసికులైన మహాకవులు, వారికి సాటి వారే. సంస్కృతమున పండితరాయ లెట్టివారో తెనుగున తిరుపతి కవు లట్టివారు. శ్రీనాథుని తరువాత శ్రీనాథునంత

వారు తిరుపతి కవులు. తరువాతి కవులందరు దాదాపు వారి యడుగు జాడలందు వర్తించిన వారే. వారు తెలుగు వాఙ్మయమునందు క్రొత్తతీరులు దిద్దిన యాధునిక యుగపురుషులు కాదని వాదింపగల వారెవరు? వారి కవితలో నిక్కెదోయొక రకపు క్రొత్తదన మెల్లెడల గోచరించుచుండును. తరిచి తెలిసికొనవలయును. పండితరాజ మైదవ యంకమునందు గంగాప్తము, రాయల భక్తి మహాత్మ్యము దర్శింపబడినది.

## ౧౨
## భాషా సౌందర్యము

శబ్దము బాహ్య స్వరూపము. అర్థ మంతః ప్రవృత్తి. ఆ రెంటి పొందిక వలన కావ్య మందముగానుండును. అవి దోష విరహితములై యుండవలయును. సాలంకృతములు గావలయును. "తదదోషౌ పరి కృతౌ చ వాగర్థౌ" దోషములు లేనంత మాత్రమున కావ్య మాకర్ష ణీయముగా నుండుటకు వీలు లేదు. అది రసవిశిష్టమయి యుండవయును "సావాగ్యారసవృత్తిః" దానినే నన్నయ "ప్రసన్నకథా కలితార్థ యుక్తి" యని వాడినాడు. రసస్రుతిలేనిది కథయందు కాని కవిత యందు కాని ప్రసన్నత యుండదు. అట్టిదానిని సారమతులగు కవీం ద్రులు మేలని వినుతింపరు. ఇంక నితరులున్నారు. పండితులు పామ రులు. వారికి రసాదులతో పనిలేదు. "ఇతరు లక్షరరమ్యత నాదరింప" వారి కక్షరరమ్యత కావలయును. అది రైకలో గుడ్డలు పొదివిన కుచ పొంకము. విప్పి చూపిన చో గుట్టు బైటపడును. నన్నయభట్టు నానా రుచిరార్థసూక్తినిధి అక్షరరమ్యతకు రుచిరార్థము జోడించి తన కవితను మందాకినీ తుల్య మొనరించినాడు. అది విబుధులగు కవి వరులకు మాత్రమే యవగాహన యోగ్యము. ఇతరులు విని యానందింప వలసినదే.

శారదరాత్రు లుజ్వల లసత్తర...(భార. ఆర) ఇత్యాది పద్యములు చదువుచున్నప్పుడు అర్థమైనను కాకున్నను చెవులు విచ్చుకొని విందురు. దానికి కారణ మొండొంటితో పొందుకలిసి సొంపుగా నుండునటుల కూర్చిన మృదుమధురములగు పదములలోని యందము. దానికి వృత్త్యనుప్రాస తోడైనది. మరింత సొబగు సమ కూర్చినది. కాని యర్థ మందరి కవగతముకాదు. అందలి యందచంద ములు సంపూర్ణముగా నందరు ననుభవింపలేరు. నన్నయ కవితా వాహినిలో నాపాదమస్తకము రత్నాభరణభూషితమైన యొకపరమ

పావనమగు గంభీర దేవతామూర్తి గోచరించు చుండును. మహాకవులు దానికి "వందే" యని కేలుమోడ్తురు. తిక్కన యమిత శాక్యుడు. "ఆంధ్రకవిత్వ విశారందుండును విద్యాదయితుండు" నగు నన్నయ రచనా విధానమునకు నమస్కరించెను. భగీరథ ప్రయత్నము గావించెను. భారత కవితా మందాకినిని ఆంధ్రావళి కర్ణపుటంబుల నారఁగ్రోలి మోదముం బొరయ దారికి మరలించెను. తత్సమ తద్భవాచ్ఛిక పదములు సమ్మిళితము గావించి

ఎలదీఁగెఁ గప్పిన లలిత పరాగంబు
క్రియ మేన మేదినీ రేణు వొప్ప (భార. వి.)

ఇటువంటి పద్యములతో రచన సాగించినాడు. ఇందు స్వభావ సుందర మగు తెనుగు దేశీయంపుఁ గవితావిలాసిని "అల్లదనంబున ననువు మైకొనఁ జూచు నడపు కాంతికి వింత తోడవుగాఁగ, పలు పోకలు పోవుచు విచ్చలవిడిగా విహారంబు గావించినది. భావ ప్రదర్శనముతోపాటు పదముల యందము లోక సామాన్యము నాకర్షించినది. ఇంక తిరుపతికవుల భాష నన్నయగారి నొకకంట నరయుచు లాక్షిణికంబగు వ్యావహారికమును గూడదీసికొని తిక్కనగారి యడుగు జాడల వెంబడి నడిచినది.

మొదటి కన్నెరికంబు తుదముట్టెనో లేదో
మీనాక్షి కట్టించు మేడ చూడు (శ్రవ)

మను పద్యమును చదువునప్పుడు ఇంటివాకిట యాయవారము నకై వచ్చిన నిరక్షరాస్యుండగు భిక్షుకుడు చిరునగవు చిలికించును. అది యాభాషాసౌలభ్యములో నున్నది. ఆ సౌలభ్యమే తిరుపతికవుల కావ్యముల కంత ప్రచారము తెచ్చినది. వారి కాలమం దెంతమంది కవులెన్ని కావ్యములు వ్రాయలేదు? వానికి పేరైనగలదా? శ్రవణానందము పామరుడు మొదలుకొని పండితుని వరకు ప్రతి మానవుని నాలుకమీద నర్తనము గావించినది. మను చరిత్రాదులకైన నంత ప్రచారము లేదు. ఈ పలుకుబడిలోని సులువుతనము తిరుపతికవులు

వరించుకొనినది. కాటూరి వేంకటేశ్వరరావుగా రూహించినటుల నవధానమువల్ల నలవడినది కాదు. అప్పటి కాలపరిస్థితులనుబట్టి వారటువంటి భాష వాడవలసివచ్చినది. ఆ విషయము లదివరకే వివరించితిని. మరల నిక్కడ ప్రస్తావించుట చర్విత చర్వణమగును. ఆ పరిస్థితులకుతోడు భాషావిప్లవము చెలరేగినది.

గిడుగు రామమూర్తి పంతులుగారు మహాపండితులు. గొప్ప మేధావి. భాషా పరిశోధకులు. కావ్యములు వాడుక భాషయందు వ్రాయవలయునను వాదము లేవదీసెను. వారి యనుయాయులు పానుగంటి లక్ష్మీనరసింహముగారు. సాక్షి వాడుక భాషయందు వ్రాసిరి. గురజాడ అప్పారావుగారు నండూరు సుబ్బారావుగారు వ్యావహారిక భాషయందు రచనలు సాగించిరి. అసలే బక్కచిక్కిన తెలుగు సాహిత్యమున కంగవైకల్యము వికృతాకారము కూడ రానుండెను, లోకమంతయు గ్రామ్యభాషావాదుల పక్షమున కొగ్గినది.

తిరుపతికవులు పూర్తిగా గ్రామ్య భాషావాదులు కారు. జన సామాన్యమును తనవైపునకు మరల్చుకొనవలయును. అధోగతి పాలగుచున్న తెనుగు నుద్ధరింపవలయును. తమ గ్రంథములకు ప్రచారము రావలయును. అందుమూలమున నుడికారమునందు సులువుతనము నెలకొల్పిరి. అన్నపు రుచి యంతరించిన దీర్ఘరోగికి మరల అన్నప్రాశనమువలె భాషాసౌలభ్యము జనులలో తెనుగు సాహిత్యమునందభిరుచి పెంపొందించినది. అందరు తిరుపతి కవులవంక చూపులు నిగిడించినారు. సాహిత్యభిక్ష కర్థించినారు. అది వారికి ప్రసాదించినారు తిరుపతికవులు. తెనుగు సాహిత్యము మరల పుంజుకొన్నది. భాషలోని సులువుతనము దానికి జీవము పోసినది.

పగలు భార్యను బట్టి పడఁ గొట్టు ముక్కోపి
భృత్యుఁడై చరియించు రేయి యందు

అను పద్యపాదమును విని యెదుట నున్న యిల్లాలు ఓరచూపుల నరయుచు సిగ్గున తలవంచుకొనును.

కైకైక దాటియు బనారసు కండువా దాటి
గబ్బిగుబ్బల కాంతి గంతు లిడగ (శ్రవ.)

అని చదువుట నాలించి కవివరుడు సంతోషమున మనసు గంతులువెట్ట పరవశత్వము నొందును.

కీర్తిని నిష్కారణ మొక్క నాతికయివార్ధిం గల్పఁగానేల? లోఁ
గనుఱంగొక్కటినూఱునోములను మెక్కంజాలు నిక్కంబుగా
(శ్రవ)

అనుట చెవియొగ్గి విని వాదులాడుచున్న వ్యావహారిక భాషా ప్రచారకుడు "బాగు బాగు" అని ప్రశంసించును. పద్యము లిట్లు వ్యావహారిక భాషలో నుండవలయును. కొండవీట చేంతాళ్ళవలె సమాసములల్లి పద్యము సంస్కృతమో తెలుగో తెలియకుండ కవిత్వము చెప్పుదురు. అట్టి కవితలెవ రాలింతురు. మా వాదమున కిది దరిదాపుగా నున్నది. ఈ రచన సర్వసమ్మతమని కీర్తించును. ఆబాల గోపాలము స్త్రీపురుషులు ఆనందించునది తిరుపతి కవుల భాష. ఆ సౌలభ్యములో నందచందము లిమిడియుండును. జానగు దేశీయంపు తెలుగు పదములతో వ్యావహారికములు జతకూర్చి లోకోక్తుల నిమిడించి రసవంతముగా పద్యములు నడుపుదురు. వానిలో గాలించి చూచినను కరకుఁదనమును గోచరింపదు. బెండుతనము కనిపించదు. ప్రసాదగుణము భాసిల్లుచుండును.

పద్మినీకాంత తనుఁ జూచి పగలు నవ్వ
రాత్రి నగసాగె దానిఁ గైరవిణి చెలఁగి
యేరి కేనియు నమవస యేగుమీద
రాణ నెసఁగెడి పున్నమ రాక పోదు (లక్ష్మ.ప)

ఈ పద్యము వారి భాషా సౌకుమార్యమునకు మచ్చుతునక. దానికి చక్కని యలంకారములు తీర్చి

పుష్పవతి యైన పద్మిని పొందు చేసి
తనదు తేజంబు క్రమమునఁ దఱిగి పోవఁ

పశ్చిమ సముద్రమున మున్గెఁ బాప మడఁగ
వనఁగ రవి క్రుంకెఁ దద్దిశాభ్యంతరమున.

అని యిట్లు ప్రతిపద మనోహరము గావింతురు. ఇట్టి పద్యములు సాహితీవేత్తల మనమున కానందము కల్పించి పొగడ్తలనుపొందును. తిరుపతి కవుల కవిత్వము నిస్తరంగంబైన సరోవరము. అర్థగాంభీర్యముతోపాటు భావ గాంభీర్యము కలదయి, పీతెంచు నడక యొయ్యారములో

తంజాపురీ నీల కంజాతనయనల
రెండు చెక్కులు పుల్కరింపఁ జేయు

మలయ మారుతమువలె కవిజనముల మనస్సునకు హాయి కలిగించును. వారు మిగుల నుబ్బి యుబికిస లాడుదురు. ఇంక పండితులున్నారు. వారు శాస్త్రవాదములందు మల్లయుద్ధము చేయుదురు. వారు

ప్రాసాద నిర్మాణ రక్తి మీకు నృపాల
ప్రాసాద నిర్మాణ రక్తి మాకు (నానా)
ద్రాఙ్నదీ తరణ తంద్రాళు పాంథాహూత
నావిక ప్రతివచో రావకంబు (శ్రవ)

ఇత్యాది పద్యముల కుప్పొంగి నింగి ముట్టుచుందురు. వేంకట శాస్త్రిగారు పని చేసిన బందరు హిందూ హైస్కూలులో పరిమి నృసింహాశాస్త్రిగారు కలరు. ఆయన వ్యాకరణ పండితుడు. శాస్త్రి గారి మాట వచ్చినప్పుడెల్ల రెండవ పద్య పాదము చదివి 'వేంకట శాస్త్రిగారంటే యేమో ననుకొనేవాడను. అసాధ్యపు పిండమేను. గట్టి వ్యాకరణ పాండిత్యమున్నది. 'ద్రాఙ్నదీ తరణ తంద్రాళుః' ఆ సంధి ఆ శబ్దాలు 'అళుచ్' ప్రత్యయము ఎట్లావాడాడో చూడండి. అని మహా పొగిడెడివాడు. పండితులు జట్టీపట్లు పట్టే ప్రకృతి కలవారు. వారికి రసాలంకార గుణాదులతో పని లేదు. సమాసములకు విగ్రహములు సాగతీసి "ప్రధ్వంసా భావమా ప్రాగభావమా"

యని చర్చింతురు. వారి గోత్రపాట్లేళ్ళ పోట్లాటల కిటువంటి పద్యాలు కల్పించినారు తిరుపతి కవులు.

భాషయందు ప్రసన్నత కలిగి పద్యమునే చదువగా భావ మందరికి నవగత మగుచున్నను నిగూఢముగా నంతర్లీనమయి దాగి యుండు సారస్యములు తిరుపతి కవుల కవిత్వమునందు పెక్కు చోటుల గలవు. అవి నిశితమగు విమర్శనా దృష్టితో పరిశీలించినగాని గోచరించవు. మచ్చునకు

పాపిష్టి రాజుల పాలి దయ్యంబు సం
ధ్యా వందనమునకు బావగారు

అని కవిత్వమును గురించి తిరుపతి కవులు చెప్పిరి. కవిత్వము సర్వశ్రేయము లొసంగును. అది యొక విశిష్టదైవతము. ''విశ్వశ్రేయః కావ్యం'' దానిని సగౌరవముగా బూజించినవారికి మోక్షమైనను లభింపగలదు. ''అది ముక్తికాంతా సంగమునకుఁ దారుపు కత్తె'' ఆ దృఢవిశ్వాసము కవులందరికి కలదు. జీవితాంతమువరకు కవితా దేవత నుపాసించిన శ్రీనాథుడు మరణ సమయమున

దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమర పురికి

అని గట్టిగా నుడువగలిగినాడు. వేంకటశాస్త్రిగారు ''తపమే కైతము. భవ మద్దానఁ దరింతు''నని గట్టిగా నమ్మికొని యుండెను. దానివలన రోగములు కష్టములు తరించెను. తుది ఘడియలందుకూడ కవితాదేవతను విడిచిపెట్టలేదు. అట్టి సర్వార్థ సాధనంబయిన కవిత్వమును సత్కరించి శ్రీకృష్ణరాయాది మహీధవులు చిరకీర్తిని సంపాదించిరి. దాని నగౌరవించిన రాజుల నది దయ్యమువలె పట్టి పీడించి మూలచ్ఛేదము చేయును.

పెద్దాపురపుఁ గోట పెద్దమ్మ కిల్లాట
కవివరేణ్యుల కోప కలనఁ గాదె

అని తిరుపతి కవులు పెక్కు దృష్టాంతములను చూపిరి. అట్టి కవిత్వము సంధ్యావందనమునకు బావగారు. బావమరదళ్ళ సరాగ మందరికి తెలిసినదే. సంధ్యావందనము మరదలు. కవిత్వము బావ గారు. మరదలు బావగారి యెదుటపడగానె సిగ్గుకొంకులు కలదగును. అందుమూలమున పలుకులలో తడబాటు తొట్రుపాటు కలుగును. కవి సంధ్యవార్చుకొనునప్పుడు కవిత్వ నియమములు జ్ఞాపకమునకు వచ్చినచో సంధ్యావందనమునందు తడబాటులు పొరబాటులుకలుగు నని సారస్యము. సకల పురుషార్థ సాధకంబయిన కయితముందు జప తపాదులు సంధ్యావందనములు సిగ్గు చెందునని భావము. కవిత్వము జపతపాదులకంటె సర్వసమర్థమైనదని సూచన. ఇట్టి మహత్తర భావములు వారి కవితయం దిమిడియుండును. అవి సముద్రపు టడుగున నుండు ముత్యములు. విజ్ఞాన చక్షువుతో తరిచి చూచినగాని యవగతములు కావు. భాష సులువైనను భావము లతి నిగూఢము లుగా నందు దాగియుండును. దానికి ప్రసాద గుణము మెరుగు పెట్టు చుండును. అల్లికలో బిగువు తరిగియుండదు. బాలురకైన నర్థమగు నట్లు చిన్న వాక్యములతో పద్య మిమిడి యుండును.

వేసవి డగ్గరాయె మిము వీడుటకు న్మన సొగ్గదాయె మా
వాసము దూరమాయె పరవాసము మిక్కిలి కష్టమాయె మా
కోసము తల్లిదండ్రు లిదిగో యదిగో యని చూచుటాయె వి
శ్వాస మెలర్పవే సెలవొసంగుము పోయెద మింక భూవరా!

ఇట్టి ముద్దు ముద్దు పదములతో తిరుపతికవు లతి మనోహర ముగా రచన సాగించిరి. ఇందలి తియ్యదనము "వన్నెలాడి తీయని మోవి" పానకములోని రుచిని తలపించును. అందుకనే

ముద్దు ముద్దుగఁ జెప్ప బూనితిమా వన్నె
లాడి తీయని మోవి లంచ మిచ్చు

నని చెప్పుకొనిరి.

కఠినమ్ముగాఁ జెప్పఁ గడఁగితి మా ప్రౌఢ
కాంత వక్షోజముల్ కాన్క పెట్టు

నట. వక్షోజములు పసిడి మసమిసలను వెలయించుచు కడు నాకర్షణీయముగా నుండును. పట్టి చూచినగాని బిగువుతనము బయటపడదు. తిరుపతి కవుల భాష క్రొన్ననలవలె మెత్తనయి యందచందములు పైకి పచరించుచున్నను ఒక్కొక్కప్పుడు భావములలో కరకు తన మంతర్గతమయి యుండును. అది పుణికి పరిశీలించిన గాని యవగతము కాదు. మచ్చునకు "పండితులైనవాగు ప్రతిభాగతి భాసితులాట" ఇత్యాది పద్యములు చూడవచ్చును.

వేంకటశాస్త్రిగారు హాస్యరస ధునీతరంగ మాలికలలో నోలలాడు పరమహంస. వారి కవితలో నేమూలనో యొకమూల హాస్యరసము ఉబికి తొణికిసలాడుచునే యుండును. శ్రవణానందమునందు పాణిగృహీత యం దాయాఘట్టములలో చూపుచునే వచ్చితిని. మానవుల విషయమునందే కాదు, దేవుని విషయమునందును పరిహాసోక్తులు దొరలి వచ్చుచునే యుండును. మృత్యుంజయుని స్తుతించుచు నంత రోగమునందున్నను చతురులు మరువలేదు. "నావంటి భక్తులె నీ యున్కి స్థిరీకరింపవలె నాకున్ "ఫీజు" వేరీయగావల దారోగ్య మొసంగుము. అనియు "మత్ప్రారబ్ధ కర్మంబు భోగ్యము కాకుండ "రెమిష" నిచ్చి రుజనిష్కాసించు మృత్యుంజయా" యిత్యాదులరయునది. తిరుపతి కవుల కవిత్వము సనాతన మార్గములకు భరత వాక్యము. ఆధునిక కవిత్వమునకు నాంది యని తలంతురు. అది యుట్టిమాట. వారు సనాతనంపు దారుల నంటి

మారాహిత క్షీరవారాశి హీరామృ
తైరావత ప్రభా చోరకములు

ఇత్యాది పద్యములు పెక్కు రచించిరి. వారు ప్రాత పద్ధతుల కెప్పుడు స్వస్తి చెప్పలేదు. నూతన దారులు నిర్మించలేదు. ప్రాతలో

శ్రోత్ర లేర్పంచిరి. వీరి కవితా సౌలభ్యమునం దచ్చటచ్చట పేలవము లేకపోలేదు. చివరికి పోనుపోను అదియే మిగిలినది. వేంకట శాస్త్రిగారు "గిలికితి" ననుటలో నా భావమే స్ఫురించును. దానికి నీరసము తోడయినది. అందుమూలమున తరువాతి కావ్యములు చదువుట కూడ విసుగు పుట్టించును.

౧౩

## సారస్వత రచనలు

"స్వస్థానవేష భాషాభిమతా స్సన్తో రస ప్రలుబ్ధధియః" తిరుపతి కవులు సంస్కృత పండితులు. అయిననేమి దేశభాషాభిమానము వారిని తెలుగు కవులుగా మార్చివేసినది. జాతీయత పొంగి యుబుకెత్తినది. నూరు సంవత్సరముల పైకాలమునుండియు సంస్కృతంపుం బలుకుబడుల ముసుగులో నుక్కిరి బిక్కిరగుచు శ్లేష బంధకవిత్వముల సంకెలలో నవయుచున్న తెనుగు సారస్వతము మీఁదికి చూపు మరలినది. తెనుగు తనమును కలిగింపవలయునను బుద్ధి పుట్టినది.

శతావధానులయి కార్యరంగము మీఁదికి దిగిరి. ఆనాఁటి యువకుల చిత్తప్రవృత్తిని చక్కఁగా నవగాహము గావించుకొనిరి. తెలుగు కవిత్వమును క్రొత్తదారులకు మళ్ళించి జాతియత రేఖలు తీర్చిదిద్ది శిష్టవ్యవహార సిద్ధములగు పలుకులు నేర్పి యవధానములందు నాట్యమాడించిరి. మనన హృదయములలో నూతన చైతన్యముబుకెత్తినది. రసార్ద్రతను పొంది యాదరాభిమానము లంకురించినవి. చుట్టు మూఁగి కవిత్వభిక్షకయి యాచించినారు యువకులు, బాలకులు. వారి కోరిక నెరవేర్చినారు తిరుపతి కవులు. వీరి జాతీయతాభిమానము కవిత్వమునకు సౌలభ్య సౌందర్యములు సంపాదించి పెట్టినవి.

ఇతర దేశమ్ములను జనియించుకంటె
నాంధ్ర దేశాన జనియించు టార్య హితము

అని శివభక్తిలో నుడివిన యీ పద్య పాదములు పై యభిప్రాయమును దృఢపరచుచున్నవి. ఆ యభిమానమే తెలుగు కవిత్వమును సంస్కృతినుండి దూరముగా తొలగించి లోక వ్యవహార సిద్ధము గావించినది. అందుమూలముననే సౌలభ్యము నిరవుకొన్నది.

ఒక్కొక్కప్పుడు జాతీయములు వ్యాకరణములకు లొంగక పోవచ్చును. అది వ్యాకరణ దోషముగాని ప్రయోగించిన కవి దోషము కాదని వారి వాదన. అది సత్యము. "ప్రవాహినీ దేశ్యా" దేశ భాషలు సజీవములు. కాలము గడచినకొలది అర్థములు మారును. పదములు నూతన పరిణామము చెందును. కవి లోకానుభవమువలన వానిని గుర్తించును. తన కావ్యమునం దుపయోగించును. "నిరంకుశాః కవయః" వారి ననుశాసించు వా రుండరు. ప్రయోగ శరణ్యములు వ్యాకరణములు. కవి వానిని సరిగా వెతికి సూత్రింపలేక పోవుట వాని తప్పు. ఏ భాషకు సంపూర్ణమగు వ్యాకరణము లేనేలేదు. వ్యాకరణ కర్తలు కంచు కాగడాలు వెలిగించి సారస్వత సముద్రము గాలించినను రత్నములవంటి ప్రయోగము లే మూలనో నక్కి యుండును. ఆ సంగతి గుర్తింపలేరు సంస్కర్తలు. అసమగ్రమగు వ్యాకరణ మాధారముగా చేసికొని పూర్వకవి ప్రయోగములను దిద్దుటకు పూనుకొందురు.

కాళిదాసు కవికుల గురువు. కుమార సంభవమునందు "త్రయంబకం దదర్శ" అని యుపయోగించెను. "ఇకో యణచి" యను సూత్రము దానిని సాధింపలేదు. ఏ భాష్యములు దానిని సమర్థింపలేవు. అట్లని దానిని దిద్దుట యా మహాకవికి ద్రోహము చేయుట. ఆయనకే కాదు, ఆయన నాదర్శముగా గొనిన కవిమాన్యులకు సంస్కృత సారసత్వమునకు గూడ నపచారము చేసినట్లగును. కవిత్రయ విరచితమగు భారతము తెనుగు సారస్వతమునకు వేదము. కవులకు ప్రమాణ గ్రంథము. వ్యాకరణములకు మహాభాష్యము. "తెనుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది" దాని వెలుగున భారత మహాసముద్రమును పరిశోధించి నన్నయాది మహాకవుల ప్రయోగములను దిద్దుట యవివేకమని తిరుపతి కవులు 'భారత సంస్కరణము' అను వ్యాసమునందు సంస్కర్తలను గద్దించిరి.

భారతమిట్లెయుండునని పండిత మండలి నమ్మి దాని యా
భారమునన్ గవిత్వము పదంపడి కట్టుకొనెంగదా తదా

ధారముఁబట్టి లాక్షిణిక తండము లక్షణముల్ రచించె నే
డారసి దిద్ది యేమి ఫలమయ్య చెడుంగద వారి పూనికల్.

అని ప్రబోధించిరి. దానికి దృష్టాంతములు చూపిరి. "న, జ్ఞానికి నుపదేశ విధిఁ బ్రకాశము" అను దాని నాధారము చేసికొని సోమయాజులు వాడుకతన "జ్ఞా"కు "కా"కు యతి అప్పకవి విధించి యున్నాడు. ఇటీవల "ప్రజనితము" అని దిద్దియున్నారు. దీనింబట్టి యప్పకవి లక్షణ మేమి కావలయును. తిక్కనగారి ప్రయోగము ననుసరించిన తరువాతి కవుల ప్రయోగములకు గతి యేమి యని చేతికి వచ్చినటుల భారతముదిద్దిన సంస్కర్తలను ప్రశ్నించిరి. ఇట్లే "నరపతి నమ్మ్మినమ్మ్మక" యనుదానిని 'నరపతి మిత్రున్నమ్మ్మి' అని దిద్దిరి. ఈ దిద్దుపాటు మూలమునకు విరుద్ధము. ఈ ప్రయోగము నాధారము చేసికొని "వినీ వినక" యని శ్రీనాథుడును "రోసీ రోయక చేసీ చేయక" యని ధూర్జటి మొదలగువారును వాడిరి. తిక్కనగారి ప్రయోగము రూపు మాపితిరి. వీరికేమి గతి కల్పించితిరి. ఆ ప్రయోగము వ్యాకరణ సిద్ధము కాదని దిద్దితిరి. తెనుగునకు సమగ్రమగు వ్యాకరణము లేదు. సంస్కృతమునకు భాష్య ప్రయోగ మెట్టిదో తెనుగునకు మహాభారత ప్రయోగ మట్టిది. సూత్రకారుని సమ్మతి లేకున్నను భాష్యకారుని ప్రయోగ మున్నచో సూత్రము పుట్టించును. అని తిరుపతి కవులు బోధించిరి.

"వృత్తికిన్నరుదుగ" అని భారతమునం దున్నది. దానిని చూచి పోతన తన భాగవతము నిండ "సర్వమున్నతని" ఇత్యాది ప్రయోగములు గావించెను. అహోబల పండితుని కాలమువరకు దీనిని మార్చినవారు లేరు. "లుక్సంశ్లేషా నాచి" అని యుండుటచేత ఇటీవల వారు భారతము ముద్రించు నప్పుడు మార్చిరి. ఇటువంటి చక్కని జాతీయ పదములు వ్యాకరణమునకు లొంగ లేదని మార్చివేసి నారు సంస్కర్తలు. అంతటితో వారు విరమించలేదు. శబ్దరత్నాకరమునం దీ యర్థము లేదని శబ్దములనే కొన్ని చోటులందు మార్చిరి. వ్యాకరణములు శబ్ద రత్నాకరములు పూర్వకవి కృతుల నాధార

మున పుట్టినవి. అట్టి కవి మహర్షుల ప్రయోగములను ఇష్టమువచ్చి నట్లు దిద్దుచు వచ్చిరి సంస్కర్తలు. అందుమూలమున కవితల్లజుల చేతులలో స్వేచ్ఛా స్వతంత్రము లనుభవించిన సారస్వత వాణి కర పాదములకు సంకెలలు బంధించి కదలక మెదలక క్రొత్తగాలి పీల్చు కొనుటకైన వీలు లేకుండునటుల గావించినారు సారస్వత స్వభావము భాషా పరిణామము నెరుంగని సంస్కర్తలైన పండిత మాన్యులు. వారి దోషములను వారికి నిరూపించినారు తిరుపతి కవులు.

సంస్కృతపు భారతమునకు సంకటమ్ము
తెలుఁగు ప్రతుల కన్యోన్యము కలతపాటు
తదనుసారి కవీంద్రుల దారి కడ్డు
భారతం బిట్లు దిద్దుట పాడి యగునె

అని మందలించిరి. కవితావాహిని కడ్డుకట్టలను తొలగించిరి. కవి లేఖినికి స్వేచ్ఛ ప్రసాదించిరి. సాహిత్యాభివృద్ధికి రహదారులు కల్పించిరి. ఇట్టి ప్రయత్నము ఒక్క నన్నయ తప్ప శ్రీనాథాది మహాకవులలో నెవరు సాధింపలేదు. వీరి యీ రచనలు తరువాత కవిలోకమున కాధారములైనవి. చీకటియందు పడియున్న గ్రంథము లందలి రహస్యములను తిరుపతికవులు వినిర్గతము గావించిరి.

తిరుపతికవుల విమర్శనా దృష్టి యతి నిశితమయినది. బుద్ధి తీక్ష్ణమయినది. వారేగ్రంథమును పరిశీలించినను స్తనశల్య పరీక్ష గావింతురు. వారు చదవని గ్రంథములేదు. గ్రహింపని రహస్యము లేదు. సూక్ష్మాతి సూక్ష్మ విషయమయినను వారి దృష్టికి భూతద్దము నందువలె స్థూలముగా విస్తరించి కనిపించును. అందు భారతమును గురించి వారుచేసిన పరిశ్రమ పొగడతగినది. కందుకూరి వీరేశ లింగముగారు గిడుగు రామమూర్తి పంతులుగారుకూడ అంత పరి శ్రమ చేయలేదనవచ్చును. గిడుగు రామమూర్తి పంతులుగారి దృష్టికి తగలని ప్రయోగము సారస్వతమునందు లేదు. వారి పరిశో ధనను మించినది తిరుపతికవుల పరిశోధన.

వీరి 'భారత విశేషములు' అను గ్రంథమును చదివినవారికీ సంగతి యవగత మగును. ఇట్టి గ్రంథము తెలుగునం దదివరకు వెలువడి యుండలేదు. ఇదియొక లక్షణ గ్రంథము. సారస్వతమునకు వెలుగుదీపము. దీని సహాయమున కవిత్రయమువారి కవితారీతులు ప్రయోగరహస్యములు వింత పోకడలు నవగతము గావించుకొన వచ్చును. దానిని తిరుపతికవుల రచనల వైపునకు మలిపి చూచినచో వారి కవనంపు తీరులలోని మరుగు మట్టులు పరిస్ఫుటముగా గోచరించును. మచ్చునకు రెండుమూడు సంగతులను చూపింతును.

పాణినీయ రహస్యజ్ఞత

భీమాసుర వీరుల ము

ష్టాముష్టి రణోత్థితచ్ఛటా శబ్దంబుల్ (అరణ్యా 3 ఆ)

అని నన్నయభట్టు అరణ్యపర్వమునందు రచించెను. ముష్టాముష్టి యని యుండరాదు. "ముష్టీముష్టి" అని యుండవలయును అని కొందరజ్ఞులు శంకచేసిరి.

నన్నయ మహాపండితుడు, సకల భాషావేత్త. ఆయన ప్రయోగము సకల కవిలోకమునకు తలమాణిక్యము. భారతమన్నను కవిత్రయమన్నను తిరుపతికవులకు నమితగౌరవము. నన్నయగారి మీద వారికున్న గౌరవము మరెవ్వరికిలేదు. దీని సాధుత్వాసాత్వములు తత్త్వద్వ్యాఖ్యానము వలన నెరుగఁదగును. ఇది పాణినీయ రహస్యము. అది నన్నయ విజ్ఞుడు కావున రహస్యము గుర్తించి వాడెను అని తెలిపిరి. అసలు రహస్యమిది 'ఇచ్ కర్మ వ్యతిహారే' యని కౌముది. 'కర్మ వ్యతిహారే' యో బహువ్రీహి తస్మాదిచ్ సమాసాంతః" ముష్టీముష్టి అని వ్యాఖ్యా, "ముష్టిభి ర్ముష్టిభిశ్చ యత్ ప్రవర్తితం యుద్ధం తత్ ముష్టీముష్టి"యని రూపమేర్పడును. ఇట్లు వాడిన యతి భంగమగును. వ్యాకరశాస్త్ర మాసాంతము చదివినవాడు నన్నయ. దాని మరుగులు గుర్తించినవాడు కావున ముష్టాముష్టి యని వాడెను. శబ్దరత్నావళి యందు "వ్యతీహార

లక్షణ బహువ్రీహి ర్వ్యతేత్ర ఏవం ముష్టాముష్టి దండాదండి అస్య సమాసస్య అవ్యయత్వం బోధ్యం'' అని యున్నది. ఇది తెలియని వారు నన్నయయందు తప్పు నారోపింతురు. ఈ ప్రయోగము నాధారముగా చేసికొని తిరుపతికవులు పాండవ విజయమునందు ''బాహాబాహి ముష్టాముష్టి కేశాకేశి తలాతలి'' యనియు ''ముష్టీముష్టి రణంబుఁ జేయడీకొనియె. బలే'' అనియు రెండు రూపములు వాడిరి. బాహాబాహావి అని యేలనో షష్టిపూర్తి ప్రతియందు దిద్దిరి. ఇది వేంకటశాస్త్రిగారు చూడక పోవచ్చును.

తాను ప్రయోగపు సొగసు

ఎందులదాన వేకతమ యియ్యమునానది నోడ సల్పుచున్
సుందరి నీకు నిట్లునికిఁ జూడగఁ దా నుచితంబె (ఆది. 4 ఆ)

ఇందు తాను వ్యర్థపద మనియు గణపూరణము కొరకు భారతమునందు నన్నయ వాడెననియు అందలి యందము తెలియని వారూహింతురు. దాని సొగసు గ్రహించినవారు తిరుపతికవులు. మొన్న మొన్న విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పతరువును విమర్శించుచు నిట్టి ప్రయోగముల నెత్తిచూపి వెక్కిరించిరి.

శబ్ద సౌందర్యము గ్రహించుటకు సుహృదయత్వ ముండవలయును. సారస్యగ్రహణశక్తి కావలయును. అది తాను పదము లుపయోగించుట భారతములో పెక్కుచోటులందు కనిపించును. అందుచేత నొక యందము వచ్చును. తిరుపతికవులు నానారాజ సందర్శనమునందు ''ఆనతిచ్చుటది భాగ్యముకాదె'' యనియు ''మదనాభిరామ రాణ్మణి బిల్హణకవీంద్రునితో విరోధించి తాఁ జేవ చెడడె'' అనియు వాడిరి. ఇట్టివి వారి గ్రంథములందు చాల చోటులగలవు. ఇవన్నియు నా యీ ప్రదేశములం దంద మొదవించును. పాదపూరణము కొరకో గణపూరణము కొరకో వాడబడినవని సహృదయులు తలంపరు.

లోకోల్లంఘనము

మరవ కనుష్టించునది సమంజస బుద్ధిన్ (ఆది 3 ఆ)

ప్రజాపతి నిభుండగు భార్గవునకు (ఆది 3 ఆ)

అనుష్టించు, ప్రజాపతి దురర్థములు గలవి. వీని నాలంకారికులు అశ్లీలములని నిర్దేశించిరి. ఇటువంటి పదములు భారతాది గ్రంథములందు చాలకలవు. లాక్షణికులనుకూడ కవులు లక్ష్యము చేయలేదు. దానికి కారణము వారి నిరంకుశత్వము. లాక్షణికుల కేమి వ్యాకరణకర్తల కేమి మార్గదర్శకులు మహాకవులు. వారి కింకొకరి శాసనమేమిటి? ఇట్టి భారతప్రయోగములను చూడక యితరుల గ్రంథములను విమర్శించుట వెక్కిరించఁబోయి వేళాకోళము చేయించుకొనుట. విమర్శకునకు సమస్త గ్రంథముల పరిచయముండ వలయును. నిశితమగు పరిశీలనాదృష్టి యలవడ వలయును. హృదయమునందు రాగద్వేషములకు చోటీయరాదు.

రామాయణ కల్పతరువును విమర్శించుచు ఇట్టి యశ్లీలం ''బొక్క''టి యెత్తిచూపినటుల నాకు జ్ఞాపకము. విశ్వనాథ సత్యనారాయణగారు తిరుపతికవుల శిష్యులు. వారంతటివారు వారు. తిరుపతికవుల ప్రయోగములన్నియు వారికి హృదయగతములు. అవి యన్నియు వారి రామాయణమునం దగుపించును. తిరుపతి కవులు ''పృథ్వీభరం బొక్కటా'' యని వాడిరి. దీనిని రామకృష్ణ కవులు శతఘ్నిలో వేల్చిరి. దానికి తిరుపతికవులు కొల్లోకొల్లలుగా పూర్వకవి ప్రయోగములెదుట పెట్టిరి. ''హరి తా జయమొందఁ గూర్పకున్న'' భారత ముద్యోగపర్వము 2 వ ఆశ్వాసము. ''గుద్దంటఁద్రవ్వి త్రవ్వి'' కళాపూర్ణోదయము 4 వ ఆశ్వాసము. ఇంతకంటె నశ్లీలములే'ముండ' గలవు. ఇవే కావు ఔపచారికము, భిన్నక్రమము, పునరుక్తావభాసము మున్నగునవి యెన్నో కలవు. తిరుపతికవుల భారత విశేషములు కవులకు కల్పతరువు.

వ్యాకరణ మొక్క త్రోవ మ
హాకవు లొక త్రోవ కోశ మఖిల మ్మొక త్రో
వై కన్పట్టెడి నీ భా
షా కావ్యమ్ములను దఱచు చదివిన కోలఁదిన్.

అని నిరూపించిరి.

భారత మాంధ్ర సత్కవుల పాలిటి వేదము దాన నుండు వా
గ్ధోరణు లెట్టివేని యవి త్రోయగ రానివి.

అని నిర్ణయించిరి. ఒక విధముగా భారత విశేషములు లక్షణ గ్రంథము. దానికి తిరుపతికవుల కృతులు లక్ష్యములు. వ్యాఖ్యానములు. లాక్షణికుల చూపు తప్పించుకొనిన ప్రయోగములన్నియు నం దగుపించును. అది యవగతము చేసికొనలేక రామకృష్ణ కవులు పాండవ రాజసూయముమీాద 'శతఘ్ని' యను విమర్శ గ్రంథము ప్రకటించిరి. దానిని ఖండించుచు 'పాశుపతము' అను గ్రంథమును తిరుపతికవులు వెలువరించిరి.

విమర్శన సత్యాన్వేషణము. దేనినయినను చక్కగా నాలోచించి విమర్శించ వలయును. లేనిచో విమర్శకుడు లోకమును తప్పుదారికి మరల్చును. అందు మూలమున సారస్వతమునకు కవికి తరగని యపకారము ద్రోహము చేసినవాడగును.

నన్నయ భారత పీఠికయందు తన్ను గురించి 'తనకుల బ్రాహ్మణున్' అని వ్రాసికొనెను. దానికి కందుకూరి వీరేశలింగంగారు నన్నయభట్టు వైదికి. కుల బ్రాహ్మణు డనగా కుల పురోహితుడు. నన్నయ రాజరాజ నరేంద్రుని కుల పురోహితుడని వ్యాఖ్యానించిరి. ఆనాటి నుండి యీా నాటివరకు నన్నయ కులపురోహితుడనియే లోకము నమ్ముచున్నది. అది వాని ముఖమున శిలాక్షరమైనది. బ్రాహ్మణ శబ్దమునకు పురోహితుడను నర్థ మెక్కడలేదు. 'బ్రాహ్మణో విద్వాన్' అని. కుల విద్వాంసుడు అనగా కులగురువని భావము. అసలు సత్యమిది. రాజరాజనరేంద్రుని కాలమున తెనుగు దేశములోని జనులు బౌద్ధులని వేదమతస్థులని రెండు కులములుగా

నుండిరి. రాజరాజ నరేంద్రుడు వేదమతస్థుడు. నన్నయ రాజరాజ నరేంద్రుని కులమగు వేదకులమునందు బ్రాహ్మణుడయిన కులగురు వని దాని భావము.

ఆ కాలమును చరిత్రను కొంత పరిశీలించినచో కులబ్రాహ్మణుడను దానికి సరియగు నర్థము గోచరించెడిది. పదునొకండవ శతాబ్దమునాటికి నియోగి వైదిక తెగలేర్పడలేదు. రాయన భాస్కరుని కాలమునుండి యేర్పడినవి. అతడు పదమూడవ శతాబ్దాంతము లోని వాడయి యుండవచ్చునని వాదన. నన్నయ వైదికి కాడు. నియోగికాడు. బ్రాహ్మణుడు. పంతులుగా రనుకొనినట్లు కుల పురోహితుడును గాడు. ఇంకొక విషయముకూడ మనవిచేసి ప్రకృతము లోనికి ప్రవేశింతురు.

ఆంధ్ర భాగవతకర్త పోతనగారు గతానుగతికముగా నాయన రామభక్తుడని యందరు నొకటే మాటగా నమ్ముచుంటిరి. భాగవత మునకు పీరిక వ్రాసినవారిలో నొకరు పోతన తారకమంత్రము జపించుచుండగా రాముడు ప్రత్యక్షమయి భాగవత కృతి నర్థించినా డని వ్రాసిరి. ఇంకొకరు ''సర్వం విష్ణుమయం జగత్తు''ను నది చక్కగా ననుభూతికి తెచ్చికొనిన విష్ణుభక్తుడని నుడివిరి. పోతన పీరికయందు ''మహనీయ మంజులపులినతలంబున మహేశ్వర ధ్యానంబు చేయుచుఁ గించి దున్మీలిత లోచనుండనై యున్నయెడ''నని పలికెను. దీనిని బట్టి పై రెండువ్రాత లసంబద్ధములని తేలుచున్నవి. ఆయన శివభక్తుడు. ఆయన వంశము వారందరు శివపూజా పరులు. తల్లి లక్కసాని సదాశివపాద యుగార్చనానుకంపానయ వాగ్భవాని. తండ్రి శైవశాస్త్రమతస్థుడు. పోతనకు విష్ణుభక్తి నంటగట్టి లోక మును విమర్శకులు తప్పుడు దారికి మరలించిరి. దీనిని నమ్మటము—ప్రతివాది ''నేను బ్రతికియున్నా''నని మొరపెట్టుకొనుచుండగా ''సాక్షులు నీవు మరణించితి వని చెప్పిరి. నీమాట నమ్మటకు వీలు లేదు.'' అని జడ్జి కేసు కొట్టివేసినటు లున్నది. అనాలోచితములైన యిట్టి విమర్శనల మూలమున ననేక యనర్థములు వాటిల్లుచున్నవి.

రామ కృష్ణకవులు పండితులు కాదని నే ననను. దోష కలుషితమైన వారి బుద్ధి కన్నియు దోషములుగా గనిపించినవి. తిరుపతి కవులు చక్కని సమాధానములు చెప్పిరి. మచ్చునకు "తాపసి" అను శబ్దము తప్పు అని రామకృష్ణుల వాదన. తాపస శబ్దభవము తాపసి "అనుడు వేల్పు తాపసి." అని పాండురంగ మాహాత్మ్యము 5వ ఆశ్వాసమునందు కలదు. మానుష శబ్దభవము మానిసి. ఇది యికారాంత మెట్లైనదో యది యట్లే యని తిరుపతికవుల సమాధానము. ఏఁడోయి ఏఁడ+ఓయి ఏఁడోయి కాదు. ఏడనోయి కావల యునని వారి వాదము. వారు విడతీయటమే తప్పు. ఏఁడి+ఓయి= ఏఁడోయి ఏడేరేదేవి శబ్దము లర్థవిశేషమ్మునం దికారాంతములగు, హ్రస్వాంతములగు నని త్రిలింగ లక్షణ శేషమునందున్నది. ఖండ బిందువు లేకపోవుట అచ్చుతప్పని వీరి సమర్థన. "ముక్కు తెగ బారెడు చేసితి ఇది యేటి పలుకుబడి, యని వారి వెక్కిరింత. ఈ మాట కోపాతిశయమును సూచించు లోకోక్తి. 'ముక్కు మూరెడు కళ్లు చేరెడు చేసినాడు' అనునది లోకవ్యవహారమని వారి సమాధానము. ఇటువంటి యనేక శంకలను తిరుపతి కవులు పాశుపతము నందు ప్రయోగ పూర్వకముగా సమాధానములు చెప్పిరి. అంతటితో రామకృష్ణకవు లూరుకొనలేదు. మరల పూర్వపక్షములు గావించిరి. దానికి తిరుపతికవులు పునశ్చరణము అను పేరుతో ఖండనము ప్రకటించిరి. నిజమయిన పండితుల వివాదములలో నిగ్గయిన రత్నములు నిర్గతము లగుచుండును. అవి భద్రముగా కవులు హృదయగతము గావించుకొందురు. తిరుపతి కవుల శృంఖలా తృణీకరమునందు సార స్వతమునకు కంఠాలంకారముల వంటి విషయములు పెక్కు వివరింప బడినవి. అవి మాపుకొనరానివి. రామకృష్ణకవుల సంబంధీకులలో నెవరో వారి శిష్యులని యూహ, శ్రవణానందము పాణిగృహీతలను "శృంఖల" యను పేరుతో విమర్శించిరి. దానికి శృంఖలా తృణీకరణము ఖండన గ్రంథము. తిరుపతి కవులు రచించిన కృతు లన్నిటిలో శ్రవణానందము చాల రసవంతము నుత్తమము నైన గ్రంథము.

దానివలన తిరుపతి కవుల కీర్తి చిరస్థాయిని పొందినదని చెప్ప వచ్చును.

ఒక శ్రవణానందమ్మున
నొక పద్యమునందుఁ గల్గు నొక పాదము నం
దొక యక్కరమున కొసఁగిన
సకలమ్మగు రత్నగర్భ చాలునె తూఁపన్

అని యొక కవి యనెను. ఇందు అతిశయోక్తి లేకపోలేదు. కొంత నిజము కాకనుబోదు. ఇప్పటికిని దానియందు నూటికి తొంబది పద్యాలు నోటికి వచ్చినవారు కలరు. దానినిబట్టి యది యెంత రస వంతమగు గ్రంథమో మనము గ్రహింపవచ్చును.

కవిః కరోతి కావ్యాని, లాలయ త్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి, మరు ద్వహతి సౌరభం

మరత్తు వేడిది కావచ్చును. చల్లనిది కావచ్చును. చల్లగాలి వినుతియైనచో వేడిగాలి దూషణమగును. రెండును కీర్తిసౌరభమును వెదచల్లుననుటలో సందేహము లేదు. దూషణము నొక విధముగా లాలనమే. అందుమూలమున నిరుపక్షములవారు నుత్తమ జను లగుదురు. కావున గ్రంథకర్త నిందకు కాక పడవలసిన పనిలేదు. విమర్శలకు శంకలకు తిరుపతికవు లిచ్చిన సమాధానములు కవుల కందరకు ముఖ్యముగా కావలసినవే. అవి సారస్వత రంగమును విశాల ముగా పెంచి కవితా వాణికి మరింత తావు నాట్యమునకు కల్పించు చున్నవి. ఇందు వ్యాకరణ విషయములేకాక రసవిషయములు నాయికా నాయక విషయములు సందేహములు తీరునట్లు చర్చింపఁ బడినవి. అంతేకాదు. కొన్ని వింతలు వినూతనములు సూచింప బడినవి. వ్యాకరణ విషయముల మాటటుంచి క్రొత్త సంగతులు పరిశీలింతము.

తనదు చిత్తమ్ము నేనియుఁ దగిన సొగసు
గలుగు చెలిమిన్న కడకంపఁ గదలి రాదు

అట్టిచోఁ గేవలాన్యుల ననుప నగునె
దౌత్యమున కన్న సతి పొందు తప్పిదంబె

అను నీ పద్యము పాణిగృహీతయందుగల పద్యములలో చక్కని పద్యము. భావ పూరిత మయినది. ఇది నాయికా నాయకుల యధమత్వమును ధ్వనింపచేయు పద్యము. ఇది,

నపుంసక మితి జ్ఞాత్వా, ప్రియాయై ప్రేషితం మనః
తత్తు తత్రైవ రమతే, హతాః పాణినినా వయం

అను శ్లోకమును మనస్సు నందుంచుకొని వ్రాయబడినది. 'దౌత్యమునకన్న సతిపొందు తప్పిదంబె' యను పాదము నిరర్థకమని విమర్శకులు పూర్వపక్షము గావించిరి. ఇది యర్థాంతరన్యాసముగా నుపయోగించిన పాదము. నాయకురాలు సామాన్య. దౌత్యము నీచకృత్యము. దౌత్యమున కంగీకరించువాడు నీచుడై యుండును. అట్టివాడు సామాన్యయగు నాయకురాలిని పొందుటకు వెనుతీయడు. అది దూతలకు తప్పుగా తోచదు. అది వారికి సహజము. ఇందులకు 'నిశ్శేషచ్యుత చందనం స్తనతటం నిర్మృష్ట రాగోధరః'యను లక్షణ శ్లోకము 'దూతి! త్వయా కృతమహో నిఖిలం మదుక్తం' అను పుష్పబాణ విలాసమునందలి నీచనాయికల నుదాహరణగా చూపించిరి తిరుపతికవులు. నాయికా భేదములు వానివలన నేర్పడు కావ్య భేదములు, పూర్వకవుల భిన్న కావ్య రచనలు మొదలగు పెక్కు విషయములు సాహిత్య పిపాసువులు తెలిసికొనవలసినవి వివరించిరి. అవి యన్నియు చదివి తీరవలయును.

శ్రవణానంద పాణిగృహీతలు దుర్నీతి బోధకములను విమర్శకు "బుడ్డనమ్ముకొని యేటఁబడ్డ విధమ్ము" అను శ్రవణానందములోని లోకోక్తి అశ్లీలమను శంకకు తిరుపతి కవులు పెక్కు విషయములను తెలుపు సమాధానము లిచ్చిరి. ఇంత యేల విధవాస్త్రీ లింగ పుల్లింగ వివక్ష చేయుచు వివిధ విషయములు ఉదాహరణలతో చర్చించిరి. ఒకటేమిటి వారి లేఖిని సకల సారస్వతాలంకారిక

వ్యాకరణ ప్రబంధాదుల మీదికి దుముకులు పెట్టినది. దానికికన్నులు కాళ్ళున్న వేమో యనిపించినది. మాటలు వచ్చునేమోయని మన స్సును మరపించునది. "శివ శివ" "వేయిమాట లేకఁ జెప్పగ నేటికిఁ జిత్తజాత సంభవ మగు నా యవస్థ భగవంతు డెఱుంగును" అను శ్రవణానందములోని వైష్ణవురాలగు నాయిక "శివశివ" యనిన దానిని సమర్థించుటకు తిరుపతికవులు చూపిన దృష్టాంతములు లోకానుభవములు ప్రశంసనీయములు వారు రూపు తాల్చిన సారస్వత భాండాగారములు. గ్రంథగత విషయము లన్నియు నూరుకొని వచ్చును. వారిని కవ్వింపవలయును. ప్రయోగములు వర్షములవలె కురియును. అట్టివారిని రెచ్చకొట్టుటవలన సారస్వతమునకు కనకాభిషేకము రత్నాభిషేకము కలుగును. నవీన నాగరికులు పూర్తిగా వచ్చీరాని పాండిత్యముతో తెలుగు కవులు అనాగరికులు, స్త్రీలను నఖశిఖపర్యంతము వర్ణించిరి. పచ్చి శృంగారములను కావ్యముల లోని కెక్కించిరి. అని యేమేమో తూలనాడిరి. వారికి 'శృంగార రసము' అను వ్యాసమునందు తిరుపతికవులు సమాధానము చెప్పిరి. శ్రీనాథాదులు వ్యభిచారులని నిందించినవారికి పాఠము నేర్పిరి.

తిరుపతికవు లెచ్చటికి పోయినను పండితులు వారిని విడువ లేదు. ఏదో యొక శాస్త్రవాదము లోనికి దింపుచు వచ్చిరి. వారు గండర గండడులు. తిరుపతి కవులు వారికి వాయి తెరువకుండ సమాధానములు చెప్పి విజయములను పొందుచు వచ్చిరి. కొప్పరపు కవులతోడి వివాదకాలమునందు తిరుపతి కవులు గుంటూరులో రెండు మూడు నెలలు నివసించిరి. ఆ కాలమునందు నెడతెరపి లేక సభలు జరిగినవి. తిరుపతికవుల శిష్యులు వేలూరు శివరామశాస్త్రిగారు అప్పటి కిరువది యేండ్లవారు, వారి శిష్యులలో నంతపండితు డింకొకడు లేడు. సర్వవిధముల గురువులంతవాడు. అప్పుడు సాహిత్య గ్రంథాలు పూర్తిచేసి వ్యాకరణ శాస్త్రము చదువుచుండెను. ఉభయ భాషలందు నిరాఘాటముగా కవిత చెప్పగలడు. స్ఫుర ద్రూపి. చక్కని గాత్ర స్వారస్యము. గాన ప్రవేశమున్నది. ఆ రోజు

లలో తిరుపతికవుల పేరు తలచినచో నవధానములు ఆవేశించు చుండెడివి. వివాదరంగమునకు దూకి తెనాలి గుంటూరు నగరము లలో శతావధానములు సాగించెను. ఇంకేమున్నది. దావాగ్నికి జంఝూనిలము తోడయినది. గుంటూరు మండల మంటుకొన్నది. విబుధ లోక మట్టుడికిన ట్లుడికినది.

ఆ ప్రాంతమందు బెల్లముకొండ రామారావుగారు మహా పండితుడు. ప్రజ్ఞానిధి, ఆయనను గురించి పండితులు చాల చెప్పుకొను చుందురు. సంస్కృతమునందు పెక్కు గ్రంథములు వ్రాసినాడు. శాంత స్వభావుడు. ఆయనను శరణుచొచ్చినారు విరోధిపక్షమువారు. తిరుపతికవులు నరసరావుపేటకు అవధానములకై పోయిరి. కొందరు రామారావుగారిని బాధించి రంగములోనికి దింపిరి. ఆయన 'పశ్యా పశ్యౌ న పశ్యతః' అను సమస్యను పంపిరి. దానిని పూర్తిచేయుడని తిరుపతికవులకు మధ్యవారు సభలో నిచ్చిరి. అది తప్పనినారు తిరుపతి కవులు. సమస్య కఠినమైనది. చప్పున భావము స్ఫురించలేదు. ఆ సాకు పన్ని తప్పించుకొనిరని పండితు లభిప్రాయపడిరి. తిరుపతికవు లన్నమాట రామారావుగారికి వినిపించిరి. వాదమారంభమైనది.ఎట్లు తప్పని యడిగించినారు మరునాడు సభలో రామారావుగారు. తిరు పతి కవు లానా డంతకు ముందే యీ సమస్యను

యః పశ్యతి జగత్సర్వం యో నపశ్యతి సర్వతః
తావుభౌ పరమాత్మానం పశ్యా పశ్యౌ న పశ్యతః

అని పూర్తి చేసిరి. తప్పు నిర్ణయించిన మాటపదారు లిత్తు మనిరి రామారావుగారి పక్షమువారు. తిరుపతి కవులు సమాధాన మీయలేదు. గుంటూరు వచ్చిరి. సమాధాన మీయకుండుటకు కారణము లేకపోలేదు. తరువాత "పశ్యాం పుశ్యాం" అను వ్యాసము తిరుపతి కవులు ప్రకటించిరి.

అది పండితులలో పొగలు రేపినది. తాతా రాయడుశాస్త్రి గారు, జయంతి భగీరథశాస్త్రిగారు మొదలగువారిని రెచ్చగొట్టినది,

అది శాస్త్రవాదము. దిగ్దంతులగు పండితులు దాదా పోక సంవత్సరము పైన తర్జన భర్జనములు కావించుకొనిరి. తప్పని కొందరు, ఒప్పని కొందరు. ఏది తేలలేదు. చివరికి రాయడుశాస్త్రిగారి నిర్ణయం ఖాయమనిరి. ఆయన మహా పండితుడు. విజయనగరం మహారాజావారి సంస్కృత కళాశాలకు ప్రధాన గురువు. వారు ఒప్పేననిరి.

అసలు వాదమిది. పశ్య శబ్ద ముపసర్గ పూర్వకముగా నుండవలయునని తిరుపతి కవుల వాదము. అది కాశికా వృత్తికారుని మతము. అది ప్రాచీనము. "పశ్య" అనవచ్చునని రామారావుగారి వాదన. ఇది కౌముదికారుని మతము. ఇది నవీనము. రహస్యము మొదటనే విన్నవించుకొంటిని. ఈ సంగతి తిరుపతి కవులకు తెలియదని నే ననను. రెండు వాధములు సరియగునవే. పశ్య తప్పుకాదు.

చాలకాలము తరువాత నేనొకసారి "పశ్యాం పుశ్యాం" అను వ్యాసము చదివితిని. మా తండ్రిగారి నీ విషయము ప్రశ్నించితిని. మా తండ్రిగారు శిష్టా నరసింహశాస్త్రిగారు సాంగముగా నిగమాధ్యయనము గావించినారు. గొప్ప సాహితి. చతుశ్శాస్త్ర పారంగతులు. షడ్దర్శనీవేత్త. ఉభయవేదాంత సముద్రములను పుక్కిట పట్టినవారు. దిగ్విజేత. ఒకప్పుడు తాతా రాయుడుశాస్త్రిగా రన్న మాటలివి. ప్రపంచములో నింకొక శాస్త్రము పుట్టలేదు. పుట్టినచో దానిని నమిలి మ్రింగెడివాడవు నరసింహశాస్త్రిగారు అని. వారిని గురించి వేంకటశాస్త్రిగారు "శిష్టావారి విశిష్టత్వము" అని కూడ ఒక వ్యాసమగ్గించుచు వ్రాసిరి. ఆయనయంత పండితులీ తెలుగుదేశములో లేరు. మొత్తము భారతదేశములో కొద్దిమంది యుందురు.

బందరు ప్రసిద్ధమగు విద్యాస్థానము. వాగ్గేయకారక హరి నాగభూషణంగారి వంటి గాయకులు, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి వంటి కవులు, నరసింహశాస్త్రిగారివంటి శాస్త్ర పారంగతు లందు నివసించిరి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, కాటూరు వేంక

శేశ్వరరావుగారు, పింగళి లక్ష్మీకాంతముగారు కూడ నక్కడివారె. బందరునకు వచ్చి పరాభవము పొందనివారు లేరు.

కొప్పరపు గవులకు తిరుపతి కవులకు వైరాగ్ని యచటనే రగిలినది. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు బందరు వచ్చి సభ చేసిరి. అధ్యక్ష పీఠమునుండి నరసింహశాస్త్రిగారు "తిక్కన భారతము బంగారుతీగె శ్రీకృష్ణభారత ముక్కుతీగె" యని తమ యభిప్రాయము దృష్టాంతములతో నిరూపించిరి. అప్పటికి కవి సార్వభౌము లేమియు నన లేదు.

రాజమహేంద్రవరముపోయి నరసింహశాస్త్రిగారు తెనిగించిన మేఘసందేశమును నోటికి వచ్చినట్లెల్ల నిందించుచు విమర్శించిరి. రెండు మూడు సంవత్సరములు వాదోపవాదములు జరిగినవి. తెగ లేదు. శ్రీ నరసింహశాస్త్రిగారు "మహాగజాః పలాయంతే మశకానాం తు కాకథా" అని మౌనము తాల్చిరి. నేను గురుదక్షిణ యను నరువది పద్యములు రచించి సభాముఖమున తేల్చుకొనవచ్చును. బందరు దయచేయుడని వ్రాసి పంపితిని. అప్పటి పండితులకు కవులకు నొకొక్క ప్రతి నంద చేసితిని. ఆ సందర్భమున చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు "పంచశుభం పంచాశుభం" ఓం శాంతిః శాంతిః అని రెండు వ్యాసములు ప్రకటించిరి. కవిసార్వభౌము లే సమాధానము వ్రాయలేదు. నేను వారిని చెన్నపట్టణమునుండి వచ్చుచు రైలులో కలిసితిని. వారిచుట్టు పండితులు కవులు గలరు. ముఖాముఖ వాదనకు పూనుకొంటిని. ఫలితాంశముగా "శ్రీనరసింహశాస్త్రిగారు నిలుచున్న చోట నేను నిలుచుటకైన తగను. వారి పుమారులు పండితులు కాదని నేనన లేదు" అనిరి. అదే పత్రికయందు కొంచెము మార్చివ్రాసి మా తండ్రిగారిని క్షమాపణ వేడిరి. వారికి అదియు పట్టలేదు. అటువంటివారు నరసింహశాస్త్రిగారు.

ఆ నాడు నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మా యింటిలో నుండిరి. నేను మా పితృపాదుల సన్నిధిని కౌముది చదువుచుంటిని. "తుహ్యోస్తాత" జిత్యాది సూత్రపాఠము చెప్పుచుండిరి. నేను

నోరూరకుండక యీ వాదవిషయ మడిగితిని. మా నాయనగారికి తిరుపతి కవులనిన గౌరవము కలదు. వారికి నట్టి గౌరవము మా తండ్రిగారియందు కలదు. వేంకటశాస్త్రిగారు ప్రత్యహము మా యింటికి వచ్చుట కద్దు. మా తండ్రిగారు మాట్లాడలేదు. "పిల్లవాడడుగుచుండగా చెప్పరేమి శాస్త్రులుగారూ!" అన్నారు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

మీరు చెప్పకూడదా? అన్నారు మా నాయనగారు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్యాకరణ శాస్త్రములో తరగని నిధి. వారు వివరణ చెప్పి పశ్య శబ్దము నిర్దుష్టం. తిరుపతికవులు తమ వాదము నిలుపుకొన నింత జరిపిరి. వారి పొరపాటు వారికి తెలియదాయని తేల్చిరి.

ఆత్మకూరునందుకూడ గుణాలయ శబ్దము శాస్త్రవాదనరీత్యా సమర్థించుకొనలేక తెనుగున నన్నయ ప్రయోగము చూపియుందురని నేనూహించుకొంటిని. అయినను గాకున్నను వారి వాదములలో పెక్కు నూతన విషయములు తెలిసికొనవలసినవి ఉండును. అట్టి విమర్శన గ్రంథము లచ్చొత్తించి తిరుపతికవులు సారస్వతమునకు మహోపకారము గావించిరి. అవి కవులపాలిట కల్పతరువులు. వాని యందు చర్చించబడని విషయములు లేవు అవి ప్రయోగములకు యహాభాష్యములు. ఇంత పరిశ్రమ సారస్వత దృష్ట్యా కవులలో మరెవ్వరు చేసినవారు లేరు.

౧౪

## దివాకరాస్తమయము

తిరుపతి వేంకటకవులు దాదాపు పదిసంవత్సరములు సంచారము గావించిరి. ఎదిరించిన కవిమాతంగముల మదగర్వమడంచి కింకవీంద్రఘటాపంచానను లను బిరుదు సంపాదించుకొని, విజయనగరము మొదలు చెన్నపట్టణమువరకు గల దేశమునకు వారి కీర్తి మచ్చలేని మల్లెపూల చాందినీ కట్టినది. అప్పటికి తిరుపతికవులకొకటి రెండేడు లించుమించుగా ముప్పది సంవత్సరములు వచ్చినవి. దేశ సంచారము మీద విసుగు పుట్టినది. కొంతకాల మొకచోట కాలు కుదిరి నిలకడగా నుండవలయునను కోరిక జన్మించినది. దానికి సావకాశముకూడ దొరికినది.

తిరుపతికవులు బుద్ధచరిత్ర రచించిరి. దానిని రామచంద్ర కృష్ణభూపతి కంకిత మొసంగిరి. ఆయన పోలవరము పరగణాకు జమీన్దారు. నియోగి బ్రాహ్మణుడు. మన్మథునింబోలు నందము కలవాడని తిరుపతికవులు వర్ణించిరి. వినికిడికూడ నట్టిదే. రూపసంపదకు తోడు సుగుణము లన్నియు శ్రీవారియందు నెలవుకొన్నవి. బి. ఏ. పట్టభద్రుడు, సంస్కృతాంధ్ర భాషలయందు పండితుడు. కంటి తుదలనుండి యత్తయు రసనాగ్రమునందుండి కోడలును మేలమాడు కొనుచుందురట. కృష్ణభూపతి పండిత పక్షపాతి. కవిలోకమునకు కల్పవృక్షము. తిరుపతికవులు—

తిరిగితి మెల్ల దేశము లదేపనిగా నికమీఁద దేశ సం
చరణ మొనర్పఁగా విసువు చాల మనమ్మునఁ గల్గెనయ్య యీ
తిరుపతి వేంకటేశ కవిధీరుల నొక్కెడ నుండఁజేసి భూ
వర సభలందు ఖ్యాతిని నవశ్యము చెందుము కృష్ణభూవరా!

(బుద్ధ)

అని శ్రీవారి నర్థించిరి. ఆ యర్థించుటలోఁగూడ తిరుపతికవు లాత్మ గౌరవము వదులుకొనలేదు. వారి యునికివలన భూవర సభ లందు శ్రీవారికి ఖ్యాతికలుగునట. బ్రతికినంత కాలము వారాధీమా తోడనే జీవించిరి. బుద్ధచరిత్ర వ్రాయుటకు పూర్వము వేంకటశాస్త్రి గారిని శ్రీవారే యర్థించినట్లు దివాకరాస్తమయమునందు తెలుప బడినది. శార్వరినామ సంవత్సరము జ్యేష్ఠమాసమున కృష్ణభూపతికి కృతి సమర్పింపఁ బడినది. శ్రీవారు తిరుపతికవులను గొప్పగా సన్మా నించిరి. వేంకటశాస్త్రిగారు "చెళ్ళపిళ్ళరాయుడు" మొదటినుండియు నొక్కరికి లోఁబడి యుండుట గిట్టదు. అది ఆయన స్వభావమునకు విరుద్ధము

నరనాథుల్ పదిమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించు నట్టిపని నాచేఁగాదు నీవంటి స
త్కరుణా శాలిని పెంపఁగాఁబెరిఁగి విద్యాబుద్ధులన్నేర్చి నే
ఒరుల న్నిత్యము గొల్చుటొప్పగునె యంబా! దేవి! కామేశ్వరీ

అని చెప్పుకొనిన స్వతంత్రజీవి. శ్రీవారి కొలువునందు కుదురు కొనుట కాయన మనస్సంగీకరింపలేదు. తిరుపతిశాస్త్రిగారు వేంకట శాస్త్రిగారిని మించినవాడు. కాని వేంకటశాస్త్రిగా రనిన మిగుల గౌరవము కలదు.

గురుపద పద్మ భక్తి సమకూరనివాఁడవు గావు దైవతా
దరము వహింప మానవు కృతజ్ఞత కాకరమై కృతఘ్నతా
భర తిమిరోప మర్దన దివాకర మూర్తివినై చెలంగు నీ
యురవడి కెవ్వరడ్డు! కవితోరధునీపతి వోయి తిర్పతీ!

పూనుము కార్యభారమును పూను "సుదర్శనమన్న దేవకీ
సూను కథా విధానమును జూపఁబు లాత్మల సంస్మరింప నే
మానముఁ బూని నీ శుభ సమగ్రతకై జపియించుచుందు నీ
పై నొక చూపుఁదక్క సభపైనొక చూపునుగా మెలంగుచుఁ
(శతావ. లక్ష్మీనరసాపురం)

ఈ పద్యములు వేంకటశాస్త్రిగారికి తిరుపతి శాస్త్రిగారియందు గల గౌరవాదరములు వెల్లడించుచున్నవి. ఇట్టి పద్యములు సభాముఖములం దెన్నోసారులు నుడివిరి. తిరుపతిశాస్త్రిగారిని వేంకటశాస్త్రిగా రన్యాయము చేసిరనియు తక్కువచూపు చూచి రనియు, తిరుపతిశాస్త్రిగారివలన వేంకటశాస్త్రిగారికి పేరు వచ్చెననియు వారి మిత్రులందును శత్రులందును ప్రచారము కలదు. చాలమంది నాతో ననుటయు వింటిని.

తిరుపతిచేత వచ్చెనో యతి ప్రతిభామహిమమ్ము వేంకటే
శ్వరునకు వేంకటేశ్వరునివల్లనె చెందునో యామహాత్త్వముల్
తిరుపతి తద్వివేకము నిలింపుల కైనత మెఱుంగ రింతకున్.

తిరుపతిశాస్త్రి గారు మొక్కవోని పాండిత్యము కలవారు. మహామేధావి. ఆత్మవిశ్వాసము కలవారు. సభాముఖమునందు నిలిచి వివాదమున కందుకొనినచో నాయన ప్రశాంతమగు మూర్తియందు సింహాకృతి గోచరించును. అతిలోక భయంకరములగు గర్జారవములతో వాద ప్రతివాదములు కంఠ వినిర్గతము లగును. ఆ విజృంభణకు పట్టపగ్గములుండవు. వేంకటశాస్త్రిగారినికూడ లక్ష్యపెట్టెడివారు కారు. ఆ సంగతి వేంకటశాస్త్రిగారికి తెలియును. ఆ సమయమునందు శాస్త్రిగారొకయడుగు వెనుక నుండెడివారు. ఆవేశపూరిత చిత్తముతో నాశుధారగా పద్యము లందుకొని నప్పుడు సంస్కృతపద సంఘటితములైన దీర్ఘసమాసములతో హిమవత్పర్వతశృంగాగ్రమునుండి ఘుమంఘుమారావములతో క్రిందికి మహావేగముతో నురుగులు క్రక్కుకొనుచు ప్రవహించు నుత్తుంగ తరంగ సంగతయగు గంగాకల్లోలిని వలె నేకధారగా కవిత దొరలికొని వచ్చును.

ఆ యావేగమునకు సభికులు నిర్ఘాంతపోవుదురు. ప్రతిపక్షులు నిరక్షరులగుదురు. వేంకటశాస్త్రిగారికి తిరుపతిశాస్త్రిగారి శక్తి సామర్థ్యములమీద సంపూర్ణ విశ్వాసము కలదు. వేంకటశాస్త్రిగారు తిరుపతి శాస్త్రిగారిని ప్రోత్సహించిరి. తిరుపతిశాస్త్రిగారు వారిమాటను

కాదనలేదు. శ్రావణమాసమునందు పోలవరము రాజావారి యాస్థానము నందు చేరిరి. శ్రీవారు కాకినాడ యందుందురు. తిరుపతిశాస్త్రి గారుకూడ కాకినాడలో నివాస మేర్పరచుకొనిరి.

తిరుపతికవుల కీర్తివల్లీమతల్లి మొలకెత్తిన యాలవాలము కాకినాడ నగరము. తిరుపతిశాస్త్రిగారి సన్నిధానమునందు దోహదమును పొంది దినమున కొకవింత వికాసమును వహించినది. తిరుపతి శాస్త్రిగారి పేరా చుట్టుపట్టు లందల్లుకొని పోయినది.

రామచంద్ర కృష్ణభూపతి విద్యాభోజుడు. మహోదారుడు. కవితాగోష్ఠులు సాహిత్య సభలు సాగించుచు వచ్చెను. పేరునకు తిరుపతిశాస్త్రిగారు సంస్థాన విద్వాంసులేగాని యాత్మబంధువులకంటె నధిక మగు నాదరమును పొందిరి. పీట వేయించి కృష్ణభూపతి పంక్తి భోజనమునకు పిలువని పూట లేదు. చెంత కూర్చుండ బెట్టుకొని ఛలోక్తులాడని ప్రాతః సంధ్యలు లేవు. బండి పూన్పించి వెంట రాఁ బిలిపింపని ప్రయాణము లేదు. ధూమాగ్నుల వంటిదైనది వారి మైత్రి. "యత్ర ధూమ స్తత్ర వహ్నిః" ఆ ప్రభు వాదరాభిమానములలో తిరుపతిశాస్త్రిగా రనుభవింపని రాజభోగములు లేవు. శాస్త్రి గారి స్వాతంత్ర్యమునకు శ్రీవా రెన్నడు నడ్డురాలేదు.

శతావధాన మొనర్ప సరసులు కబురంప
బంపకుండఁగ మానిపింపలేదు
సర్వదేశంబుల సభలకుఁ బోవుచో
వెంట రమ్మనకుండ విడువలేదు
పీటపైఁ గూర్చుండి పిలువ నంపకయుండ
నే దినమ్మున భుజియింపలేదు
మొదటినుండియుఁ దుట్టతుద దాఁక నొకరీతి
గురుభావమున లోటు జరుపలేదు

ఇట్టి రీతిగఁ బదునెన్మి దేండ్లు జరిపి
కృష్ణ భూపాలకుఁడు దివికేగి నేఁటి

కాయనకు నాకుఁ గల్గు ఋణానుబంధ
మక్కటా దైవ దౌర్బల్య మణచివైచె

నని కృష్ణభూపతి మరణానంతరమున తిరుపతి శాస్త్రిగారు విలపించిరి. ఈ పద్యమును చదువునప్పుడు

ఎదురైనచోఁ దన మద కరీంద్రము నిల్పి
కేలూత యొసగి యెక్కించుకొనియె

నని పెద్దనగారు శ్రీకృష్ణరాయల మరణానంతరము వాపోయిన పద్యము స్మృతికి వచ్చును. శ్రీవారి యాస్థానమునందున్న కాలమున పెక్కుమంది జమీన్దారులు తమ సంస్థానము నందుండుడని తిరుపతిశాస్త్రిగారిని ప్రార్థించిరి. ఆయనలో మొదటినుండి మోసులెత్తి యల్లుకొనిపోయిన కృతజ్ఞత శాస్త్రిగారిని శ్రీవారి యాశ్రయమును విడువనీయలేదు.

ఆత్మకూరు నృపాలుఁ డాస్థానకవులు కం
డంచుఁ బెన్భక్తిఁ బ్రార్థించి నపుడు
గద్వాల రామభూకాంతుఁడు మున్న గ్ర
హార మిచ్చెద నుండు మన్నయపుడు
నితర భూపతు లెందరెందఱో తమయొద్ద
నుంచుకోఁ దలఁచి పిల్పించి నపుడు
పాఠశాలలయందుఁ బండిత పదవిఁ గై
కొనుఁ డంచుఁ బౌరులు కోరినపుడు
కృష్ణభూపాల గుణశంకు కీలితుండ
నగుచుఁ గదలఁగ లేనైతి నకట! యట్టి
పండితుండైన బ్రాహ్మణ ప్రభువుపాస్య
సుగుణుఁ డింకెవ్వఁ డున్నాఁడు జగతియందు (కృష్ణ.ని)

శ్రీ పోలవరము రాజావారు పిఠాపురము విజయనగరము ప్రభువులతో పాటు భాషాసేవ కావించిన సుగుణ సముద్రులు. 'సరస్వతి' యను పత్రికను స్థాపించిరి. అం దముద్రిత పూర్వ గ్రంథము

లను పండితుల వ్యాసములను వ్యాఖ్యానములను కవుల పద్యములను ప్రచురించుచు వచ్చిరి. తిరుపతిశాస్త్రిగారు రా కాలముననే మృచ్ఛకటిక, బాలరామాయణము, ముద్రారాక్షసము, పాండవవిజయము, ఎడ్వర్డు పట్టాభిషేకము అను గ్రంథములను మొదట సరస్వతీ పత్రిక యందు ముద్రించిరి.

రచియించినాఁడ బుద్ధ చరిత్ర కృతిగాఁగ
మేలి నాటకములు మృచ్ఛకటిక
బాలరామాయణ పాండవ విజయ ము
ద్రారాక్ష సేడ్వర్డు రాజమౌళి
పట్టాభి షేకముల్ పావన యుష్మదా
ఖ్యా భూషితంబులుగా నొనర్చి
నీ కీర్తి కాంతకీ లోకమ్మునందు వ
సించు సౌధమ్ము నిర్మించినాఁడ (కృష్ణ. ని)

## కృష్ణ నిర్యాణము

కాల మెప్పుడు నొకరీతిగా కలిసిరాదు. దేవతల నమరులను గావించి మానవులను మర్త్యులుగా నొనరించిన యా బ్రహ్మ పక్ష పాత బుద్ధిని నిందింపవలయును. రామచంద్రకృష్ణభూపతికి శని దశ ప్రవేశించినది. అప్పుడు ప్రభువులకు నలుబదెనిమిదేండ్లు. శరీరమునం దనారోగ్యము ప్రవేశించినది. అంతకంతకు రుగ్మత హెచ్చినది. మందు మాకులు నిరుపయోగములైనవి. మృత్యువు నిడువాడికోరలు మెరయ నోరు తెరుచుకొని నాలు కల్లార్చుచు దాపుల కరుదెంచు చుండెను.

కలలోఁగన్నడె నంచు నానతిడెఁ "బిక్కుల్ దీర్ఘముల్ దేహమిం
గల మాస్యం బదయారసంబు వికటోగ్ర భ్రూసమాలోకమం
భ్రుల మీఁదంబడు నల్లకోటుగల యొక్కం"డంచునాల్గైదురో
జుల కుం బోవుచు కృపారావు

అని తిరుపతిశాస్త్రిగారు "శ్రీ పోలవరం జమీందారుగారి శని మహాదశ" యందు నుడివిరి. "చేయించెం జపముల్ సహస్రములు "కాశీయాత్ర గావించెనుగాని పట్టుకొనిన గ్రహము విడిచి పెట్టలేదు. శ్రీవారు కన్నుమూసిరి

శనిగా! నీ వరుదెంచి పోలవర సంస్థానంబు పాలించు కృ
ష్ణ నృపాలోత్తంసము కల్పపాదపముఁబెల్చం గూల్చియా చెట్టు మీఁ
ద నివాసం బొనరించు సద్ద్విజతతిం దైన్యంబుఁ బొందంగఁజే
సిన నీ చిత్రపుఁజర్య లెల్లరును "ఛీఛీ" యంచు దూషింపరే

సామంతంబునఁ దెచ్చి పోలవర సంస్థానాల వాలంబు నం
గా మాయమ్మొక మొక్కపాఁతె నదియుంగల్ప ద్రుమంబై ద్విజ
స్తోమాధారమునై మహాఫలమునై ద్యోవీథికిం బ్రాఁకుచో
నా మూలంబుఁ బెకల్చివైచితివి మందా! మొక్కలేకుండఁగన్.

ఆరోగ్యంబు నొసంగఁజాలు వరదుండౌ రారా! నీ తండ్రి లో
కారాధ్యుం డటువంటి వానికెటు మందా! నీవు నీ తమ్ముఁడుం
గ్రూరాత్ముల్ జనియించిరో ప్రజలు గగ్గోలెత్తఁగా నంతకా
కారుల్ చెల్లెలొకర్తు చాలునదియుం గాళింది కాలానుజా!

శని చాలండని చెప్పికొందురు విపత్సమ్మగ్నులౌ వార లె
ల్లను సామాన్యముగాఁగ జాతకముఁ బోలంజూడకే మున్ను నీ
జననం బందినవేళయట్టిదిర నీచా! నిన్ను దుమ్మెత్తి పో
యని వారెవ్వరు? మిన్నకే కలుగ వాహా మంచియుండెడ్డయున్

అని యిరువది తొమ్మిది పద్యములలో శనిగ్రహమును గోపావేశమున నాడి పోసికొనిరి. కంటి తొగరు కార్యము సాధింపదు కదా

కలకల నవ్వు మీసల మోసల నటింప
రా జనందగు ముఖ ప్రభలతోడ
సమయానుసారిగా నమృతంబుఁ జిలికించు
వదన గంభీర నిస్వనము తోడ

నాప్తులే తేర రండంచుఁ గుర్చీ కేలఁ
జూపించు వినయ విశ్రుతులతోడఁ
గరుణ చిందించు క్రేఁగంటి చూపులు మీఱ
నలువంకఁ గను లోచనములతోడ
సౌధ చత్వరమునఁ గొల్వుసాలయందుఁ
బడుక వేత్రాసనంబునఁ బ్రౌఢి మీఱ
నుండు నీ రూపు నీ నగ వూర్జితోక్తు
లెట్లు మరపింతువయ్య! యో కృష్ణరాయ!

పదిమంది యైనను బంక్తిని లేకుండ
భుజియింప నేరని పుణ్యమూర్తి
అపకార మొనరించు నతఁ డేగుదేనైనఁ
గోపమ్ముఁ జూపని ప్రాపకుండు
అలవిగాని పచార మడుగు వారలనేని
లేదు పొమ్మనలేని సోదరుండు
ఆశ్రయించినవాని యపరాధ మెంతైన
స్మరియింప నొల్లని సజ్జనుండు
చదువుల టెంకాణ కరుణ లొచ్చని దుకాణ
మాప్త జనముల ప్రాపు సత్యముల కాపు
నాకమున కేగె నఖల లోకైక నుతుఁడు
తృష్ణలకు వేల్పుటావు మా కృష్ణరావు

బహు కుటుంబములను భరియించితివి తత్త
దనుగుణ గౌరవో పాధు లొసఁగి
పెక్కుమందిని జదివించితి వన్న వ
స్త్రంబులు సూట్లు జీతంబు లిచ్చి
చాల మందికి మేటి సౌహార్ద మొసఁగితి
వడిగిన సర్వ కార్యములు దీర్చి
కాపట్య మెఱుఁగని కరుణఁ జూపించితి
వాశ్రిత కోటిపై నాప్తులందు

నరిగితివి చెన్న రాష్ట్రంబునందు ఘనుల
యందుఁ దలమానికంబు ధరాధినేత
పండితుం డన్న ఖ్యాతి తోడ్పడఁగ రామ
చంద్ర వేంకటకృష్ణ రాయేంద్ర! దివికి

ఆనందాత్ముఁడవై సుఖింపుము మహాత్మా సత్యలోకంబు నం
దో నాకంబుననో వికుంఠ నగరీ దుర్గంబునందో శివ
స్థానంబందుననో సమస్త సుర సంస్థానాధి పత్యమ్ముతో
నానా వైభవ యుక్తితో నెపుడుఁ గృష్ణారాయ భూపాలకా!

యని కన్నీరు కాలువలుకట్ట తిరుపతిశాస్త్రిగారు విలపించిరి. ఉత్తముల హృదయ మధు వ్రతములు సుహృత్తుల చిత్తప యోజ మును వదలిపెట్టిరావు. తిరుపతిశాస్త్రిగారికి మిత్రులగు శ్రీవారిపైన బెంగ పొడమినది. నానాట నది మిక్కుటమైనది. అన్న పానములం దభిలాష జీర్ణించినది. నానాట శుష్కించి మంచము పట్టిరి. మేహాసీ రోడ లెల్ల నాక్రమించినది. రెండేం డ్లట్లో గడచినవి. మృత్యు వావేశించినది.

జననం బెత్తిన దాదిగా నెఱుఁగ నే జాడ్యంబు యుష్మద్దయా
జని తారోగ్య నిరంకుశ ప్రతిభ పంచాబ్ద మేగంగ వేఁ
జనుదెంచెన్ జనుదెంచె నేటికి సుహోష్ణంబైన మేహంబు దీ
నిని బాపంగల దేవుఁ డెవ్వఁడిఁకఁ దంద్రీ సూర్యనారాయణా!

బహుమాత్రామయ మొక్కఁడేరుపడి దివ్యంబైన దేహంబు ప్ర
త్యహమున్ గార్శ్యమునొందఁ జేసినను వైద్యంబేమియుం జేయక
న్వహమున్ జాల జపించుచుంటి భవదీయంబైన సన్మంత్ర మో
యహరీశా! దయయుంచి ప్రోవఁగదవయ్యా సూర్యనారాయణా!

దయ యే మూలను డాగెనో, భవదుదాత్తంబైన మంత్రంబనా
మ యదం బేమయిపోయెనో? యమలనామ ప్రభావంబెందులో

వ్యయమైపోయెనో? దేవ! భక్తునకు సంప్రాప్తించునే మేహావా
ర్ధ్మయ మీ యామయ మెంత మోసమిది యారా!
సూర్యనారాయణా!

అని రోగ నివారణకొరకు సూర్యభగవానుని ప్రస్తుతించినారు తిరుపతిశాస్త్రిగారు. కాని యా దేవునకు దయరాలేదు. తెనుగు సాహితీ సరస్వతి పాణితలమున నెలకొన్న వీణాదండము విరిగి పోయినది. కన్నీటి కెరటాలలో తంతువులు సమార్ద్రములైనవి దేశము గగ్గోలుపెట్టినది. కవిలోకము విలోకనముల దిగజారు నశ్రుధారా పూరంబులు దోయిటంబట్టి తిలాంజలు లర్పించినది. వేంకట శాస్త్రిగారి మనస్సు వికలమైనది. కాటుకవంటి నీలంపు విషాద మేఘము లావరించినవి. ఆ చీకటిలో నా మహా కవికి ప్రపంచమే కనిపించలేదు. రాజమహేంద్రవరము సభలో తమ యావేదన నిట్లు వెళ్ళబుచ్చిరి.

గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవనిఁ గ
ణ్ణాట సీతారాము సాటిఁ జేసి
తోడి కలార్థు లేధూర్వహు లెల్వ కీ
ర్ష్య వహించి కలహమ్ము సలుపుచుండ్రు
ఎవఁడెన్నఁడును జార మెలమి విప్పకయె వ్యా
కరణ పాండిత్య ప్రకర్ష మూనె
నోరుఁడు నచ్చని నాదు గరువంబు సడలింపఁ
జాలె నెవ్వని మనీషా బలంబు

ఎవఁడు నా కెక్కుడయ్యు నా యెడలఁ గార
ణాంతరమ్మున గురు భావ మంతరంగ
మున నె కాక వెలికిఁ గూడఁ గనఁగఁ జేసె
నట్టి తిరుపతి కవి దివి కరిగె నకట!

ఈ సీసపద్యమునందు తిరుపతి శాస్త్రిగారిని గురించి చెప్పిన ప్రత్యక్షరము సత్యము.

కలలోనైన నతండు ముందనుచు వెన్క న్నేనటంచు న్మదిం
దలపంబో మతఁ డేనుగూడ నెటులీ తార్మారు చేకూరెనో
బలవంతుండె మహోన్నతంపుఁ బదవిన్ బ్రాకంగ నర్హుండు దు
ర్బలుఁడో కాఁడటువంటి వాఁడనుట సర్వత్రానుభూతంబ కా!

ఏఁబది దాఁటె నా కతని కేఁబది కింక నెలల్ గొఱంత నా
ల్గా బుధమాన్యుఁ డిందనుక నాఁగక సల్పె శతావధానమే
న్నో బహుకాలమై యొకట నుండియు నాతని చేతియూఁతఁ బ్ర
జ్ఞాబహుళావధానపుఁ బ్రసంగము లీడ్చుచునుంటి నెట్టులో
'ఏ నల నూజివీటి సభ కేగితి నిద్దిగఁ ద్రావి' యన్న కో
పానన కాదె యొంటరిగఁ బాకపురిన్ గనఁబోయి తిప్పుడో
దీనిధి! తిర్పతీ! యచటి ధీరులతోఁ గలహమ్ము గల్గు న
ష్టైనియు నేను నీ స్మృతికి నెక్కకపోనుజుమీ సుమిత్రమా!

సభా ముఖమునందు సింగంపుఁ గొదమ రీతి వాద ప్రతివాదములు గావించుట తిరుపతి శాస్త్రిగారిపని. దానిని పత్రికా వ్యాసములందు ప్రయోగములను చూపించుచు వ్యాసముల ప్రకటించి నిలువ బెట్టుట వేంకట శాస్త్రిగారిపని.

కృతకృత్యుండవు నీవు వేఱొకనితోఁ నే మంచుఁ జెప్పం బ నే
మి తుది న్నన్నొకసారిచూచుటకె చెల్మిన్ జుమ్మిరమ్మంచు వ్రా
సితి పోష్టుండని పల్లె యాట నదినేఁ జెల్లింప లేనైతిఁ ది
ర్పతి! విద్వత్సుకవీ! క్షమింపనిది యర్హంబెమ్మెయిన్ బేర్మిమై.

నీ కొమరుండు సత్కవిత నేర్వఁగఁ జాలిన బుద్ధిశాలి త
ద్ధీకుశలత్వమ్ముఁ సరిగదిద్ది త్వదాత్మకు మెచ్చొనర్తు నం
దాకను నాదు రాకకయి నాకమునందుఁ బ్రతీక్ష సల్పు మ
య్యా! కవితిర్పతీ! వ్యవధియాటకు సైఁపఁగ దయ్యయియ్యెడన్

అల దివాకరునకుఁబోలె నస్తమయము
నుదయమునుగూడ నిజమున కుండఁబోవు

దివాకరాస్తమయము

నీ యశఃకాయమున కని నే నెఱిఁగియుఁ
బామరతఁ జేసి విలపింప వలసె సఖుఁడ!

తిరుపతి వేంకటకవులలో నొక్కరొకరు ప్రత్యేకముగా రచించిన యీ యీ పద్యములను చదివి కొంతవరకు వారి వారి కైతలో తారతమ్యము గ్రహింపవచ్చును.

తిరుపతి శాస్త్రిగారు పండితవంశమునందు జన్మించిరి. కట్టుదిట్టములలో బెరిగి సాహిత్య గ్రంథములు చదివి సంస్కృతమునందు కవిత్వము చెప్ప నారంభించిరి. వేంకటశాస్త్రిగారి ప్రోత్సాహమున తెనుగు కవిత్వము చెప్పుటకు పూనుకొనిరి. వేంకటశాస్త్రిగారు మొదట ఆటగోటితనముగా తిరిగి వంశక్రమానుగతమయిన తెనుగు కవిత్వమునందు కృషిగావించి పిమ్మట ఉభయభాషలందు కవులయిరి. ఆ యీ లక్షణములే వారి వారి కవితలందగుపించును. తిరుపతిశాస్త్రిగారి పద్యములు తత్సమ పదములతోడ తద్భవాచ్ఛికపదములు కలిసి యుండును. మధ్య మధ్య దేశీయములు కంఠహారములు పొదిగిన జాతిరతనములవలె ప్రకాశించుచుండును. దీనికి కృష్ణ నిర్యాణ పద్యములలో నొకటవ పద్యము చూడవచ్చును. వేంకటశాస్త్రిగారి పద్యములందు చాలవరకు వ్యావహారిక పదములతో దేశీయములు సమ్మిళితములయి యందందు తత్సమ తద్భవములకు తావొసగుచుండును. తిరుపతి శాస్త్రిగారి పదము ఊతము గలిగి యొండొంటితో గొలుసులోని గొళ్ళెములవలె నిమిడి జిగియు బిగియు గలిగి యుండును. అందుమూలమున శయ్యలో నొక తీరైన యందము కలిగి యెవరు చదివినను చెవుల కింపుగా నుండును.

వేంకటశాస్త్రిగారి పదముల పొందికలో పలుచదనము గలిగి యుండును. అందుమూలమున శయ్యలో సడలింపు గలిగి వారు చదువునప్పుడు శ్రవణానందముగా నుండును. దీనికి ముఖ్యకారణము 'మేమే కావ్యములను రచించినను దాదాపాశువుగానే రచింతుము. పూర్తిచేయుటకు రోజులు వారములు పట్టునేగాని నెలలు సంవత్సర

ములు పట్టవు' అని వారు అవధానసారము పీఠికయందు నుడివినదే కావచ్చును. జాతక చర్యాది గ్రంథములన్నియు నీరీతి నాశువుగా గిలికినవే. లక్షణాపరిణయము వేంకటశాస్త్రిగారాశువుగా చెప్పినది. అందలి శయ్యాదులు పండిత కవి జనాహ్లాదకరముగా నున్నవి. అప్పుడు శాస్త్రిగారు ప్రౌఢవయః పరిపాకము నందుండిరి. కృతి భర్తయు నభిలషించిన దట్టి శైతయే. వేంకటశాస్త్రిగారి కలము మిక్కిలి నేర్పయినది. రెండు దారులనుబట్టి సమయానుకూలముగా నటింపఁగలదు.

కాని కాలము గతించినకొలఁది నీరస స్థితికి వచ్చినది. తిరుపతి శాస్త్రిగారి స్వభావము వేరు. వారేది వ్రాసినను సావకాశముగా కూర్చుండి వ్రాయుదురు. వేంకటశాస్త్రిగారు బుద్ధచరిత్రలో నాలుగు వందల పద్యములు వ్రాయునప్పటికి తిరుపతిశాస్త్రిగారు రెండువందల పద్యములు వ్రాసిరట. వ్రాసిన కొలదియైనను చక్కని పొందికగల రసవంతములగు పదముల కూర్పుతో పండిత పామరాహ్లాదకరముగా నుండునట్లు కవిత్వము రచింపవలయునని తిరుపతిశాస్త్రిగారి యభిలాషయై యుండవచ్చును. కావుననే 'దగ్గరలేరు మామయును దండ్రియు'నని మృదు మధురములగు లలిత పదములను పొందుపరచి సులువుగా పద్యము రచించినను ప్రౌఢ పాకమున రచించినను కవితలో పటుత్వము సడలదు. బాలరామాయణమునం దారంభించిన యా చక్కని దారి యంతకంతకు పోయిన కొలంది చదునయి పాండవ విజయములో నుత్తీర్ణత చెందినది. మరణ కాలమునందు నైనను పదముల కూర్పు సడలలేదు. వేంకటశాస్త్రిగారు సావకాశముగా నాలోచించి వ్రాసినది శ్రవణానందము. కావుననే దాని కా విలువ వచ్చినది.

తిరుపతిశాస్త్రిగారు పోలవరము రాజావారి సంస్థానమునం దున్న కాలమున వేంకటశాస్త్రిగారు బందరులో హిందూ హైస్కూలునందు తెనుగు పండితులుగా బనిచేసిరి. ఆ కాలమునందు విద్యార్థులకు తాము రచించిన గ్రంథము లందలి పద్యములను రాగ

యుక్తముగా చదివి వినిపించుచుండెడివారు. అందుమూలమున వారందరు వేంకటశాస్త్రిగారివలె చదువుట కలవాటుపడిరి. శాస్త్రిగారి ప్రోత్సాహ మెటువంటిదోగాని బాలురందరు కవిత్వము నిరాఘాటముగా చెప్పనారంభించిరి. తిరుపతికవుల శ్రవణానందాది గ్రంథము లింగ్లీషు బోధించు సమయములందును తరగతులలో బాలురు చాటుగా బెట్టుకొని పద్యములు వల్లన వేయుచుండెడివారు. విద్యార్థులు వేంకటశాస్త్రిగారిని గ్రామాంతరములకు సైతము వెంబడించిపోయి యవధానములను చూచుచుండెడివారు. అట్టివారిలో విశ్వనాధ సత్యనారాయణగారు పింగళి లక్ష్మీకాంతముగారు, కాటూరు వేంకటేశ్వరరావుగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఇత్యాదులు పెక్కుమంది కలరు. వారందరు నవధాన ప్రక్రియ నేర్చుకొని గురువులంతవారయిరి.

వేంకటశాస్త్రిగారికి శిష్యసంతాన మెక్కువయినది. వారిలో కొందరికి శాస్త్రిగారి యింటనే భోజనము. ఈరీతిగా నా యేడాదికా యేడాది శిష్యుల సంఖ్య వేలమీద బెరిగినది. ఎవరిని కదిలించినను బందరునందు నందరు కవులే. అందరికి వేంకటశాస్త్రిగారే గురువులు. శ్రీ శాస్త్రిగారి నెరుగనివారుకూడ నా కవికుల గురుదేవుని దేవునిగా నారాధించి కవిత్వము చెప్పనారంభించిరి. వారందరు నేకలవ్య శిష్యులు. తెలుగుదేశమునందు తిరుపతి కవుల పేరు మూల మూలకు ప్రాకినది. వారిపేరు తలంచినవారికెల్ల కవిత్వమల వడినది. అవధానములు ఆవేశించినవి. తిరుపతి వేంకటేశ్వరులు తిరుపతి వేంకటేశ్వరులయి యింటింట వెలసిరి. వేంకటశాస్త్రిగారు భైరవ ముద్రాక్షరశాలయందు తమ గ్రంథములు ముద్రింపించుకొనుచు రాయల్ థియేటరువారిచేత నాటకము లాడించుకొనుచు కాలము గడపిరి. వారి స్వేచ్ఛా స్వాతంత్ర్యముల కెవ్వరడ్డువచ్చినవారు లేరు. పాఠశాలాధికారులు విద్యాశాఖాధికారులు వారికి నమస్కరించిరిగాని వారు చేయెత్తి యెవరికి నమస్కరించి యెరుగరు. పంద్రెండేడులు గడచినవి. వేంకటశాస్త్రిగారు స్వగ్రామమునకు

మరలిపోవ నిశ్చయించుకొనిరి. ఆ సమయమున బందరుపౌరు లఖండ సన్మానము గావించిరి. వేంకటశాస్త్రిగారు కడియమును చేరిరి. అచటనున్న కాలమున తిరుపతి శాస్త్రిగారి మరణము తటస్థించినది. వేంకటశాస్త్రిగారి కరువ దేడలు వచ్చినవి.

బందరు పౌరులు శ్రీ శాస్త్రిగారికి షష్టిపూర్తి ఉత్సవము చేయఁ దలపెట్టిరి. తలపెట్టుటయే వ్యవధిగా వేలకొలంది ధనము వసూలయినది. ఉత్సవ మారంభమైనది. తిరుపతికవులు రచించిన గ్రంథములన్నియు నచ్చొత్తింపబడినవి. శ్రీ శాస్త్రిగారికి కానుకగా సమర్పింపబడినవి. తెనుగుదేశము నలుమూలలనుండి కవులు, పండితులు, ధనికులు వచ్చిరి. శ్రీ శాస్త్రిగారికి సన్మానపత్రము లిచ్చిరి. వారి శిష్యులు పింగళి కాటూరువారు రచించిన సౌందరనంద కావ్యమును

జగదాశ్చర్యకరావధాన కవితా సంపత్తికిన్ మ్రొక్కి మీ
యుగళ స్నేహముఁ బ్రస్తుతించి భవదీయోదార భావ ప్రసా
ద గుణోత్ఫుల్ల కృతి ప్రసూన విగళన్మారంద ధారాసురా
పగ నోలాడి రచించి తెచ్చితిమి దేవా! నీకు నీ దక్షిణల్

అనుచు దోసిలిపట్టి గురువులకు కృతి సమర్పణ గావించిరి. కవులు పుష్పోపహారము లర్పించిరి. శ్రీ శాస్త్రిగారు

అరువది యేండ్లు నిండె ననుటట్టులె యున్ననుబైని మూఁడు వ
త్సరములుదాఁటి నాలుగవదానను మాసములొక్క రెండొగిన్
జరిగెను నాకు నేఁటికిది సర్వము సత్యమయా నను నేఁ డిటన్
జరిగెడి షష్టిపూర్తియను సత్కృతికేఁ దగియుంటి నెంతయున్

అను ప్రత్యభినందన పద్యమును జదువగా సభలు సమాప్తి నొందినవి.

## ౧౫

## తరువాతి రచనలు

తిరుపతిశాస్త్రిగారు స్వర్గస్థులైరి. ఐనను వేంకటశాస్త్రిగారి లేఖిని విశ్రాంతి బొందలేదు. యథారీతిగా కావ్యరచనలను సాగించినది.

కవనార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి యీ
భవ మద్దానఁ దరింతు

అన్నారు వేంకటశాస్త్రిగారు అది వారి ధీమా.

ఏ దినమునందుఁ గవిత యొకించు కేని
నే లిఖింపనో వ్రాకుత్తు నిజము నాకు
నా దినము దుర్దినంబు సమ్మోద మిడదు

అని యనిన మాటయం దసత్య మేమియు లేదు. వార్థక్యము వలన జవసత్వములు నుడిగినవి. లేవలేని స్థితియందుఁగూడ మంచము మీద పరుండి యేవో పద్యములు "గిలుకు" చుండెడివారు. మృత్యుదేవత వదన గహ్వరము తెరుచుకొని నిడుపాటి కోరలతో నాలుక నల్లల నార్చుచు మీదికి కబళింప నరుదెంచుచున్న సమయమునందు సైతము రేడియో సంస్థకు పద్యములను వ్రాసి యిచ్చిరి. ఆ కరాళ దేవతకూడ వారి కవిత్వదీక్షకు భయపడినదేమో. పద్యములు పూర్తి యగునంతవరకు దరిదాపునకు రాలేకపోయినది. "మృత్యువు దాన జయించితిన్" అనిన వారి పలుకులోని యంతరార్థము ఇదియే కావచ్చును. వారి ప్రజ్ఞా ఉపజ్ఞలు మరణ కాలమందు సహితము వారిని విడిచిపెట్టలేదు.

దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనఁగ
నరుగు చున్నాడు శ్రీనాథుఁ డమరపురికి

అను తెనుగు కవులం దెవరికిలేని ధీమాతో చెప్పిన కవిసార్వ భౌముని యంతవారు వేంకటశాస్త్రిగారు. ఎవరెంత "మేము శ్రీనాథునంతటి వార"మని ప్రజ్ఞకు పెనుగులాడినను, "కవిసార్వ భౌముల"మని రొమ్ములు విరచుకొని భుజములు చరుచుకొన్నను వేంకటశాస్త్రిగారితో తుల్యులు కాలేరు.

శ్రీ శాస్త్రిగారి నాశ్రయించిన గ్రహసంపత్తి యటువంటిది. ఆ యా గ్రహముల మహాదశ అంతర్దశలందు వారికి ప్రసాదించిన ఫలములను వ్యక్తీకరించుచు వ్రాసిన గ్రంథమే జాతకచర్య. ఇది వేంకటశాస్త్రిగారి జీవితచరిత్ర. ఇందు వారి జననము మొదలుకొని షష్టిపూర్తి మహోత్సవము వరకు వారికి సంబంధించిన పలు విషయ ములు నమోజు చేయబడినవి.

ఇందెన్ని యేని విషయము
లందందు నిమిడ్చి నార మాబాల్యము మే
మెందెందు తిరిగితిమొ త
త్సందర్భము లెల్ల దీనఁ దనరు.

అని శాస్త్రిగారు చెప్పుకొనిరి. "స్వీయచరిత్రలు వ్రాసే ఆచారం మనకు క్రొత్త. దీనిని పాశ్చాత్యులనుండి నేర్చుకొన్నాము. వీరేశలింగం పంతులుతో ఈ స్వీయచరిత్ర రచన మనలో ఆరంభించిం దనుకొంటున్నాము. కాని వేంకటశాస్త్రిగారు 50 ఏండ్ల క్రితమే స్వీయచరిత్ర వ్రాయటం మొదలుపెట్టినారు. పాశ్చాత్యులలో ఈ యాచార మున్నదనికూడ వారప్పటి కెరుగరు" అని కాటూరి వేంక టేశ్వరరావుగారు "తిరుపతి వేంకటకవులు" అను వ్యాసమునందు ఆంధ్రపత్రిక విరోధి ఉగాది సంచికయందు సూచించిరి.

స్వీయచరిత్రలు వ్రాయు నాచారము పాశ్చాత్యుల యందే కాదు సంస్కృత కవులందు కలదు. బాణుఁడు తన జీవిత కథను హర్ష చరిత్రతో జతపరచి వ్రాసికొనెను. బిల్హణుడు స్వీయచరిత్ర మును విక్రమాంక చరిత్రమునందు పొందు పరచెను. ఆ రెంటిని వేంకటశాస్త్రిగారు తెలిగించిరి. వానిని చూచియే శ్రీ శాస్త్రిగారు

జాతక చర్యయను పేరుతో స్వీయ చరిత్రమును వ్రాసికొనిరి. బాణ బిల్హణులు వచన రూపమున తమ జీవితకథలను రచించుకొనిరి. శాస్త్రిగారి లేఖిని వచన రచనయందు పద్యరచనయందు నేక ధాటిగా పరుగెత్తగలదు. కావున వీరు పద్యములలో వ్రాసిరి. మహాత్ము లాత్మకథలను వ్రాసికొను నప్పు డొకొక్కటి నాత్మ ప్రశంసయు పరనిందయు పాటిల్ల వచ్చును. ఆ రెండును పాపకారణములని పెద్దలనుడి.

శ్రీ శాస్త్రిగారు పాపభీతిగల మహాపురుషులు. దానినుండి తొలంగుటకు సర్వము గ్రహములమీద నారోపించి తమ జీవితకథ వ్రాసికొనిరి. అందుకనే జాతక చర్యయను నామకరణము గావించిరి. తమ యాధిక్యతకుగాని, అన్య నిరసనమునకుగాని యాగ్రహములే కారణమనియు, తాము గామనియు శ్రీ శాస్త్రిగారి తలంపు. ఆ రచనయందును ప్రథమపురుషను వాడిరి. నన్నయ తన్నుగురించి చెప్పుకొనవలసి వచ్చినప్పు డట్లే గావించెను. జాతక చర్యను వేంకటశాస్త్రిగారు పిఠాపురము జమీందారుగారగు శ్రీ గంగాధర రామారావుగారి కంకితమిచ్చిరి. ఇందు పూర్వభాగమున 676 పద్యములు నుత్తరభాగమున 358 పద్యములు వెరసి 1094 పద్యములు గలవు.

జ్యోతిషమందు నా కెపుడు శ్రద్ధయు భక్తియు మెండు దానిలో
జాతక భాగమందున నెసంగెడు నెక్కుడు నమ్మకమ్ము

అని వ్రాసికొనిరి. తమ జీవితమందు నెడనెడ వాటిల్లు సుఖ దుఃఖములు, మేలు కీళ్ళు నొడు దుడుకులు వీని యన్నిటికి గ్రహములే కారణమనియు మానవు డా యా గ్రహముల చేతిలోని యాటబొమ్మ యనియు వారి నమ్మకము. ఈ నమ్మకమునందు నిగూఢముగా వేదాంత రహస్య మిమిడియున్నది. వేంకటశాస్త్రిగారు 'స్వారం దైవాధీన' మను వినిశ్చల భావముతో తమ ప్రయత్నముల నాచరించు వేదాంత విద్యాపారంగతులు శ్రీ శాస్త్రిగారి యీ దృఢ విశ్వాసమే స్వీయచరిత్రము నీ రూపముగా విరచింపచేసినది.

ఇది జ్యోతిషశాస్త్రవేత్తల కొక లక్ష్యగ్రంథము. పతివ్రత యను కావ్యమునందు మంత్రికి జ్యోతిష శాస్త్రమునం దొక దృఢ విశ్వాసమును కల్పించి కథ నొక విచిత్రమార్గమున నడిపించినారు వేంకటశాస్త్రిగారు. వారెన్ని కావ్యములు రచించినను ఒక్కొక్క దానియం దొక్కొక్క విచిత్ర విశేషమును దృష్టియం దుంచుకొని కథలను చిత్రించిరి. ఆ కారణముచేత వారి కావ్యములన్నియు నొకే మార్గము ననుగమింపక దేనికది ప్రత్యేకత కలదయి పాఠకుల మనస్సు నాకర్షించు చుండును.

గ్రహకూటమునకు ప్రాధాన్య మొసగి స్వీయకథను నడిపించుట జాతకచర్యలోని వింత విశేషము. ఇది క్రొత్త మార్గము. స్వీయ చరిత్రము నిట్లు వ్రాసిన వారెవరు లేరు. అందు శాస్త్రిగారి యుపజ్ఞ గోచరించును. ఈ కృతికి జ్యోతిషములోని జాతకభాగము నకు లక్ష్యగ్రంథముగాను కావ్యముగాను తెనుగు వాఙ్మయమునందు నొక ప్రత్యేకస్థానము కలదు. 'ఇది కసిగల నాళ్ళలోన రచియించి నది.' ఇది ''చక్కని కబ్బము'' ''రసయుత మంచు దానిని గరంబును మెత్తురు సత్కవీశ్వరుల్.''

కృతికి చక్కదనము కల్పించునది ధార. అది శబ్దజాలము నంటిపట్టి యుండును. జాతక చర్యలోని ప్రతిపద్యము ప్రారంభించిన మొదటి యక్షరము మొదలుకొని చివరి యక్షరమువరకు నిరాడంబర ముగా నే యడ్డుపాటులేక మైదానమున ప్రవహించు ప్రవాహము వలె జాలు వారుచుండును. యతికొరకు ప్రాసకొరకు తడుముకొనిన ట్లుండక యా యా గణముల కనుగుణముగా శబ్దములు తమంతట తాము అనాలోచితముగా వచ్చి వ్రాలుచుండును.

ఎందుకు మీకు పుట్టినదొ యీదృశమహాజతనంబు సత్కవి
త్వేందిరతా స్వయంవరము నేపొనరించెడి పట్లఁ గా దనం
గం దరమే కవీంద్ర విధిగాఁ గృతిఁ గైకొన సమ్మతించితిన్
విందు నొకింత విస్మితగ విందొనరింపుడు తత్కథాంశమున్

ఈ పద్యమునందలి రెండుమూడు పాదములందలి యతులే పదములనంటి యమరినవో గమనింపఁ దగిన విషయము. 'విధిగా— పట్ల —ఎందుకు మీకు పుట్టెనో' ఇవి శిష్ట వ్యవహారముతైన వాడుక పదములు. పాదాంత శబ్దమును ప్రాసస్థానములోనికి మలుపుకొనుట తిరుపతికవులలోని యొక విశేషము. అది పద్యమును ముందుకు పరుగెత్తించును. ఇట్టి ధారాశుద్ధి తిరుపతి వేంకటకవులకు సహజసిద్ధమైన దేవీప్రసాదము. వారి యితర కావ్యములలోని ధారాశుద్ధికి జాతక చర్యలోని కవిత్వధారకు చాల తారతమ్యము కలదు. వేంకటశాస్త్రి గారి మనస్సు నిబ్బరమైనది. ఆ నిబ్బరమే జాతకచర్య కవితలో గోచరించును.

ప్రేమం బొల్చెడి యిర్వురం దతఁడు దావెల్నాటి వాఁడీతఁ డా
రామద్రావిడశాఖవాఁడు మఱి తద్గ్రామంబు జల్లాఖ్యమౌ
సీమం బొల్చెడి యెండగండితఁడు తత్సీమేతరంబైన యా
నామన్ గ్రామమువాఁడు దైవమెటు సంధానంబు గల్పించెనో.

అతఁడు దివాకరాన్వయ శీత రోచి
యీతఁడో చెళ్ళపిళ్ళ విఖ్యాత కులుఁడు
తిరుపతి యతండు వేంకటేశ్వరు డితండు
వయసు బుద్ధియుఁ నొక్కటై వరలుచుండు.

జాతకచర్య యొక డైరీ వంటిది. అందు తిరుపతికవులు చేసిన సంచారములు, సందర్శించిన రాజులు, పొందమిన కడగండ్లు పొందు పరుపబడినవి. తన్మూలమున అక్కడక్కడ పద్యముల నడకలో బిగువు సడలుచు వచ్చిన దనక తప్పదు.

మఱియు నాయేఁడు నవరాత్రమహము చేయఁ
జేసె వెండియు గురుని నివాసమైన
ధవళగిరియందు నష్టావధాన కార
ణముగ ధన మొనగూర్చి ధర్మమున కిడియె

బిగువు సడలుటయే కాదు కవిత నీరసించినదేమో యనికూడ తలంప వలసి వచ్చును. ఇందులకు కారణము వర్ణితవిషయము లట్టివని సరి పెట్టుకొన వలయును.

జాతకచర్య కనుబంధము ఇటీవలి చర్య. వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి ఉత్సవము మొదలు ఆస్థానకవియగు పర్యంతము గల జీవితకథ. యిందు 1375 పద్యములలో వ్రాయబడినది. ఇది యిను గంటి ప్రకాశరావు జమీన్దారుగారి కంకిత మీయబడెను. దీని యందు రచనా పద్ధతి మార్చబడినది. శాస్త్రిగా రిందలి కథా భాగము నుత్తమ పురుషయందే వ్రాసికొనిరి. రచనా పద్ధతియందే కాక కవిత్వము నందును జాతకచర్యకు నిటీవల చర్యకు చాల తార తమ్య మున్నది. జాతకచర్యలో నందందు నీరసించిన నిబ్బరంపు కవితావాహిని రసము పోసుకొని యిటీవలి చర్యలో చాలవరకు పుంజుకొన్నది. ఇందు చర్చించిన విషయములుగూడ నటువంటివే. తురకల దురాగతములు, దున్నినవాడిదే పొలము, మాలల దేవా లయ ప్రవేశము, విడాకుల చట్టము, గురువుగారితో గుటగుటలు. నౌఖాళీ సంఘటనము, ఒకటేమిటి ప్రపంచమంతయు నొక్కసారి చుట్టివచ్చినట్లుండును.

ఫ్రెంచివారి కత్తిరీతి దేశికు వాద
మిరు వయిపుల వాడి నెనసి యుండు

ఫ్రెంచివారి కత్తికి రెండువైపుల పదునుండునను సంగతి మనలో చాలమందికి తెలియదు. యానాము ఫ్రెంచివారిది. (శ్రీ) శాస్త్రిగారు యానాము నివాసులు. అక్కడ చూచియుందురు. వేంకటశాస్త్రిగారు దేనినైనను నిశితదృష్టితో పరిశీలించి తాము గ్రహించిన దానిని లోకమునకేదో సందర్భమున వెల్లడించుట వారి స్వభావము

కులమెట్లుం జెడె రాజ్యపాలన తురుష్కుల్ సాగనీ రింక వా
రలతోఁ జేరిన యుత్తరక్షణములో రాజ్యంబు సిద్ధించు వా

రలు రమ్మన్నను రారు వచ్చినను శాస్త్రం బద్ధమౌ నాంగిలే
యుల నిర్జించుట కొండుపాయమును నే నూహింపలేనయ్యేదన్

ఈనఁగాచి నక్కల పాలుగా నొనర్ప
నేల కుల గౌరవము చెడి చాల కాల
మయ్యె దేవాలయము లెప్పు డంటు పడెనొ
యపుడె సర్వం జగన్నాధ మయ్యెగాదె

ప్రకాశంగారి మంత్రిత్వము విమర్శించుచు

మంత్రి ప్రకాశము సేయు స్వ
తంత్రమ్ములు గొన్ని మిగుల దారుణములు కో
పింత్రు బుధ జనులు కవులు శ
పింత్రు వృధా చెడు నితండు వృద్ధికి దవ్వై

అల్లే జరిగినది. కాంగ్రెసు మంత్రులను విమర్శించుచు

హెచ్చు తగ్గులు లేకుండ నెల్ల రొక్క
ఫక్కి సుఖయించు గతి పరిపాలనంబు
నడుపువా రంట యెరికి నవ్వుపుట్ట
కుండు కాంగ్రెసు మంత్రుల యూహ లరయ

దున్నిన వారిదే పొలమను విషయము విమర్శించుచు

రయితు లోక సంరక్షణార్థమయి భూమి
దున్నుచున్నాడె పొట్టకై దున్నుచుండెఁ
గాన నితరుల సొత్తు నవ్వాని నెత్తిఁ
బెట్టి యూరేగఁ జేయుట చెట్ట సేత

ఈ విధముగా నిటీవల చర్యయందు వేంకటశాస్త్రిగారు పెక్కు విషయములను గురించి చర్చించి ఫలితాంశములను నిరూపించిరి. సారస్వత రాజకీయ సాంఘిక పరిస్థితు లన్నిటియందు జోక్యముకలుగ చేసికొని తమ యభిప్రాయములను వ్యక్తీకరించుచు వచ్చిరి. వేంకట శాస్త్రిగారికి గాంధిగారియందును మాలవ్యాయందు నధిక గౌరవము

కలదు. వారిని వారి యుద్యమములను సందర్భానుసారముగా ప్రశం సించుచు వచ్చిరి. ఇట్టి విమర్శనా ప్రసంగములందు మధ్యమధ్య వారి సహజ స్వభావమగు హాస్యరసమును శాస్త్రిగారు మరచిపోలేదు.

గురువుగారి శంకలు సరేసరి కుబేరుఁ
డీశ్వరునకుఁ జీనాంబరం బిచ్చె నన్న
పోష్టు ద్వారానఁ దెప్పింపఁ బోలు ననెడు
నీరసపు శంక నెరుఁగని వారు లేరు

ఇటీవల చర్యయంతయు నిట్లే చాలవరకు రసవంతముగా నడచి నది. జాతక చర్యయందుకాని యిటీవలి చర్యయందుగాని వేంకట శాస్త్రిగారు వాడిన లోకోక్తులు వందలకు మించియున్నవి. తెలుగు దేశమందు ప్రచారమందున్న లోకోక్తులన్నియు నీ రెండు గ్రంథము లందు నిమిడియున్నవేమో యనిపించును. ఇట్టి లోకోక్తులు వాడు టలో నొక విశేషమున్నది. వేంకటశాస్త్రిగారు పద్యమునం దొక వింత వికాశమును కల్పించుటలో నతి సమర్థులు. పద్యము నీరసించి నప్పుడెల్ల లోకోక్తినో ఆంగ్లేయ పదమునో వాడి వహావ్వా యని పించకలరు. మచ్చునకు

నన్ను వేలుపుగాఁ జూచుచున్న బంధు
జనుల నెవ్వాడు చూచు నీచముగ నేమి
కర్మమో గనుపట్టదు కారణంబు
కడుపు చించుకొనినఁ బడుఁ గాళ్ళమీఁద

అతి సర్వత్ర వర్జయేత్తను బుధుల నుడిలో సత్యము లేక పోలేదు. ఏదైనను పరిమితిని మించిపోయినచో వెగటు కలిగించును. జాతక చర్యయందు నిటీవల చర్యయందు వేంకటశాస్త్రిగారు వాడిన ఆంగ్లేయ పదములు దాదాపు డెబ్బదికి మించియున్నవి. "కోర్టులకు త్రిప్పునేమో-హోటల్సులో పంక్తికొగివచ్చి-శారుడుకూడవ్రాయుట-మిలిటరీ తినుచుండె" ఇత్యాదులు. ఇవేకావు. టీ, కాఫీ, యూని

ఫారము, కోటు, బూటు, టీచరు, షేక్‌హాన్డు, క్రాసు ఇట్టివెన్నో కలవు.

ఆంధ్రశబ్ద చింతామణియందు నన్నయభట్టు ప్రవాహినీదేశ్యా యని సూత్రించినాడు. సజీవమగు భాషయందు విదేశీయ పదము లంతర్లీన మగుచుండుట సహజమే. పూర్వకవులు తురుష్కపదములు తమ కవితయందు వాడిరనుటయు సత్యమే. "ఇంగ్లీషుచదివి తెలుగు కైత చెప్పువా రుభయ భ్రష్టు"లని విమర్శించిన ధీమహాకవులగు వేంకటశాస్త్రిగారు తమ గ్రంథములం దిన్ని యాంగ్లేయపదములను "ఐనవానికి కాని వానికి" వాడుట విచారణీయాంశము. ఇది యాంధ్ర సారస్వతాభిమానుల కెంతవరకు రుచించునో యాలోచింప వలసిన విషయము. జాతక చర్యయందు నిటీవలి చర్యయందుకూడ శాస్త్రిగారు వ్యాకరణ విరుద్ధముకాని వ్యావహారిక భాషనే చాల వరకు వాడిరి.

నన్నుఁ దిట్టె సరియె నా శిష్యులను దిట్టె
నంతకన్న సరియె అఖిల వైది
కులను దిట్టె నొప్పికొందము నన్నయఁ
గూడ తిట్టె నాల్క కోయ వలదె.

ఇట్టి శిష్ట వ్యవహారసిద్ధంబగు భాషకు దేశీయములు మాండలికములగు పదములుచేర్చి

అసలు వారలు మిన్నకున్నట్టి విషయ
మెవ్వరో లాకలూకాయ లిపుడు పైకిఁ
దెచ్చి కారులు నూరెడి తెలివిఁజూడ
నాలు దూడలుఁ జూడగుం జార్చినట్లు.

ఈ విధముగా సామెతల సమ్మేళనముతో చివరివరకు రచించిరి.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి జీవితకథకు సంబంధించిన మరొక గ్రంథము సౌభాగ్య కామేశ్వరి. ఈ గ్రంథము పూర్వార్థము, ఉత్తరార్థమని రెండు భాగములుగా ప్రకటింపఁబడినది.

పూర్వార్థము 612 పద్యముల గ్రంథము. దీనిని అప్పాజోస్యుల కృష్ణశాస్త్రిగారికి అంకితమిచ్చిరి. ఉత్తరార్థము వారి శిష్యుడగు వేమూరి రామాజీకి కృతినిచ్చిరి. వేంకటశాస్త్రిగారు కామేశ్వరీ దేవిని చిన్నతనమునుండి యుపాసించి తమ జీవితమును చరితార్థము గావించుకొనిన ధన్యమూర్తులు. వీరీ గ్రంథమును ముప్పదవయేట ప్రారంభించినటుల నీ పద్యమువలన తెలియనగును.

మన మీపాటికి శాంతము న్నలుపు మంబా! సర్వభోగంబులు
న్ననినాఁడన్ సగమాయెనాయువును సంస్కారుల్ "కలాషష్టి" నా
వినమే పైసగమేని బ్రహ్మము వినా విశ్వంబు సర్వంబస
త్తను చర్చన్గమనింప నిమ్మధికమున్ బ్రార్థింపఁ గామేశ్వరీ!

దేవతారాధనచేత నాయు రారోగ్యైశ్వర్యములు కలుగునని వేంకటశాస్త్రిగారికి గట్టి నమ్మకము కలదు. కావున శ్రీ శాస్త్రిగా రనారోగ్యముగా నున్నప్పుడా దేవిని

ఆయుర్దాయముఁ గట్టిపెట్టితివి నాకారోగ్యమీవైతి వ
మ్మా యేలాగున దీని భుక్తముగఁ జేయం గల్గుదున్ శక్తిలే
దాయెన్ వ్యాసుని యంతవానికి భవన్మాస్తిత్వపర్యాప్తియం
దా యీ వేంకన లెక్కయేమి బలమిమ్మా సుంత కామేశ్వరీ!

అని బహువిధముల ప్రార్థించుచు వచ్చిరి. వారి నమ్మకమే వారిని కృతకృత్యుని గావించినది.

నుతునిన్నన్నిచ్చితి నన్ను మన్నించితివి నీ స్తోత్రమ్మునన్నేచు దు
ర్గతి దూరస్థముగాఁగ నెట్టె నిటులే గండమ్ములెన్నేని దాఁ
టితి నీ యాశ్రయణమ్ము కల్మి, రుజ పీడింపంగ నేమయ్యె స
ద్గతికి న్మార్గము చూపె దీనికి నమస్కారంబు కామేశ్వరీ!

అని దేవియెడఁ దన కృతజ్ఞతను ప్రకటించిరి. వేంకటశాస్త్రి గారికి తదుపాస్యదేవత యెడ నిశ్చలమగు భక్తి కలదు. తన్నామ స్మరణముచేత సకలానర్థములను తపఃశక్తివలన మహర్షులవలె తరింప గలనను నమ్మకము కలదు.

సకలానర్థములున్ దపస్సుకతనం జక్కంబడున్, బూర్వులే
సుకముంగాంచినఁ గష్టమాఁగినఁ దపస్సుంజేసియే, నాకు సం
తుకు లోకానకుఁగూడ మంగళములం గూర్పంగ నీనామమో
పికమై నే జపియింతు నన్నిటికి నీవే దిక్కు కామేశ్వరీ!

అప్పుడప్పు డా దేవి శాస్త్రిగారికి స్వప్నమునందు దర్శన మొసంగుటయు గలదు.

భవదీయమ్మగు రూపమప్డపుడు స్వప్నమ్మందుఁ గన్పట్టు నే
శివమో వెంటనె కల్గితీరు శివరాశీ నిన్ను ధ్యానించు నీ
కవికింతే ఫలితమ్మె యీ జనని సాక్షాత్కార భాగ్యమ్ము గ
ల్గి వినోదించుట కూడఁ గల్గెడినో తల్లీ! తెల్పు కామేశ్వరీ!

వేంకటశాస్త్రిగారు ధన్యజీవులు. ఐహికాముష్మిక సుఖములు వారి కరచేతిలోని భాగ్యములైనవి. అంతకంటె మానవుడు కోరఁదగినది కాని యనుభవింపదగినది కాని యింకొకటి లేదు. సౌభాగ్య కామేశ్వరిలోని ప్రతి పద్యము వారికి కామేశ్వరీదేవి యెడగల యపార భక్తి విశ్వాసములను వెల్లడించుచుండును. ఆమె నొక తల్లిగా వేంకటశాస్త్రిగారు సేవించిరి. ఆమె యొక కుమారునిగా శాస్త్రిగారిని కాపాడుచు వచ్చినది. శాస్త్రిగారు తమ యావేదనల నన్నియు నామెతో మనవి చేసికొనిరి. ఆ దేవి కరుణార్ద్రహృదయముతో వాని నన్నిటిని తీర్చినది.

వేంకటశాస్త్రిగారు విశాల హృదయులు, ఉదార స్వభావులు. దేశ క్షేమమే తన క్షేమమని తలంచినవారు. వార్ధక్య దశయందు తమ యారోగ్యముకొరకు కామేశ్వరీ మహాదేవి నెంత ప్రార్థించిరో రెండవ ప్రపంచ సంగ్రామ సమయమున దేశమందలి ప్రజానీకమును కాపాడుమని యంత ప్రార్థించిరి. వారికి భారతదేశము మీదనున్న గౌరవము విశ్వాసము చెప్పుకొన తగినది. బెంగాలునందు విశ్వకవి రవీంద్రనాథటాగూరువలె తెనుగు దేశమున వేంకటశాస్త్రిగారు ఈ విషయమున గణనీయుడు.

పాతివ్రత్య మహావ్రతంబు నెడ విశ్వాసంబుతోఁ గొందఱా
సీతంబోలెఁ జరించి పుణ్యసతు లీ సీమన్ గలారాధకిన్
జేతంబించుక నొచ్చె నేని నుడియున్ సేనల్ మఱిన్ గీనలున్
సీతో సాధ్వులఁగూర్చి చెప్పవలెనే నే నిప్డు కామేశ్వరీ!

సిక్కుల్ శూరులు, త్రాగు నెత్తురల ముస్లింజాతి ఘూర్కాలపే
ర్దిక్కుంభుల్ విని దద్దరిల్లు వెలమల్ ధీరుల్ సరే క్షత్రియుల్
పక్కాయోధులు విప్రు లందుఁగల రాంగ్ల ప్రాభవంబెవ్వ రు
న్న్యక్కారింపఁగలే రజపాననిన లెక్కా మాకుఁ గామేశ్వరీ!

ఈ విధమగు చక్కని భక్తిపూరితములగు పద్యములతో సౌభాగ్య కామేశ్వరిని విరచించిరి.

వేంకటశాస్త్రిగారి జీవిత కథాఘట్టములలో నొక విచిత్ర సన్నివేశ ఫలితమే మల్లేశ్వర విజ్ఞప్తి. వేంకటశాస్త్రిగా రుద్యోగము నుండి విరమించి స్వగ్రామమగు కడియమును చేరుకొనిరి. అక్కడ వారికి కొంత పొలము పుట్ర గలదు. వాని విషయమై యాగ్రామము నందలి కొందరు దుర్మార్గులు వేంకట శాస్త్రిగారిని బాధింప మొదలు పెట్టిరి. తగాదా బోదె కాలువతో నారంభమైనది. క్రమక్రమముగా చిలువలు పలువలు నల్లుకొని వృద్ధిపొందినది. దురాగత చిత్తవృత్తులగువారికి దైవమొక్కడే బుద్ధి చెప్పగలడు. వేంకట శాస్త్రిగారు కడియమునందలి మల్లేశ్వర దైవమునకు నా శుంఠలను గురించి విజ్ఞప్తి చేసికొనిరి. అదియే మల్లేశ్వర విజ్ఞప్తి. ఇది 599 పద్యముల గ్రంథము. ఈ గ్రంథములో ప్రతి పద్యమునకు చివర శతకములందువలె 'మల్లేశ్వరా' యను మకుటము కలదు.

చేటుంగాలమొకాక యున్న వృథగాఁ జియ్యోక్కి చండాలపుం
గూటిన్ మెక్కి బహిష్కరింపఁబడి సద్గుర్వాగ్రహాగ్ని స్ఫుట
ద్వాటిన్ మ్రగ్గెడి దుష్ప్రయత్నములు సల్పంగాఁబనేమయ్యె? నీ
నోటంబల్కుము హేతువున్న విని సంతోషింతు మల్లేశ్వరా.

పతితుండో నల పాచకాధముఁడు సంభాషించు నాయా యసం
గతిపుం గూతలు వింటివేకదే? తదాకారమ్ముఁ దద్దోషపున్
గతులు న్నీ వెఱుఁగంగ నేరవే? బలాత్కారమ్ముగా వాని నా
హుతిగానీయనలాత్కి కైకొనదదేమో? తెల్పు మల్లేశ్వరా!

ఇట్లే యిందలి పద్యములన్నియు నుద్రేకపూరితములయి యుండును.

వేంకటశాస్త్రిగారు తమ జీవితమునకు సంబంధించిన గ్రంథములే కాక ప్రత్యేకముగా కావ్యములనుకూడ రచించిరి. వానిలో బొబ్బిలి పట్టాభిషేకము ఒకటి. ఇది బొబ్బిలి రాజ్యాధిపతులగు రామకృష్ణ ధరణీపతుల పట్టాభిషేక మహోత్సవమును వర్ణించుచు వ్రాయబడిన గ్రంథము. ఇందు నాలుగాశ్వాసములు 458 పద్యములు గలవు. మొదట యాశ్వాసమునందు బొబ్బిలి సంస్థానాధిపతుల వంశ క్రమము వర్ణింపబడినది. రెండవ యాశ్వాసమునందు బొబ్బిలిపుర వర్ణనము. పట్టాభిషేకమునకు వివిధ ప్రదేశములనుండి వచ్చిన యవని పాలకులకు సగౌరవముగా నెదుర్కొని తెచ్చి విడియించుట, ప్రస్తుత సంస్థానాధిపతులు దేవతా సందర్శనము గావించుకొనుట వర్ణింపబడినది. మూడు నాలు గాశ్వాసములందు పట్టాభిషేకమహోత్సవ కార్యక్రమములు విపులముగా వర్ణింపబడినవి.

పురాతనత్వమునందు నవీనత్వమును సమ్మిళితము గావించి నూతనంపు దారులలో పద్యములను భావములను ప్రదర్శించుట తిరుపతి కవుల కావ్యములం దన్నిటను గోచరించును. ఈ కావ్యమునందు కథను ప్రారంభించుటలో నదే మార్గము ననుగమించిరి. పురాణములందు కథావతరణ విధానమటు లుంతము. పారిజాతాపహరణము వసుచరిత్ర మొదలగు కొన్ని కావ్యములందు సైతము వైశంపాయన సూతజాదులు కథను చెప్పుచున్నటు లుండును. శ్రీ వేంకటశాస్త్రిగారు కుమారుని వివాహ మహోత్సవ సన్నివేశ మొక దానిని కల్పించి అందు వివాహమునకు వచ్చిన కవి పండితులు బంధువులు బొబ్బిలి పట్టాభిషేక మహోత్సవమును గురించి వినిపింపుడని యర్థింపతా నీ కావ్యము వినిపించినటులనున్నది. ఇది యుభయతారకము.

కావ్యమునకు ప్రచారము, వచ్చినవారికి కాలక్షేపము నయినది. ఈ కృతిని వేంకటశాస్త్రిగారు బొబ్బిలి ప్రభువులగు రామకృష్ణ ధరణీ పాలు కంకిత మిచ్చిరి.

బొబ్బిలి ప్రాతబొబ్బిలి యనియు క్రొత్తబొబ్బిలి యనియు రెండు భాగములు. ప్రాతబొబ్బిలి విజయనగరాధిపతుల దుర్గ మయమున పాడుపడి యొక దిబ్బయైనది. ఆ స్థానమున జ్ఞాపకార్థ మొక స్తంభము నిర్మింపబడినది. దానిమీద యుద్ధవిశేషములు వ్రాయబడినవి.

అది గనుఁగొన్న మాత్ర విజయావనిపాలుని దుర్ణయంబు దు
ర్మదులు పరాసు సైన్యములరాయిడి దుష్టదురుష్క సైన్య రా
డదయిత వెల్మశూరుల నయాంచిత బాహు పరాక్రమ స్ఫుర
త్కథనము నొక్కపెట్టుగను గన్నులఁ గట్టినయట్లు వ్రేలెడిన్.

ఈ కావ్యమునందు నా యా కార్యకలాపములు జరిగినవి జరిగినట్లు వర్ణింపబడినవి. అందందు రామకృష్ణ రంగరాయ మహీ పాలుని దైవభక్తి మాతృగౌరవముతోడి రాజ కుటుంబముల మీఁది సహజాదరాభిమానములు వినయాది సుగుణములు రాజరీవి సముచిత రీతులుగా వర్ణింపబడినవి. ఈ పద్యములన్నియు నొకయెత్తు. రాజు పురమేగునపుడు చూచు పురనారీ జనుల మనోభావములను వర్ణించిన నీ క్రింది రెండు పద్యము లొకయెత్తు.

రాముఁడు కృష్ణుడుం గలసి రాజితుఁడై జనియించెనంచుఁ ద
న్నామమె తెల్పుఁగాని సుగుణంబులలో మఱి యందు నేక ప
త్నీ మహిత వ్రతాభిగమ దీక్ష యెడన్ ధ్రువ మల్ల రాముఁడే
యీ మహిపాలుఁడింకొకటఁ గృష్ణుఁడుగాఁ జెలువారెనేనియున్

అనుభావమ్ము పురంబునం దరచుగా నాబాలగోపాలమున్
జనవిఖ్యాతమ యౌటఁ దన్నృపమణిన్ సౌందర్యరాశిం గనుం
గొను నారీజనమెల్లఁ దండ్రియనుచున్ గోవిందుఁడంచున్ గనుం
గొనిరేగాని మఱొండు బుద్ధిని గనుంగోలేద యేదిక్కునన్.

సంస్కృతాంధ్ర కావ్యములందు పెక్కుమంది మహాకవులనఁదగినవారు, రాజులు, పురవీథులం దూరేగుట, స్త్రీలు మేడలమీద నుండి చూచుటయు వర్ణించిరి. ఆ పట్టునందు రాజునకు పౌరులకుండు సంబంధములను విస్మరించి స్త్రీల యకళంకమగు మనో వ్యాపారము నవలకుఁ ద్రోసిపుచ్చి వారి పాతివ్రత్యమునకు భంగకరముగా స్త్రీల యందు విభ్రమాది భావములను వర్ణించిరి.

ఆ పద్యములను చదువునప్పుడు పతివ్రతా శిరోమణుల కనాది నుండియు జన్మస్థానమయిన భారత మాతృభూమి పతి దైవతలకు గొడ్డుపోయినది కాబోలు! రాజును చూచి యందరు రెప్పలల్లార్చు యువతులైరను తలంపు కలుగక పోదు. వేంకటశాస్త్రిగారు పూర్వ కవుల వర్ణనలోని యిట్టి లోపములను విమర్శనా దృష్టిలో పరిశీలించి బొబ్బిలి పట్టాభిషేకమునందు సముచితము సక్రమమునగు మార్గ మనుసరించిరి. మొదటి పద్యమునందు రామకృష్ణరంగ రాయావనీ పాలుడు రామునివలె నేకపత్నీవ్రతుడని వచించుటచేత రాజు గుణ శీలములను చక్కగా పోషించిరి. రెండవ పద్యమందు స్త్రీలా ప్రభువును తండ్రిగాను దేవునిగాను భావించి పరికించి రనుటచేత స్త్రీలపాతివ్రత్యమును గాపాడుటయే కాక బొబ్బిలి పురాంగనల కా రాజు నెడగల భక్తి గౌరవములను ప్రకటించిరి. అంతే కాదు "నా విష్ణుః నృపతిః" అను బుధజనోక్తిని పొందుపరచిరి.

రెండు పద్యముల వలన బొబ్బిలి పురాధీశ్వరులకు తత్ప్రజలకుఁ గల పితృ పుత్రికాభావము రక్షక రక్షిత భావము మనోహరముగా వర్ణించినారు వేంకటశాస్త్రిగారు. సన్నివేశము ప్రాతదే, వర్ణనా విధానము ప్రాతదే కాని భావప్రకటనలో క్రొత్తవగు నడుగు జాడ లను నెలకొల్పిరి. అదియే వారి కావ్యములందు కనిపించు వినూత నత్వము. రామకృష్ణ రంగారాయావనీ విభుడు పట్టాభిషేక సమయ మున సరదారులర్పించు కానుకలను గ్రహించెను. దానిని శాస్త్రిగారు

ఇచ్చుట తప్ప పుచ్చుకొను టెన్నఁడుగాని యెఱుంగనట్టి యా
యచ్చపు రావువంశజుఁ డహర్పతి తేజుఁడు కాన్కలన్ మహీ

భృచ్ఛోపురుండు కైకొనియె నిచ్చినదానికి వేయిరెట్లు తా
నిచ్చు తలంపుతోనదియె యేలు నృపాలుర ధర్మమారఁగదా!

యని చక్కఁగా సమర్థించిరి. ఈ పద్యము మహారాజు దాన శీలత ప్రకటించుచున్నది.

''పతివ్రత'' శ్రీ వేంకటశాస్త్రిగారు డెబ్బదవపడితలవడిసను కవితా సీమంతినికి విశ్రాంతి యొసంగలేదు. లేఖినియను గిలుకు కఱ్ఱను చేత పట్టుకొని మూలపరుండి యుండియు చిట్టికాగితముల నాట్యరంగమునఁ గాలక్షేపమునకయి చిందులు త్రొక్కించుచునే యుండెను. అదియు తోడిపడని పాద విన్యాసములతో నభినయము సాగించుచునే యుండెను.

శ్రీ శాస్త్రిగారికి జవసత్వములు సన్నగిల్లినను సాహిత్య సరస్వతి నిత్య యౌవనవతియై నూతనభావ రచనలు చేయుచునే వచ్చినది. అట్టివానిలో పతివ్రతయను కావ్యమొకటి. ఇందలి కథకు మూలగ్రంథము ధర్మాంగద చరిత్ర. పాముపాట యను జంగము కథ. దానిని రచించినవారు గంజాంజిల్లాలోని శారువను గ్రామము నందలి యొక క్షత్రియగృహస్థుడు అని శ్రీశాస్త్రిగా రా గ్రంథపీఠిక యందు నుడివిరి. ''నాకు వీలయినంతలో మంచో చెడ్డో క్రొత్త మార్గమున రచన సాగించుకొనుటయే యభిమతము'' అని వేంకట శాస్త్రిగారనిన దానికి తార్కాణముగా నీ కృతియందు కథను ప్రవేశపెట్టుటలోనే యింకొక క్రొత్తదారిని త్రొక్కిరి.

కలియుగమందుఁగూడ నిహకాంక్షయెకాక పరంబునందుఁ గో
ర్కులుగల పండితోత్తములు కొందఱు ధర్మవినిర్ణయార్థ మ
ర్మిలి బరిషత్తొకానొకఁడు మేటులఁజేరిచి నిల్పియందుఁ బె
ద్దల వలనన్ విశేషములు తత్పరులై వినుచుండి రింపుగన్
ఆ సభకేగుదెంచె సకలాగమ మర్మవిదుం డొకం డుప
న్యాస మొనర్ప నయ్యనఘు నర్చితుచేసి సదస్యు లయ్యుప
న్యాసకుతోడ నిట్లనిరి.

ఈ కలియుగ మారంభమైన పిమ్మట పతివ్రత యెక్కడ నేనియు నున్నటుల మీరు విన్నచో నామె చరిత్రంబుగూర్చి నే డుపన్యసింపఁ గోరెదము. ఉపన్యాసకుడు పతివ్రతకథ చెప్ప నారంభించెను. కథావస్తువును ప్రవేశపెట్టుటలో నిది మరొక నూతన మార్గముగా శాస్త్రిగారు కల్పించిరి.

కుంకుమపువ్వుచేల తళుకుల్ బెళుకుల్ వలపుల్ జలాశయా
లంకృతముల్ వనస్థలులు లంకలు వొల్చెడి యాపగల్ జలం
బింకని మంచి కూపములు నెల్లెడఁ బొల్చెడి యూళ్ళతో ధరా
లంకరణమ్ము దేశ మకలంకమొకం డలరారుఁ బేరుగన్

అది కాశ్మీ రాభిదమని
మొదటి విశేషణమె తెల్పు భువిఁ దాదృశ సం
పదగల దేశ మ్మొక్కటి
వెదకినఁ గనుపట్టదేల విస్తరమింకన్

అని యొక యుపన్యాస ధోరణిలో నె కథ ప్రారంభింపఁబడెను. ఆ దేశమును ధర్మాంగదుడను రాజు పరిపాలించుచుండెను. వాని భార్య అర్మిలి. ఆమె యొక పామును గనెను. జన్మనక్షత్రమును గ్రహవీక్షణములను గుఱించి జ్యోతిష్కులు నిగూఢార్థ సహితముగా

పుట్టు భోగి యితఁడు పురుషోత్తమాంఘ్రుల
నెపుడు తలను దాల్చు నితరుల కగు
పడుట కిష్టపడఁడు

అని నుడివిరి. మంత్రి జ్యోతిశ్శాస్త్రముమీద నమ్మకము కలవాడు. వారలతో బాగుగా నాలోచించెను. ఈ సంగతి బైటికి పొక్కనీయలేదు. కొంతకాలము జరిగినది. మంత్రి మధ్యవరచి మాణిక్య పురాధీశ్వరుని పుత్రికయగు త్రిలోకసుందరిని సర్పమునకు పెండ్లి చేసెను. ఆ రాజకుమారి యున్న గుట్టంతయు గ్రహించినది. ఆమె మహాసాధ్వి

ముత్యాలపేరు లిమ్ముగఁ దీసి రుద్రాక్ష
మాలికల్ ధరియించె మగువ మిన్న
అగరు గంధము మాని యాపాద మస్తకం
బంగనామణి భస్మమలది కొనియెఁ
గస్తూరికా తిలకమ్ము దిద్దెడు మోము
నందు కుంకుమమాత్ర మతివ తాల్చెఁ
జీని చీనాంబరా లూను నెమ్మేన న
న్నాతిమిన్న ధరించె నారచీర
పూలు భూషణములు తాల్చు పొలతి తలను
మట్టుగాఁ జుట్టకుదురు రొండు పెట్టుకొనియె
భర్తయున్న పేటికఁ దాల్చి పడతి మిన్న
తీర్థయాత్రార్థమై బయల్ దేరె నిట్లు

అత్తమామ లామె యుద్యమమునకు విషాదపడిరి.

జనులకుఁ గర్మమే సుఖమొసంగును కష్టమొసంగు నవ్వుచుం
బొనరిచి యేడ్చుచుం గుడువఁబోలునె యెంతవివేక మద్ది మీ
మన మది నాకునై వగపు మానిన దానవ నాథు నుద్యమం
బనఘుమగుచ్ సమస్తము జయంబగు నాదగుకోర్కె యింతియే

అని త్రిలోకసుందరి వారి నూరడించినది. తీర్థయాత్రలు సేవించుచు బ్రహ్మగుండము చేరెను. అచట తన భర్తను స్నానము చేయించెను. సర్పాకృతి మారలేదు. పురుషాకృతి పొందలేదు. ఆమె యిట్లు చింతించినది.

పాదమ్ములొత్తు నామోద ముండిన నేమి
గూఢపాత్తునకుఁ జేకూరు టెట్లు
మోము మోమునఁ జేర్చు మోహ ముండిన నేమి
ప్రాణంబుపైఁ దీపి వాయలేదు

ప్రక్క లో పన్నుండు భావ ముండిన నేమి
పెట్టెలో నా మేనుపట్టు బెట్లు
హాస్యోక్తులాడు నాహ్లాద ముండిన నేమి
కన్ను బున్నులకు భీ కాంచవలసె

పనికిమాలిన మానుషీ భావమెంత
హాని కరమయ్యె వచ్చు జన్మాన నేనిఁ
బామునాఁ బుట్టి నీ సేవఁ బడయుదాన
నిన్ను మానిసిగాఁ జేయనేర నింక

ఈ కావ్యమునందు శాస్త్రిగా రందందు సాంఘిక దురాచార ములను ప్రభుత్వపు చర్యలను బహిరంగముగాను గూఢముగాను విమర్శించుచు వచ్చిరి.

స్త్రీల దుస్థితిన్

బాగానరింతు మంచును సభల్ పౌనరించుచు స్త్రీలకందులో
భాగ మొసంగి భర్తపయి భార్యకుఁ గష్టము దోచనేని సు
శ్రీగల యన్యుఁ గట్టుకొను చెద్యి వర మ్మనిపింత్రు వారిచేన్

ఇటువంటి సంఘ సంస్కర్తల యకార్యములను ప్రతిఘటించి 'పాతివ్రత్యమున కున్న పాటవము వేఱు. దానికి సాటిలేదు.'

''ఎంత శాస్త్రీయమైన మతెంతమంది
పెద్ద లొప్పికొన్నను నొక వెలఁది యొక్క
పతికి మించి వరించినఁ బలుచగాక
తీర దిందుకు ద్రుపద పుత్రికయ సాక్షి.''

అని దృష్టాంత పూర్వకముగా విడాకుల చట్టములు నిరసించిరి. సర్ప కుమారుని పూర్వజన్మ వృత్తాంతము నుడువుచు నీత డొక రాజ కుమారుడు. రాజ్యభారము వహించి

పన్నుల్ లేశము లేని పండితుల దుంబాలా యినాం భూమికిన్
బన్నుల్ హెచ్చుగ కట్టి వారలఁ గడున్ బాధింపఁగాఁజొచ్చె

అందుమూలమున నీ జన్మయందు పామై పుట్టితివని కారణము నిరూపించిరి. దానిని పురాణములనుండి

బ్రాహ్మణావమానమ్మునఁ బడతి! మున్ను
నహుషుఁ డహి యయ్యె స్వర్గాధినాథుఁడయ్యు
నింక నితరుల లెక్కేమి

అని దృష్టాంతము చూపిరి ఈ పద్యములు సర్వదుంబాలా యీనాముల మీదను బ్రాహ్మణ మాన్యముల మీదను పన్నులను విధించిన ప్రస్తుతపు ప్రభుత్వమును విమర్శించుటయేమో యని పించును. వేంకటశాస్త్రిగారికి వేదవిహితములగు సనాత నాచార ములం దభిమానము మెండు. అధునాతన మార్గములు సంఘమున కరిష్ట దాయకములని వారి నిశ్చితాభిప్రాయము. పాణిగృహీత యిటీవలి చర్యాదులందు నీ విషయములను సందర్భానుసారముగా సూచించుచు వచ్చిరి. అట్లని వీరు నవీన మార్గావలంబకులు కారనుటకు వీలులేదు. గాంధియన్నను గాంధితత్త్వమన్నను వేంకటశాస్త్రిగారి కభిమానము కలదు.

వేంకటశాస్త్రిగారు వేలకొలంది పద్యములు రచించిన మహాకవులు. ధారాశుద్ధియం దెవరే వంకయును బెట్టలేరు. కవిత్వమునకు ధారాశుద్ధి యొక్కటియే ప్రధానాధారము కాదు. పదముల పొందికలో బిగువును, వర్ణనాశిల్పము, భావ గౌరవము నుండవలయును. అవి యీ కావ్యమునం దంతగా కనిపింపవు. వేంకటశాస్త్రిగారు వార్ధక్యమునందు "కాలక్షేపమునకై గిలికిన" యీ కృతి గిలికినట్లే యున్నది. మహాకవులగు వేంకటశాస్త్రిగారంత మహామహుల కావ్యములందుండవలసిన సౌందర్యాది గుణము లిందు గానరావు.

దీనియందే కాదు వీరి సుశీల యందును చదివి యానందింపం దగినంత రచనా సౌందర్య మేమియుఁ గనబడదు. కావ్యమున కుండ తగిన లక్షణములు పెక్కు గలవు. ధార యొక్కటే ప్రధానము కాదు. "గారెల పిండివంటకయి కాంతుఁడు కాంతను బృచ్ఛ చేయ" అని తిరుపతి కవులు చెప్పిన పద్య మీ కావ్యములు పఠించునప్పుడు

జ్ఞప్తికి వచ్చును. పొందికఁగల పదముల కూర్పు రసోచితంబులయి మనస్సు నుప్పొంగఁజేయు భావములు సముచితములగు నలంకార ములు నిత్యాది సాధన సామగ్రులు కావ్యమునకు శోభ కలిగించును. అవిలేక కథనే ప్రధానముగా చెప్పువో నిర్గంధ కుసుమమువలె రసిక జనుల హృదయము నాకర్షించదు. ప్రాయంపు జిగి బిగువు లొరయ మెరుగారు నంగంబుల నందచందములు లేని పసి బాలికతోడఁ బ్రమోదించు వా డెవ డుండును. నేనిట్లు వ్రాసితినని నా పయి దండెత్తెడివారు చాలమంది యుందురని నాకు తెలియును. తిరుపతి కవులయందు నా కమిత గౌరవము కలదు. నిష్పాక్షికబుద్ధితో సత్య మును బహిర్గతము గావించుట విమర్శకుని పని. సుశీల కల్పిత ప్రబంధము. ఆ రాశ్వాసముల గ్రంథము. ఇందు 1137 పద్యములు గలవు. దీనిని వేంకటశాస్త్రిగారు పిఠాపుర వాస్తవ్యులగు లింగం లక్ష్మీ జగన్నాథరావుగారి కంకిత మిచ్చిరి. ఈ కావ్యమును

కలఁడొక వైశ్యుఁడాతఁడు సుఖంపడి యెన్నఁడెఱుంగఁ డొక్కబీ
దలకులమందుఁ బుట్టి ధనధాన్య సువర్ణచిరత్న రత్న రా
సుల కధినేతయై యెపుడు సోమరిగా కతి లోభియై సుతుల్
పలువురు కూతులుం గలిగి భాసిలు స్వార్జిత భాగ్యశాలియై.

అని వైశ్యుని వర్ణనతో ప్రారంభించిరి. అతడు కడు లోభి. వాని సుతులు దానధర్మపరులు. అది వానికి గిట్టలేదు.

సెట్టి కొడుకులు కడు సుప్రసిద్ధులగుచుఁ
దండ్రి యేమేని యన్న నాతని యెడలను
భక్తి భావంబు సడలని ఫక్కినెలమి
వర్తిలుచునున్న సెట్టికి వైర మబ్బె

ఆ సెట్టి గృహంబునం దుండుట కిచ్చగింపక యరణ్యమున కరిగెను. అక్కడికి శత్రు హృతాత్మరాజ్యుడగు నొక రాజు వచ్చెను. అచటి కొక వేశ్య కూడ చేరెను. ఆమె

అల్ల భగవంతుఁ డిచ్చిన యంద చంద
ములు వినా వేఱు భూషణములు ధరింప
దా లతాతన్వి వయసు పదాఱు కించు
మించుగాఁ దోఁచుఁ దొలకరి మించు మించు.

వా రా వేశ్య జన్మవృత్తాంతమును గురించి ప్రశ్నించిరి. ఇది ప్రథమాశ్వాసము. ద్వితీయాశ్వాసము వేశ్య తన కథ చెప్పుటతో నారంభింపఁబడినది. ఆమె యొక ధనవంతమగు కుటుంబమున జన్మించెను. ఆమె యిల్లు పృథివీశు మహల్ లాగున ఘారాయు నగారాయును గలది. ఆమెకు విన్నాణమునకు నిక్క లక్క లిరువురు గలరు. ఒక్కనాడు సంజప్రొద్దు దాపుగఁ జంద్రశాలయందు వారానందముగ బాడికొనుచు కూర్చుండిరి. వారిలో గూడ నీమెయు నుండెను. అప్పటికామె పసిది. ఆ సమయమున

గడ్డము మీసముల్గలఁ డొకానొకఁ డందముఁ జందముస్గలాఁ
డొడ్డును బొడ్వునుం గలిగియుండెను శ్వేతవయస్కుఁవాఁ డెటో
అడ్డెడి ద్వారపాలకుల యాంధ్యమునన్ వెస మేడమెక్కెబల్
గడ్డుగఁ దోఁచె నాతని వికారము త్రాఁగని త్రాఁగుఁబో తహా

వానిం గని యా వారవనితలు కులమర్యాద యగుటఁ గూర్చుండ నొక్క పీఠము చూపియుఁ దాంబూల మిచ్చిరి. అతడు సిక్కుకులమువాడు. అతడు వారిని వరించి వచ్చెను. వాని వైఖరి యా వారకాంతల కంతగా రుచింపలేదు. ''మీ యిరువురలో నొక్కతె నా యందుఁ బ్రియంబు సూపినన్నాలు వెసన్, మీ యమ్మకు నెఱిగించెద, నాయమ సంతుష్టిఁజెందు నంతయు నిత్తున్'' అనెను.

వారిష్టపడలేదు. వానికి కోపము వచ్చినది. 'ముక్కును కోసి పట్టుకొని పోయెద'నని బెదరించెను. మొలనున్న చిన్న సురకత్తిని దీసి చిన్నదాని ముక్కుఁ గోసెను. అంతలో పారావారు వచ్చిరి. అతడు పారిపోయెను.

అప్పటినుండి పడుపువృత్తిమీద నేవగింపు పుట్టినది వారాంగనకు. ఆమెకు నీడు వచ్చినది. విరక్తి నొంది వనమునకు వచ్చినది. ఈ కథ ముగియగానే యచటికొక బ్రాహ్మణుడు వచ్చెను. అతడొక జ్యోతిష్కుడు. వాని చంకయందు శుక్రనాడి గ్రంథమున్నది. జ్యోతిశ్శాస్త్రమనిన శాస్త్రిగారికున్న యభిమాన మెంతోగాని జాతక చర్యయందు, పతివ్రతయందు, సుశీలయందు, జయంతిలోను, తదితర గ్రంథములలోను సావకాశము లభించి నప్పుడెల్ల నేదో విధముగా ప్రస్తావించుచు వచ్చిరి.

జ్యోతిశ్శాస్త్రవేత్త నాడిగ్రంథమును జూచి వారి వారి పూర్వజన్మ వృత్తాంతములు చెప్పెను. చంద్రప్రభ చరిత్రయందు వీరనంది పద్మనాభ నృపాలున కొక మహాముని చేత పూర్వజన్మ వృత్తాంతము లిట్లే చెప్పించెను. వేంకటశాస్త్రిగారు దానిని దృష్టియందుంచుకొని ఈ కార్యమునందు జ్యోతిష్కునిచేత నాడీ గ్రంథమునుండి వేశ్యా వైశ్య నృపతుల పూర్వజన్మ కథలను చదివింపించిరి. ఈ కథలతో మూడాశ్వాసములు గడచినవి. నాల్గవ యాశ్వాసమునందు నలువురు కలిసి తీర్థయాత్రలకై బయలుదేరిరి. తీర్థములు సేవించుచు వారు దేవుని కొండకు వత్తురు. ఈ దేవుని కొండను గురించి మూడవ యాశ్వాసమునందు వివరింపబడినది. వేంకటశాస్త్రిగారు కవిత్వ విషయమున నవీన మార్గమననుసరించిరేగాని యాచారములందును నమ్మకములందును సనాతను లనియే వచింపవలయును. వారికి సనాతన సాంప్రదాయమును పాడుచేయు నవయుగ సంస్కర్తల భావము లేమియు గిట్టవు. ఈ విషయమును గురించి కొంత పాణిగృహీత యందు చర్చించితిని. సుశీలయందు నాలుగైదాశ్వాసములలో ఈ కాలమునందలి తెనుగు దేశ పరిస్థితులు చక్కగా విమర్శింపబడినవి. ఈ కావ్యము కూడ నొకవిధముగా విమర్శన గ్రంథ మనవచ్చును.

వేంకటశాస్త్రిగారు కావ్యములందు పాత్రల మూలమున తమ యభిప్రాయములను లోకమునకు వెల్లడి చేయుదురు. వారి

కథా కల్పనయు వాని కనుగుణముగా నుండునటుల నల్లికను తీర్చి దిద్దుచుందురు. వానియందు పరిస్ఫుటముగా దేశపరిస్థితులు, సంఘ ప్రవృత్తులు ప్రతిఫలించుచుండును. ఆ నైజతేజమే కావ్యమునకు నూతనత్వము జీవము నెలకొల్పును. వారిటీవల వార్థక్యమునందు గిలికిన కావ్యము లన్నిటిలోను సంఘము గోచరించుచునే యుండును.

ఈదారి ననుసరించి కావ్యములు రచించిన వారదివరకు కవులలో నంతగా కనుపించరు. పాల్కురికి సోమనాథుడు బసవపురాణము, పండితారాధ్య చరిత్ర ద్విపదయందు రచించెను. అందు ఆ కాలములోని తెలుగుదేశ పరిస్థితులు గోచరించుచుండును. కాని అవి పాక్షికములు. మతములను గురించి మాత్రము స్పృశింప బడినవి. శాస్త్రిగారి గ్రంథము లట్లుగావు. వానియందు సకల విషయములు గోచరించును. వేంకటశాస్త్రిగారి యీ చణుకును సమగ్రముగా గ్రహించి దానిని కావ్యములోనికి దారి పట్టించినవారు పింగళి, కాటూరు కవులు. శ్రీశాస్త్రిగారు దేశ కాల సంఘ పరిస్థితు లీ యా వ్యక్తులనుండి వాగ్రూపమున వ్యక్తీకరింపగా పైజంట కవులు తమ సౌందరనందమునకు కథరూపమున సమ్మిళితముచేసి మరింత మనోహరముగా ప్రతిపాదించిరి. (సహధర్మ చర్యము) ఆ నైపుణ్యము మెచ్చుకొన వలసియున్నది. వేంకటశాస్త్రిగారిది రచనా చిత్రము. పింగళి కాటూరువారలది శిల్పచిత్రము. వేంకటశాస్త్రిగారి ననుకరించి తరువాత పెక్కుమంది రచనలు సాగించిరి. కాని యీ నేర్పు ''నాస్తి.''

ఆ నాడేకాదశి. ఉత్సవము మహావైభవముగా జరుగుచుండెను. ఒక వైష్ణవి యీ రేయి హరికథ చెప్పినది. ఆమె ''భాగవత గ్రంథపఠన మెట్టి ముక్తినిగూర్చి వచించు'' దానిని బోధించెను. ఒక పండితుడు లేచి పిడివాదమునకు మొదలుపెట్టెను. వారకాంత యగు సుశీల భారత భాగవతాదులు కంఠస్థము గావించిన పండితురాలు. ఆమె తగు సమాధానము చెప్పి వానిని నోరు మూయించినది. అందరు ఆమెను పొగడిరి. మరునాడొక సంస్కర్త

మాలలుఁ గూడ మంటపాం
తరమును జొచ్చి దేవునిఁ గనందగు పీ లొనరింపకున్న సో
దరుల ననాదరించి నటులౌదు సతమ్మది మర్త్య జాతికిన్

అని యుపన్యాస మొసగెను. ''ఏదియొ భాగ్య మబ్బునని యీ రీటువంటి కుమార్గ మొండు సర్వాదరణీయ మాటకుఁ బ్రయత్న మొనర్తురు'' ''అవయవ సమత్వమును రక్తవిషయ సామ్యంబు యోగ్యతకు గుఱుతులు గావు'' అని సుశీల ప్రత్యాఖ్యానము గావించెను. మాలల దేవాలయ ప్రవేశమువలన నెన్నియో కీడు లుప్పతిలు నే కవియో పత్రికలందు పద్యములు ప్రకటించెను. అనుచు

ఆలయముల్ ప్రధాన మయినట్టివి యంటువడెన్ శరించి వ
ర్షా లెగఁదట్టె భూ ప్రజలు క్షామపు దేవత కగ్గమైరి దే
వాలయ దేవతల్ కనిసి యాత్మ పురమ్ములు చేరఁబోయి నా
రాలన పాలనల్ జరుపు నట్టిరు మంత్రులకేమి కావలెన్

ఇత్యాదికంబులగు నా పద్యములను చదివి వినిపించెను. తరువాత సుశీల 'బాలురు బాలికల్ గలసి పాఠములన్ మఱి పాఠశాలలన్, దోలిఁ బఠింపవచ్చు ననుచుందురు, గొందఱు' అది ముప్పు దెచ్చును

పొలతి దాన వహ్ని పురుషుఁ డాజ్య ఘటంబు
కదియ కుండవలయుఁ గదిసె నేని
బమ్మ యైనఁ గూతుఁ బట్టక మానఁడు
వటున కింతి పొత్తు వలదు వలదు

అని వాదించెను. మతాంతర వివాహమును ఖండించెను. జనులందరామెను మెచ్చుకొనిరి. అంతటితో చతుర్థాశ్వాసము ముగియును. ఐదు ఆరాశ్వాసములందు సినిమా తారలను, దొంగతనములను, లంచకొండి తనములను నొకటి వెనుక నొకటిగా ఖండించిరి. ఇట్లు వేంకటశాస్త్రిగారు సుశీల కావ్యమునందు దేశములోని దురాచారములను ఖండించిరి. ఇట్టి దురాచారముల

వలన నధోగతి పాలగుచున్న దేశము దుస్థితి వారి నుద్రేకపరచినది. వాని నరికట్టుట కుద్యమించినారు శాస్త్రిగారు.

స్వార్థముకొరకు కవిత్వము చెప్పుచున్నను కవి విశ్వశ్రేయోభిలాషి. ప్రపంచ శ్రేయముకొరకు కావ్యములు రచించును. ముఖప్రీతికొరకు సద్యః ఫలముకొరకు రచనలు చేయని కవులు లేరని నా యభిప్రాయముకాదు. అట్టి కుకవుల విషయము నేను నుడువను. ఈ కాలమునం దట్టి రచనలు లక్షలకొలంది కలవు. అవి కుక్కగొడుగుల వలె నశించును. మహాకవుల కావ్యము లట్టివికావు. వారి రచనలలో సంఘములోని దురాచారములను ఖండించుచు, నీతిని బోధించు పట్టులు పెక్కులుండును. భారతము మొదలు నుత్తమ గ్రంథము లన్నియు విశ్వశ్రేయముకొరకే వ్రాయబడినవి. అందుకనే "విశ్వ శ్రేయః కావ్యం" అని లాక్షణికులు నుడివిరి. ప్రేమ కలాపములు విలాసములు ప్రకటించు నీ నాటి కవులు వానిని నిందింతురుగాక, "నిరవధిః కాలః విపులాచ పృథ్వీ" అవి వారికొరకు కావు. వానిని చదివి వారు తత్త్వము నర్థము చేసికొనలేరు. అంతకంటె విచిత్రము తాము కొత్తదారిని త్రొక్కుచున్నా మనుకొనుటయే గాని ప్రాత దారుల వైతొలంగి పోలేదు.

సుశీల కావ్యమునందలి కవిత్వమును గురించి యంతగా ప్రశంసింపతగిన దేదియు లేదు. ఇదియు దినములు వారములలో వార్ధక్యమునం దాశువుగా గిలికిన గ్రంథమే. దీనియందు వినూతన భావ కల్పనలుగాని, మిగుల రసమును గురిపించు చక్కని పద్యములుగాని, హృదయాహ్లాద కరములగు నలంకారములుగాని మనము ఆసింప వలసిన పనిలేదు. అది యుచితమును గాదు. అట్టి యాశుకవితలో కొంత పేలవము వాటిల్లక దప్పదు. దానికి వయస్సుకూడ కొంత కారణమై యుండవచ్చును.

"ఏదో బోలెడు వ్రాసిన
చేదస్తపుఁ గవిలెక్కట్టచేఁ గవి యగుచో

సీదాఁక నేల? భువిని భ
వాదృశు లిఁక రామకోటి వారలు లేరే

ఓపిక పట్టితి వ్రాసితి
వే పొత్తము లైన నేమి? యెన్నిటినో! యం
దే పొత్తము రుచియించు? వృ
థా పడితి పరిశ్రమంబు తథ్య మెఱుఁగుమీ

"ఏదో ఛందోబద్ధంబుగనే కాదు, గద్యరూపంబున నేని గొంత రచన సాగించిన మానిసి కవి యనుటకు సందియంబు లేదు." అని నా ముందున్న శాస్త్రిగారి పురాణకథలు అను గ్రంథము నుండి పార్వతి వ్యాసుని మందలించిన భాగము సాభిప్రాయముగా నే నీ భాగమును వ్రాయుచుండగా నా మిత్రుడగు నొక పండితవరుడు చదివి వినిపించెను. "వ్యాసుడెంత చమత్కారకుక్షియైనను నన్ని గ్రంథములు రచించుట యొక ప్రజ్ఞ యేకదా? దానికైనను వ్యాసునకు నమస్కరింప వచ్చు"నని నేను సమాధానము చెప్పితిని. నా మిత్రుడతి సమర్థుడు. తిరుపతికవుల గ్రంథములన్నియును క్షుణ్ణముగా జదివిన దిట్ట. వారనిన నభిమానము మెండు. ఆయన అంతటితో నూరకుండక

"కలపరా ల్వంద చెక్కుటకన్న ముక్క
రలకుఁ జాలదె యొక మగఱాతి ముక్క"

అని ప్రత్యాఖ్యానము గావించెను. "మగఱాతి ముక్క యొకటికాదు శ్రవణానందము, పాండవ విజయ ఉద్యోగములు మూడు కలవు. వానిని వాణి ముంగరలో ముద్దుకురియ దాపికొన వచ్చును" అని నా సమాధానము. "మరి మిగిలినవో?" అన్నాడాయన. "లోకము నిర్ణయించును" అని నే నంటిని.

తరువాతి కావ్యమగు గోదేవి యందును ప్రశంసింప తగినంత సుశేష మేదియు గోచరించదు. గోదేవి యొక పద్యాత్మకమైన వ్యాసమని చెప్పవచ్చును. దీనిని వేంకటశాస్త్రిగారు గంగాధర

రామరాయణంగారి కంకిత మిచ్చిరి. గోమాత ప్రాశస్త్యమును వర్ణించుటయే యీ కృతియాశయము. కావున

శ్రీ లక్ష్మీసతితోడఁ జందురునితోఁ జింతామణీ భూషతో
నైలింపాగ సుధాప్సరస్సతులతో నారాయణావాసమై
చాలం బొల్చెడు క్షీరనీర నిధిలో జన్మించు తేజంబు లో
కాలంబం బల కామధేను విడుఁగా కారోగ్య మాయుష్యమున్

అను నాశీర్వాద పద్యముతో గావ్యమును ప్రారంభించినారు శాస్త్రిగారు. గో బృందమునకు మాతృదేవతయు లోకములకు నాలంబమును ఆరోగ్యము నాయుష్యము నిచ్చునదియునగు కామధేను వింద ప్రస్తావింపఁ బడినది. గోవులు కామధేనువు సంతానము. తల్లి గుణములు సంతానమునకు ప్రాప్తించుట లోకసహజము. కావున గోవుల ఆ యా గుణములు గోదేవి కావ్యమునందు ప్రశంసింపఁ బడినవి. ఆ కారణముననే

సకల పుణ్యతీర్థములును సర్వ నదులు
గోవు నవయవమందునఁ గూడియుండు

"అట్టి గోవు పరిచర్య నిరంతర మిహ సుఖము నొసఁగుచుం బరసుఖము గూడ నిడుట ప్రత్యక్షంబే" యని నుడివిరి. దీనికి తార్కాణముగా సుదక్షిణా దిలీపుల కధను పేర్కొనిరి. దిలీపునకు చాలకాలము సంతానము కలుగలేదు. వసిష్ఠుని యాదేశమున కామధేనువు కూతురగు నందినీ ధేనువును దినదినము నడవికిఁ గొనిపోయి యది పూరిమేయు నెడ

అడవి యీగలు మూగ నవ్వానిఁ జిఱుమండఁ
జేఁ బూని దవ్వుగాఁ జెదరఁ గొట్టు
గంగడోల్ పారిఁ బోరి ఖర నఖరములచే
గోకి హాయిని సమకూడఁ జేయు

నెడ నెడఁ బొదరిండ్ల నెదిగి ముచ్చటఁ గొల్పు
గతికి గుసెళ్ళతోఁ బెఱికి మేపు
నెటు లేగ నట్టులే యేగనిచ్చును గాని
యడ్డమేగి మరల్చు టసలు లేదు

త్రావినం ద్రావుఁ దినఁ దిను దారి నిలువ
నిలుచుఁ బన్నుండఁ గూర్చుండు నేల ఱేడు
తన ప్రవర్తనమును జూచి తక్క నాల
గాపరులు మెచ్చికొని తన దాపు జేర

ఇట్లు దాని నెడతెగక సేవించుచు దాని పాలుద్రావుచుండుటచేత కొంత కాలమునకు దిలీపుడు రఘువను కుమారుని గాంచెను. ఉశీనగర వసుమతీపతి కూతురు వ్యాధి పీడితురాలయ్యెను. ఆమెకు స్నేహితురాలష్టవసువులలో చిన్నవాని భార్య. ఆమెకు అష్టమ వసువు

మాటల ధోరణిలోఁ దన
బోటికి నందినిని జూపి పూఁబోఁణిరో! బల్
గాటంపు వ్యాధు లియ్యది
గోటన్ మీటుఁ దన పాలు గ్రోలిన యేనిన్

అని నుడివెను. తత్సందర్భమున గంగాశంతనుల కథ ప్రసంగింపఁబడెను. రఘు మహారాజు తన భార్యను బ్రహ్మచారి మునికిచ్చిన కథను తెల్పి యాయన త్యాగమునకు కారణము

అతఁడు మా నందినీ ధేను వలరి ప్రేమ
పూర్వకంబుగ నిచ్చిన పొదుగు పాల
వలనఁ జన్మించె నీఁక యే తపంబు గూడఁ
జేయలే దక్క తనఁ గుల శ్రేష్ఠుఁ డయ్యె

ఇట్టి పురాణకథలు గోదేవియందు కలవు.
గోవు సేవవలనఁ గొన వచ్చు నుత్తమ
మైన సంతతియును నతుల మైన

సిరియు సంపదయును జిరతరాయుష్యం బ
నామయంబు మఱియు నన్య సుఖము

అట్టి గోమాత సంరక్షణకై జీవితము ధారపోయు శ్రీమంతుల జీవితమే జీవితము. అని వేంకటశాస్త్రిగారు నిరూపించిరి. వేంకట శాస్త్రిగారు సకల విజ్ఞాన భాండాగారమని చెప్పవచ్చును. గోదేవి కావ్యమునం దహింసా తత్త్వమును గురించి చర్చించుచు

వేదమున నున్న పశుహింస విజ్ఞు లెల్ల
హింస కాదనియే నిర్ణయించినారు
కాని యమ్మాట స్మృతులలో ఖండితముగఁ
ద్రోసి పుచ్చిన మార్గముల్ గలుగుఁ గొన్ని

ద్వైత విశిష్టాద్వైతులు
స్వాతంత్ర్యము కొంత పూని సవనమ్ముల హిం
సా తంత్రము తప్పించిరి
శ్రోతులు వారలను గేలి సల్పుచు నున్నన్

అని శాస్త్రిగారు శ్రుతి స్మృతుల వాదముల విజ్ఞానము, ద్వైతాద్వైతసిద్ధాంతముల పరిచయము, నా యా సందర్భములందు ప్రకటించుచు వచ్చిరి. దానికితోడు లౌకిక పరిజ్ఞానము కూడ ప్రశంసింపఁ దగినది. వేంకటశాస్త్రిగా రవధా నాదికముల మూలమున కవితా బీజములను తెలుగువారి హృదయ క్షేత్రములందు వెదచల్లుచు దేశము నలుమూలల సంచారము గావించిరి. ఆ సందర్భమునందు వారికి పరిచయమయిన విభిన్నజాతీయ వ్యక్తులవలన పెక్కు విషయములను గ్రహించుకొనిరి.

ఏను మతాంతరస్థులఁ గవీంద్రులఁ గొందఱఁ జూచితిన్ ముస
ల్మానులఁగూడ వైదికులు మాంసము మద్యము ముట్టరాని వం
చే నియమం బొనర్చినటు చెప్పగ వింటిని చాల గొప్ప వి
జ్ఞానులు వారిలోఁ గలరు.

అని శాస్త్రిగారు వ్రాసిరి. శాస్త్రిగారు విజ్ఞాన పిపాసువు. నూతన విషయములను పరులనుండి గ్రహించుకొనుటకు వారి మన స్సారాట పడుచుండును. ''శునకములగూఁడ పోలండు తినుట విది తమె'' యని పోలండువారి యలవాటు నుగ్గడించిరి. బుద్ధుని యహింసా తత్త్వము జపాను చైనాల యందుకూడ ప్రచారము చేయబడినది.

పాపమాతండు చేసిన పని జపాను
నందె కాదు చైనాయందు నావరించె
నేమి లాభ మిప్పుడు వార లెల్ల జంతు
వుల నె కాదు సుడీ తిన గలరు నరుల

అని జపాను చైనావారల క్రూర స్వభావమును వర్ణించిరి. విదేశములను గురించే కాదు స్వదేశమునందు నారయప్పారావు గారి ఎలుకల కథ, ధర్మాప్పారావుగారి కొల్లేటి దోమల కథ మొదలగు పెక్కు కథలు గోదేవి యందు కలవు. వేంకటశాస్త్రిగారు రూపొందిన విజ్ఞాన సర్వస్వము. కలమునుచేత బట్టుకొని నంతనే యాయా సంగతు లొకటి వెంటనొకటి హృదయ పేటిక తెరుచుకొని ముందు నకు నెట్టుకొని వచ్చును. వానికి సాహిత్యంపుఁ బోకడల నాపాదించి కావ్యస్వరూపము కల్పింతురు. ''కవనార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి'' అని ధీమాతో చెప్పుకొనిన లోకోత్తర కవితా సామ్రాజ్య సార్వభౌములు వేంకటశాస్త్రిగారు. గోచిపెట్టినది మొదలు శివసాయుజ్యమును పొందునంత వరకు వార్ధక్యమున నీరసించి శయ్యా గతులై యుండియు కావ్యకన్యకలను సృష్టించుచు లోకమునకు ప్రసాదించుచునే యుండిరి.

''పూర్వ హరిశ్చంద్ర'' వారి వృద్ధాప్యమునందు పొడమిన సంతానములలో మరొకటి. దీనిని వేంకటశాస్త్రిగారు తమ చిర మిత్రులగు సోమిన వేంకటేశ్వరరావుగారి కంకిత మొసంగిరి. ఈ కృతియం దితర గ్రంథములయందు వలెగాక సంస్కృతశ్లోకముతో మంగళా చరణము గావింపబడినది. నన్నయ తరువాత కృత్యాదిని సంస్కృతశ్లోకముతో మంగళా చరణము గావించినవారు కనిపించరు.

నైమిశారణ్య వర్ణనముతో కావ్యం ప్రారంభింపబడినది. అందలి మహర్షులు కర్మ పరిణామము, జీవాత్మ పరమాత్మల మైక్యము, జన్మలు, మొదలగు విషయములను గురించి చర్చించిరి. అందు వేంకటశాస్త్రిగా రుత్తర మీమాంస స్మృతుల సారమును పిండి పోసిరి. గర్భస్థశిశువు

ఇరుకై పంకిలమై యయోమయమునై హేయంబునై రోతయై
నరకంపుం దెరువై తలంచుకోలఁది న్నానారసాభాసమై
దురితంపుం గుఱుతై దురుద్ధర రుజా దుర్గంధ భూయిష్ఠమై
మఱుగుందొడ్డి గనుండు దీని నిఁక సంపాదించుకో నెప్పుడున్

అని తలంచునట. ఈ పద్యమును చదువు చున్నప్పుడు జఠర కుహరము నందలి శిశువు పడు యాతన మనో నయనమునకు గోచరించి యొడలు జలదరించును. తాపసులు కలియుగ దురాచారములను తడవుచు

కన్నియలు నట్టి నాగరి
కౌన్నత్యము లేనివాని నధమాధముఁ డం
చు న్నిరసింతురు

అని కలియుగమందలి కన్యకల స్వభావము నుడివిరి. ఈ పద్య భాగమును ప్రధానముగా దీసికొని (శ్రీ) శాస్త్రిగారు కలకంధరా నీల లోహితుల కథ నల్లిరి. కలకంధర యొక వ్యవసాయదారుని కూతురు. తండ్రి వీణానాదము, సంగీతము సాహిత్యము నేర్పించెను. కొంకొంక ము కొంత గురువునొద్ద, కొంత తాను స్వయముగాను అభ్యసించినది. ఆమె యతి సౌందర్యవతి. తండ్రి యామె నొక కృషికున కిచ్చి వివాహము గావించెను. ఇక నామె మనోవేదన యారంభమయినది.

చదువు చెప్పించె నా తండ్రి శైశవమున
రసికునకు నీక యెద్దుల రసికతా వి
పాక మెఱిఁగిన మోఱకు పాలొనర్చె
నడవిఁ గాచిన వెన్నెల యాయె బ్రతుకు.

భర్త యెద్దుల రసికతా విపాక మెరిగిన మోరకట. వేంకట శాస్త్రిగారు చక్కని భావమిందు మరుగుపరచినారు. అవును విద్యావంతురాలగు కలకంధర అంతకంటె భర్తను గురించి యేమి తలంపఁగలదు. ఆయెద్దు మొద్దయిన

ప్రొద్దుట లేచు టాది రవి పోయిన పిమ్మటఁ గూడ బీటిలో
నెద్దులతోడి నేస్తమున కే యలవాటగు కాపు బిడ్డ నే
యొద్దిక లబ్బ నింట పద ముంచుటయే తడ వాహరించి తా
నిద్దురవోవు లేపినను నీలిగి కన్నులు మోడ్చు వెంటనే.

అతడు రవి పోయిన పిమ్మటఁగూడ బీటిలో నుండు నట. కలకంధర క్రొత్తగా కాపురమునకు వచ్చిన నిండు జవ్వనవతి. ఇంక నామె మనస్సెట్లుండునో చదువరు లూహించుకొనవచ్చును. ఆ ప్రాయ మటువంటిది. వాని కెద్దులతోడి నేస్తమట. ఎంత చక్కని భావము. ఎంత భావపూరితమైన యుపాలంభము. ఎద్దుల కెద్దులతో గాక మరెవరితో స్నేహముండును. అట్టివాని కే యొద్దిక లుండును. పోనీ యింటికి వచ్చిన తరువాత నయిన తన్నేమయిన తడవునా యనినచో అదియు లేదు. ఆహరించి నిద్దురపోవును. సిగ్గువిడిచి లేపిన నీలిగి కన్నులు మూయును. ఇంక నామె ప్రాయంపు బిగువు సడలించుకొను తెరువేది? నేర్చిన చదువుల నుపయోగించుటకు వీలేది?

కొంత చెప్పిరి గురులు కొంకొక మేనె
చదివికొంటిఁ జతురశీతి సంఖ్యగా ర
హస్యమందుఁ గలదు గాని యందొకండు
గూడ లక్ష్యమ్ముగాఁ జూచు గో డెఱుంగ

ఇది కలకంధర యావేదన. అందు తప్పేమున్నది? నవయౌవనవతుల కుండు ప్రధానాశయమది. దానిని కాదనగలవారెవరు. కొంకొక మాసాంత మభ్యసించిన వయోవతి. భర్త

నెదుట నుంచుకొని లక్ష్యమునకై పెనుగులాడకుండునా? ఆ యదృష్టము కలకంధర కలవడలేదు. అదియే యామె యావేదన.

ఈ మూడు పద్యములు బంగారమునందు పొదిగిన వజ్ర శకలములవలె నీ కథయందు పొందుపరచిరి. శ్రీ శాస్త్రిగారు ప్రాయమున వృద్ధులయ్యును యౌవనంపు శృంగారరస ప్రాదుర్భావము ఇనికి పోలేదు. చేవ చేరి చతురత్వమున గడుసుతనమును బోసికొన్నది. కలకంధర మనస్సులోని భావములను పుణికి పుచ్చుకొనినట్లు, తొంగి చూచినట్లు, వెలయింప గలిగిరి. కలకంధర పురాణపాత్ర. దానిని నీ కాలపు నవనాగరి కాంగన వలె తీర్చిదిద్దినారు వేంకటశాస్త్రిగారు. అందు నతిప్రౌఢగా చిత్రించిరి. బలవంతముమీద అత్తగారి మొగ మోటము కొరకు రాట్నము ముందు కూర్చుండును.

ఎంతసేపు కూర్చున్న నా కొకింత నూలు
కన్పడదు తెగ తెంపులే గానుపించు

చదువుకొన్న యువతుల స్థితి గతు లింతే. వారింటి పనులకు పనికిరారు. ఈనాటి కాపు పడుచుల నచ్చునం బోసి కలకంధరగా నీ కథయందు నిలిపినారు శాస్త్రిగారు. ఆమె యొకనాడా దేశపు రాజగు నీలలోహితుని చూచినది. వానిమీద మనస్సు పారినది. రాజు మనస్సు కూడ కలకంధర మీద ప్రసరించినది. ఆమె యా రేయి

చదివితి కామశాస్త్రమును చాటుగ దానికి సార్థకత్వ మిం
కొదవెడి బంధ చిత్రముల నుంతును తేఁడుల మేలి కేళికా
సదనములందుఁ దత్సుఖ వశంవదుగా నొనరించి తేని మ
త్పదయుగ దాసుగా సలిపి పాలన మేన యొనర్తు సర్వమున్

అని తలంచినది. ఉమ్మరిసి యుబలాటపడుచున్న కలకంధర యౌవనంపు మిడిసిపాటుతనము కామకేళి కెంత తహతహ లాడు చున్నదో తెలుపుట కీ పద్య మొక్కటి చాలు. అందమున్నది. దానికి తోడు కామశాస్త్రోపాధ్యాయిని. ఆ రెంటిని మించినది

వయస్సు. అట్టివారికి తెలివితేటల కేమితక్కువ. మరునాడు రాజొక దూతికను కలకంధర యొద్దకు పంపెను. కలకంధర దూతికకు చెప్పిన మాటలలో గాంభీర్యము చతురత యుపాయము రాశీభూతములయి కుదురుకొన్నవి.

అఖిల రత్నములును నేలునట్టి తేని
వేను రత్నంబ నని తోచెనేమొ నీకు
నెప్పు డటుతోచె నపుడె నీ యిక్క నుండ
వలసినదె పని యేమింత వలపుతోడ

అన్నది. ఎంత ప్రౌఢమును భావగంభీరమునగు సమాధానము. అందులో నిరాశ కలిగింపని యాశాగర్భితమయిన యూహ మనస్సున కందించినది. అది మదనోద్రేకము తల కెక్కించునది.

వలపు వెల తెలియఁ దలఁచిన
వెల వెలఁదియుఁ బెండ్లియాడు వెలఁదియుఁ దెలుపం
గలరే? పాపమొ పున్నెమొ
యల వలపుం దెలుపఁ దగిన దన్యాంగనయే

యట. వలపు చవిచూడవలయునన్నచో తనవంటి యన్యాంగన యందే చూడవలయునట. తన చాతుర్య మంత ఘనమయిన దని చాటి చెప్పినది. ఆ మాటలలో నాశ నుద్రేకింపచేయు నూరింపులు నొక విధముగా రాజసము స్ఫురించును. ఇన్ని విధములచేత ప్రౌఢయయిన కలకంధర సాంగత్యమే రసికు డభిలషింప కుండఁ గలడు?

మదనునకే మదన తాపము కలిగించు మదవతిగా కలకంధరను సృష్టించినారు శాస్త్రిగారు. నీలలోహితు డామె నంతఃపురమునకు గొనిపోయెను. కలకంధరా నీలలోహితులు మరల జన్మయందు చంద్రమతీ హరిశ్చంద్రులుగా పుట్టిరి. పరకీయ నాయికగాగల తారాశశాంకాది పౌరాణిక కావ్యములు పెక్కు గలవు. అవి పౌరాణికములుగానే స్ఫురించును.

కలకంధరా సీలలోహితులు కృతయుగమునాటి పౌరాణిక పాత్రలు. కథ యతి ప్రాచీనము. అందు నవీన కాలమునాటి నవ నాగరి కాంగనల మనోభావములను చిత్రించి నాయికా నాయకులను మన యూహకు దృష్టికి నందుబాటులోనికి తెచ్చినారు శాస్త్రిగారు. అది యిందలి నవీనత. పౌరాణికములో నధునాతనత్వమును ప్రతిపాదించి పాత్రలను పాఠకులకు సన్నిహితము చేయుటలో శాస్త్రిగారి చాకచక్య మిందు చక్కఁగా నగుపించును. ఇంతే కాదు శునశ్శేపుని కథలో విశ్వామిత్రుని పాత్రయు నిట్టిదే శునశ్శేపుని కథ రామాయణాది పురాణములందుఁ గలదు. అందలి విశ్వామిత్రపాత్ర మహత్తరమైన తపశ్శక్తి గల పౌరాణిక పాత్రగా సృష్టింపబడెను. పూర్వ హరిశ్చంద్ర కావ్యమునందు వానిలో విప్లవ బీజములను నెలకొల్పి వేదవిహితములగు యజ్ఞయాగాదులం దాచరించు హింసాకర్మమును వ్యతిరేకించినటుల శాస్త్రిగారు చిత్రించిరి. శునశ్శేపుడు యూప స్తంభమునకు బంధింపఁ బడెను. విశ్వామిత్రుడు యజ్ఞశాల కరుదెంచి హరిశ్చంద్రునితో

ఆది వ్యాధి పరీతం
బీ ధర సర్వంబు మందులె పోకారున్
వ్యాధులఁ గొన్నిటిఁ దక్కన
వ్యాధులకు శివార్చనంబు వారక మధిపా!

వ్యాధి కని చెప్పి బ్రహ్మ హత్యంబొనరితె
వ్యాధి లేనట్టి ప్రాణి ప్రపంచకమునఁ
గలఁడె నారక మిడు సిలుగులకుఁ దాళఁ
గలవె, వ్యాధికే జంకెడు కాతరుఁడవు

జీవ హత్యకన్నఁ జెట్టయు జీవ సం
రక్ష కన్న మంచి రాజ చంద్ర
లేదు

అని యుపన్యసించెను. ఇది యొకవిధముగా యజ్ఞములందు పశుహననమును బోధించు సూత్రములకు ఖండన వాదము. ద్వైత విశిష్టాద్వైత మతానుయాయులు యజ్ఞములందు పశుహనన మంగీకరింపరు. వారు సజీవ పశువు బదులు యజ్ఞములందు పిష్ట పశువు నుపయోగింతురు. హింస యెందైనను హింసయనియే వారి వాదము. కొన్ని స్మృతివాదములుకూడ ఈ కర్మకు వ్యతిరేకముగా నున్నవి. వేంకటశాస్త్రిగా రివన్నియు పరికించి విశ్వామిత్రుని నోట తమ యభిప్రాయమును వెలువరించిరి. గోదేవియందు బుద్ధచరిత్రయందు నిట్టి యభిప్రాయమునే వెల్లడించిరి. ఇట్లు పాత్రలో క్రొత్తభావము లిమిడ్చి పూర్వ హారిశ్చంద్ర కొక నవీనత్వమును వేంకటశాస్త్రిగా రాపాదించిరి.

తరువాత చెప్పదగిన కావ్యము శివభక్తి. ఇది భక్తి ప్రధానమైన కావ్యము. ఇందు 5 ఆశ్వాసములు 1222 పద్యములు గలవు. ఈ గ్రంథము చుండూరు వెంకట రెడ్డిగారి కంకిత మీయబడినది. కథ కైలాసవర్ణనతో ప్రారంభింపబడినది. ఆ గిరిమీద నలకాపురము కలదు. దాని కధినేత కుబేరుడు. అతడు శివునకు పరమ భక్తుడు.

అలకాధిపతి మేడ లందుండు మని వేడు
　　శివుడు కందరమె వాంఛించుచుండు
శ్రీదుం డొసఁగుచుండుఁ జీని చీనాంబరా
　　లభవుండు తాల్పు వ్యాఘ్రాజినంబు
అగరు గంధము యక్షుఁ డర్పించు భక్తితో
　　ఫాలనేత్రుఁడు పూయు భస్మ మెపుడు
మణి హారము లొసంగు మానవహాయుఁడు శ్రీ
　　గళుఁడు పున్కలు పూను గళమునందు

రకరకాల్ భక్ష్య భోజ్యముల్ రాజరాజు
దిన దినము భక్తిమై నివేదించు హరుఁడు

కంద మూలమ్ములనె తృప్తిగాంచు "నిస్పృ
హాస్య తు తృణం జగ" త్తను టనువు పడఁగ.

ఈ పద్యమునందు శివునిమీద కుబేరునికి గల యనురక్తియు శివునికి భోగముల మీదగల విరక్తియు చక్కగా నిరూపింపఁబడినది. ఇందు కొంత హాస్యరసముకూడా సన్నని మబ్బు తెరమరుగున నున్న సుధాకరుని బింబమువలె గోచరించును. దీని తరువాతి పద్యముకూడ నటువంటిదే

ఏనాటి ముసలి యెద్దో
దీనికి విశ్రాంతి యిచ్చి తేజీనో మే
లా నాగంబునొ కొనుమనఁ
గా నాతండేది కూడ కైకొనఁ డెపుడున్.

బలు సున్నితమైన హాస్యరస మిందు సమ్మిళిత మయి వేంకట శాస్త్రిగారి స్వభావమును జ్ఞప్తికి తెచ్చుచున్నది. శ్రీశాస్త్రిగారేది మాట్లాడినను నర్మగర్భముగా మాట్లాడుట యలవాటు. ఆ మాట లలో కొంత పరిహాసము, కొంత వేళాకోళము చాటు చాటుననుండి ముసిముసి నగవుల మిసమిసలు వెలయించుచుండును. అది వారికి జన్మతః సిద్ధించిన విద్య. వార్ధక్యమునందు అది వారిని విడిచిపెట్టలేదు. అంతేకాదు ఆ శంకరుడు భక్త సులభుడట.

అభిషేక మొనరించు టసలె యక్కర లేదు
గంగ మూర్ధమున నుప్పొంగి పొరలు
భూషణంబు లొసంగి పూజింపఁ బనిలేదు
బాలచంద్రుని జూపు పాటి చాలు
వస్త్రయుగ్మపు సమర్పణ మనావశ్యకం
బష్ట దిక్కులె చేయు నట్టి సేవ
యజ్ఞోపవీతంబు లర్పించు టెందుల
కహిరాజులే తీర్తు రట్టి లోటు

విషము భక్షించువానికి వివిధ మధుర
భక్ష్యముల్ గూర్చ నేటికి భక్త తతికి
నింత సులభుఁడౌ దేవర యెందుఁ గలఁడె
భక్తి కుదిరినఁ జాలు సర్వమ్ముఁ గలదు

ఇట్టి రచనా చమత్కారము మరే యితర కృతులందుఁ గని పించదు. వేంకటశాస్త్రిగారు శివభక్తిపరులు. భక్తునకు పరమేశ్వ రుని యందుండు చనువు మరెవ్వరికిని వుండదు. ఆ చనువే యీ పద్యమునందు శాస్త్రిగారు ప్రదర్శించిరి. అట్లు కానిచో ఈ పద్య మింకొక తీరుగా నడిపించెడివారు.

శివ యనెడి శబ్దమందున్న శ్రేయమునకు
వలచి కాక రెండవ పెండ్లివాని శూలి
గౌరి వరియించునే? దాని గౌరవమున
కింతకన్నను సాక్ష్య మెం డేది వలయు
ఎఱిఁగి తన్ను భజించిన యేది యేని
యొసఁగు నడుగనిదే పాప ముగ్రు పట్ల

యట. శివునిఁ దలంచు కొలంది యూరిన మధుర భావములకు భాషా సౌకుమార్యమును జోడించి జీవసరమును పోసి యీ పద్యము లను శాస్త్రిగారు రచించిరి. వేంకటశాస్త్రిగారు సంస్కృత భాషా కోవిదులు. అట్లయ్యును సంస్కృతమునందు కంటె వారు మాతృ భాషయగు తెనుగునందె బహుళముగా కావ్యరచనము సాగించి రన్నచో వారి మాతృభాషాభిమానము అపారమైనదని చెప్పక తప్పదు. అంతకంటె వారి మాతృదేశాభిమానము వేనోళ్ళఁ బ్రశం సింపఁ దగినదని యీ పద్యము చాటుచున్నది.

ఇతర దేశమ్ములను జనియించుకంటె
నాంధ్రదేశాన జనియించు టార్యహితము
వశి! వశి! యటంచుఁ బిలుతురు వారు భార్య
నదియు శివ శివయై తుద కఘము లడచు

నారదుఁడు కైలాసమున శివుని దర్శించి పది శ్లోకములతో వానిని వినుతించెను. భూలోకమునందలి జనుల యవినీతి ప్రవర్తనములను సంస్కృతచ్ఛందమునందు వ్రాయబడిన తెనుగు పద్యములలో విశదపరచెను. ఇదియొక క్రొత్త పద్ధతి. శివుడు కుబేరుని కావేరీ తీరమునందలి కావేరీ పురమునందున్న శివకలా శివనేతలకు పుత్రునిగా జన్మింపుమని యాదేశించెను. కుబేరుడు తిరివంకాడ యను పేరుతో వారికి పుత్రుడై పుట్టెను.

కావ్యమునకు రూపకల్పన చేయునది కథ. దానియందు చక్కని సన్నివేశములను సమకూర్చుకొనుటకు తగిన సంఘటనలుండవలయును. అట్టి సావకాశము లేనప్పుడు కవి తన కవితానైపుణ్యమును ఎంత వెలయించుటకు ప్రయత్నించినను నిరుపయోగమగును. కృతిపతి కృతికర్త కిచ్చిన కథ యిది. అందు చక్కని సన్నివేశములు గాని సంఘటనలుగాని లేవు. అందుమూలమున 2, 3, 4, ఆశ్వాసములు చప్ప చప్పగా నున్నవి. అయినను శాస్త్రిగారు అందందుఁ గొన్ని వేదాంత విషయములను వివరించి రస పిపాసువులకు కాకపోయినను జిజ్ఞాసువులకుఁ జదివి తెలిసికొనవలయునను నిచ్ఛ కల్పింపఁ గలిగిరి. నిత్యకర్మ యగు సంధ్యావందన ప్రాశస్త్యమును గూర్చి ప్రస్తావించుచు గాయత్రీ మంత్రార్థము

చోదనార్థక ధాతువు చోదయాత్త
నెడిది యమ్మంత్ర మందున నెగడు కతన
ధీకిఁ బ్రేరకుఁ డున్నట్లు తెలియఁ బడెడి
గాన జీవి స్వతంత్రుఁడు గాఁడు ధ్రువము

ధీకిఁ బ్రేరకుండైనవాఁడల మహాదేవుండె పంచాక్షరీ
ప్రాకారాంతర చక్రవర్తి సుమహోభ్రాజిష్ణు చిన్మూర్తి భూ
మ్యాకాశాది సమస్త దేశగత సూక్ష్మాకార విస్ఫూర్తి నా
వాక్కుల్ శుద్ధ మొనర్పుఁగా కని నమోవాకమ్ము లర్పించెదన్.

అని వక్కాణించిరి. శాస్త్రిగారు పంచాక్షరీ మంత్రోపాసకులు. 'సర్వం శివమయ మిదం జగత్త'ని తెలిసికొనిన యనుభవజ్ఞులు. పలువురు పలువిధముల వ్యాఖ్యానముచేసిన భర్గశబ్దమునకు 'అటనున్న భర్గపద మార్యుల్ చూచి శైవార్థమే న్యాయ ప్రాప్తముగాఁ దలంతు రనుచున్ నా బుద్ధికిం దోఁచెడిన్' అని స్వానుభవముచేత చెప్పిరి. దానినే

భవతు నా కన్య ద్దైవత వైర బుద్ధి
లేదు కాసంతయేని తల్లి యని పార్వ
తినిఁ దలంతుఁ దండ్రిగ మహాదేవుఁ దలఁతు
నర్థ నారీశ్వర మయంబ యఖిల జగము

అని తిరుపంకాడకు నోట శాస్త్రిగారొక వేద మహర్షి వలె చాటి చెప్పిరి. అవును వారు తపఃసిద్ధులు. కావుననే వినూతన మార్గదర్శకులయి నవీన కవితా యుగమునకు మూలపురుషులు కాగలిగినారు.

నాల్గవ యాశ్వాసములోని శివశర్మ కథలో మరల కావ్యము కొంత జీవము పోసికొన్నది. శివశర్మను పరమేశ్వరుడు పరీక్షింప దలచెను. వృద్ధబ్రాహ్మణ వేషము తాల్చి యడు గామడగా వీధి వెంట నరుగుచు ఆకటి పెల్లున

ప్రాణము వోవుచున్న యది బ్రాహ్మణ వృద్ధుడఁ దాళఁజాలసం
త్రాణ పరాయణుం డొకఁడు దారినిఁ బోయెడు వారిలో దరి
ద్రాణ కృపాళుఁడే కరవె ధాత యనాథుల పట్ల యింత ని
ద్రాణుఁడె పుట్టఁజేసిన యతం డిటు లాకట మాడ్చి చంపునే

యని విలపించుచుండెను. వేంకటశాస్త్రిగారి జీవితమంతయు జబర్దస్తీగానే గడచిపోయినది. మహారాజులను జమీన్దారుల నర్థించి నను ఆ విధముగానే యర్థించిరి. భిక్షుకుం డగు నీ పేద బ్రాహ్మణుని నోటినుండి కూడ వారి జబర్దస్తీతనమునే ప్రదర్శింప జేసిరి. శివుడెట్లో వాని భక్తులు కూడ నట్లె.

ఏలఁగ రాజ్యమిమ్మని మహేశ్వర! నిన్నును దేవురింప లే
దాలములోన శత్రుజయ మర్థి నొసంగు మటంచు వేడలే
దేలకొ బిచ్చమెత్తికొన నేగినఁ బట్టుక చావమోది తో
కాలగళా! యికెక్కడికిఁ గాని చనన్ జని తెమ్ము నీ వెటో

నీవు తెచ్చి పెట్టిన యప్డె నేనుఁ దిందు
లేనిచో మానుకొందు నీ యాన దేవ!
యంచు నొట్టిడుకొంచు మాహాళము చేరి
యచట మాహాళేశ్వరుని దేవాలయమున

శివనేత తిష్ఠవేసి కూర్చుండెను. భిక్షుకాకారమున నున్న శివుడు కూడ నిట్లే శివశర్మతో

పెట్టఁ దలఁచిన నిక్కడఁ బెట్టు తెచ్చి
యొక్కడుగు వేయుటకుఁ గూడ నోప నింక
నడుగిడెడు శక్తియే యున్నఁ బిడికెడన్న
మునకు విలపింతునే పుట్టి మునిగినట్లు.

అన్నాడు. భక్తుని పరీక్షించుటయందు శివు డెట్టి యాగడము చూపించెనో శివనేతయు శివుని విషయమున పై పద్యములం దట్టి యాగడమే ప్రదర్శించెను. "యథా దేవ స్తథా భక్తః"

## ౧౬

## వచన రచనలు

కవి ప్రతిభా విశేషము నొరిపిడి పెట్టి వన్నె చూచుటకుఁ దగిన నికషోపలములు వచన రచనలు. అవి పద్య రచనల వంటివి కావు. పద్య కావ్యములకు వృత్తములు ఒరవడులు. గణ యతి ప్రాసలు గాడులు. పద రస భావ సంపద గల యెవడైనను ఆ గాడుల వెంబడి నొరవడిని బట్టి నడక సాగింపవచ్చును. గద్య కావ్యముల కొక నియమము గాని నిబంధనము కాని లేదు. మొదటి నుండి చివరివరకు కవి తన ప్రతిభా విశేషమును వినియోగించి యంద చందములను సమకూర్చుకొనవలయును. కట్టుబాటులు లేకుండుట చేత గద్య కావ్యములు రచించుట తలంపునకు తేలికగా తోఁచ వచ్చును. కలము పట్టుకొని కార్యకలాపమున కుపక్రమించినప్పుడు తలంపు తల క్రిందుకాక తప్పదు. ఇది విద్యావంతుల మాట. ఏ భాష యందైనను సలక్షణముగా వచన కావ్యములు వ్రాసి రసజ్ఞు లగువారి మెప్పు సంపాదించుట దుస్సాధ్యము. సంస్కృత భాష యందు పెక్కు వచన కావ్యములు గలవు. వాని నన్నిటిని చదివి సరిపోల్చుకొని చూచినచో నెన్ని యుత్తమ స్థానములఁ బొందఁ గలవో మన మూహించుకొన వచ్చును. తెనుగు భాషయం దిప్పటికిఁ గల గద్య గ్రంథములు లెక్కించి చూచినచో కొన్ని వేలు బండ్ల కెక్కించవచ్చును. వానిలో సలక్షణమైన వచన గ్రంథములు వందల సంఖ్యమీఁద నుండును. అందు హృదయంగమ మైనవి వ్రేళ్ళమీఁద లెక్కపెట్టవలసినవి యుండును.

వచనకావ్య రచనకు మొదట పూనుకొనినవాడు సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు. అతఁడు జైమిని భారతమును వచన కావ్యముగా వ్రాసెను. తరువాత కళువె వీరరాజు భారతమును గద్య రూపమున విరచించెను. వీరి రచనలు కొంచెము ప్రౌఢ పాకమునఁ

బడినను హృదయంగమములై ధారాళముగా నుండును. ప్రాచీను లందు గద్య కవులు వీరుతప్ప మరెవ్వరు కనిపించరు.

వచన కృతులకు తరువాత కడంగినవాడు చిన్నయసూరి. నీతిచంద్రిక నారంభించి మిత్రలాభము, మిత్రభేదములను రెండు తంత్రములను వ్రాసి దివంగతు డయ్యెను. ఆ రెండు తెనుఁగు బలుకుఁ బూఁబోడికి మాణిక్య మకుటము రత్న కేయూర యుగళము. అవి తళుకు మాయని సుస్థిరా లంకారములు.

వచన రచనలో లయా తాళ సహితములగు పద్యంపుఁ బోకడలను పొందుపరచి క్రొత్తఁ దనము నాపాదించిన మహానుభావుడు కందుకూరి వీరేశలింగము పంతులుగారు. ఆయన రచించిన సంధి విగ్రహములు ఆ వాణీ మహాదేవికి కాంతి తరగనేరని మేడలోని వజ్రాలంకారములు. నీతి చంద్రికతో సమాన మనఁ దగిన కావ్య మాంధ్ర వాఙ్మయమునం దింతవరకు పుట్టలేదు. ఇంకముందు పుట్టు నను నమ్మకము లేదు. అది తెన్గుభాషా యోష శిరమున దాల్చు కోహినూరు వజ్రము.

నీతి చంద్రిక విద్యార్థుల కొరకు ప్రత్యేకముగా వ్రాయబడిన దను వదంతి కలదు. కాని పండితులు కూడ చదివి యానందింప వల సిన విషయము లా రచనయందు పెక్కు గలవు. ఆ పదముల పొందిక, శయ్యలోని చక్కదనము, రచనలోని మార్దవము, వర్ణనాంశముల లోని సహజ చిత్రకళా శిల్పము అనన్యాదృశములు. చదివిన కొలంది మరల మరల చదువవలయు నను దలంపు కలిగించును. తడవ తడవకు నొక రకమగు నూతనత్వము పొడసూపుచుండును. గ్రహించుకొన గలవా రుండవలయునుగాని నీతిచంద్రిక యందాలకు కాణాచి. గద్య కావ్య రచయితల కది మేలుబంతి. దానివలె గద్య కావ్యములు వ్రాయవలెనని ప్రయత్నించినవారు పెక్కుమందికలరు. కాని యెవరును కృతకృత్యులు కాలేదు.

కందుకూరి వీరేశలింగము పంతులుగారి సమకాలికులు తిరుపతి వేంకటేశ్వర కవులు. వీరు రచించిన తెనుగు వచన కావ్యములలో

విక్రమాంకదేవ చరిత్ర ఒకటి. సంస్కృతమున బిల్హణ కవి రచించిన దాని కనువాదము. ఇది పదునెనిమిది సర్గల గ్రంథము. ఇది కాదంబరి హర్ష చరిత్రలవలె సంస్కృత భాషయందు పరమోత్కృష్ట గ్రంథమని పండిత ప్రకాండులు శిరమున ధరింపక పోయినను కొంత పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనినది.

ఇందు మొదటి సర్గమునందు దేవేంద్రుడు బ్రహ్మదేవుని దర్శించి 'ధర్మద్రోహులగు కొందరు రక్కసులు భూలోకంబున కుపద్రవముఁ గలుగఁజేయు చున్నారని చారులవలన వింటిని. వారి గడతేర్పు నుపాయము దేవర యాలోచింపకున్న దేవతలకు యజ్ఞభాగములు సున్న యగుటకు సందేహము లేదు. కావున సూర్యకిరణప్రసారముంబోలె దనవంశముచే దెసలన్నియు నిర్మలముగాఁ జేయఁజాలిన యొక రాజచంద్రుని సృజించి యీ యాపద తొలఁగింపవలయు'నని వేడుకొనెను.

సంధ్య వార్చుకొనుచున్న బ్రహ్మదేవుడు చులుకము వంకఁ జూచెను. అందుండి యొక్క మహాపురుషుం డుద్భవించెను. ఆ మహాపురుషుని వంశమువారు చాళుక్య రాజ్యమును పరిపాలించిరి. ఆ వంశమునందు తైలపాదులు పుట్టిరి. వారిలో త్రైలోక్య మల్ల దేవుడు కళ్యాణపురము నిర్మించెను.

రెండవ సర్గమునందు త్రైలోక్య మల్ల దేవుడు సంతానము కొరకు తపమాచరింపగా నీశ్వరానుగ్రహమున ముగ్గురు కుమారులు గలిగిరి. వారిలో మధ్యవాడగు విక్రమాంకుడు ఈశ్వర ప్రసాది. ఆతడు పెరిగి పెద్దవాడయ్యెను. తండ్రి విక్రమాంకునకు యౌవరాజ్యాభిషేకము చేయ తలంచెను. పెద్దవాడుండగాఁ దనకు యౌవరాజ్యాభిషేక మనభిమత మని వాదించెను. తండ్రి మొదటివానికే యౌవరాజ్యాభిషేక మొనరించెను. ఇది మూడవ సర్గలోని కథ.

నాల్గవ సర్గమునందు విక్రమాంకుడు దిగ్విజయ యాత్రకై బయలువెడలి పాండ్య చోళ సింహళ ద్రవిడ దేశములు జయించుటయు, తండ్రియగు త్రైలోక్యమల్ల దేవుడు మరణించుటయుఁగలదు.

విక్రమాంకుడు చోళరాజ పుత్రికను పరిణయ మాడుట పంచమ సర్గమునందుఁ గలదు. విరోధిరాజుతో గలసి తనపై దండెత్తిన యన్న యగు సోమదేవుని శివు నానతి చొప్పున విక్రమాంకుడు జయించి రాజ్య సింహాసనం బెక్కుటయు, కరహాట నృపాలుని పెంపుడుకూతు రగు చంద్రలేఖను స్వయంవరమున భార్యగా బడయుటయు మొద లుగా గల మిగిలిన కథయంతయు తరువాతి సర్గములం దున్నది. పదునెనిమిదవ సర్గమునందు గ్రంథకర్తయగు బిల్హణుని స్వదేశమగు కాశ్మీరము వర్ణనయు, వంశవర్ణన, దేశాటనము, స్వదేశ గమనము కలవు.

రెండవ వచన కావ్యము చంద్రప్రభ చరిత్రము. దీనియందు పదునెనిమిది సర్గములు గలవు. ఈ మహాకావ్యమును వీరనందియను పండిత ప్రవరుడు సంస్కృత భాషయందు రచించెను. ఇతడు జైన మతస్థుడు, తర్కశాస్త్ర పారంగతుడు. విబుధ గుణానందికి శిష్యుడు. మొదట సౌధర్మ కల్పంబున వీరవర్మ నృపతినై పుట్టి పిదప అజిత సేన నృపాలుడయి, తరువాత అచ్యుతేంద్రుడయి సప్తమ భవంబున చంద్రప్రభుండను పేర జినేంద్రుడయిన వాని చరితమే యీ కావ్యము నందలి యితివృత్తము.

పూర్వ విదేహభూములందు మంగళావతి యను దేశము కలదు. దానికి రత్నసంచయ నగరము రాజధాని. ఆ దేశమును కనకప్రభుడను రాజు పరిపాలించుచుండెను. వాని భార్యపేరు సువర్ణ మాల. ఆ రాజదంపతులకు పద్మనాభుడను కుమారుడు జన్మించెను. ఆతడు పెరిగి పెద్దవాడయ్యెను.

ఒకనాడు కనకప్రభుడు మేడమీద కూర్చుండి పుర వైభవ మును చూచుచుండెను. ఆ సమీపమున ముందున్న చెరువులో నొక యావులమంద నీరు త్రాగవచ్చినది. అందొక ముసలి యావు బురదలో దిగబడి లేవలేక మరణించినది. దానిని చూచిన రాజు నకు జీవితము క్షణభంగురమని తోచినది. వెంటనే కుమారునకు

పట్టాభిషేక మొనరించి కనకప్రభుడు తపమాచరింప వనమున కరిగెను.

పద్మనాభుని భార్య సోమప్రభ. వారికి సువర్ణనాభు డను కుమారుడు కలడు. సువర్ణనాభుని యువరాజుగా నొనరించి పద్మనాభుడు రాజ్యమేలుచుండెను. ఒకనాడు వనపాలు డొకడు రాజును దర్శింప నరుదెంచెను. శ్రీధరుడను నొక మునీంద్రు డుద్యాన వనమునకు వచ్చియున్నాడని మనవి చేసికొనెను. పద్మనాభు డా మునిని దర్శించి తన పూర్వజన్మ వృత్తాంతమును వినిపింపుమని ప్రార్థించెను. ఆ ముని యిట్లు చెప్పెను. ఇది ప్రధాన కథ. దీనియం దంతర్కథలు పెక్కుగలవు.

శీతోదానది కుత్తరతటమున సుగంధి యను దేశము కలదు. దానికి శ్రీపురము ముఖ్యపట్టణము. ఆ నగరమును శ్రీషేణుండను రాజు పరిపాలించు చుండెను. ఆ మహారాజునకు శ్రీకాంత దేవేరి. వారికి చాలకాలము సంతానము లేదు.

ఒకనాడు శ్రీషేణుడు వసంతోద్యానమునఁ దిరుగుచుండెను. ఆ సమయమున వసంత మునీంద్రుం డాకాశమునుండి దిగివచ్చి యొక్క తమాల వృక్షము నీడ సమాధి నిష్ఠుండయి యుండెను. మహారా జా మునివరుని సమీపించి తన విచారము నెరింగించెను. ఆ ముని, రాజునకు రాణియగు శ్రీకాంత పూర్వజన్మ వృత్తాంతము తెలిపి, కొలది కాలములో నీకు సుతు డుదయించునని నుడివెను.

అట్లే శ్రీకాంత గర్భవతి యైనది. ఒక కుమారుని కన్నది. వానికి జాతకర్మాదులు నిర్వర్తించి శ్రీవర్మ యను పేరు పెట్టిరి. అతడు పెద్దవాడయి ప్రభావతియను రాచకూతురును పరిణయ మాడెను.

ఒకనాడు శ్రీషేణుడు గగనమునుండి భూమికి పడుచున్న యుల్కాపాతము నవలోకించెను. విరక్తుండయి కుమారునకు రాజ్యము నప్పగించి తాను శ్రీప్రభుండను ముని నాశ్రయించి నిర్వృతిని బొందెను. శ్రీవర్మ చాలకాలము రాజ్యమేలెను. చివరికిరాజ్యము

శ్రీకాంతు డను కుమారున కప్పగించి శ్రీప్రభుండను ముని నాశ్ర యించెను.

రెండువందల సంవత్సరములు తపమాచరించి శ్రీషేణుడు శ్రీధర మునీంద్రుడై పుట్టెను. ఇది మొదటి నాలుగు సర్గల లోని కథ. ఈ నాలుగు సర్గములయందలి కథలో నొక వినూతనత్వము కాని వర్ణనలలో నందము కాని మూలగ్రంథమునందు లేదు. చర్విత చర్వణముగా వచ్చిన విషయములే వచ్చుచుండును. చదువుట కుత్సాహము కలిగించు నొక సన్నివేశముగాని సంఘటనముగాని కని పించదు. రచనలో చైతన్యము లేదు. చదువునప్పుడు మనస్సును నిద్రపోవుచున్న వానినిపట్టి బలవంతముగా నడిపించినట్లు అతి కష్ట ముగా మధ్య మధ్య మేలుకొలుపుచు ముందునకు తోయవలసి వచ్చుచుండును.

ఐదవ సర్గమునుండి మరొక కథ ప్రారంభమగును. ధాతకి యను దక్షిణఖండమున నిషుకారగిరి యను నొక పర్వతము కలదు. దానిని చుట్టి పూర్వ భరతఖండము కలదు. అందలక యను దేశ మున్నది. దానికి కోసల రాజధాని. దానికి జితంజయుడు రాజుగా నుండెను.

వానిని జితసేన యను సతీ తిలకము వరించెను. వారి కజిత సేనుడను కుమారుడు జనించెను. అతడు సకల సద్గుణ సంపన్నుడయి యౌవనవంతు డయ్యెను. ఒకనా డజితంజయుడు కుమారునిలో నిండు కొలువు నందుండెను.

ఆ సమయమున చంద్రరుచియను రాక్షసుడు పూర్వ వైర మును స్మరించుకొని సభ యంతయు మాయఁబుచ్చి యజితసేను నపహ రించుకొని పోయెను. మహారాజు పుత్రశోకమున మునిగెను. ఆ సమయమున తపోభూషణుఁడను ముని యాకాశమునుండి యచటికి దిగి వచ్చెను. "నీ కుమారున కుపద్రవ మేమియు కలుగదు. కొలది దినములలో నీ వాతనిని గలిసికొందువు. అతడు కుశలియై యున్న వాడు" అని రాజునకు నుడివి వెడలిపోయెను.

చంద్రరుచి యజితసేనుని గొనిపోయి మనోరమయను సరోవరమునందు పడవేసెను. అజితసేను డీదుకొనివచ్చి తీరమును చేరుకొనెను. ఆ పరిసరప్రాంతము మహారణ్యము. అజితసేనుం డా అడవిదారిం బడిపోవుచు నొక పర్వతమును గాంచెను.

దాన నధిరోహించుచుండ హిరణ్యుండను నొక గంధర్వుండు వానిమీద కయ్యమునకుఁ దూగెను. అజితసేనుడు వాని నోడించెను. గంధర్వుఁడు ప్రసన్నుండయి "రాకుమారా! నీ వీ జన్మమునకు వెనుకటి మూడవ జన్మమున సుగంధిదేశమున శ్రీపుర మేలు భూపాలుండవు. ఆ పురమున శశి సూర్యు లను నిరువురు సేద్యగాండ్రు కాపురము చేయుచుండిరి. అందు శశి యొకనాడు సూర్యుని యింటికి కన్నము త్రవ్వి వాని ధనమంతయు నపహరించెను. నీ వా విషయము విచారించి శశిని బందెలో పడవైచితివి. వానియొద్ద హరించిన ధనము కానరామిం జేసి సూర్యునకు నీస్వంత ధనము నిచ్చితివి. ఆ శశి రెండవ జన్మమున చంద్రరుచి యను రాక్షసుడై పుట్టెను. ఆ సూర్యుడే పూర్వపుణ్యమున నేనైతిని. శశి పూర్వ వైరమును బురస్కరించుకొని నిన్న పహరించెను. నా కుపకారము చేసితివిగావున నే నిపుడు నీతోడ స్నేహంబుకోరి వచ్చితిని. నీ కేదయిన యిక్కట్టు వాటిల్లినప్పుడు నన్ను తలంచుకొనునది" అని వచించి యంతర్ధానము నొందెను.

తరువాత అజితసేనుడు అరింజయ దేశాధిపతియగు జయవర్మ కూతురు శశిప్రభను పరిణయమాడెను. భార్యతోఁగూడ యజితసేనుడు తండ్రి నగరమున కరుదెంచెను. తండ్రియగు అజితంజయుడు అజితసేనునకు పట్టాభిషేక మొనరించెను. అజితంజయుఁడు శ్రమణకసేవిత మగు పదము నాశ్రయించెను. అజితసేనుడు దిగ్విజయములను సాధించి కొంతకాలమునకు కుమారునిమీద రాజ్యభారమును మోపి గుణప్రభుండను ముని యుపదేశమున తపమొనరించి తనువును బాసెను.

అచ్యుత కల్పంబున అచ్యుతేంద్రుడై జన్మించెను. వివిధ భోగము లనుభవించి, తనువు చాలించెను. అచ్యుతేంద్రుండు పద్మనాభుండను పేర నీవై పుట్టితివి. అని శ్రీధరముని పద్మనాభునకు పూర్వజన్మ వృత్తాంతములను వినిపించెను. అనంతరము పద్మనాభ నరపాలుడు ధరణీపాల నరపాలుని యుద్ధమునందు చంపి విరక్తుండయ్యెను. తప మొనరించి రాజర్షియై దేహమువీడి యపర జన్మంబున అహమింద్రుండను రాజయి పుట్టెను. తరువాత లక్షణామహాసేనులకు జినేంద్రుడై పుట్టెను. ఇది చంద్రప్రభ చరిత్రములోనికథ.

తిరుపతి కవు లాంధ్రీకరించిన మూడవ వచన కావ్యము హర్ష చరిత్రము. సంస్కృతమునందు వచన కావ్యములలో కాదంబరి సుప్రసిద్ధమైనది. అది యతి ప్రౌఢకావ్యము. అందలి కథా చమత్కారము, రచనా పాటవము, వర్ణనా వైదగ్ధ్యము, కల్పనా వైదుష్యము, ననన్య సామాన్యములు. దాని తరువాత పేర్కొనదగినది హర్ష చరిత్ర. దీనిని బాణభట్టు మహాకవి రచించెను. "బాణోచ్ఛిష్ట మిదం జగత్త"ను విబుధోక్తి యందరు నెరిగినదే. ఆ మహాకవి ప్రయోగింపని శబ్దము కాని, స్పృశింపని వర్ణనకాని, యుపయోగింపని యుపమానముగాని లేవు. ఆ మహామహుడు రచించిన హర్ష చరిత్రలోని మొదటి మూడు ఉచ్ఛ్వాసములు తిరుపతి కవులు తెనిగించిరి. దానిలోని కథ యిది.

ఒక్కనాడు బ్రహ్మ పేరోలగంబు నందుండెను. మునీంద్రులు విద్యాగోష్ఠి గావించుచుండిరి. ఆ సమయమున వారిలో వారికి వివాదము తటస్థించెను. దుర్వాసుండు మందపాలుం డను నిరాకారితో పంతగించి క్రోధాంధుండై సామగాన మొనరించు తరి స్వరము తప్పెను. అందులకు సరస్వతి పరిహాసముగా నవ్వినది.

దుర్వాసుం డది చూచి "ఓ! దుర్వినీతురాలా! నీ విద్యామదము నేటితోఁ బో నడంచెదను. నీ యౌన్నత్యము రూపు మాపెదను. నీవు మర్త్యలోకమునకుఁ బోయెదవుగాక" యని శపించెను.

ఈ సందర్భమున బాణభట్టు సరస్వతీ సావిత్రులను వర్ణించిన విధము అతి రమణీయముగా నున్నది. బాణభట్టే మరల తెనుగు దేశమునందు పుట్టి యా యా భాగముల ననువదింప మొదలు పెట్టినను కృతకృత్యుడు కాలేడు. ఇంక నితరుల మాట చెప్పవలసిన పనేముండును? పదానుగతముగా భావమును ప్రదర్శించుటలో గొప్ప తనము లేదు. అది యందరు చేయగలరు. అనువాదము స్వతంత్ర రచనవలె సాగిపోవలయును. వాక్యరచనలోను భావప్రకటనలోను తెనుగుఁదన ముండవలయును. అప్పుడే యాంధ్రీకరణమున కందము వచ్చును.

బ్రహ్మ యాదేశమున సావిత్రి వెంటరాగా సరస్వతి భూలోకమునకు వచ్చినది. శోణనదీ తీరమున నొక లతామంటపమున నివసించినది. కొన్ని దినములు గడచినవి. చ్యవన మహర్షి కుమారుడు దధీచుడు తాత యగు శర్యాతి గృహమునుండి తండ్రి యాశ్రమమునకు బోవుచు మార్గ మధ్యమున సరస్వతిని చూచెను. ఆమె యందు మోహము కలవాడయ్యెను. సరస్వతియు నాతనియందు బద్ధానురాగ యైనది. మాలతి యను చేటి మూలమున వారిరువురకు సమాగమమైనది.

వారికి సారస్వతు డను కుమారుడు పుట్టెను. సరస్వతి వర ప్రసాదమున సారస్వతుడు పుట్టినతోడనే సకలాగమశాస్త్ర కళా పరిపూర్ణుడయ్యెను. తరువాత సరస్వతి సత్యలోకమున కరిగెను. దధీచుడు తన భ్రాత బ్రాహ్మణుని భార్యయగు నక్షమాలకు తన కుమారునిఁ బెంచుమని యొసంగి తాను తపోవనమున కరిగెను.

అక్షమాల తన కుమారునితోబాటు సారస్వతుని బెంచినది. అక్షమాల కుమారుని పేరు వత్సుడు. సారస్వతుడు వత్సునకు సమస్త విద్యలు నేర్పెను పెండ్లిచేసి యా ప్రదేశమునందే ప్రీతికూట మను పేర నివాసము కల్పించి కాపురం బుంచెను.

సారస్వతుడు తపోవనమున కరిగెను. వత్సుని వంశమువారు వాత్స్యాయనులైరి. ఆ వంశమున కుబేరుడు, పాశుపతుడు, అర్థపతి

యనువారు పుట్టిరి. అర్థపతి కుమారుడు చిత్రభానుడు. వాని భార్య రాజదేవి. రాజదేవీ చిత్రభానులకు బాణుఁడు జన్మించెను.

బాణుని చిన్నతనముననే తల్లి మరణించినది. తండ్రి పదు నాల్గవయేట గతించెను. స్వాతంత్ర్య మవినయమున కునికిపట్టగుటఁ జేసియు, బాల్యము కుతూహలంబున కాకరంబగుటం బట్టియు, యౌవనారంభము ధైర్యమునకుం బ్రతిబంధియగుటచేతను, బెక్కు చిన్నతనంపుం జెయ్వులకు లోనై బాణుడు స్వేచ్ఛావిహారి యయ్యెను. వానిచేయు దుష్కృతములకు గొందరు సమవయస్కులు సహాయు లుగాఁ జొచ్చిరి. బాణుఁడు పండితమండలికి పరిహాసాస్పదుండయ్యెను. దేశముల వెంటఁ దిరిగి చివరకు పండితగోష్ఠి వలన మహావిద్వాంసు డయి స్వగ్రామమునకుఁ దిరిగి వచ్చెను. ఇది ప్రథమోచ్ఛ్వాసము లోని కథ.

ద్వితీయోచ్ఛ్వాసమునందు హర్ష చక్రవర్తి సహోదరుడు కృష్ణభూపతి పంపిన లేఖను చూచుకొని బాణభట్టు హర్ష చక్రవర్తిని దర్శింపనరుగుటయు, నా భూమీపతి నిరాదర మొనరించుటయు రాజానుగ్రహము సంపాదించి బాణభట్టు నిజవాసమునకుఁ దిరిగి వచ్చుటకు హర్షుని కథ బంధుమిత్రులకుఁ జెప్పనారంభించుటయు గలదు. వేంకటశాస్త్రిగారు హర్ష చరిత్రలోని యీ కథారంభ విధానమును బురస్కరించుకొనియే బొబ్బిలి పట్టాభిషేక కావ్యము నారంభము చేసిరి. పట్టాభిషేక కార్యక్రమమంతయుఁ గుమారుని వివాహ సందర్భమున బంధుమిత్రులకు వినిపించినటుల వ్రాయఁ బడినది.

భాషాంతరీకరణము. ఒక్కొక్క భాష కొక్కొక్క విశిష్ట గుణము కలదు. ఒక భాష గుణము మరొక భాషకురాదు. సంస్కృత భాష మిగుల గంభీరమయినది. అందు రాజసము గోచరించును. తెలుగుభాష మృదుమనోహరమైనది. నిండార విచ్చిన తమ్మి వెలందుక యంతరంగములోని మకరందంపుఁ దియ్యదన మూ పలుకు బడియందు కలదు. కావున సంస్కృత కావ్యమును తెనుగొనరించి

పండితుల మెప్పు వడయుట యెంతవారికిని సాధ్యముకాని పని. ఒక భాషయందలి యుత్తమ కావ్యము ననువదించుట యా కావ్య గౌరవమును గోల్పుచ్చుట. తక్కుంగల కావ్యములను భాషాంతరీకరించుట రచయిత తన గౌరవమును గోల్పోవుట.

తిరుపతికవులు తెనిగించిన మూఁడు గద్య కావ్యములలో చంద్రప్రభ చరిత్రము మూలమే పసలేనిది. దానిలో చమత్కారముగాని, సన్నివేశముల యందముగాని, వర్ణనలలో క్రొత్తందనముగాని లేవు. రెండవది విక్రమాంక దేవచరిత్రము. కథావిధానమునందు కొంత యాకర్షణీయత కలదు. కాని నూతనత్వము లేదు. హర్ష చరిత్ర యన్ని విధముల నుత్తమమైనది. చదువ నారంభించినది మొదలు చివరివరకు పాఠకుని మనస్సును భావి కథావిధానము కొఱకు తహ తహలాడించును. వర్ణనలు హృదయంగమములు. తిరుపతికవుల యాంధ్రీకరణము గురించి కొంత విచారింతము.

ఆంధ్రీకరణము స్వతంత్ర కావ్యమువలె రచన సాగినప్పుడే హృదయంగమముగా నుండును. సంస్కృతమునందు వాక్య రచనా విధానము వేరు. ఆదినుండి చివరివరకు తెనుగు పద్ధతి నవలంబించినప్పుడే తెనుగు కావ్యమునకు సౌష్టవము కలుగును. రెంటిని కలయ కలిపినప్పుడు పులగమువలె నుండును. సంస్కృతమునందు కర్మణ్యర్థక వాక్యములకు ప్రయోగ బాహుళ్యము కలదు. ఆ భాషయందది యందము. తెలుగుభాష కది తలకంటకింపు. కర్త్రర్థక విధానము తెలుగునకు నడకలో నందము నాపాదించును, సరళత్వము కల్పించును, తెలుగు తనము నొదవించును. దూరాన్వయములు, చుట్టు భావములు తెనుగు సహింపదు.

ఎత్తైన శిఖరములచే నొరయఁ బడుచున్న యాకాశమందు వరిహొట్టలం బోలు తన కాంతులచే మెఱుపులు పుట్టించు సమస్త ఫల వృక్షముల కాలవాలమయి పూర్వ మందర మను పర్వతము... (చంద్ర 1 స. 2 వ పే)

కొలువు తీర్చిన విక్రమాంక భూపాలుఁ డందఱిచేతను బంగారు కొండ శిఖరముమీఁద నున్న సూర్యభగవానులను స్మరింపఁ జేసెను. (విక్ర 6 స. 37 పే.)

ఇటువంటి వాక్యములు చంద్రప్రభ విక్రమాంక చరిత్రలం దసంఖ్యాకములుగా కనిపించును. అవి గమన భంగికి వెన్నుపోటులు. అందమునకు డిందుపాటులు. కథా పిపాసువులకు ముంగాలి దెబ్బలు. మరికొన్ని చోటులందు ఆంధ్రీకరణము మక్కికి మక్కి వాక్యాను గత మగుటయేకాక పదానుగతము కూడ నగుటచేత నన్వయక్లిష్టత, తలచుట్టు భావములు నేర్పడినవి.

రక్త పంకిలమగు యుద్ధ భూములందు రాజులతో వ్యభిచరింప నభిసారిక యగు రాజ్యలక్ష్మి హృదయమందు నిలుపుకొనిన వారి హృదయముల నేల పంకిలము చేయకుండును (విక్ర 6 స 38 పే)

గమన వేగంబున జయింపఁ బడియు సిగ్గులేక వాయుదేవుఁడు వీవనవలె నల్లాడు వాలము లాశ్రయింప మణిమయంబులగు పల్ల ములయందు సూర్యుని బింబము ప్రతిఫలించుటంజేసి తన యందము లాగుటకుం దగిన వగునో కావో యని యతనిచేతం బరీక్షింపఁ బడుచున్నవో యను నట్లున్నవియు మేము పరుగెత్తుటకుఁ దగిన భూమిని సృజింపక పోయితి వేల యని బ్రహ్మనడుగఁ బోవుచున్నట్లు ఖురపుటము లెత్తి యాకాశాభి ముఖము లగుచున్నవియునై బంగారు టంగువాఱులతో నధిష్ఠించియున్న రౌతులతో లెక్కింప నలవికాక బారులుగట్టి నడచుచున్న గుఱ్ఱములతోడను (విక్ర 6 స 39 పే)

ఇటువంటి వాక్యరచనలు మొదటి రెండు కావ్యములం దెల్లెడ లను గనిపించును. వానికై వెదుకుకొనవలసిన పనిలేదు, ఈ గద్య కావ్యములను తెనిగించుటలో తిరుపతి కవులు భాషా సౌలభ్యము కొరకు పాటుపడినట్లు తోచును. అందుమూలమున రచనలో రమ్య త్వము, శయ్యలో సరళత్వము, భావములో ప్రసన్నత కొంత వరకు లోపించినదేమో యనిపించును. హర్ష చరిత్రమునం దీ లోపము లంతగాఁ గనిపించవు. ''ఇట్టి సర్వోత్కృష్ట గ్రంథంబును లోకోప

కారార్థమై రచించి'' యని చెలికాని లచ్చారావుగారు పీఠికయందు వాడినంత స్థాయికి రచన రాలేదని మాత్రము చెప్పవచ్చును. పెద్ద లేది యెటుల వ్రాసినను చాల బాగున్న దనుట లోకస్వభావము. గద్య రచనలోని యందచందములు గుర్తింపగల పండిత పాఠకులు అందలి సత్యా సత్యములను గ్రహించుకోనఁ గలరు.

ఈ మూఁడు వచన కావ్యములకంటె వ్యావహారిక భాష యందు వ్రాసినను తిరుపతికవుల కథలు గాథలు అను వ్యాస సంపుటములలోని శయ్య ప్రశంసనీయముగా నున్నది. తిరుపతికవులు గ్రాంథిక వచన కావ్యముల రచనల యందంతగా నుత్తీర్ణులు కాలేక పోయినను వాడుక భాషను వ్రాయుటలో నసమానమగు ప్రజ్ఞను సంపాదించిరని యొప్పుకొనక తప్పదు. కథలు మూఁడు సంపుటములు. దాదాపు నూట డెబ్బది వ్యాసములు గలవు.

ఇందు వాడినది శిష్టజన వ్యవహార సిద్ధమగు చక్కని భాష. కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు, వడ్డాది సుబ్బారాయుడు గారు, వేదం వేంకటరాయశాస్త్రిగార్లవలె తిరుపతికవులు పరిపూర్ణ ముగా గ్రాంథిక భాషావాదులుకారు. గిడుగు రామమూర్తిపంతులు గారు. గురజాడ అప్పారావుగారు, నండూరు సుబ్బారావుగారువలె నతి గ్రామ్య భాషావాదులును గారు. పరిస్థితులనుబట్టి భాష మారు చుండవలయునను వాదనలోనివారు.

ఈ విషయమును గురించి వేంకటశాస్త్రిగారు ''కవిత్వమంటే యేమిటి?'' అను వ్యాసమునందు విపులముగా చర్చించిరి. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారివలె నింట భార్య బిడ్డలతో మాట్లాడినను బైట కూరలమ్ముదానితో ప్రసంగించినను అతి ఛాందసముగా గ్రాంథిక భాష నుపయోగించవలయునను పట్టుదల తిరుపతికవులకు లేదు. గురజాడవారివలె కావ్యములందైనను వ్యావహారిక భాష నుపయోగింపవలయునను వాదము వారి కసలు గిట్టదు. గ్రామ్య భాషావాదము రాకమునుపే ''పల్లెటూళ్ళ పట్టుదలలు'' అను ప్రహసనమును తిరుపతికవులు వ్యావహారిక భాషయందు వ్రాసిరి.

పురాణ పురుషుల కథలు కావ్యములు వ్రాయునప్పుడు గ్రాంధిక భాష నుపయోగింపవలయుననియు, సామాన్య మానవుల కథలు వ్రాయునప్పు డే భాషయైన నుపయోగింపవచ్చుననియు, లోక వ్యవహారముకొరకు జన బాహుళ్యముకొరకు వ్యావహారిక భాష వాడవలయునవియు వారి సిద్ధాంతము. కాని గ్రాంధిక భాషకుండు గౌరవము వ్యావహారికమునకు లేదని నిర్ణయించిరి. అధిక జనోప యోగముకొరకుపత్రికలయందు ప్రచురించిన కథలు గాథలను నీ మూడు సంపుటములలోని వివిధ వ్యాసములు శిష్టవ్యావహారిక భాష యందు వ్రాయబడినవి. ఇప్పటికి పెక్కు సంవత్సరములనుండి వ్యావ హారిక భాషలో రచనలు సాగించుచున్నవారు చాలమంది కలరు. ప్రస్తుత కాలమున పత్రికల మూ టటుండ నవలలు, విమర్శనలు, వ్యాసములు, నాటకములు, కొన్ని కొన్ని కావ్యములు గేయములు వ్యావహారిక భాషయందే వ్రాయబడుచున్నవి. ఈ వ్యావహారికమున కొక నియమము లేదు. నాడులనుబట్టి భాష మారుచుండును. రచ నలు కూడ వాని కనుగుణముగానే యుండును. అందును ఎవరి యిష్టము వారిది. కొందరి కొందరి రచన లర్థములే కావు. సంస్కృ తమునందు ప్రాకృతాదులు వ్యావహారికములే. వానికి వ్యాకరణము లున్నవి. రచన సాగించినప్పుడు వ్యాకరణ నిబంధన లతిక్రమించి పోలేదు కవులు. కావున వాని కీ యిక్కట్టు లేదు.

తిరుపతికవులు కథలు గాథలందు వాడినది శిష్ట వ్యావహారిక భాష. కావున చదువునప్పు డందరికి చక్కగా నర్థమగును. ధారా శముగా గ్రాంధిక భాషవలె నడక సాగిపోవును. పానుగంటివారి సాక్షి కూడ తిరుపతి కవుల రచనకు తీసిపోవుననుటలో సందేహము లేదు. సాక్షియం దొక్కొక్క చోట శయ్యయం దెగుడు దిగుడులు కలవు. కథలు గాథలందు తరిచి చూచిన నటువంటి మిట్టపల్లము లగుపించవు. వ్యాసము ప్రారంభమునుండి చివరి వరకు నేకధాటిగా ప్రవాహమువలె సాగిపోవును. వ్యాసములన్నియు నొకేవిధముగా నుండును. ఆ శయ్యలో నొక మార్దవ మున్నది. అందమున్నది.

నూతనత్వ మున్నది. ప్రతి వ్యాసమునం దేదో యొక క్రొత్త విషయమును గురించి ప్రస్తావింపఁబడును. అది చదువుచున్నప్పుడు మనస్సును దానితో కూడ లాగుకొనిపోవును. అది యా రచనా విధానములో నున్నది.

"నేను మా తిరుపతి" యను వ్యాసము చదివినవారి కిందలి సత్యము గోచరించును. ఎన్నిసారులు చదివినను మరల మరల చదువవలయుననియే యనిపించును. కొంత హాస్యము, కొంత విషాదము కొంత వినుతి, కొంత యెత్తిపొడుపు, వ్యంగ్యము, ఒకటేమిటి నవరసములు తొణికిస లాడుచుండును. గ్రాంధిక భాషయందు వ్రాసిన చో నా యందముండదనియే తోచును. ఒకొక్కచోట గ్రాంధిక భాషకంటె వ్యావహారిక భాష రాణించునని శ్రీ శాస్త్రిగారు చెప్పినమాట సత్యము. వేంకటశాస్త్రిగారు ప్రపంచమును, భాషను నామూలాగ్రముగా పరిశీలించి యనుభవమునకు తెచ్చుకొనినవారు. ప్రజలకు భాషకుఁగల సంబంధము నర్థము చేసికొనినవారు. సమకాలికులగు కందుకూరి వీరేశలింగముగారు, వేదం వేంకట్రాయశాస్త్రిగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మొదలగువారు తమవ్యాసములను నిర్దుష్టమగు గ్రాంధిక భాషయందు వ్రాసి పత్రికలయందు ప్రకటించుచుండగా, వేంకటశాస్త్రిగారు శిష్ట వ్యావహారిక భాషయందు తమ వ్యాసములను వ్రాసి ప్రకటించిరి.

వేంకటశాస్త్రిగారి పాండిత్యము సర్వతోముఖమైనది. వారి పరిశీలనా శక్తి లోకమున కతీతమైనది. వారి బుద్ధి కుశాగ్రముకంటె నిశితమైనది. పూర్వ లాక్షణిక గ్రంథ రచయితలకు గూడ నందని విషయములను గ్రుచ్చి పైకి తీయఁగల సామర్థ్యము దానియందుఁ గలదు. వారు చదివిన గ్రంధములన్నియు పత్యక్షర పరిశోధన గావించి, సనాత నాధునాతన విమర్శకులు గ్రహింపని సత్యములను బహిర్గతము గావించి, కవులకు సాహిత్య జిజ్ఞాసువులకు మహోపకారము గావించిరి. ప్రకటన కర్తలు సంస్కర్తలు చేసిన భారతము

లోని దిద్దుపాటులలోని యవివేకితనమును సహేతుకముగా నిరూపించిరి.

భారత గ్రంథ విషయమున వారుచేసిన పరిశోధన తెనుగు దేశమునందే యితర కవియుఁ బండితుడును చేయలేదని విస్పష్టమగును. భారతకవుల ప్రయోగము లన్నియు వేంకటశాస్త్రిగారికి హృదయ గతములు. ఒక భారత ప్రయోగములే కాదు, నన్నయ మొదలుకొని తమ కాలమువరకు గల కవుల గ్రంథములోని ప్రయోగము లన్నియు నాయనకు కంఠస్థములు. శ్రుతి స్మృతులు మొదలుకొని సంస్కృత వాఙ్మయమునగల వింత వింత ప్రయోగములన్నియు ముని నాలుకమీద తాండవమాడు చుండును. "త్రియంబక" అని కాళిదాసు కుమారసంభవమునందు వాడెను. "ఇకోయణచి" అను సూత్రమునుబట్టి "త్ర్యంబకం" అని యుండవలయును. కాళిదాసు ప్రయోగమును సమర్థించుచు వేద వాఙ్మయమునుండి వేంకటశాస్త్రి గారుమూడు నాలుగు ప్రయోగములు చూపించిరి. దీనినిబట్టి శ్రీ శాస్త్రిగారి పరిశోధనాశక్తి యవగతము కాగలదు.

వారే గ్రంథమైన సునిశితమగు విమర్శనా దృష్టితో చదువుట యలవాటు. లోకమునుకూడ ఆ దృష్టితోడనే చూతురు. కావుననే తిరుపతి కవులు ఎవరికిఁ గొరుకుడు పడని లోక విఖ్యాత కవులయి విజయములను సాధించిరి. ఆధునిక కవి ప్రపంచమునకుఁ దిరుపతి వేంకటకవుల కావ్యములలోని ప్రయోగములు శిరోధార్యములైనవి. వారి ప్రయోగములు పూర్వకవి కావ్యములందేమూలనో యుండకపోవని నమ్మకము కవిలోకమునకుం గలదు. లేక పోయినను అవి లాక్షణికముగా నంగీకరింతురు. ఆ గౌరవము తెలుగు దేశమున వారి కొక్కరికే గలదు.

పూర్వ కవుల కవనంపుఁ బోకడలను పరిశీలించు నప్పుడు వారి దృష్టి యాంతర్యమును చింపుకొనిపోయి యడుగు మట్టము నవగతము చేసికొని రచనా విశేషములను బహిర్గతము గావించును. "తిక్కనగారి నైపుణ్యము – పిల్లలమఱ్ఱివారి కవిత్వం – తెనాలి రామ

లింగని కవిత్వం - నన్నయభట్టు - బమ్మెర పోతనామాత్యుడు'' అను వ్యాసములందు మహావిమర్శకులని పేరుమోసిన వారి యూహకు కూడ అందని స్ఫురింపని విషయములు వివరింపఁబడినవి. కోరాడ రామకృష్ణయ్యగారు సుప్రసిద్ధులైన విమర్శకులలో నగ్రగణ్యులు. భారతముమీద విమర్శ వ్రాసిరి. వారికి తిక్కనగారియం దభిమానము మెండు. ఆ యభిమానము కొలంది యందందు పెడదారులు పట్టినను మూలమునకు తిక్కనగారి రచన వన్నె పెట్టినదని నిరూపించిరే కాని దానిలోని ప్రత్యేకత నిరూపించలేక పోయిరి. వేంకటశాస్త్రిగారు

కృప భవత్సము ననిన నయ్యపరిమేయ
తేజుఁ డాత్మ తేజమున నా దృఙ్మఖేంద్రి
యములు మనమును సమ్మోహితములు సేసి
యపుడు తనయుండు పుట్టెడు మనియె పిదప

కుంతీదేవి కర్ణుని జన్మ వృత్తాంతమును చెప్పిన ఘట్టములోని పద్యమిది. ఈ చిన్న పద్యమును తీసికొని వేంకటశాస్త్రిగారు ''తిక్కన గారి నైపుణ్య'' మను వ్యాసములో నిందలి రచనా వైశిష్ట్యమును విమర్శనా వైదగ్ధ్యమును నిరూపించిరి.

శ్రీ శాస్త్రిగారి విమర్శన లన్నియు లాక్షణికముగాను, రస విషయికము గాను, భావ నిరూపకముగాను, లోతులు ముట్టి వారి పాండిత్య ప్రకర్షను వెల్లడి చేయుచుండును. వారు లోకములోని పుక్కిటి పురాణములను నమ్మి కందుకూరి వారివలె కవులకు కళంక మునో ఘనతనో ప్రతిపాదించువారు కారు. వానియందు గల సత్యా సత్యములను నిశితదృష్టితో పరిశీలించి సత్యమును స్వానుభవము వలన బాగుగా నవగతము చేసికొని యొక నిర్ణయమునకు వత్తురు. వారి ''పుక్కిటి పురాణములు-పిల్లలమఱ్ఱివారి కవిత్వము అను వ్యాస ములు దీనికి తార్కాణములు.

వేంకటశాస్త్రిగారు తెనుగు దేశమునందు తిరుగని చోటులు లేవు. వారు సందర్శింపని రాజులు లేరు. వారు పరిచయము చేసి

కొనని పండితులు లేరు. ఊరక స్వకార్యార్థము సందర్శించుటయు పరిచయము సంపాదించుకొనుటయే కాదు. ఆ యా మహాపురుషుల పుట్టు పూర్వోత్తరములు, తత్సంబంధీకుల చరిత్రలు మూలమట్టగా దెలిసికొనుట వారి స్వభావము. పిండిప్రోలువారి దండితనము, శాఖాం ద్వేషం, పిఠాపుర ప్రభువులు, లేటు గంగాధర రామారావుగారి కథలు, వెంకప్ప సోమయాజులు, బ్రాహ్మణశాఖలు, నా గురుపరం పర అను వ్యాసములు చదువునప్పుడు వేంకటశాస్త్రిగారు పాండిత్య సంపాదన కొరకెంత కృషి గావించిరో అంతకు రెట్టింపులౌకిక విజ్ఞాన సంపాదనకు పాటుపడిరని తోచును. గుణమున్న చోట పొగడుట వేంకటశాస్త్రిగారిలో నున్న గొప్ప సుగుణము. అతడు విరోధియై నను వారి కంత పట్టదు. ఈ గుణ మందరియందు నుండదు. నూటికో కోటికో ఒకరిద్ద రిట్టి గుణముగల వారుందురనుట కూడ సందేహమే. "గిడుగా పిడుగా" యను వ్యాసములోని రెండు మూడు వాక్యము లిందు వివరింతును. అందు వారి యుదార స్వభావమేకాక శిష్ట వ్యావహారిక భాషా రచనయందు శాస్త్రిగారికిఁ గల యసాధారణ ప్రజ్ఞాపాటవములుకూడ తెలిసికొనవచ్చును.

"పంతులుగారి లేఖిని మా మీఁదికిగూడ దూఁకినది." "మహా గజాః పలాయంతే మశకానాం తు కా గతిః" అది యెక్కడి పరిశీ లనా జ్ఞానమో? ఒక్కొక్క శబ్దాన్ని యెత్తుకుని వర్గత్రయాలు వ్రాయడం. ఆ వ్రాయడంలో వక్క అక్కరంకూడ సూటి దప్పిన దంటూ వుండదు. అదెక్కడి పాండిత్యమో నిజంగా గ్రాంధిక కవుల మని పేరు పెట్టుకున్న వాళ్ళందఱూ ఆత్మవంచన లేనివాళ్ళే అయితే వక మహాసభ చేసి, వారివారి బిరుదాలన్నీ పంతులుగారికి సమర్పించి, ఆయన అనుగ్రహించి మళ్ళా యిచ్చేటట్టయితే, అలంకారార్థం, ధరించుకో వలసిందేకాని లేకపోతే వదలుకోవలసిందే."

"నా స్వభావం శత్రువు దగ్గరైనా సరే గుణం వుంటే దాన్ని కప్పి పుచ్చటం చేతకానిది. పంతులుగారు అంతో యింతో నాకు శత్రుకోటిలో వారేగాని మిత్రకోటిలో వారు కారుగదా!"

వేంకటశాస్త్రిగారి లేఖిని యసాధారణ మగు ప్రజ్ఞా నైపుణ్యములు గలది. అది యే దారినైన నిరాఘాటముగా ననుగమింపఁ గలదు. ఒకొక్కప్పుడు నన్నయ భట్టారకుని దీర్ఘసమాసంపు సంఘుటనలకు సహచరంబులగు పోకడలను సంతరించును. ఒకప్పుడు తిక్కనగారి తీపిపలుకుల పొందిక లాపాదించును. మరొకప్పుడు సరళంపు గ్రాంథిక వచన రచనల దారు లనుగమించును. ఇంకొకప్పుడు శిష్ట వ్యావహారికముల తెన్నులు త్రొక్కును. ఏ దారి పట్టిపోయినను దానికి తిరుగుడు లేదు. ఎందైన నది ప్రశంసల నందుకొనును. హర్ష చరిత్రాదులందు గ్రాంథిక భాషావేదిక మీఁద నృత్య మొనరించినది. కథలు గాథలలో శిష్ట వ్యావహారిక భాషారంగమున నభినయించినది. వహవ్వా యనిపించుకొనినది. ఆ చతురత మరే లేఖినికి లేదను కీర్తి సంపాదించుకొనినది. అది దాని సుకృతము. ''పుణ్యైర్యశో లభ్యతే.''

## ౧౭

## బెజవాడలో వేంకటశాస్త్రిగారు

బెజవాడ యాంధ్రావనికి నడిమిగడ్డ. వర్తక వ్యాపారములకు కేంద్రము. రైళ్ళ రాకపోకలకు కూడలి చోటు ఒకప్పుడు కళా నిలయమని పేరు. ఆ వైభవము మూడునాళ్ళ ముచ్చట. 1930వ సంవత్సరమునకు చెట్టులేని చోట ఆముదపుచెట్టు మహావృక్షమన్నట్లు నాటక కర్తలొక రిద్దరు పూర్వ విభవములను చాటుకొనుచు తాము రచించిన గ్రంథములను చంకలో నిరికించుకొని పాడుపడిన దేవాలయములోని విగ్రహములవలె బజారులో నచ్చటచ్చట కనబడు చుండెడివారు.

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి నెరుగనివారు లేరు. ఆయన చక్కని ప్రవక్త. ఆంగ్లభాషా పండితుడు. ఆయన మాటలలో హాస్యరసము వెల్లివిరియుచుండును. తెనుగు భాషయందు కవి. అంతో యింతో సంస్కృత వాసన కలవాడని వదంతి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు విజయవాడలో నున్నప్పు డా నగరమునందు నివాస ముండెను. విజయవాడ వాతావరణమును బాగుగా నవగాహము గావించుకొనెను. ఆయన యొకసారి యుపన్యాసమునందు విజయవాడను గురించి ప్రసంగించుచు ''విజ్ఞానమునకు సహారా యెడారి విజయవాడ'' యని నుడివెను. ఆమాట సత్యమనుటకు సందేహింపవలసిన పనిలేదు.

తరువాత కొంత కాలమునకు చుండూరు వేంకటరెడ్డిగారు త్రిలింగ విద్యాపీఠమును కాంచనపల్లి కనకమ్మగారి ప్రోత్సాహమున స్థాపించిరి. చుండూరు వేంకటరెడ్డిగారు వైశ్య ప్రముఖులలో నుత్తముడు, ధన సంపన్నుడు. ఆంగ్లమునందు బి.ఏ. పట్టభద్రుడు, విజ్ఞానవంతుడు. సంస్కృతాంధ్రభాషాభిమాని. పండిత కవిప్రియుడు. బ్రాహ్మణభక్తి కలవాడు. సముపార్జించిన ధనమంతయు దానధర్మము

లకు వినియోగించిన యభినవ దానకర్ణుడు రెడ్డిగారు. సేతువు మొదలు బ్రహ్మాకపాలము వరకుగల పుణ్యక్షేత్రములలో సత్రవులు నిర్మించెను. వైశ్యులలో నట్టివా డింకొకడు లేడు. ఆయన సంస్కృత పాఠశాల నొకదానిని త్రిలింగ విద్యాపీఠ భవనమునందు స్థాపించెను. మహా పండితులను పిలిపించి గురువులుగా నియమించెను. ప్రతి సంవత్సరము నాయన గురువగు నమృతానందస్వామి యుత్సవము లొనరించెడు వాడు. ఆ యుత్సవమునకు భారత దేశము నలుమూలలనుండి మహా పండితులను కవులను పిలిపించెడి వాడు. సభలు జరిపించి సన్మాన ములు చేయుచుండెడి వాడు. ఆ దినములలో సంస్కృతవాణి వీణా తంతువులను సమకూర్చి వేద మాలాపించినది. చతుఃశాస్త్రవాదము లందుకొని పండిత ముఖంబుల నృత్యము చేసినది.

అంతటినుండి విజయవాడ కొక్క క్రొత్తశోభ బయలుదేరినది. సంస్కృతముమీద నున్న యభిమానము రెడ్డిగారికి తెనుగుమీదికి కూడ దారిపట్టినది. తెలుగుదేశమునందు ప్రఖ్యాతిగాంచిన కవుల కాహ్వానములను బంపెను. ఆ పిలుపు నందుకుని ప్రముఖులైన మహా కవులు వచ్చిరి. తమ నివాస భవనమగు నమృత భాండాగారము నందు సభలు జరిగినవి. అట్టి సభలు తెలుగు దేశమునందు మ రెచ్చటను జరగలేదు. ఆ నాలు గైదు దినములు శ్రీకృష్ణరాయల భువన విజయము తలపునకు వచ్చినది. వేంకటరెడ్డిగారు సభాముఖ మున కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిగారికి విలువగల తురాయిని బహూకరించిరి. కాశీ కృష్ణాచార్యులవారికి నూట పది యారులు సన్మాన మొనరించిరి. ఆ సభకు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారుకూడ వచ్చిరి.

అందర రాక యొక యెత్తు. శ్రీ శాస్త్రిగారి రాక మరొక యెత్తు. సారస్వతోద్యానమున కది వసంతాగమము. కవికులము నకు శరత్కాల చంద్రోదయము. వాఙ్మయ పిపాసువులకు స్వాతి

వర్షము. మూల మూలలనున్న జనులు విరగబడి వచ్చిరి. అమృత భాండాగారము కిటకిట లాడినది. శాస్త్రిగారు సాయంకాలము నాలుగు గంటలకు ప్రసంగ మారంభించిరి. ఆరు గంటలవరకు కథల మీద కథలు కబుర్లమీద కబుర్లు పద్యాల వెంబడి పద్యాలు నడచి పోయినవి. చతురులకు మితిలేదు. హాస్యముల కంతులేదు. అంతయు సారస్వతమును గురించిన ప్రసంగమే. దానిలో నన్నయ మొదలు తిమ్మనవరకుగల కవుల కావ్యములు తిరిగిపోయినవి. మాడభూషి వేంకటాచార్యుల వారి శతావధానముల వరకు గెంటుకొని పోయినవి. ఒక్క మానవుడు లేవలేదు. ఒక్కవ్యక్తి కదలలేదు. దీపములు వెలిగినవి. చీకటి పడినదని యెవరికి గుర్తురాలేదు. "ఇంక నీనాటికి ప్రసంగ మింతటితో కట్టిపెడదాం" అన్నారు శాస్త్రిగారు.

అందరి మనస్సు లల్లకల్లోలములయినవి. కవు లొకరి వెంట నొకరు శాస్త్రిగారిమీద పద్యా లాశువుగా గుప్పించిరి. వారిలో తిరుపతి కవుల యేకలవ్య శిష్యుడు శతావధానాష్టావధానాశు కవిత్వములందు పేరు పొందినవాడు శ్రీపతి త్రియంబకరావుగారు, అసలు శిష్యుడు పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రస్తుత గ్రంథ కర్త మొదలగువారు పెక్కుమంది కలరు. ఎవరికి తోచిన పద్యములు వారు ఆశువుగా శాస్త్రిగారి మీద చెప్పిరి.

పున్నమ చందమామ విరబోసిన వెన్నెల తేట నిగ్గులం
దున్న సుధారసంబు చవులూరఁగఁ ద్రావితొ విచ్చుపూల జా
లొక్కన్న మరంద మానితివొకో మునివృత్తిఁ బురాభవంబునం
దెన్నగ నిట్టి కైత రచియింప మదిం గొని వెంకటేశ్వరా.

ఇది ప్రస్తుత గ్రంధకర్త ఆశువుగా చెప్పిన పద్యములలో నొకటి. ఆనాడు వేంకటశాస్త్రిగారి ప్రసంగపు సుధావర్షమునకు కవుల హృదయ క్షేత్రములు మరల పదనెక్కి వాడఁబారిన కవితా సస్యములు రెక్కొనినవి. దుబ్బులు కట్టి విస్తరించినవి. ఈ నాడు

విజయవాడలో కవితా గోష్ఠులు కవి సన్మానములు జరుగుటకు ఆ నాటి వేంకటశాస్త్రిగారి చలువయనియే చెప్పవలయును.

చుండూరు వేంకటరెడ్డిగారు శ్రీ శాస్త్రిగారికి వార్షిక మేర్ప రచి విజయవాడలో స్థిరనివాసము కల్పించిరి. క్రమక్రమముగా శిష్యులు వారి చుట్టు చేరుకొనిరి. ప్రతిదినము శాస్త్రిగారి యింటనో విద్యాపీఠములోనో రెడ్డిగారి యింటియందో కవితా ప్రసంగములు సాగుచు వచ్చినవి. శ్రీ రెడ్డిగారు వేంకటశాస్త్రిగారిచేత శివభక్తి యను కావ్యమును వ్రాయించి కృతి పొందిరి. కృతి సమర్పణ సమ యమున పెద్ద సభ జరిగినది. శాస్త్రిగారికి వెంకటరెడ్డిగారు గౌరవ పూర్వకముగా వేయినూట పదార్లిచ్చిరని వాడుక.

దినములు గడచినవి. సభల వెంట సభలు జరుగుచు వచ్చి నవి. శాస్త్రిగారి ప్రసంగములు, కాశీ కృష్ణాచార్యులవారి యుపన్యా సములు, శ్రీపాదవారి సన్మాన సభలు కొల్లో కొల్లలుగా సాగినవి. వేంకటరెడ్డిగారి యాదరమున భోజుని కాలమున ధారానగరమైనది విజయవాడ. ఆయన నాదర్శముగాఁ గొని ధనిక వైశ్యులు పెక్కు మంది కవులకు సన్మానము లొనరించిరి.

శంకర ఫౌండరి యజమానులు పుచ్చా కోటయ్యగారు భేత పూడి వీర శరభయ్యగార్లు బ్రాహ్మణులు. అముద్రితమగు పాపయా రాధ్యుల దేవీ భాగవతము నచ్చొత్తింప దలపెట్టిరి. దానిని సంస్క రింపవలసినదని వేంకటశాస్త్రిగారిని భేతపూడి వీరశరభయ్యగా రర్థించిరి. పాపయారాధ్యులు వీరశైవ మతావలంబి. దాదాపు నూరేండ్ల క్రిందట నివసించి యుండెను. మూలానుసరణముగా నా కవిశేఖరుడు దేవీభాగవతము నాంధ్రీకరించెను. ఆయన కవిత్వము కొంచెము ప్రౌఢముగా నుండినను శయ్య ధారాళముగా సాగి పోవును. పద్యము లన్నియు తత్సమపదములతోడను సంస్కృత

సమాసములతోడను నడిచినవి. కొన్ని విషయములందు పాపయారాధ్యుల దేవీభాగవత మొకవిధముగా తిరుపతికవుల దేవీభాగవతము కంటె బాగున్నదనక తప్పదు.

శరభయ్యగారు శైవమతస్థుడు. దేవ్యుపాసనాపరుడు. ఈ రెండు కారణము లాయన నీ యుద్యమమునకు ప్రోత్సహించినవి. శ్రీ శాస్త్రిగారి కప్పటికే డెబ్బది యేండ్లు దాపించినవి. భాషా విషయము లాయన నెవ రేమడిగినను శాస్త్రిగారు కాదనలేరు. అంత వృద్ధులయి యుండియు దేవీభాగవతమును సంస్కరించుట కంగీకరించిరి. అచిరకాలంలోనే దానిని సంస్కరించిరి. దేవీభాగవతములను మూడింటిని సరిపోల్చుచు చక్కని పీఠిక రచించిరి. అందు పెక్కు విషయములు చర్చింపబడినవి. అవియన్నియు చదువునప్పుడు ముదిమిచేత శరీరమునందలి జవసత్త్వము లుడిగినను మేధాసంపత్తియు భాషా పటుత్వము రచనా సామర్థ్యము రవ్వంతయైనను తగ్గలేదని యెట్టివారికయిన తోచక మానదు. వేంకటశాస్త్రిగారు ఆంధ్రసాహిత్య సముద్ధరణకై పుట్టినవారు. ఆమరణాంతము సరస్వతి వారి నంటిపట్టుకొని యున్నది. కాలపురుషుఁడు పైఁబైనాక్రమించి బలమపహరించినను, వాణి విశ్వాసమును వీడలేదు.

కవనార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నావృత్తి యీ
భవ మద్దానఁ దరింతుఁ దద్భవమొ మద్భాగ్యంబు సర్వంబు మృ
త్యువు నే దాన జయించితిన్ రుజ జయింతున్ దానిచే నట్టి యీ
కవనమ్మే భవదీయ తేజ మని వక్కాణింతు విశ్వాత్మకా

అని మరల కలము పట్టినారు వేంకటశాస్త్రిగారు.

స్కాందపురాణములోని కథలు పురాణ గాథలు అను పేరుతో తెనిగించిరి. అందు శివలీలలు పెక్కింటిని వ్రాసిరి. తిక్కన హరిహరనాథుని "జన్మాంతర దుఃఖముల్ దొలఁగు నట్టుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే" యని ప్రార్థించెను. పోతన కైవల్యపదంబు

గోరి నందాంగనా డింభకునకు చేతులు జోడించినాడు. ఎందరెందరో కవులు తమ దైవమును మోక్షమర్థించిరి. వేంకటశాస్త్రిగారు

దేవా! యావత్తైలం
తావ ద్వ్యాఖ్య యని విజ్జనం బను కవితన్
యావజ్జీవము సాగం
గా వర మిదు చాలు నొందుగా వరమేలా
ప్రాణం బున్నంతటిలో
నే నాపనుగాక కవిత నీ వెల్లట్లో
నా నేమము సాగింపుము
దీనత గలిగింపఁబో కిదే పరమేశా (పురా. గా.)

అని ముగించినారు పురాణగాథలను శ్రీ వేంకటశాస్త్రిగారు. ఇట్టి యభ్యర్థన యేకవియు, నెప్పుడు చేసియుండలేదు. కావుననే శాస్త్రిగారు తెనుగు దేశమునం దొక విశిష్ట స్థానము నాక్రమించిరి.

ఆంధ్రరాష్ట్రీయ ప్రభుత్వ మా మహాకవియందలి ప్రత్యేకత గుర్తించినది. ఆస్థానకవిగా నియమించి సత్కరించినది. ఆ సందర్భమున శాస్త్రిగారి గౌరవార్థము విజయవాడ మునిసిపల్ హైస్కూలు నందు మూడుదినములు మహావైభవముగా సన్మానసభలు జరిగినవి. ఆ సభల కాంధ్రదేశము నలుదిశలనుండి కవులు పండితులు కళోపాసకులు పెక్కుమంది వచ్చిరి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వైస్ ఛాన్సలరు సి. ఆర్. రెడ్డిగారు వేంకటశాస్త్రిగారి గొప్పతనమును గురించి యుపన్యసించిరి. చెన్నరాష్ట్రీయ ప్రభుత్వమంత్రి శ్రీ కుమారస్వామి రాజావారు గౌరవప్రదానము గావించిరి. పెక్కుమంది కవులు పద్యములను చదివిరి. శ్రీశాస్త్రిగారు రచించిన

పద్మాకండేఁడుల పైన రెండిపుడు నాప్రాయంబు నాబోటికిన్
గదిలో మంచమె యెల్లలోకమనుచుం గాలమ్ము వెళ్ళించు వ్య

ద్ధు దయార్ద్రింబగు దృష్టిఁ జూచి యిడి తేగో గొప్పదా గద్దె నా
కది భుక్తంబగుదాక నాయు విడుమం చర్థింతుఁ గామేశ్వరీ!

ఇత్యాదికంబులగు ప్రత్యభినందన పద్యములు చదువబడినవి. సభలు పూర్తియైనవి. వేంకటశాస్త్రిగారి కప్పటికి డెబ్బది తొమ్మి దేండ్లు. ధారావాహిని కుంటుపడలేదు. వేగము తగ్గలేదు. రచనలో చతురత్వము సమసిపోలేదు. భావములో తొట్రుపాటు పడలేదు. తరువాత శాస్త్రిగారు బహుకాలము జీవించలేదు.

---